## రవీంద్రనాథ ఠాకూర్

# ఏకోత్తరశతి

రవీంద్రనాథ ఠాకూర్

# ఏకోత్తరశతి

అనువాదము :

త్రిపురారిభట్ల వీరరాఘవస్వామి



సాహిత్య అకాదెమీ

న్యూ ఢిల్లీ

*EKOTTARASATI* (101 Poems): by Rabindranath Tagore Translation into Telugu from Bengali by Tripuraribhatla Veeraraghava Swamy. Sahitya Akademi, New Delhi, 1963. Price Rs. 6·50



ప్రథమ ముద్రణ : 1963

హోల్ డిస్ట్రిబ్యూటర్స్ :
వేంకట్రామ & కంపెనీ
విజయవాడ

Also available at
Sahitya Akademi, New Delhi.

ముద్రణ :
అజంతా ప్రింటర్సు
సికింద్రాబాదు

వెల : రు. 6.50

# అనుక్రమణిక


| | | | |
|---|---|---|---|
| | ఉపోద్ఘాతము | ... | 1 |
| 1. | నిర్ఝర స్వప్నభంగము | ... | 21 |
| 2. | ప్రాణము | ... | 23 |
| 3. | నిష్ఫలకామన | ... | 24 |
| 4. | వధువు | ... | 26 |
| 5. | వ్యక్తప్రేమ | ... | 30 |
| 6. | మేఘదూతము | ... | 34 |
| 7. | అహల్య | ... | 41 |
| 8. | బంగరు పడవ | ... | 45 |
| 9. | హింగ్ టింగ్ ఛట్ | .. | 47 |
| 10. | జంట పక్షులు | ... | 56 |
| 11. | పోసీయను | ... | 58 |
| 12. | ఉయ్యాల | .. | 67 |
| 13. | వీడ్కోలు - శాపము | ... | 72 |
| 14. | వసుంధర | ... | 89 |
| 15. | నిరుద్దేశయాత్ర | ... | 103 |
| 16. | ఈమారు నన్ను మరలిరానిమ్ము | ... | 106 |
| 17. | బ్రాహ్మణుడు | ... | 115 |
| 18. | పురాతన భృత్యుడు | ... | 119 |
| 19. | ఊర్వశి | ... | 124 |
| 20. | స్వర్గమునుండి వీడ్కోలు | ... | 128 |
| 21. | జీవనదేవత | ... | 134 |
| 22. | విభావరి - ప్రభాతము | ... | 137 |
| 23. | అక్క | ... | 140 |
| 24. | దుస్సమయము | ... | 141 |
| 25. | భ్రష్టలగ్నము | ... | 142 |
| 26. | స్వప్నము | ... | 145 |

| | | | |
|---|---|---|---|
| 27. | మదనభస్మానంతరము | ... | 148 |
| 28. | దేవతాగ్రాసము | ... | 150 |
| 29. | అభిసారము | ... | 160 |
| 30 | కర్ణకుంతీసంవాదము | ... | 165 |
| 31. | గాంధారి ఆవేదనము | ... | 176 |
| 32. | వైశాఖము | ... | 214 |
| 33. | నూతనవర్షము | ... | 217 |
| 34. | విరహము | ... | 221 |
| 35. | కృష్ణకలి | ... | 222 |
| 36. | ఆవిర్భావము | ... | 225 |
| 37. | ఉద్బోధనము | ... | 228 |
| 38. | ప్రతిజ్ఞ | ... | 230 |
| 39. | యథాస్థానము | ... | 232 |
| 40. | అకాలమున | ... | 234 |
| 41. | న్యాయదండము | ... | 242 |
| 42. | ప్రార్థన | ... | 243 |
| 43. | ముక్తి | ... | 244 |
| 44. | త్రాణము | ... | 245 |
| 45. | ప్రతివిధి | ... | 246 |
| 46. | జన్మకథ | ... | 247 |
| 47. | వీరపురుషుడు | ... | 249 |
| 48. | దాగిలిమూత | ... | 252 |
| 49. | జగదంబుధితీరంబున | ... | 254 |
| 50 | అపకీర్తి | ... | 256 |
| 51. | సమవ్యథ | ... | 258 |
| 52. | సమాలోచకుడు | ... | 259 |
| 53. | కథచెప్పు | ... | 260 |
| 54. | మరీచిక | ... | 261 |
| 55. | శుభక్షణము | ... | 263 |
| 56. | అనావశ్యకము | ... | 265 |

57. కృపణ ... 267
58. వీడుకోలు ... 268
59. బంది ... 270
60. భారతతీర్థము ... 271
61. అవమానిత ... 274
62 ధూళిమందిరము ... 277
63. పోవునాడు ... 278
64. శంఖము ... 279
65. చిత్తరువు ... 281
66. షాజహాన్ ... 286
67. చంచల ... 293
68. దానము ... 297
69 విచారణ ... 299
70. మాధవి ... 302
71. ప్రేమస్పర్శ .. 303
72. నారీద్వయము .. 304
73. బలాకలు ... 305
74. ముక్తి ... 309
75. పతనము ... 315
76. స్మృతి ... 317
77. తపోభంగము ... 317
78. పూర్ణత ... 327
79 ఆశ ... 328
80. ఆశంక ... 333
81. వీడ్కోలు ... 335
82. పాంథుడు ... 339
83. ప్రశ్న ... 341
84. మృత్యుంజయుడు ... 342
85. ప్రథమపూజ ... 344
86. విహంగమము వెడలిపోవువేళ యైనది ... 355

87. నీ కనులలో ... 356
88. అవసన్న చైతన్య గోధూళివేళ ... 357
89. జన్మవాసరము ... 358
90. జపమాల ... 366
91. ఋణశోధనము ... 367
92. నా కీర్తిపై నాకు నమ్మకమ్మే లేదు ... 368
93 ఏకతానము ... 369
94. జిఘాంసుయామిని ... 375
95. ఆశీర్వాదము ... 375
96. మధుమయ పృథివీధూళి ... 376
97. వట్టి చౌకి ... 377
98. నాజన్మవాసరమున ... 378
99. రోపనారాయణారోధస్సునందు ... 379
100. తొలినాటి సూర్యుడు ... 379
101. నీ సృష్టిపథము ... 380


వంగమాతృక – అనులేఖనము


1. నిర్ఝరేర స్వప్నభంగ ... 383
2. సోనారతరీ ... 384
3. ఝులన ... 386
4. భ్రష్టలగ్న ... 389
5. యథాస్థాన ... 390
6. లుకోచురి ... 392
7. జగత్-పారావారేరతీరే ... 393
8. బందీ ... 395
9: భారత తీర్థ ... 396
10. తపోభంగ ... 398


*

# ఉపోద్ఘాతము

రవీంద్రనాథఠాకూరు సార్వకాలికు లగు ప్రఖ్యాత సాహిత్య స్రష్టలలో నొకడు. రచనల పరిమాణమును బట్టి చూచినను కొలదిమంది రచయితలు మాత్రమే ఆయనతో తులతూగుదురు. ఆయన కృతులలో వేయింటికి పైగా ఖండ కావ్యములు, రెండు వేలకు పైగా గేయములు కలవు. ఇవి కాక కథలు, నవలలు, నాటకములు, మతము విద్య రాజకీయములు సాహిత్యము ఇత్యాదులను గురించిన వ్యాసము లనేకములు కలవు. ఒక్క మాటలో చెప్పవలె నన్న మానవుల కేయే విషయములు ఆసక్తములో వాటిమీద అన్నింటను ఆయన అభిరుచి ప్రసరించినది. గుణవిశేషము నందు కూడ ఆయన రచనలు అత్యున్నతస్థితిని పొందినవి—మానవులలో మహానుభావులు—వారిలోను కొలదిమంది చేసిన రచనలు మాత్రము అధిగమించిన ఔన్నత్యమును పొందినవి. ఆయన రచనల అపరిమిత విస్తృతిని, అసాధారణ గుణ విశిష్టతను ప్రశంసించువారు మానవ చరిత్రలోని సాహిత్య స్రష్టలలో ఆయనను అత్యుత్కృష్టునిగా పరిగణించిన యెడల ఆశ్చర్యపడవలసిన యవసర ముండదు.

ప్రతిభావంతు డగు మహావ్యక్తి ఆవిర్భవించుటకు కారణము చెప్పుట కష్టము. ఏలయన మహావ్యక్తి ప్రవృత్తి సాధారణమునకు సర్వదా విలక్షణముగా ఉండును. ఇంకను ప్రతిభాశీలుడైన వ్యక్తియందు విశేష మేమనగా - అతడు అచేతనముగ గాని అర్ధచేతనముగ గాని తన జాతి మానసమును ప్రేరేపించు ఆశయములకును భావములకును రూపము కల్పించుటయే. తన్మూలమున ప్రతిభాన్వితునకును అతని జాతికిని సంబంధ మేర్పడుచుండును. ప్రతిభావంతు డావిర్భవించినప్పుడు ప్రజల కతనియందు కలుగు ఆదరాశ్చర్యములకు కారణమును ఈ సంబంధమే వ్యక్తము చేయుచున్నది. అతని వాక్కులలోను భావోద్వేగములలోను ప్రజలు తాము అస్పష్టముగా అనుభవించు అవ్యక్తానుభూతులను ఆకాంక్షలను ఆరసికొనుచుందురు. అందువలన ప్రతిభాశాలి కూడ ప్రయోజనము పొందును. తన జాతి మానసమున రేకెత్తెడి అసంపూర్ణ భావముల వల్లను అస్పష్టాకాంక్షలవల్లను అతడు బలమును శక్తిని పొందుచున్నాడు.

ఈ రెండు విధములందును ఠాకూరు ప్రతిభ విశిష్టమైనది ఆయన వైశిష్ట్యమును గూర్చి ప్రశ్నింప నక్కఱలేదు. ఆయన ఎవరికొఱకు జీవించెనో, ఎవరిని ప్రేమించెనో అట్టి ప్రజల జీవితములో పాదుకొనిపోయినాడు.

రవీంద్రుడు జన్మించిన దేశకాలములనుబట్టి చూచినను ఆయన అదృష్ట వంతు డనవలెను. పాశ్చాత్యుల ఆగమనము భారతీయ జీవిత శాంత ప్రవంతిని ఆలోడించినది; దేశ మంతటను నూతన చైతన్యమును ప్రసరింపజేసినది; దాని మొదటి తాకుడు భారతీయ మానసమును పరిభ్రమింప చేసినది; తత్ప్రథమ సంస్కర్తలను అంధానుకర్తలను చేసినది. ఠాకూరు జన్మించిన కాలములో పాశ్చాత్యులమీద జనించిన మొదటి అవిమర్శక వ్యామోహము జారిపోవు చుండెను. కాని పాశ్చాత్యులు కొని తెచ్చిన ఆదర్శములు మాత్రము బహుళ ప్రచారములో ఉండెను. ఆ సమయమందే భారతీయ నిజ సంస్కృతి యందును తన్మహత్వ మందును శ్రద్ధాభక్తులు వృద్ధిపొంద నారంభించినవి. అందుచేత ప్రతిభాశాలి ప్రాదుర్భవించి ప్రాచ్యపాశ్చాత్యాశయములను తనలో మేళవించు కొనుట కది తగిన తరుణముగా నుండెను.

తరుణమే కాక దేశము కూడ తగినట్లుండెను. భారత దేశ మందలి ఇతర రాష్ట్రములమీద కన్న వంగదేశముమీదనే పాశ్చాత్య ప్రభావము ఎక్కువ విస్తృతముగా ప్రసరించినది. వంగదేశములో—ముఖ్యముగా కలకత్తాలో నూతన చైతన్యస్పందనము ప్రచురముగా కనబడినది. ఠాకూరు ప్రతిభ ఉన్మేషించుటకు ఆయన కుటుంబ పరిస్థితులుకూడ సాయపడినవి. నూతన భారతీయ చైతన్యము నకు ఆయన కుటుంబమే మొట్టమొదట మార్గదర్శకమైనది. అంతేకాక సమృద్ధ మైన ప్రాచీన సంస్కృతిని విడనాడక క్రొత్త సవాళ్ళను అంగీకరించినది. ఠాకూరు బ్రాహ్మణు డగుటచే సహజముగా సులభముగా ప్రాచీన భారతీయ సంప్రదాయములను అవగతము చేసికొన్నాడు. సంస్కృత భాషలోని సాహిత్య విశిష్టతయే కాక వైజ్ఞాని కాదర్శముల తేజము మతాదర్శముల మహత్వము ఆయనను గాఢముగా ఆకర్షించినవి. జమీందారుల శ్రేణిలోనివా డగుటచే ఆయ నకు మధ్యకాలపు భారతీయ జీవిత పద్ధతులతో పరిచయము కలిగినది. అందుచేత ఆయన మొగల్ దర్బారుల మిశ్ర సంస్కృతిని ప్రశ్నింపక అంగీకరించినాడు. ఈ రెండు విషయములలోను ఆకాలపు జమీందారులగు బ్రాహ్మణుల కన్న ఆయన వేరు కాదనవచ్చును. అయినను వారిలో చాలమందికన్న ఆయన ఆధు నిక ప్రపంచములోని నూతన పద్ధతి ప్రవాహములనుకూడ గ్రహించుచుండెను.

ప్రాచీన మధ్యకాల సంప్రదాయములకు బాగుగా అలవాటుపడి యుండినను, ఆయన కుటుంబమువారు పాశ్చాత్యవిద్య యందును, పాశ్చాత్య జీవిత పద్ధతుల యందును ఆ కాలమున మార్గదర్శకులుగా నుండిరి. రవీంద్రుని కుటుంబ పారంపర్య సంస్కృతియే ఆయన భారతీయ సంప్రదాయ మహత్వమును, మానసిక భేదభావాభావమును విశదీకరించుచున్నది. ఆయన సమకాలికులలో చాలమంది శక్తిని క్రుంగదీసి నాశనముచేసిన భిన్నభావములు ఆయన సమగ్ర వ్యక్తిత్వము నందు లేవు

ఠాకూరు నిజముగా అదృష్టశాలి. ఆయన ప్రాచీనములతో మధ్యకాలీనములగు భారతీయ మహత్వములను విసర్జింపక క్రొత్త సవాళ్ళను అంగీకరించుటయే అందుకు కారణము స్వీయ సంస్కృతి స్తన్యమును మాని భావప్రేరణలకై పాశ్చాత్య సంస్కృతిపై ఆధారపడినవారు తమ జాతి జీవిత మూలములను కోలుపోయినారు ప్రజాసంపర్కము లేకుండుటచే భావప్రేరణలకు మూలాధారములు తరిగిపోయి ఆధ్యాత్మిక మూలధనమును హ్రాసము చేసినవి. వారు నిజముగా ప్రజ్ఞాప్రతిభలు కలవారైనను ఈ కారణము వల్లనే భారతీయ జీవితము మీదను భారతీయ సాహిత్యముమీదను గంభీరమైన అథవా స్థిరమైన తమ ప్రభావమును ప్రదర్శింపలేకపోయినారు ప్రతిభాశాలి యగు మహా వ్యక్తి తన జాతిలో అంతర్లీనముగా నుండు ఆశయములతో సంమిళితమైపోయి ఏ శక్తిని పొందగలుగునో అట్టి శక్తి వారికి లేదు.

ప్రజలతో ఏకత్వము స్థిరపడుటకు ఠాకూరున కింకొక్క విశేషముకూడ కలదు. చాల చిన్నతనము నందే ఆయన నెలల కొలది పద్మానదీ సైకతతీరములందు పడవలో నివసించుచుండువాడు. అందువల్ల ఆయనకు తన దేశములోని గ్రామీణ సంస్కృతితో సన్నిహిత పరిచయము కలిగినది. ఆ ప్రదేశములందాయన అనుభవించిన జీవిత స్వభావవిశేషమే ప్రాథమికము అతి ప్రాచీనము అని దేశచరిత్ర చెప్పుచున్నది. ఆ జీవిత సంస్కృతి మధ్యయుగమున విస్తరిల్లిన నాగర సంస్కృతికన్న ప్రాచీనమై ప్రజా జీవితములో ఇంకను లోతుగా నెలకొన్నది. ఆ విధముగా నగరవాసులకు పరిచయములేని ప్రపంచములోనికి ప్రవేశము సంపాదించుకొని ఠాకూరు అచటి జాతి చైతన్యములోని కొన్ని గభీరతలములందు చొరబడినాడు. సామాన్య జనుల విస్తృత జీవితముతోటి సంబంధమే సమృద్ధమైన ఆయన సృజనశక్తికి మూలభూతమై భావనాశక్తి తరిగిపోకుండుటకు కారణమైనది.

ఠాకూరు జీవితమును రచనలను పరిశీలించువారు ఆయన ప్రతిభలోని జీవశక్తికి మాటి మాటికి చకితు లగుచుందురు. ఆయన వస్తుతః కవి. అయినను ఆయన అభిరుచులు కేవలము కవితారచనకే వినియుక్తములు కాలేదు. ఆయన సాహిత్యరచనలను గూర్చి ఇదివరకే చెప్పియున్నాము. కాని సాహిత్యము తన సమగ్రార్థములో ఆయన ప్రజ్ఞను శోషింపచేయలేక పోయినది ఆయన గొప్ప గాయకుడు; గొప్ప చిత్రకారుడు కూడ. అంతే కాక మత విషయములను విద్యావిషయములను రాజకీయములను సంఘసంస్కరణములను నైతిక పునరుద్ధరణమును ఆర్థిక పునర్నిర్మాణమును గురించి ఆయన ప్రసిద్ధమైన రచనలు చేసినాడు. నిజముగా ఆయా క్షేత్రములందలి మహత్తర సాధనా ఫలితములే ఆయనను ఆధునిక భారతమును తీర్చి దిద్దిన వారిలో నొకనిగా పరిగణింప చేసినవి.

రవీంద్రుని శక్త్యతిశయము ఆయన జీవనైకత్వ పరిజ్ఞానములో నిహితమై యున్నది. ఆదర్శములందును సంస్కృతియందును గల ద్వైవిధ్యము ఆయన శక్తిని విభజింపలేదు. అందుచేత ఆయన జీవితమునకును కళకును అభిన్నత్వమును గుర్తించినా డన్నచో ఆశ్చర్యము కలుగదు. పందొమ్మిదవ శతాబ్దము చివర యూరప్‌లో నూతన రససిద్ధాంతము ప్రాముఖ్యము వహించినది. జీవితముతోడి సంబంధమును పాటింపక కళను కళకోసమే అనుసరింపవలె నని అనేకులు నమ్మియుండిరి. గజదంతగోపురము (Ivory Tower) వారి కలాత్మక ప్రయత్నమునకు చిహ్నముగాను ప్రతీకగాను పరిణమించినది. ఈ మతానుయాయులు కవియు కళాకారుడును ముఖ్యముగా స్వప్నజగత్సంచారులని వచించినారు. ఠాకూరు మాత్రము జీవితము కన్న కళ భిన్నమైనది అను సిద్ధాంతము ఎన్నడు అంగీకరించలేదు. జీవితాభివ్యక్తిరూపమే సౌందర్య మని దాని ననుసరించినాడు. అంతే కాక జీవితము సహజముగా సౌందర్యముతో విలసిల్లకున్న దాని యందు మనోహరత్వ ముండదని పలికినాడు. కవి ధర్మమే మానవధర్మమని ఠాకూరు అభిమతము.

## II

ప్రపంచములోని అత్యుత్తమ గేయకవులలో ఠాకూ రొకడు. హృదయపూర్వకమైన సంవేదనయు, విస్పష్టమైన భావచిత్రములును పద్యమందలి సంగీత

ముతో మిళితమై కావ్యము పఠించి అందలి పదములను విస్మరించిన తరువాత కూడ చాలసేపటివరకు పాఠకుని మనోవీథిలో ఆ కావ్యమాధురి ధ్వనించు చుండును. సంవేదన, భావచిత్రము, సంగీతము—ఈ మూటి మేళనము ఆయన బాల్యకాలపు రచనలలో కూడ కనబడును. 'నిర్ఝర స్వప్నభంగము' ఆయన కిరువదేండ్లు నిండకముందు రచించినది. అయినను వంగభాషలోను—మరి ఏ భాషలోను – గేయకావ్యములలో అది నేటికిని ఉత్తమమైనదిగా గణింపబడు చున్నది. దాని విశిష్టత భావావేశ సంగీతము లందే కాక ప్రస్ఫుటమైన భావచిత్ర మందును వెలయుచున్నది. ఇంతకన్న కూడ బాహ్య ప్రకృతికి మానవులకు గల విడదీయరాని అనన్యత్వమును మేళవించుటయే బహుశః తన్మహత్వమునకు కారణము కావచ్చును. ప్రకృతి మానవుల అనన్యత్వము రాకూరు కవిత్వములో ఆయన జీవితాంతము వరకు ప్రధాన విషయముగా నిలిచిపోయినది.

ప్రపంచములో రాకూరు వలె వసుధను గాఢముగా ప్రేమించిన కవి మరి యొకడు లేడనవచ్చును. దివారాత్రములు ఋతుచక్రము—వీనిలో ఆ మహాకవి గానము చేయని భావము ఒకటి కూడ ఆయన కవితలో లేదనవచ్చును. వంగ దేశమందలి ప్రకృతి దృశ్యములు, ధ్వనులు, ముఖ్యముగా గ్రామీణ ప్రకృతి శోభలు ఆయన ఐంద్రజాలిక కవితలోని కాకృష్టము లైనవి. కాళిదాస మహాకవి కాలమునుండి వర్షఋతువు దివ్యశోభలను భారతీయ కవులు విరజిమ్మినారు. రాకూరు కూడ పరిణామశీలములగు వర్షఋతు భావములను వందలకొలది ఖండ కృతులందును, గేయములందును ఇమిడ్చినాడు. నిజముగా వర్షఋతు సంబంధము లగు రాకూరు కావ్యములును గేయములును పరంపరాగత మగు జాతీయసంపదలో భాగ మైనవి. వర్షాగమనమునకు ముందు శుష్కక్షేత్రముల నిరీక్షణము, తొలకరికి తడిసిన భూమి నుండి వెడలు ప్రగాఢవాసనలు, నవనవోన్మిషితములగు శాద్వల ముల పులకింపచేయు ప్రాణస్పందనము, స్వచ్ఛములగు ఉదయారుణకాంతులను మరుగుపరచుచు, ఇంద్రజాలశక్తితో సాయంకాలపు నీడలను కప్పివేయు కారు మేఘములు, నిశ్శబ్దనిశీథమందు నిరంతరముగా రాలు వర్షబిందువుల పటపట ధ్వనులు—ఇవియు, ఇంకను వందలకొలది వేర్వేరు చిత్రములు రాకూరు కావ్య మంత్రముతో మన మనోనేత్రమునకు ప్రస్ఫుటముగా ప్రకటితము లగును. ప్రకృతి మానవులు ఒకరి అవస్థలను ఒకరియందు ప్రతిబింబింప చేసికొని తమ తమ ప్రత్యేక వ్యక్తిత్వము కోలుపోవు వరకు మానవ హృదయములలో స్పందించు సుఖదుఃఖములను ఆయన ఆ కావ్యములలో అల్లినాడు.

ఠాకూరు ఇతర ఋతువులను విడనాడలేదు. శరద్వసంతముల భావము లనేకములు ఆయన కవితలో ప్రతిబింబించినవి. నవవసంతపు అవ్యాహత శక్తియు హేమంత శిశిరబంధనముల నుండి విముక్తి నొందిన సంవేదనయు, శీఘ్రముగా విస్పష్టముగా ప్రోత్ఫుల్లములైన రంగులు ధ్వనులు అనేక కావ్యము లందును, అనేక గేయములందును ప్రతిఫలించినవి. ఆ కావ్యాదులు వసంత మందలి ఆనంద ప్రభావములనే కాక దాని చంచలత్వాస్థిరత్వములను కూడ ప్రతిఫలింప చేయుచున్నవి. శరత్కాలము సమగ్రము పరిపక్వము నగు ప్రజ్ఞ తోడను, వర్షశోధితమగు నిర్మలాకాశముతోడను ఠాకూరు కావ్యములలో అనే కములందు ప్రత్యేక పాత్రను వహించినది. ఆయన అత్యుత్తమ గేయనాటికలలో నొకటి కార్యసంకులత్వము నుండి విముక్తమైన శరత్కాలమును వస్తువుగా గ్రహించినది. ఆయన గ్రీష్మహేమంతములను త్యజింపలేదు. సుప్రసిద్ధమగు నొక కావ్యములో కఠోర నియమములతో ప్రాణసంయమముతో నూతన జీవనో దయముకై నిరీక్షించుచున్న సన్యాసి వలె ఆయన గ్రీష్మమును చిత్రించినాడు.

ప్రకృతి సౌందర్యమే ఠాకూరును భూమితో బంధించియుంచలేదు. మానవ నివాస భూమిగా భూమిని ప్రేమించి తన మానవ ప్రేమను ఆయన అనేక కావ్యము లందును గేయము లందును వర్షించినాడు. ఆయన హృదయములో ప్రతిధ్వనింపని భావము మానవ హృదయములో లేదన వచ్చును. ఆంతరంగిక ప్రేమలోని సుఖదుఃఖముల వివిధ భావవ్యత్యయములను మరపురాని మాటలతో తేటతెల్లము చేసినాడు. దుఃఖమును, తాపమును, నిష్ఫల ప్రతీక్షలోని మర్మచ్ఛే దక వ్యథను, పాఠకుని విభ్రమములో ముంచివేయు వాస్తవికతతో ఆయన సజీవముగా చిత్రించినాడు. మానవుని భావావేగములకు నిత్య సహచరినిగా ప్రకృ తిని రూపొందించినాడు. జీవితము విరోధములతోడను ప్రయత్నములతోడను నిండియున్న దనియు, ప్రపంచము పరిపూర్ణమైన దనియు ఆయనకు తెలియును. అయినను అసంపూర్ణతలు, దోషములు, దుఃఖములు, ఆకాంక్షలు—వీనితో కూడిన ఐహిక జీవితమే మానవున కత్యంత ప్రేమాస్పద మనియు ఆయన భావించినాడు. మానవుడు సంపూర్ణ జీవితమును సాధించుటకై ప్రయత్నించు రంగస్థలము మాత్రమే కాక ఈ ప్రపంచము సమస్తానుభవము లందును సమృద్ధ మగు తాత్పర్యము నన్వేషించుటకై చేయు మానవకృషిని పరిశీలించు ప్రేమ మూర్తి యగు మాతృమూర్తియే అని ఠాకూరు గ్రహించినాడు. ఆయన సన్యాసి కాడు. ఆయన శారీరకములైన వివిధ చేష్టలను అరికట్టు ఆదర్శములను మనః

పూర్వకముగా త్యజించినాడు. ఆయన స్వేచ్ఛాచార స్వేచ్ఛావిహారములు గల చార్వాకుడు కాడు ఇంద్రియ సౌఖ్యమే పరమసుఖ మను నాస్తికుడును కాడు. పరిపూర్ణములు గంభీరములు అగు అనుభూతుల కోసము నిరంతరము యత్నించుటలోనే యథార్థమైన జీవితమహత్త్వము ఇమిడి ఉన్నదని నమ్మినవాడు ఠాకూరు. పరిపూర్ణ జీవితమును గురించిన ఈ కాంక్షయే ఆయన కావ్యములందు మాటిమాటికి కనబడుచున్నది. ఆయన వసుంధర అను కావ్యములో సమృద్ధమైన జీవితమును చూపించు వసుంధరకును అనాదివాసనలచే ఉప్పొంగు శక్తికిని మానవునకును గల సన్నిహిత సంబంధమును కీర్తించినాడు. ప్రసిద్ధ గీతికావ్యములలో నొకటి యగు 'స్వర్గ హొయ్‌తే బిదాయ్' అను కావ్యములో ఆయన వికారరహితము శాంతము నగు స్వర్గానందమునకును మర్త్యానుభూతులలోని నిరంతర సుఖదుఃఖ ప్రవాహమునకును పోల్చినాడు. తన కేది అభిమతమో దానినాయన సందేహాస్పదముగా నుంచలేదు.

ఠాకూరు వస్తుతః గేయకవి. అయినను ఆయనకు గల ప్రకృతి ప్రేమయు సమగ్రజీవితముపై గల ఆంతరంగికప్రేమయు ఆయన కావ్యము లనేకములకు సుసమృద్ధ మగు రూపకగుణము కలిగించినవి. గంభీరమగు ఆయన మానవత్వమును న్యాయముకోసమైన తీవ్రాకాంక్షను చూచినప్పుడు సాంఘికములు రాజకీయములు నగు కథావస్తువు లాయన నాకర్షించుటయం దాశ్చర్యపడవలసినది లేదు. కథాసందర్భము ఒకానొక ప్రత్యేకానుభూతి విషయము కావచ్చును. కాని ఆయన కవితాస్పర్శ తగిలిన దెల్ల సార్వజనీనభావముతో మహోన్నతస్థానము నలంకరించినది. ఆయన తన ప్రజల మూఢాభిప్రాయములను అంధవిశ్వాసములను గురించి అత్యంతాసహ్యము లగు హేళన కావ్యములను రచించినాడు. కాని ఏ కొన్నిటిలోనో తప్ప వానిలో కూడ కోపమును రోషమును అతిక్రమించి సారభూత మగు మానవత్వమే గోచరించుచున్నది. స్వదేశాభిమానపూర్ణము లగు ఆయన కావ్యములు కూడ సమగ్రమానవజాతి భావనతోడనే అనుప్రేరితములైనవి. ఠాకూరుకు దేశాభిమాన మనునది స్వదేశీయుల మీది సహజప్రేమయే కాని విదేశీయుల మీది సహింపరాని ద్వేషభావ మెన్నడును కాదు. ఇందుకు చక్కని ఉదాహరణము గురుగోవింద్ అను కావ్యము. అందు ప్రజలమీదను దేశముమీదను గల ప్రేమాతిశయము సమగ్ర మానవజాతిమీది గంభీర ప్రేమగా రూపొందినది. వాస్తవముగా మానవతా సంబంధమైన దేనిని కూడ అన్యమయిన దానినిగా ఆయన ఎన్నడు అంగీకరింపలేదు. ప్రసిద్ధ మగు

'ప్రవాసి' అను గీతికావ్యములో మానవునకు ప్రతిదేశమును తన గృహమే అనియు, ప్రతి ప్రపంచభాగమును తన దేశమే అనియు ఆయన ఉద్ఘాటించినాడు. సమగ్రమానవజాతితో ఏకీభావము మన జాతీయగీతములో చక్కగా విశద మైనది. అందు ప్రపంచమందలి సకల జనుల హృదయాధినాథుని భారతభాగ్య విధాతగా ప్రార్థించినాడు.

రవీంద్రుని మానవప్రేమ అప్రయత్నముగా అనివార్యముగా భగవ త్ప్రేమలో కలిసిపోయినది. ఆయన భావనానుభూతులలో ప్రకృతియు మాన వుడును అనన్యత్వమును పొందినారని ఇదివరకే చెప్పినాము. మానవజీవితము కన్న దైవము అన్యము దూరము అని ఆయన ఎన్నడును భావించి యుండ లేదు. ఆయనకు ముఖ్యముగా ప్రేమయే దైవము. మాతాశిశువుల ప్రేమగాని ప్రియుల ప్రేమగాని భగవత్స్వరూపమని చెప్పబడు సర్వోత్కృష్టప్రేమకు ఉదాహరణములు. ఇట్టి ప్రేమ పరాభక్తుని (Mystic) భక్తిపారవశ్యమునందే కాక సామాన్య మానవుని నిత్యజీవిత పరిపాటి యందును అభివ్యక్త మగు చున్నది. జీవితములోని సామాన్య సంబంధములలోను ప్రపంచమును పోషించు నిత్య కార్యకలాపములలోను భగవంతుడు అనుభవైకవేద్యుడు కావలె నని రాకూరు పలుమారు ఉద్ఘోషించినాడు. వైష్ణవ కవిత్వము సూఫీల మార్మికత— వీవి గభీర ప్రభావమునకు రాకూరు వశంవదుడైనా డనుట నిర్వివాదాంశము. ఆయన కావ్యములందును గేయములందును లోకోత్తరానందమును స్ఫురింప జేయు భావములు చిత్రములే కాక నిత్యజీవనములోని నిజస్థితిని వెల్లడించు సూక్ష్మ సంవేదన కూడ గోచరించును. ఆయన శబ్దములు శబ్దసమూహములు వ్యక్తముచేయు యాథార్థ్యము స్వానుభవసంభూత మైనది. భావపరిమాణములను ప్రకృతి అవస్థలతో మేళవించిన ప్రపంచ కవులలో ఆయనకు సాటి రాగలవారు కొద్దిమంది మాత్రమే కలరు.

ఆయన ఆధ్యాత్మిక కవితాగుణవిశేషమును గురించి కొంచెము చెప్ప వలెను. గీతాంజలిని ఆంగ్లములో మొదట ప్రచురించినప్పుడు యుద్ధములతో జీర్ణమై విద్వేష సంక్షుభిత మైన పాశ్చాత్యలోకము దానిని శాంతి సందేశముగాను ప్రేమ సందేశముగాను ఆహ్వానించినది. ఆ చిన్ని గ్రంథము గంభీర శాంతి స్థైర్యములు కలిగించు ఛందకృతులతో నిబిడీకృత మైన దనుటకు సందేహము లేదు. ఆ కృతులలోని వస్తువు పరిచిత మైన దైనను, భాషయు భావచిత్రములును సరళమైన వైనను, వానిలో అనిర్వచనీయమైన సౌందర్యగుణమును నిగూఢ

భావనయు కలవు. ఐరోపా-అమెరికా ఖండములలోని పాఠకులకు అవి నూతన వస్తువును కనిపెట్టినప్పటి విభ్రమానందములను సమకూర్చినవి. కాని వంగ దేశములో తత్కావ్యములు పఠించువారల కవి ఆయన పూర్వ రచనల సహజ పరిణామముగా మాత్రము గోచరించినవి. ప్రకృతి ప్రేమయు మానవ ప్రేమయు క్రమముగా అయత్నపూర్వకముగా భగవత్ప్రేమలో మిళితములైనవి. తీవ్రము లైన స్వీయబాధలు ఆయన కావ్య వస్తువులకు భావచిత్రములకు పరిపక్వత నాపాదించినవి. వర్ధమాన మగుచున్న ఆయన అనుభవము జీవిత మంతయు రహస్యావృత మైనదను సందేహము లేని సత్యమును స్ఫురింపచేసినది. మానవ జీవితములోని ఆశ్చర్యవిషాదము లాయనకు నూతన సానుభూతిని నూతన వివేకమును సమకూర్చినవి.

ఠాకూరు తరువాత రచించిన గేయకావ్యము లనేకములందు అత్యంత సరళత విశిష్టలక్షణముగా నున్నది. మొట్టమొదటి కావ్యములలో సంస్కృతము నుండి సమృద్ధమగు శబ్దసాంగత్యమును శబ్దాలంకారములను విశేషముగా గ్రహించినాడు. వానిలో చాల కావ్యములందు భారతీయ ప్రాచీన సాహిత్యము లోని వస్తుయోజనయు, భావభంగియు పునర్గృహీతము లైనవి. ప్రాత సన్ని వేశముల కాయన క్రొత్త రూపము నిచ్చినా డనుటలో సందేహము లేదు. అయినను వానిలో సమృద్ధమగు భారతీయ పౌరాణిక సంసర్గము స్పష్టముగా కనబడుచున్నది. మానవునకు భగవంతునకు అంకితము చేసి తరువాత రచించిన కావ్యములం దాయన అలంకారము లన్నియు వదలినాడు. సామాన్యములైన మానవ సన్నివేశములను స్వీయమైన భగవదనుభూతులను వ్యక్తము చేయుట కుపయోగించినాడు. భాష కూడ వ్యావహారిక భాషలోని సరళతను సహజ ఋజుగతిని పొందినది. తరువాత వ్రాసిన ఖండకృతులలోను గేయకృతులలోను సద్యః పర నిర్వృతి కలుగుచుండును. శబ్దములు స్ఫటికాయమానములై స్వచ్ఛ మైన సంగీతశ్రుతులవలె స్పష్టతతోడను శక్తితోడను స్తంభింప చేయుచుండును.

ఠాకూరు జీవితాంతమువరకు నిర్భయముగా హృదయపూర్వకముగా సత్యాన్వేషణ చేసినవాడని మనము మరువరాదు. మనము మన దారిద్ర్యమును కప్పిపుచ్చుటకై నిర్మించుకొను కపటవంచనాద్యావరణములను ఆయన తన తీక్ష్ణబుద్ధితో చీల్చి చెండాడినాడు. విస్తృత ధైర్యసాహస గుణములు గల ఆయన రచనలను వంగమాతృకలో చదువనివారి కవి అగోచరముగా నున్నవి. మొదటి కారణము భాషాంతరీకరణములు ఆయన రచనలలో నుండి ఏర్చి

కూర్చినవి. కాని ప్రజ్ఞావిశేషమునకు ప్రబలోదాహరణము లగు కొన్ని ముఖ్య కావ్యములను వదలినారు. రెండవ కారణము భాషానువాదములలో చాల భాగము అనుసరణములై మూలములోని తేజోబలములను తగ్గించినవి.

మనుష్యుని భవిష్యత్తును గురించిన విచారణ ఠాకూరుకు బాల్యమందే ప్రారంభమైనది. చిన్ననాటి కావ్యగుచ్ఛములో నొకటి యగు 'సంధ్యాగీత్' లో జీవితసమస్యను గూర్చి ఆయన దీర్ఘాలోచన చేసినట్లు ఇదివరకే తెలిపికొన్నాము. మనుష్యుని స్వార్థము ప్రేమవేషము ధరించి నటించినప్పుడు సౌందర్యము సిద్ధింపదని ఆయన అల్పవయస్సునందే గ్రహించినాడు. ఆధ్యాత్మిక చింతనము క్రమముగా 'నైవేద్య'లో ప్రగాఢము గంభీరము అయినది. అయినను బుద్ధి భావావేశముల చక్కని కలయిక 'బలాక' లో కనవచ్చుచున్నది. బలాకలోని కొన్ని ఖండికలలో తత్త్వవిచారణ స్వచ్ఛమైన గేయకవితగా రూపొందుటను ప్రదర్శించుచున్నది

ఠాకూరు జీవితములో చిట్టచివరి దినముపరకు నూతనానుభవముల కొరకును నూతన రూపాభివ్యక్తులకోసమును ప్రయత్నించినాడు ఆయన అరువదివత్సరములు దాటిన తరువాత వెల్లివిరిసిన కవితతో యౌవనమున రచించిన ఉత్తమ కవితను సరిపోల్చవచ్చును. ఈ కాలములోని కావ్యములలో బాధా సంక్షోభితములైన గంభీరసంవేదనయు భావోద్వేగమును నూతన రీతిని వెలువడినవి. ఈ కావ్యములలోని అంతరంగికములు స్వీయములు అగు గుణములు తరువాతి దశాబ్దములో - సమృద్ధము పరిపక్వము అగు మానవత్వములోనికి పరిణమించినవి. తొలినాటి రచనలలోని భాషాభావముల ప్రాచుర్యము ఇప్పుడు వస్తు తదభివ్యక్తి రీతుల అపూర్వపరిమితిగా పరిణమించినది. ఆయన చివరి కావ్యములలో కొన్నిటియందు గల శక్తియు, విశ్వాసమును, భావగాంభీర్యమును మనలను ఆశ్చర్య చకితులను చేయును. జీవిత చరమలక్ష్యములనుగూర్చి నూతన రీతిని ప్రశ్నించుచు జీవితములోని అసంపూర్ణతలను భవితవ్యములను శాంత స్నిగ్ధభావముతో అంగీకరించినాడు

# III

ఠాకూరు వేయి ఖండకావ్యములు రెండువేల గేయములు రచించినాడు. మొదటి పుస్తకము ప్రచురించు నాటికి ఆయనకు పదునైదు వత్సరములు సరిగా నిండ

లేదు చిట్టచివరి కావ్యము మరణించునాడు వ్రాసినాడు. ఇట్లు చెప్పుట వలన ఆయన రచనలనుండి ఏర్చి కూర్చుట ఎంత కష్టమో తెలియుచున్నది. నిజముగా కావ్యసంగ్రహము సిద్ధము చేయుట ఎప్పుడును కష్టమైన కార్యమే. సంగ్రహ కర్త భావము ఆయన కూర్చిన కావ్యసంగ్రహము నందు ప్రతిబింబించును. ఆయన కృతుల సంగ్రహము అందరి అభిరుచులను తృప్తిపరచు నని ఎవ్వరును భావింపలేరు. అందుచేతనే ఏ సంకలనమును ఎప్పుడును సంపూర్ణ తృప్తిని కలిగించలేదు. వచనరచనల విషయములో ఈ మాట సత్యమైన యెడల పద్య రచనల విషయములో ఇంకను సత్యమగును భిన్న భిన్న పాఠకులకు భిన్న భిన్నాభిరుచు లుండును. అంతేకాక కావ్యరసాస్వాదనము పాఠకుని మానసిక స్థితిని అనుభూతిని ఆశ్రయించుకొని యుండును. ఒకనిని ఆనందింపచేసిన కావ్య మింకొకని యెడ కర్రవారును. ఒకే పాఠకుడు ఒకే కావ్యమును భిన్నభిన్న సమయములలో భిన్నభిన్న భావప్రభావములలో భిన్నభిన్నముగా గ్రహించును. సంగ్రహకర్త ఎంత జాగరూకతతో సంతరించినను, ఎంత వివేకి అయినను సర్వకాలములందును సకల పాఠకులను తృప్తిపరచు కావ్యసందోహమును ఏర్చి కూర్చుట అసంభవము కావచ్చును రచనా విస్తృతి, విషయ విస్తారము, వస్తు వైచిత్ర్యము అపారముగా నుండు రచనలను ఏర్చి కూర్చుట ఎంత కష్టమో అంత అవసరము. మహాకవులు కూడ ఒకే భావావేశ శిఖరమందు ఒకే స్థాయిలో నిలిచియుండరు. అప్పుడపుడు తదావేశపటుత్వము సన్నగిల్లును. ఒక్కొకప్పుడు అది లోయలోనికి దిగిపోవును. మహాకవి రచనల నెన్నింటిని చదివి, వానిలో అత్యుత్తమమైన కళను గుర్తించి అభినందించుటకై సామాన్య పాఠకునకు తగిన కాలము గాని ఇచ్ఛగాని ఉండదు రాకూరు రచనలలో ఒకే విషయము కల వానిని - వానిలోకూడ సర్వథా ప్రబలములు అతి గంభీరములు కాని వానిని పాశ్చాత్యులకు ప్రదర్శించుటచే ఆయన కీర్తి కొంత క్రిందుపడినది ఈ విష యము వంగరాష్ట్రేతర భారతీయులకుకూడ వర్తించుచున్నది. రెండు విధము లుగా ఇది జాతీయ దురదృష్టము : ఒకటి—భారతీయులలో ఎక్కువ మందికి భారతీయ మహాకవి ఉత్తమ రచనలు కొన్ని పరిచితములు కాలేదు రెండు — భారతదేశములో పర్ధిల్లిన ప్రావీణ్యమును తెలిసికొనుటకును అభినందించుటకును భారతేతర ప్రపంచమునకు అవకాశము కలుగలేదు కావున జాతీయాంతర్జాతీయ హితము కోసము రాకూరు రచనల నుండి నూతన సంకలనము అవసరమైనది. సాహిత్య అకాడెమి ఈ అవసరమును గుర్తించి రాకూరు రచనలలో నుండి

ఏర్చిన కావ్యములు, గేయములు, నాటకములు, నవలలు, కథలు, వ్యాసములు ఎనిమిది సంపుటములలో ప్రచురింప సమకట్టినది. ప్రథమోద్దేశము భారతీయభాష లన్నిటిలోను రాకూరు ప్రతిభలోని విస్తృతి వికాసము శక్తి—వీనిని తెలియ జేయుట రెండవదియు సహకారియు నగు ఉద్దేశ్యము పై వానిని ప్రపంచములోని ఇతర దేశములకు అందించుట.

101 ఖండకావ్యములు గల ఈ సంకలనము సాహిత్య అకాదెమి ప్రచు రింపదలచిన ముఖ్య రచనల మొదటి సంపుటము. ఈ కావ్యములు మొదట దేవనాగర లిపిలో ప్రచురించి తదుపరి ముఖ్యములైన భారతీయభాష లన్నిటి లోనికి అనువదింపబడును. అటుపైన ప్రపంచములోని ముఖ్యభాషలలోనికి అనువదింపవచ్చును. ఉత్తర భారత భాషల కన్నిటికి సన్నిహిత సంబంధ ముండుటచేత వంగభాష రానివారు కూడ ఆ కావ్యములను (దేవనాగరలిపిలో) చదువుకొని రాకూరు వ్రాసిన వంగభాషను అర్థము చేసికొనగలరు భాషలలో సన్నిహితసంబంధ ముండుటయే కాక, భావావేశములు సాంప్రదాయికాచార ములు, కావ్యవస్తువులు, అనుభూతులు మొదలగు వానియందు కూడ సాన్ని ధ్యము కలదు. దక్షిణ భారత భాషలలోని శాబ్దభేదములు నిజముగా ప్రబల మైనవే. అయినను భావములందును సంప్రదాయములందును ఏకత్వము కూడ అంత ప్రబలమైనది వంగమాతృకలను దేవనాగరలిపిలో ప్రచురించినయెడల అనువాదముల సాయముతో భిన్నభిన్నభాషలలోని పాఠకులు రాకూరు రచనల సౌందర్యమును వ్యంగ్యవైభవమును ఆనందింపగలరు. తరువాత అవి ప్రపం చములోని ఇతర భాషలలోనికి అనువదింపబడినప్పుడు ప్రచారములో నున్న కావ్య సంగ్రహములు అనువాదములు—వీని కన్న ఈ కావ్యములు ఎక్కువగా రాకూరు రచనల సమష్టి భావమును సమకూర్ప గలవని ఆశించుచున్నాము.

101 సంఖ్యలో ఎట్టి పవిత్రతయు లేదు. అత్యుత్తమ కావ్యములను చేర్చి ఈ సంఖ్యను ద్విగుణము చేయదగును అని పాఠకు డనునెడల నే నతని మాటకు మారుమాటాడను. ఈ సంపుటములో చేర్చక వదలివేసిన కావ్యములలో కొన్ని ఇంత ఉత్తమమైనవే కాక దీనిలో చేరినవానికన్న ఉత్తమోత్తమము లని ఎవ రయినా విమర్శించు నెడల నేను దాని నంగీకరింతును. మహాకవి రచించిన వానిలో నూరు కావ్యములా రెండువందల కావ్యములా ప్రశస్తతమములు అను అభిప్రాయభేదమునకు సదా అవకాశము కలదు. అయినను ఈ సంకలనము నందు రెండు విశేషము లున్న వనుచున్నాను. ప్రశస్తము కాని దానిని ఇందులో

చేర్చలేదు. రెండవది — రవీంద్రుని వివిధావస్థలకును శైలులకును నమూనా లుగా ఉన్న కొన్ని కావ్యములైనను ఇందు చేరినవి. ఇది ఆయన రచనలకు ప్రతినిధిగా ఉన్నది. ఈ సందర్భములో ఒక విశేషము చెప్పుట అవసరము. ఇందు గేయకావ్యములను ఉద్దేశ్యపూర్వకముగా వదలినాము. వానిలో రవీంద్రుని ప్రశస్తతమగేయము లున్న వనుటకు సందేహము లేదు. ఆయన గేయములను ప్రత్యేక సంపుటములో ప్రచురింప నుద్దేశించి ఈ సంపుటములో వానిని వదలుట మంచి దని తలచితిమి.

ఈ సంకలనము వెనుక చెప్పిన 'నిర్ఝరేర్‌స్వప్నభంగ' అను కావ్యముతో ప్రారంభ మగుచున్నది. రాకూరు దీనిని తన కవితా ప్రతిభాసమున్మేషముగా భావించినాడు. దీనిలో ధ్వనించు గేయశ్రుతి దీర్ఘ మగు రాకూరు కవితాజీవితమం దంతట స్ఫురించుచున్నది. కొన్నియెడల — 'సోనార్ తరి' లేక 'నిరుద్దేశ్ జాత్ర' అనువానిలో ఈ శ్రుతి లాత్త్వికాకాంక్షతో సంశ్లిష్ట మైనది. 'జేతే నాహి దిబో', 'బసుంధర' లేక 'భారతతీర్థ' ఇత్యాదులలో ఈ శ్రుతి గంభీరమైన మానవవాసనతోడను దాని తాత్పర్యముతోడను గుంఫిత మైనది. ఒకప్పుడు 'ఊర్వశీ' 'ఛబి' లేక 'చంచల' అను కావ్యములలో కేవల గేయత్వము ఐంద్రియి కత్వముతోడను బుద్ధికౌశలముతోడను సంపూర్ణ మేళనము పొందినది. ఇట్టి మేళనము ప్రశస్తతమ మగు నమూనాలలో నొకటి యగు 'ప్రహర్ శేషేర్ ఆలోయ్ రాంగా' అను అసంపూర్ణ కావ్యములో కనబడుచున్నది.

మనుష్యుని పరమప్రయోజనము స్వీయదుఃఖమును, ప్రపంచములోని ప్రభూతదుఃఖమును జయించుటయే అని రాకూరు భావము. స్వార్థపరత్వము నుండియు, ఆత్మవిరోధము నుండియు ఉత్పన్న మగు దుఃఖమును మానవుడు జయించగలడు. అపరిహార్యఫలక మగు జీవితానిత్యత్వమువలన కలుగు గభీర దుఃఖమును గూడ అతిక్రమింపగలడు. 'బిదాయ్–అభిశాప్' అను కావ్యములో దేవయాని ఇచ్చిన శాపమునకు బదులు ఆమెకు వర మొసంగిన కచుడు విజయిగా మానవు డగుచున్నాడు. 'బ్రాహ్మణ్' అను కావ్యములో మానవుని గొప్ప దనము జననమాత్రముచేత కాక త్రికరణశుద్ధిగా సత్యము నంగీకరించుటలోనే కలదని ఉపాధ్యాయుడు తెలిసికొన్నాడు. 'జేతే నాహి దిబో' అను కావ్యములో వివేచనాపరులగు స్త్రీపురుషులు నిష్ఫలు లగునెడ పసిపిల్ల ఒకప్పుడు మానవ స్వభావములోని సహజసత్యము వ్యక్తము చేయగలదు. 'గాంధారీర్ ఆబేదన్' 'కర్ణ–కుంతీ సంబాద్' అను కావ్యములలో ఆశ, వాత్సల్యము లేక భయము—

వీనిని జయించుటయందే మానవుని గొప్పదనము కలదని మరల నొక్కి చెప్పినాడు. మానవ సంబంధములలో గల దుఃఖము సౌందర్యము 'దిది' అను ఖండ కృతిలోను, 'జన్మకథ' తో ప్రారంభమైన చక్కని శిశుకావ్యములలోను నిబద్ధములైనవి.

రాకూరు ఎక్కువగా సంప్రదాయసిద్ధములైన కావ్యవస్తువులను గ్రహించినాడు. ప్రాచీన సంస్కృత సాహిత్యములోని శబ్దగుణాలంకారములును శబ్ద సాంగత్యములును అయన కుపజీవ్యములైనవి. అయినను తాను గ్రహించిన వానికి ఆయన క్రొత్తదన మాపాదించినాడు రాకూరుకు కాళిదాసుమీద అత్యంత గౌరవము కలదు. ఆయన రచనలనుండి కావ్యవస్తువును గ్రహించి కూడ ఠాకూరు దాని భావము కొంత మార్చి పూర్తిగా ఆధునిక పద్ధతిలో రచించినాడు. మేఘదూతము పౌరాణిక యక్షుడు కేవలము తన ప్రియురాలికి ంపిన సందేశమే కాదు రాకూరుకు అది సకల దేశములందును సర్వకాలములందును మానవ ప్రేమికులకు కలుగు తీవ్రాకాంక్షయే అని ఆయన భావము. 'అహల్యార్ ప్రతి' 'భ్రష్టలగ్న' 'స్వప్న' అను కావ్యములలో మాసిపోయిన ప్రాచీనమానవ ప్రకృతిని పునః సృషిచేసి ఈనాటి మానవ స్థితులలోను, భావావేశములలోను ఆ ప్రకృతి మరల జీవించియున్నదని విశదీకరించినాడు భూతమునకు వర్తమానమునకు గల సంబంధమును, పురాణమునకు అనుభవమునకు గల సంబంధము 'మదన భస్మేర్ పర్' అను కావ్యములో అంత చక్కని కౌశలముతో చిత్రించినట్లు ఇతరత్ర అరుదుగా తప్ప కనబడదు ప్రాచీన సంప్రదాయములను పునరుద్ధరించి సజీవములుగచేయు శక్తి ఆయన చివరి కావ్యములందును కలదు. 'తపోభంగ' అను కావ్యములో నూతన జీవిత విజృంభణము చివరకు సన్యాసమును జయించినది అను ప్రాచీన గాథకు దివ్యమైన వ్యాఖ్యానముచేసి సుందర మగు రూపము నొసగినాడు.

రాకూరు కావ్యవస్తువునందే కాక కావ్యశిల్పములో కూడ రూపవిధానమును పరిశోధించినాడు. పూర్వుల ప్రాభవమునుగూర్చి ఆయన ఎన్నడు భయపడలేదు. సాంప్రదాయికమైన వంగీయ వైష్ణవ కవిత్వము నుండి స్వేచ్ఛగా సంగ్రహించినాడు. బిహారీలాల్ వంటి కవికి తాను చాల కృతజ్ఞుడనని తానే అంగీకరించినాడు. ఎవ్వరును తమ దేశ కాలపరిస్థితుల నుండి తప్పించుకొని పోలేరు. తప్పించుకొనుటకు ప్రయత్నించువారు సామాన్యముగా విఫలు లగుదురు. అట్టి ప్రయత్నము కవికి ఆత్మవిశ్వాసము లేదని సూచించును. రాకూరు

తన సమకాలికమగు సాంఘిక ప్రభావములో అభివృద్ధి నొందినాడు కాని ఆ అభివృద్ధి విధానము చేతనే క్రమముగా ఆయన దానిని అతిక్రమింపగలిగినాడు. తాను కవిత్వము చెప్పనెంచిన భాషాదికము నిశ్చయము కాగానే కవితారూపములోను కావ్యవస్తువులోను పరిశోధనలు చేయుట కాయన సందేహింపలేదు. తనకు పూర్వము వంగీయ కవితలో ఉపేక్షించిన విషయానుభూతులలో నుండి ఆయన తన కవితాసామగ్రిని సమకూర్చుకొన్నాడు. నిజముగా ఇది కవిత్వమున కనుకూలమైనది, ఇది కాదు అను విచారణ ఆయన పూర్తిగా తుడిచివేసినాడు 'క్షణిక' అను కావ్యములో చూచినంతనే కవిత కనుకూలింపని వస్తువును గ్రహించినాడు. కాని ఆయన ప్రతిభావిశేషము దానిని సామాన్య స్థితినుండి పైకెత్తి సౌందర్య తేజః పుంజముచే ప్రకాశించునట్లు చేసినది. గంభీరానుభూతులు అత్యంత సులభ పదములతో వ్యక్తము చేయవచ్చు ననియు, నిత్యజీవితములోని సంగతులను రహస్యాలోకముతో ప్రకాశింపచేయవచ్చు ననియు వర్డ్స్‌వర్త్ అను ఆంగ్లకవి వాదము. అది ఈ కాలపు ఠాకూరు కావ్యము లనేకములలో విస్పష్టముగా కనబడుచున్నది. కరుణహాస్యములను వినోదావేగములను మేళవించి అభిలాషమును, ఉత్కంఠను, అపహాసమును ఆయన అపూర్వముగా సంయోజించినాడు. 'కృష్ణకలి' 'జథాస్థాన్' 'షేకాల్' అను కావ్యములలో మానవభావములు, మానసికస్థితులు, ఆవేదనలు అద్భుతముగా అన్యోన్యసంవలితము లైనవి.

ఠాకూరు ప్రతిభ ముఖ్యముగా గేయకవిత్వములో కనబడుచున్నది. అయినను అప్పుడప్పుడు దానిలో సాంఘిక దోషాలపై తీవ్రమైన అవహేళనము, అపహాస్య పూర్వకదూషణము కలవు. ఆచార పూర్వకముగా భారతీయులు తమదని, భావించు ఆధ్యాత్మికశక్తి ఒక్కొక్కప్పుడు ఆలోచనా రాహిత్యమునుగాని తదసమర్థతనుగాని తెలుపునది అని ఆయనకు తెలియును. 'హింగ్ టింగ్ ఛట్' అను కావ్యములో శూన్యమనస్సును మరుగుపరచు గంభీరయవనికను నిర్దయగా చీల్చినాడు. 'దుయ్ పక్షి' అను కావ్యములో జీవములేని ఆచారములను నిర్జీవము లగు సంప్రదాయములను మన జీవితమును భారముగా నొనర్చిన పద్ధతిని అవహేళన చేసినాడు. 'దేబతార్ గ్రాస్' అను కావ్యములో సాంప్రదాయిక విశ్వాసములకును మతమునకును గల సంఘర్షణమును చిత్రించి బాహ్యరూపములందు సామాన్యముగా మానవుడు పోగొట్టుకొను సత్యము చిట్టచివరకెట్లు జయించునో చిత్రించినాడు. 'అపమానిత' 'ధులామందిర్' అను కావ్యములలో మానవునకు

అథోగతిలో కలుగు తిరస్కార క్రోధావేశములకును, మానవావమానములు సర్వవృత్తి సమత్వాంగీకారము అను వానికి గల విరోధమును చూపించినాడు.

ఈ సంపుటములో రాకూరు చివరి జీవితమందలి రచనలే ఎక్కువగా ఉన్నవని విమర్శకులు కొందర నవచ్చును. అందులో కొంత సత్య మున్నది. ఈ సంగ్రహములో 1882 మొదలు 1924 లోపల రచించినవి 80 కావ్యములును, 1928 మొదలు 1941 లోపల రచించినవి 20 కావ్యములును కలవు. ఇందు కొక కారణము యౌవనకాలపు రచనలు వంగభాషలోను, ఇతర భాషానువాదములలోను, ఇదివరకే ప్రకటితములై యుండుట, చివరకాలములోని కావ్యములను ఎక్కువగా గ్రహించుటలో గల రెండవ కారణము వానిలో భావగాంభీర్యము, పరిమిత పదప్రయోగము, ఎక్కువగా నుండుటయే. శిల్పనైపుణ్యము భావకేంద్రీకరణము కలిసి ఈ చివరి కావ్యముల యందు గాంభీర్యమును, మర్మస్పర్శిత్వమును అధికము చేసినవి. యౌవనారంభములో రాకూరు చాల సుందరమైన ప్రేమకావ్యములు రచించినాడు. కాని అవి జీవితోపరితలమును మాత్రము స్పృశించుచున్నట్లున్నవి. ఆకాంక్ష ప్రజ్వలించు లోతుకు పోలే దవి అందుచేత అప్పుడప్పుడు విమర్శకు లన్నారు— ప్రేమానుభూతిని తెలుపుటకన్న శబ్దములను ఏర్చి కూర్చి వ్యక్తము చేయుటలో ఆయన ఎక్కువ శ్రద్ధ తీసికొన్నాడవి. కాని అది పూర్తిగా యథార్థము కాదు, 'రాత్రే ఓ ప్రభాతే' వంటి కావ్యములోను, 'స్వర్గ హోయితే బిదాయ్' అను కావ్యములోను పొంగి పొరలు ఆకాంక్ష లున్నవి. అయినను వానిని తరువాత వ్రాసిన కావ్యములతో పోల్చి చూచినప్పుడు మొదటి రచనలలో లేని గభీరత ఉదాత్తత తరువాతవ్రాసిన వానిలో ఉన్నవని అంగీకరింపక తప్పదు. నిగ్రహముతోను, నిగూఢ మనోరాగముతోను నిండిన 'స్తబ్ధరాతే ఏక్ దిన్', 'భాలోభాసార్ మూల్య' అను కావ్యములతో సరివచ్చునవి ఏ భాషలో నైనను కొలదిగానే ఉండును.

చివరిదశలోని కావ్యములలో తీవ్రత ప్రగాఢత అను గుణములే కాక జీవిత రహస్యములోని సమస్యల విచారణ క్రమక్రమాభివృద్ధి నొందినది. వంగీయ కవితలో సమృద్ధి వైవిధ్యము ఉన్నప్పటికిని తరుచుగా సంకుచితత్వము ప్రకటిత మగుచున్నది. అతి మనోహరములైన వైష్ణవ గేయములుకూడ స్థానిక వాతావరణములో నిమగ్నమై యుండుటచే వానిని వాని సందర్భముల నుండి విడదీయుటకు వీలులేదు. రాకూరు సాధించిన గొప్ప విషయములలో నూతన శిష్టత్వము, విశ్వజనీనత ముఖ్యములు. అందుచేత ఆయన కావ్యములు

వంగదేశజులకు వలెనే అమెరికా యూరప్ ఖండములలోని వారికి కూడ ఆస్వాద్యము లగుచున్నవి. ఈ విశ్వజనీనతాప్రుతి శిష్టతాప్రుతి నిరంతరముగా గంభీరములై ఆయన దీర్ఘజీవిత మంతటను ప్రవృద్ధములై ఆయన చివరికాలపు రచనలలో ప్రముఖస్థానము నలంకరించినవి. వానిలో మానవునకును అతని ప్రయత్నాశయములు, ఆశానిరాశలు, ఆకాంక్ష నిత్యకృత్యములు మొదలగు వానికిని గల బంధుత్వమును స్థిరపరుచుటకై యత్నించినట్లు స్పష్టపడుచున్నది. ఠాకూరు తన చివరి కాలములో అనుభవింపవలసి వచ్చిన శారీరక బాధనుకూడ అసమానమైన స్పష్టతతోను ఆవేదనతోను వ్యక్తము చేసినాడు. 'అవసన్నచేతనార్' లేదా 'అబ్రసదినేర్ ఆలో' వంటి కావ్యాలలో ఉన్న పరిమిత శబ్దములతోడి భావాభివ్యక్తి పిన్ననాటి కావ్యాలలోని అదృఢ పదబంధము శబ్దవిస్తృతి ఇత్యాదుల కన్న మిక్కిలి భిన్నముగా నున్నది. భావాభివ్యక్తిలో శబ్దనియతి శబ్దపరిమితి ఉండుటయే కాక భావముల సమగ్రత, సంపూర్ణత చివరి కావ్యాలలో సుస్పష్టముగా నున్నవి. చూడగా ఆయన జీవితముతోను ప్రపంచముతోను సంధిచేసికొన్నా డనిపించును. ప్రపంచములో బాధ దైన్యము కలవు. జీవితమువెన్నంటి యున్నది మృత్యువు. ఎన్ని లోపము లున్నను జీవితము అర్థప్రయోజనములతో నిండియున్నది. 'ఏ జీవనే సుందరేర్' లేదా 'మధుమయ పృథివీర్ ధూళి' అను వానిలో మిత్తిలోయ చాయలలో జీవితమే విజయము పొందిన దను భావము ప్రస్ఫుటముగా నున్నది.

కవి మానస మేవిధముగా నభివృద్ధి పొందినదో వివరించుట అసంభవము కాకపోయినను చాల కష్టము. ఇతర విషయము లందలి అనుభవములలో అవిచ్ఛిన్నమగు అభివృద్ధి కొన్ని నియమముల ననుసరించి యున్నట్లుండును. కాని కవిత్వ విషయములో అద్భుతముగను అనిర్వచనీయముగను భావోద్వేగము వృద్ధిక్షయములు పొందుచుండును. ఒకప్పుడు ఒక కవి బాల్యములోనే మహాకావ్యములు రచించును. వయసు వచ్చిన తిరువాత అతి సామాన్యములు పారంపరీయములు అగు కావ్యములు వ్రాయును. ఠాకూరు కూడ ఈ తరగతి వారికి భిన్నుడు కాడు. ఆయన బాల్యకాలపు రచనలలో ప్రశస్తములైన కావ్యము లున్నవి. తరువాత వ్రాసిన వానిలో భావావేశ రహితము లగు కావ్యము లున్నవి. ఐనను ఆయన తన యెనుబదియేండ్ల దీర్ఘజీవితములో అవిచ్ఛిన్నముగా భావావేశమును పోషించుకొన్న విధానమే ఆయనను సార్వకాలిక మహాకవులలో ఒక డని చాటుచున్నది. అట్టి మహత్త్వము సాధించుటకు తగిన సామర్థ్యమును

ప్రాణశక్తియు నెలకొనుటకు ఆయన వ్యక్తిత్వమునందలి సమగ్రతయు అఖండత్వ మును కారణములు. నేటి భారతీయ మిశ్రమ సంస్కృతిని రూపొందించిన భిన్నభిన్న సూత్రములను తనయందాయన ఏకత్వము నొందించుకొన్నాడు. అనేక ముఖములు గల భారతీయ జీవితములోని భిన్నభిన్న దృక్పథములను గ్రహించి ప్రతిబింబింప చేయుటలో ఆయన ప్రభావము విరాజిల్లుచున్నది. సంస్కృత సాహిత్యము నుండి విరివిగా గ్రహించి ఆయన వంగభాషా పదజాల మును ఛందోరీతులను వృద్ధిచేసినాడు. వైష్ణవ గేయకవితను సూఫీల తత్వాను భూతులను సమగ్రముగ సమన్వయించినాడు. మధ్యయుగములో జమీందారీ విధానము ప్రబలినప్పుడు వృద్ధిపొందిన రాజసభామర్యాదలను సానుభూతితోడను కల్పనాశక్తితోడను ప్రదర్శించినాడు. ఆ కాలమందు ఇతరులు స్పృశింపని సామాన్యజన జీవితములను కావ్యనిబద్ధము చేసినాడు. వంగీయ గ్రామములలోని భావచిత్రములను ప్రతీకలను అద్భుత నైపుణ్యముతో తన కవితావస్త్రములో అల్లినాడు. వంగసాహిత్యములో యూరప్‌లోని ఆదర్శములను ఆశయములను సమకూర్చినాడు. 'బలాకా' కావ్య సంగ్రహములోని చాల ఖండికలలో గల శక్తి, ఆవేగము ఐరోపా సాహిత్యమునుండి లభించి యుండవచ్చును. సర్వము క్షణిక మని ప్రాచీనులే కనుగొన్నారు. కాని సర్వవస్తువులందును నిగూఢముగా నున్న చలనమునకు అది ప్రతీక అని రాకూరు దానికి నూతనార్థము చెప్పినాడు.

సమృద్ధమగు భారతీయ సంస్కృతి సంపదలు, మొగల్ దర్బారులోని విశాలరీతులు, వంగదేశములోని సామాన్య జనుల జీవితములందలి సహజ సత్య ములు, నేటి ఐరోపా ఖండములోని బుద్ధిప్రాగల్భ్యము వ్యాకులశక్తి—వీని సమ్మేళనమందు రాకూరు కవిత ప్రాదుర్భవించిన దని ఒక్కమాటలో చెప్ప వచ్చును. సర్వకాలములకును సర్వసంస్కృతులకును రాకూరు వారసుడు. ఏవం విధములగు భిన్నసూత్రములు భిన్నప్రసంగములు కలిసి రాకూరు కవిత్వ మునకు విజృంభణము విశ్వజనీనత అశేష హృదయగ్రాహిత ఒసగినవి.

—హుమాయూన్ కబీర్

★

# నిర్ఝర స్వప్నభంగము

ఎంతహాయిగ సోకిన దినకరములు
ప్రాణములలోన నేడీ ప్రభాతమందు!
ఎంత సొంపుగ జొచ్చెనీ గుహాంధ
కారమున ప్రభాత విహంగ గానలహరి!
ఎందులకు మేలుకొన్నదో ఎరుకపడదు
ప్రాణ మిన్నిదినాలు పైబడిన పిదప!
మేలుకొన్నది ప్రాణము, మేరమీరి
నీర ముద్వేల్లితంబయ్యె. నే నయారె
ప్రాణవేగము ప్రాణసంభ్రమము నింక
నిగ్రహింపగ జాల. క్షోణీధరంబు
గడగడ వడంకుచున్నది, గండశిలలు
రాశిరాసులుగా నూడి రాలుచుండె;
గర్జనముచేసె నురుగులు గ్రక్కి జలము
పొంగి దారుణరోష ముప్పొంగి పొరల!

అచట నచ్చట నున్మత్తునట్లు వెడలి
సంచరించితి పారవశ్యమ్ముతోడ
బయటపడ నెంచితిని. కాని బంది తలుపు
ఎచట నున్నదో కనబడ. దీ విధాత
ఇంత పాషాణమైనా డదేల నొక్కొ!
అతని బంధన మేలకో అన్నియెడల!
భంగపరుచుము. హృదయమా, బంధనంబు!
ప్రాణముల సాధనము సిద్ధపరుచు నేడె!
ఊర్మికలమీద నూర్మిక లుప్పతిల్ల
తగులనిమ్ము ఘాతమ్ము ఘాతమ్ముమీద

ప్రాణ మెప్పుడు పరవశమందు నపుడు
ఎవరికి తమస్సు పాషాణ మెవరి కద్దు ?
ఎప్పు డుప్పొంగునో మనోవృత్తి యపుడు
భయము జగమున నెవ్వారివల్ల కలుగు ?

కరుణరసధారలను నేను కురియు దింక ;
రాతిచెరసాల భంగింతు, గీతములను
పాడుచును ప్లావనముచేసి వసుధయెల్ల
మరచి విహరింతు వ్యాకులోన్మత్తు పగిది
విరియబారగ చికురముల్, విరులుకోసి
ఇంద్రధనురంకితము తాలవృంతమెత్తి
విసరికొనుచు, విభాకరు వెలుగులందు
నవ్వు వెదజల్లి, ప్రాణమా, నవ్య నవ్య
రీతు లొప్పార ప్రసరింపజేతు నిన్ను ;
శిఖరమునుండి లంఘింతు శిఖరమునకు,
శిఖరిపైనుండి దొరలెద శిఖరిమీద.
కిలకిల హసింతు, పాడుదు కలకల యని,
దరువు వేసెద తాళము తాళమునకు
ఇంత కథ యున్న, దున్నది యింత గాన,
మింతయున్నది నా ప్రాణ, మింత సౌఖ్య
మున్న, దింతటి యభిలాష యున్నదిపుడు ;
పరవశం బగుచున్నది ప్రాణమింక,
ఏమి జరిగినదో యేమొ యెరుకపడదు
అల్లదే మేలుకొన్నది ప్రాణ మిపుడు
అమ్మహాంబుధి గానమ్ము సుమ్ము, వినగ
నయ్యె దూరమ్మునుండి ; ఈ యన్నియెడల
ఈ భయంకర బంధనమేల నాకు ?
పగులగొట్టుము పడపడ బంధనంబు
ఘాతములపై తగుల్చుము ఘాతములను
ఎట్టి గానము నేడహో ఈ ఖగాళి

సలుపుచున్నది ! నే దెంత సమ్మదముగ
సూర్యకిరణము లేతెంచుచున్న వాక్కా !

1882 ప్రభాత సంగీత్

## ప్రాణము

ఇట్టి సుందరధరణిలో గిట్టుటకును
అభిలషింప నెన్నడు, మానవాళి నడుమ
నేను జీవింపగోరుచున్నాను సతము.
ఈ రవి మయూఖములలోన, నీ సజీవ
హృదయజాతము నడుమను, నీ కుసుమిత
వనములో నాకు స్థానము ప్రాప్తమగునె !
చిరతరంగితములు కావె ధరణిలోన
ప్రాణి లీలలు ! విప్రలంభములతోడ,
సంగములతోడ, హాసబాష్పములతోడ
మిళితమైయుండు మనుజుల మేలు కీడు
లందు సంగీతమునుగూర్చి యమరనిలయ
మహహ నిర్మింపగా నాకు నలవియగునె !
అలవికాకున్న మనియుండు నంతదనుక
పడయగలను మీ యందర నడుమ నునికి
అపుడు ప్రత్యూషములను సాయంతనముల
నవ్య నవ్య సంగీతసూనములు మీరు
కోసికొనుటకు వికసింపజేసి యుంతు.
సంతసముమీర మీరా లతాంతతతిని
స్వీకరింపుడు ; కటకటా ! పిదప వాని
పారవేయుడు వసివాళ్లు వాడెనేని.

నవంబరు 1886 కడి ఓ కోమల్

## నిష్ఫలకామన

అస్తమించె దివాకరుం, డంధకార
మడవిలోపల, నాలోకి మారసమున.
నాలినడకలుమీర దినమ్ము వెంట
సంజ నతనేత్రములతోడ సాగివచ్చె.
వీచుచున్నదియో లేదో పీఁకికోలు
నలమటను శ్రాంతమైన సంధ్యనిలమ్ము.
కరము కరమునజేర్చి యేకాగ్రదృష్టి
అరయుచుంటి క్షుధార్తములైన కనుల.

ఎచట నుంటివి నీవు, నీ వెచట నుంటి
వనుచు వెదకుచు నుంటి ని న్నన్నియెడల.
ఏది నీలోన గూఢత నిండియున్న
అమృత మెచ్చట ? అంధకారావృతమగు
సాంధ్యనభమున, విరల నక్షత్రచయము
నందు, స్వర్గీయ శోభా మహారహస్య
మే విధంబున కంపించు నా విధాన
ఆ కనులలోని చిక్కని చీకటి కడ
అల్ల కంపించు నాత్మరహస్య శిఖయు;
అందుకై చూచుచుంటి నే నా విధాన.
మనము ప్రాణమునెల్ల కైకొని యగాధ
కాంక్షితాపార సాగర గర్భమందు
మునిగిపోవుచు నుంటి. నీ కనులలోన,
హాసముల, వాక్సుధాప్రవాహముల యందు,
నీ ముఖవ్యాప్త కరుణశాంతితల మందు,—
ఏ యెడను నిన్ను కనుగొందునోయి యింక !
అందుచేతనె యీ దుఃఖ మందుచుంటి.

అకట, యీ దుఃఖ మోసి దురాశ, వమ్మ :
ఈ రహస్య,' మీ యానంద, మీ విధంబు
నీ కొరకు కాదు, కొలదిగా నాకు మున్న
హాసములు, దృష్టులు, ప్రణయాభాసములును,
వాక్కులు లభించె అదియె నా భాగ్యగరిమ.
ఎంత దుస్సాహసమ్మొ ! నీ కేమి కలదు ?
ఏమి నా కీయగలుగుదు వీవు ? కలదె
నీ కడ ననంతమగు ప్రేమ ? నీకు సాధ్య
పడునె జీవితమందు నపారమైన
లేమి మారీకరింపగా ? ఈ మహాభ్ర
సంవృతానంత జగతియు, జనవితతియు,
ఈ నిరంతర కాంతియు నీ తమస్సు,
అఖిల మాయాంధాళి, ఛాయా ధాళి,
పొందగారాని యుదయాస్త భూధరములు
వీని నడుమను మార్గమ్ము వేలు రచి,
నిత్య సహచరివై, యహర్నిశము విడక
ఒక్కతవె యే సహాయంబు నొందకుండ
తీసికొనిపోవ గల్గుదే స్పీలి నన్ను ?
భీతుడును, దుర్బలుండును, కాతరుండు,
హృదయ భారవ్యథా జర్జరిత తనుండు,
అంధకుండు, బుభుక్షాతృషాతురుండు,
మ్లానదేహుండు, దిగ్భ్రమ మూనువాడు
చిరము దేనిని పొంద కాంక్షించు నింక ?

ఆకలి శమింపజేయ ఖాద్యములు లేని
మానవుండు, నా యనువారు లేనివాడు,
అతిరహస్యముగా, నతియత్నమునను,
హర్షమున, దుఃఖమున, దినమందు, రాత్రి
యందు, సంపద, నాపద, నంతమందు,
బ్రతుకునందును, ఋతుశతావర్తనమున,

సతము పుష్పించుచుండును శతదలమ్ము ;
దాని ఖండించి గ్రహియింప బూనుకొనెదె
కరము పదునైన వాసనా ఛురికచేత ;
తవిసెదవు దాని తీయని తావులు గొని,
కనెదు దాని సౌందర్య వికాసములను,
అనెదవు దాని కమ్మని తేనియలను,
దాని ప్రేమింతు, వా ప్రేమ నూని బలము
పొందెదవు, దాని వాంఛింపకుందు వెపుడు ।
మనుజునాత్మ యాకాంక్షల ధనము కాదు.

శాంతముగ నుండె సంధ్య, నిశ్శబ్దమయ్యె
కలకలమ్మును, నయనాశ్రుజలముతోడ
వాసనావహ్ని నుపశమింపంగ జేసి
మరలిపోదము, మెల్లగా తరలిరమ్ము !

28 నవంబరు 1883 మానసీ

## వర్షువు

ఎరిగిస యెలుగుతో నెదవప్వ నుంది,
'పొద్దువాలిన దింక పొమ్ము నీళ్ళకును'
అని యెవ్వరో పిల్చినట్లు తోచినది.
ఎచ్చ టా సఖి ఛాయ, ఎచట జలమ్ము,
ఆ మెట్ల ఘట్ట, మా యశ్వత్థ తలము ;
ఇంటిలో నొక మూల నుంటి నొంటరిగ
అన్యమనస్కనై. అప్పుడు నన్ను
జలముకై పొమ్మని పలికిన దెవరొ !

కలశమ్ము కదియించి కక్షమునందు
బయలుదేరితి నల్ల వక్రమార్గమున.

దాపలివైపు మైదాన మెల్లెడల
నిరతము నిప్పులు కురియుచునుండు.
వంశవనమ్మున వలపలి దెసను
శాఖ లూగుచునుండు. సాంధ్యదీధితులు
దీపించుచుండును దీర్ఘికానీల
జలములమీద. పార్శ్వమ్ములయందు
ఘనవనచ్ఛాయలు పెనగొనుచుండు.
నిశ్చలగంభీరనీర తీరమున
కోయిలపిండుల కొమరు కూకువులు
అమృత సంసిక్తమ్ములై తేలిపోవు.
మరల త్రోవకు వచ్చి అరసితి నపుడు
ఘనతరుశిఖరమందున సుధాకిరుడు
ఆకస్మికమ్ముగా నంకితుడౌట.

ప్రాచీరము పగిలి పైకి వచ్చినది
అశ్వత్థ మచ్చటి కిరుగుచనుందు
నిత్యము ప్రొద్దున నే లేచినంత
శరదృతువందున మెరయుచునుండు
ధారుణీతలము తుషారముతోడ.
వికసించినవి కరవీర పుష్పములు
గుదిగొని గుత్తులు గుత్తులుగాను.
ప్రహరిపై కెగబ్రాకి వ్రతతులు రెండు
ప్రసరింపజేయుచు పచ్చదనంబు
'బేగుని' పూలతో వెలయుచు నుండు.
పగులుపై చూపులు ప్రసరింపజేసి
చరణతలంబున పొరల కుచ్చెళ్ళు
కనుగొనుచుంటి చాటున కూరుచుండి.

బయలుపైన బయలు, బయలున కావల
అధికదూరమ్మున నాకాశమందు

కలిసిపోయిన దల్ల గ్రామ మంతయును.
నీల పురాతన తాళవనంబు
తాకుచున్నది వారిదంబుల వరుస.
అనకట్ట చెంగట నా జలరేఖ
తళ తళ మెరిసెడి. తటమున జూడ
గోపాలకుల గుంపు గోచరించెడిని.
ఎచటికి పోవునో యేమొ ఆ త్రోవ,
ఏ క్రొత్త సీమల కెళ్లెట్లు చనునొ!

రాతిమే నకట యీ రాజధానికిని!
వ్యాకుల మందిన బాలిక బట్టి
పిడికిలితో నొక్కిపెట్టు విధాత,
గాఢబలమ్ముతో కరుణ వర్జించి!
ఆవరణము లేని యా బయ లేది,
ఆ ఖగసంగీత, మా వనచ్ఛాయ,
ఆ శస్త్రమార్గమ్ము, నా ఘట్ట మేది?

ఏ వైపు చూచిన నెవ్వరో నిల్చి
పరికించు నట్లుండు. ప్రక్కల వారు
వినెదరేమో యని మనసు నే విప్ప.
ఈ వృథాబాధ నా కెక్కడి దొక్క!
ప్రాకార మట నడ్డుపడుటచే నేమొ
మరలి నా చెంతకే యరుదెంచె చింత.

ఎవరు నా కంటినీ రెఱుగంగ లేరు,
అది యేమి కారణ మని యెల్లవారు
నిర్వ్యాకులురై యెంతొ నెమకు చున్నారు—
"ఎద్దానితో గూడ నెనయదు ముదము,
విధము చూడగ నిది విషమదోషమ్ము!
పల్లెపడుచుల స్వభావమో యేమొ!

ఇరుగు పొరుగువార లింటివారలును
కలిసి యిట్లుండంగ కనులు మూసికొని
ఈరీతి కూర్చుండు టేలనో యామె :"

కొందరు వదనమ్ము, కొందరు తనువు
కనుగొనుచుందురు ; కొనియాడుచుంద్రు
కొందరు, మెచ్చరు కొంద రేదియును.
నేను కేవలము ప్రసూన మాలికను
విక్రీత సగుటకు విచ్చేసియుంటి,
శీలింతు రందరు, స్నేహింప రెవరు !

ఎల్లర నడుమ నే నేకాంతమందు
మెలగుదు, కాల మెట్టులు నాకు కడచు !
ఇటుకలపై పేర్చి యిటుకలే చుట్టు,
మానవకీటముల్ మనియుండు నడుమ ;
లే వాటపాటలు, లే దనురక్తి.

ఎచట నుంటివి, తల్లి, ఎచట నున్నావు,
మరువగా గలవె, తల్లిరో, నన్ను నీవు
బాలశశాంకుడు పైతోచినంత
మిద్దెపై కూర్చుండి ముద్దుగా, జనని,
చెప్పవా నా కింత చిత్రకథాళి !
హృదయవేదనతోడ రిక్తశయ్యపయి
కన్నీరు కార్చుచు కనుమోడ్పులేక
కడపెదు కాటోలు నిదురాతి రెల్ల!
పూలుకోసికొని శివాలయమందు
దూరమం దున్న కుమారి సేమమును
ప్రార్థింతు వొక్కొక్క ప్రభాతమ్మలందు :

ఇట కూడ శశితోచు నీ యింటిమీద ;

వెన్నెల నాకయి వెదకుచు వచ్చి
వాకిలినుండి లోపలికి రాగోరు.
ప్రేమింప నెంచి నన్వెదకు చున్నట్లు
తిరుగును చంద్రిక దేశదేశములు
అందుకై యొక క్షణమందు మైమరచి
వాకిలి చెంతకు ఎరుగునబోయి
తలుపులు తెరతు వ్యాకులపాటుతోడ.
ఆ క్షణమందె మా యత్త నా కడకు
చాటుగా నాలుగు చాయ లారయుచు
పరుగునవచ్చు చీపురు చేతపట్టి

చూపరు వెలుతురు, చూపరు ప్రేమ ;
ఛాయాంధకార సంఛన్న దీర్ఘికయు,
తద్గత నీలశీతల జలమ్ములును
మెలగుచునుండు నిచ్చలు మదిలోన.
ఆ నీటియొడి దూరి యారుట మేలు ;
పిలువుడు మీరలు, బిలుకుడు మీరు—
'పొద్దువాలిన దింక పొమ్ము నీళ్ళ'కని
ఆ వేళ యేవేళ నరుదెంచు నొక్కొ,
ఏవేళ నా యాట లెల్లను ముగియు ;
సరగున నా శీతజలము లేవేళ
చల్లార్చు నొక్కొ నా జ్వాలల నెల్ల,
ఎరిగింపుడీ మీర లెరిగిన నాకు ;

23-5-1888 మానసీ

## వ్యక్త ప్రేమ

తీసివైచితి వేల నా సిగ్గు ముసుగు ;
భంగించి హృదయకవాటము, నన్ను

ఈడుచుకొని వచ్చితీవు వెల్పలకు.
తుదకు వీడుదు వాకొ్క్క త్రోవలో నడుమ ?

నేను నా హృదయమ్మలోన నున్నాను
అఖిల కార్యములలో నందర నడుమ
వాసించుచున్నాను సంసారమందు;
అంద రెట్లుండిరో అట్టు లున్నాను.

పెనగొన్న లీవెలు పెల్లు క్రిక్కిరియు,
ఆ సర స్తీరమం దా సీడత్రోవ:
ఆ కరవీర వనాంతరమందు
పూజాసుమాళి లేటోయితి నపుడు.

కుహరిత కోకిలకులమౌ శిరీష
శాఖాచయములో నుషఃకాలమందు,
ఎన్నెన్ని క్రీడలో ఎన్ని హాసములో
సఖులతో కలిసి నే సలిపితి నపుడు.
ఈ ప్రాణములలోన నేమేమి కలదొ
ఎవ్వార లెరుగుదు రెట్టుల తెలియు ?

మల్లెలు వికసించు మధుమాసమందు
ఉద్యానములలోన, నొక కొంతమంది
గుత్తురు మాలలు, కొందరు కోసి
పూలపుట్టికలను పూరించుకొంద్రు.
మలయానిలమ్ము కొంగులు కదలించు.

వర్తించు ఘనఘటల్ వానకాలమున,
చంచలల్ క్రీడించు, జలదముల్ వనులు
కలియు దూరాన వనాంతరమందు,
అపరాహ్ణమున నొప్పు నడవి మల్లెలును.

కడచిపోవును వానకాలముల్ వచ్చి,
గృహకృత్యముల నాచరించుచు నుందు.
కష్టసుఖాంశ భోగములు కల్గించి
అనుదినంబును విచ్చె అరుగుచునుందు.
యామినుల్ గూడ రహస్యమ్ములైన
స్వప్నముల్ గ్రహియించి సాగుచునుందు.

ప్రాణమ్ములందు గుప్తమ్ముగా నున్న
అనురాగము పవిత్రమైనది సుమ్ము!
హావణిల్లు మాణిక్య మట్టుల నదియు
హృదయ తమస్సులో, వెలుగులో నదియె
కాలకళంకమ్ముగా గోచరించు

స్త్రీహృదయమ్ము ఛీఛీ విదారించి
కన్గొందువా? గడగడలాడుచుండు
ప్రణయమ్ము సిగ్గుతో భయముతో నచట
తల్లడపడుచు; నిర్దయుడ! అద్దాని
గుప్తాశ్రయము తటుక్కున పెళ్ళగింతె!

ఆ శరత్కాలము నా వసంతమ్ము
వచ్చు నేడునుగూడ. వక్రాతివక్ర
చాంపేయశాఖను స్వర్ణపుష్పములు
పుష్పించుచుండు. ఆ పూలు త్రుంచెదరు
ఆ సీడత్రోవల నవ్వారె వచ్చి.

అన్నియు నెట్లుండె నట్టులేయున్న
వవికలమ్ముగ. వారె అంగలార్చెదరు,
హసింత్రు, కార్యము లాచరించెదరు.
అనురక్తి చూపింతు, రర్చచేయుదురు,
వెలిగింత్రు దీపికల్, జలము తెచ్చెదరు.

వంగి చూడరు వారి ప్రాణాలలోన
నెవ్వ, రెవ్వరు వారి హృదయములోని
గుప్తగృహము పడగొట్టి కన్గొనరు ;
వార లెరుంగరు వారి పర్మములు.

పడియుంటి త్రుంచిన ప్రసవము పగిది
ఈ రాజవీధిలో నీ రీతి నేడు.
విబిడ పర్ణచ్ఛాయ, నిద్రమౌ కొలని
ఆవరణంబు నే నట్లు త్యజించి
ధూళిలో నక్కటా దొరలుచు నుంటి.

ప్రేమించి ఎంతేని వెతతోడ కుంది
యత్నపూర్వకముగ వ్యవధాన మేను
విరచించుకొని యుంటి చిరము. ప్రాణముల
నగ్నము చేసితి నమ్మికతోడ.

తిరిగి యే ముఖముతో సరయును ప్రియుడు ?
భ్రమపడి వచ్చెనా ? భ్రమపడి నన్ను
ప్రేమించెనా ? భ్రమ విడిపోయినంత
విడిపోయి యుండునా వెనుకకు మరలి.

కడపెదు నీ వింక కాలము నేడు
మగిడిపోయినగాని; మరలిపోవుటకు
త్రోవ లే దిక నాకు : ధూళిసాత్కృతము
అగునట్లు చేతు ప్రాణాభ్యంతరమును.

ఇది భయంకర మాయ ! ఇట్టి ప్రాణములు
వదలుట లే దెన్ని వందలమంది
అఖిల గృహంబుల ? అతడు భ్రమపడి
ఏల ఏతెంచినా డీ దురదృష్ట

బాలికా హృదయాంతరాలంబునకును ?

నను నెట్టి స్థితికి తా కొనివచ్చినాడొ
ఆరసి చూడు, మనావృతమైన
ఈ కలంకము వంక నిక కనుల్ విప్పి
కరినకౌతుకముతో కాంచుచు నుంద్రు
జగమున గల్గు లక్షలకొద్ది జనులు.

చేర మరలి వచ్చి చివరకు ప్రియుడు
కై కొన్నచో బహిర్గతము చేయంగ
నేల యీ సిగ్గును ? ఏకాంత మేల
వదలగా వలయు వివస్త్రనై నేను
విస్తృతమైన పృథ్వీతలమందు ?

24 మే 1888 మానసీ

## మేఘదూతము

ఎప్పుడు, కవివర్య, ఏ విస్మృతాబ్దమం,
దే సుకృతాషాఢ మాసమందు,
ప్రథమ దినంబున రచియించినాడవో
మేఘ దూతమ్మును : మేఘమంద్ర
పద్యాళిలోన విశ్వములోని విరహుల
తాపమ్మును, తదీయతమములోని
పొరపొరయందున విరచించితివి నీ ని
రంతరగానమ్ము రాశిపడగ ;

ఎన్నియో ఘనఘట, లెన్నియో విద్యున్మహో
త్సవము, లదెంత దుర్దాంతవాయు

రయ మొకో, యెంత ఘర్ఘర ఘోషమో, నాడు
సౌధాగ్రములను నుజ్జయిని యందు ;
జలద సంఘర్షసంజనితగంభీర ని
ర్ఘోషచే నంతర్నిగూఢ మగుచు
బాష్పాకులంబైన బహ్వబ్దవిచ్ఛేద
శోకమే యొకనాడు పైకి పొంగె.
కాలబంధనము భంగముచేసి చిరకాల
సంరుద్ధ బాష్పముల్ ఝరమువోలె
ప్రవహించె నేమొ నార్ద్రిముగ నొనర్చుచు
నీ యుదార శ్లోక నిచయమెల్ల :

ధరలో ప్రవాసు లెందరు నాడు తలలెత్తి
గగనమునందు మేఘమును గాంచి,
అభిముఖు లగుచు ప్రియా గృహమ్ములకును
విరహగాథలు సమస్వరముతోడ
కరములు జోడించి గానము చేసిరో ;
నవ్యాంబుదచ్ఛదనంబులందు
ఆసీనులై యెంద రాసించి నారలో
ప్రేమవార్తలు పంప ప్రియతమలకు—
వాతాయనము చెంత భూతల శయ్యపై
మ్లానవేషంబులు పూనియుండి
సజల నేత్రములతో శయనించి కేశముల్
విడివడి చెదరిన విరహిణులకు ;

కవివర్య ! విరహుల గానము నీదు సం
గీతమ్ముతో మేళవించి, వెదకి
పంచితే రాత్రిందివమ్ములు ప్రియలగు
వివిధ దేశమ్ముల విరహిణులకు-
శ్రావణమాసాన జాహ్నవి దిగ్గిగం
తర వారిధారలు తా గ్రహించి

పాథోధిని లయింప బ్రవహించు రీతిగా :
స్వచ్ఛందముగను నాషాఢమందు
వినువీధి విహరించు ఘనమేఘముల జూచి
నిండు దుఃఖమ్ముతో నిశ్వసించి,
శీతాద్రియందలి శృంఖలాబద్ధులు
కందరంబులనుండి గగనమునకు
చిమ్మిరో పుంజిపుంజిగ నెట్లు కన్నీరు ?
ఎవ్వ రుద్దేశవిహీను లగుచు
పరువెత్తిరో, వారు వాంఛానమమ్ముగా
పరచిరి. శిఖరముపైకి నెక్కి
అందరు కలిసి యేకాకారు లయ్యేద,
రధికారు లయ్యేద రభ్రమునకు.
ఆనాటి తరువాత నా స్నిగ్ధ నూతన
వర్షఋత్వాదిమవాసరములు
వచ్చిపోయిన వెన్నివందల తడవలో :
ఇట్టులే ప్రతివర్షఋతువునందు
నవవర్షధారలు నవ్యజీవనమును
నీదు కావ్యముపైన నింపిపోయె.
అంబుదగంభీరమగు నవ్యనవ్య ప్ర
తిధ్వని దెసల వర్తింపజేసె
వర్షాతరంగిణివడుపున నీ కవి
తానదీరయము స్ఫీతమ్ము చేసి.

సహచరీవిరహితుల్ సహచరీరహితగే
హమ్ముల నెంత కాలమ్ముమండి,
నిదురయై, వానచే వదలి, తారకల్ శ
శాంకుడు లేని యాషాఢమాస
సాంధ్యకాలమ్మున సన్నని దీపపు
కాంతిలో, భవదీయ కవిత నెంద
రాస్థతో జదువుచు, నాత్మీయవిరహబా

ధలను నిమగ్నము సలిపికొనిరొ :
జలనిధివీచికా కలకలధ్వనివలె
వారల కంఠరవంబు నాదు
కర్ణంబులకు నీదు కావ్యమ్మునందుండి
వినవచ్చుచున్నది విశదముగను.

భారతదేశ పూర్వాంచలమ్మున నుంటి
శ్యామలవంగదేశమున నేను—
వానకాలమునం దొకానొక దినమున
సంపూర్ణముగ నాకసంబునందు
జలధరజాల మాచ్ఛాదించి యుండ ది
గంతతమాలవనాంలిరిముసె
జయదేవకవి యెట శ్యామలచ్ఛాయను
తిలకించి యుండె నా దేశమందు ।

జోరున వర్షమ్ము, కారుచీకటి పగల్
చండదురంత ఝంఝూనిలమ్ము,
అది యాక్రమింప హాహాకార మొనరించె
హస్తముల్ పైకెత్తి అడవి నేడు.
అత్యర్ధకుటిలాట్టహాస మాకసమున
పెల్లు వర్షించి విద్యుల్లతాంగి
జీమూతజాలముల్ చీలుచుకొని వచ్చి
తిలకించుచున్నది తీక్ష్ణముగను.

గృహకవాటములు బిగించి చీకటిలోన
ఒంటిగా కూర్చుండి యొక్కచోట
మేఘదూత మధిగమించుచుంటిని నేను,
వారిదపృష్ఠమ్ముపైన నెక్కి
దేశదేశమ్ములు తిరుగాడుచుండె గృ
హత్యాగి హృదయ మిచ్ఛానుగతిని.

ఆ సానుమంతమౌ ఆమ్రకూట మ్మెట ?
స్వచ్ఛవిశీర్ణ రేవాస్రవంతి
గ్రావప్రపీడితగతితోడ వింధ్యాంఘ్రి
తలమున ప్రవహించు స్థాన మెచట ?
వేత్రవతీతటోర్వి పక్వఫలనీల
జాంబూలకాననచ్ఛాయలోన
విచ్చిన గేదంగి విరులచే వేష్టిత
మగుదశార్ణగ్రామ మది యెచటనొ ।
అధ్వపాదపశాఖలందు నీడంబులు
విరచించుకొను గ్రామ విహగచయము
కలరవంబుల వాన కాలమునందున
తరువుల చుట్టును దిరుగు నెచట ।
కాననాంగన యూథికావన చారిణి
తిరుగు నే నిమ్నగా తీరమందు,
త ప్తకపోల సంతాపముచే క్లాంత
మైన కర్ణోత్పల మంబుదముల
చల్లని నీడకై తల్లడిల్లుచునుండె
ఇంతు లెవ్వ రైరో యేమొ గాని
జానపదాబలాజనములు కాబోలు
భ్రూవిలాసము లెట్టివో యెరుంగ
రంబుదాడంబర మదరు దివంబున
ప్రాకెడి ధారాధరముల వంక
తిలకించుచుండి రుత్ క్షి ప్తనేత్రములతో ;
వారి నీలాక్షుల పైన నల్ల
వాలుచున్నవి సాంద్ర నీలిమచ్ఛాయలు.
జలధరశ్యామల శైలమందు
ముగ్ధసిద్ధాంగన స్నిగ్ధనవాంబుద
మరసి యుత్కంఠిత యైన దొకతె
ఆ శిలాతలమున. ఆకస్మికముగ మ
హాంధకారము కవియంగ చూచి

భయముచే వివశయై వడవడ కంపించె—
'అమ్మయో, ఈ తిమిరమ్ము కదిసి
అద్రిశృంగమును మాయముచేయు కాబోలు'
అని తలపోయుచు నళుకుతోడ
సంయతవస్త్రయై చనుచుండె మరలి తా
దరిగృహంబును వేగ నరసికొనుచు.
ఎట నవంతీపురి, ఎట వింధ్యగిరికి దూ
రమున నిర్వింధ్యాతరంగిణియును !
సిప్రానదీతీరసీమను స్వమహిమ
చ్ఛాయ నీక్షించు నుజ్జయిని యెచట !
అచట రాతిరి రెండు యామము లప్పుడు
ప్రేమచాంచల్యంబు విస్మరించి
కనుమోడ్చె భవనాగ్రమున కలకంఠమ్ము.
రాజమార్గమువెంట రమణి యొకతె
ఆ సూచికాభేద్యమైన తమస్సులో
క్షణిక విద్యుత్ప్రకాశమ్ములోన
కేవల విరహవిక్రియతోడ ప్రేమాభి
సారికయై వేగ సాగుచుండె.
అల్ల బ్రహ్మావర్తమందు కురుక్షేత్ర
మెచ్చట రాజిల్లు ? ఎచట కనక
ఖలతీర్థ? మా జహ్నుకన్య యా తావున
యౌవనచాంచల్య మతిశయింప
పార్వతీభ్రూకుటీభంగిని భంగించి
మృదుఫేన పరిహాసమిషను తాను
గిరిశుజటాచంద్రకర సముజ్వలితయై
సలుపుచున్నది క్రీడ స్వైరగతిని.

తోయదరూపమ్ముతో దేశదేశముల్
చెరలాడి చివరకు చేరుకొనియె
నా హృదయము కామనామోక్షధామమౌ

అలకకు, సొబగున కాది సృష్టి.
విరహిణి, ప్రియురాలు విలసిల్లు సీమకు ;
నీవు కా కెవరు కొంపోవగలరు
ఆటంకములులేక అమరలోకములోని
లక్ష్మీవిలాస స్థలంబునకును ;
నిత్య వసంతమ్ము, నిత్య పుష్పవనమ్ము,
నిత్య చంద్రికయును నెగడుచోట,
ఇంద్రనీలాఖ్య మహీధ్రమూలమునందు
సంఫుల్ల సౌవర్ణ సరసిజాత
సరసి తీరమ్మున, వరమణి సౌధమ్ము
నం దసీమైశ్వర్యమందు వరలు
చుండియు తా పొక్కుచున్న దేకాకిని
ప్రియురాలు విరహార్తి సయిపలేక.
పూర్వదిశాంచలంబున నస్తమించెడి
ప్రక్షీణ శశిరేఖ పగిది తోచు
తల్పాంతలీన గాత్రను చూడగా పొమ్ము
ముక్తజాలక మార్గమునను ప్రియను.
నీ మంత్రమున, కవీ, నే డామె మదిలోని
అవరుద్ధ బంధనవ్యధ తొలంగు.
అమిత సౌందర్యంబు నందును మేల్కాని
ఒంటిమై కదపుచునుండె నెచట
విరహిణి, ప్రియతమ చిరరాత్రి, అచట ప్రా
ప్తించు స్వర్లోకంబు విరహమునకు ;

మరల పోగొట్టుకొన్నది మానసంబు ;
కురియుచున్నది వర్షము విరతిలేక
అన్నివంకల, మిగుల నిరంతరముగ
చేయుచున్నది రాతిరి చీకటులను.
పెద్ద మైదానపుం గడహద్దునుండి
వెదకుచు నకూలమునకయి వీచుచుండె

అంగలార్చుచు తీవ్ర ఝంఝూనిలంబు.
ఆ నడిమిరేయి నిద్రావిహీన నేత్ర
యుగళితో నిట్లు భావించుచుంటి నేను—
ఎవ్వ రిచ్చిరో యీ శాప, మిట్టి వ్యవధి
ఎందులకొ, రుద్ధవాంఛిత మేల నొక్కొ
అంగలార్చుట ఊర్ధ్వమ్ము నరయుచుండి,
ఏల తన మార్గమును ప్రేమ యెనయ లేదొ :
విరహాశయనము మానససరసి తీర
మందు ; రవిలేని, మణిదీప్తమైన యచటి,
కా ప్రదేశమ్మున, కళిలశైల
శైవలిన్యాది సర్వాంత సదనమునకు
మానవు డెవందు పోగల్గు మీనుతోడ :

20-21 మే 1890 మానసీ

## అహల్య

తాపసరహిత మస్తమితహోమాగ్ని
అగు శూన్యమున్యాశ్రమాంతరిచ్ఛాయ
పాషాణరూపమ్ము ప్రాప్తించినంత
మేదినీతలముతో మిళితమై పోయి
ఎట్టి స్వప్నములతో నీవో అహల్య,
కడపుచున్నావు దీర్ఘదివానిశాళి :
ఈ మహామహితోడ ఏకదేహముగ
కలిసియుంటివి గదా తెలిసిన దొక్కొ
దీనిలో నలరు మహానురాగంబు :
అస్పష్ట చైతన్య మా రాతిలోన
దాగియున్నదియె : విస్తారము సుమ్ము
జనని సజీవ మేదిని వేదనంబు :

మాతృధైర్యముతోడ మౌనము దాల్చి
మూకకష్టసుఖానుభూతు లెంతగనొ
సుప్తాంతరాత్మలో సోకుచుమండ
అనుభవించుచునుంటివా స్వప్న మట్లు!
రాత్రిం దివము లహరహమును నీవు
ప్రాణికోటుల కలహములు, గర్జలును,
సంతోషరోదన సంక్షోభములును,
అమిత సంఖ్యాక పాంథాంఘ్రి శబ్దములు
నీ కర్ణయుగమందు సోకుచున్నవియె
విరతము నఖిశాప నిద్ర భేదించి?
అక్షిహీనము నప్రియంబు మూఢంబు
నగు నర్ధజాగరమందు మేలుకొని
యుంటివే నీవు! నీ యుల్లములోన
ఈ మహాజనయిత్రి ఎదపక పొందు
నిద్రావిహీనార్తి నీ వెరింగితివె?
నవవసంతమ్మున పవనుండు వీవ
పుడమి సర్వాంగకంబుల జనియించు
పులకప్రవాహంబు పొందునే నిన్ను?
వేయి మార్గంబుల వేయి రూపముల
జీవనోత్సాహమ్ము చెచ్చెర వెడలి
మదను దిగ్విజయమ్ము మొదలు పర్వెత్తు.
అది నీ శిలావిగ్రహము నాక్రమించి
సద్యోపపాదకశక్తివిహీన
మగు నీదు శాపమ్ము నంత మొందింప
ఆలోడనము చేయ యత్నింప దొడగె.
దాని ఘాతము నీదు తనువున సోకి
కలచెనే నీ ప్రాణకంపము వింత?

వసుమతి మానవ వసతులలోని
శ్రాంతదేహముల నిశాకాలమందు

తన యెదపై జేర్చుకొనుచున్న దల్ల.
విద్రించుచున్నా రనేకజీవులును.
మేల్కొనియున్నది మీద నాకసము.
ధారుణీహృదయమ్ము తన్మయ మంద
చేయుచున్నవి వారి శిథిలాంగములును.
వారి సుషుప్తి విశ్వాస జాలమును.
ప్రాణికోటుల తనుస్పర్శసుఖమ్ము
కలదు గదా మాతృ గాత్రమునందు !
ఆ సుఖమ్మును కొంచె మైనను నీవు
అనుభవించుచునుంటివా అంతరమున !
జనని యొక్కతె రహస్యాంతఃపురమున
వివిధవర్ణములతో విలసిల్లుచుండు
పత్రపుష్పమ్ములు చిత్రించినట్టి
యవనికాభ్యంతరమందు శోభిల్లు .
అట నసూర్యంపశ్యయై మెలంగుచును
యౌవనజీవనమందు నా జనని
ధనధాన్యయుక్త సంతానగృహంబు
ఏనాడును భరించు మౌనముతోడ.
ఆ మాతృగూఢ కక్షాంతరమందు—
చిరరాత్రి శీతమ్ము మరిపుబిడారు
నగు ధరణీవక్షమం దింతవరకు
విద్రించుచుంటివి నీవు మైమరచి.
లక్షజీవనముల క్లాంతి అచ్చోట
విద్రించుచున్నది నిర్భయముగను
ధూళిశయ్య ననంతకాలమునుండి.
ప్రతినిమేషమునందు పడుచుండె రాలి
పగటి తాపమ్ముచే వాడినపూలు.
తారక లుల్కలు దగ్ధము లయ్యె,
ఖ్యాతి జీర్ణించె, సౌఖ్యము శ్రాంతమయ్యె,
పరితాపహీనమ్మె పరగె దుఃఖమ్ము.

తల్లియే ఆట పాపతాపరేఖలను
స్నిగ్ధహస్తములతో చెరిపివైచినది
సరళమ్ముగా మనోజ్ఞముగ శుభ్రముగ
వరలు సద్యోజాతవసుధాకుమారి
పగిది యిప్పుడు కనబడుచుంటి వీవు ;
వాక్యవిహీనవై ప్రత్యూషమందు
దర్శించుచున్నావు ధారుణి నెల్ల.
రాతిరివేళ నీరాతిపై బడిన
మంచుబిందువులు కంపించుచునుండె.
ఆజానులంబితమగు ముక్తకృష్ణ
కేశపాశమునందు కిలకిల మనుచు.
ధారుణీనీలకౌశాంచలమట్లు
బహువత్సరముల శైవాలము మట్టు
కప్పియున్నది నిన్ను. కనిపించు నదియు
ఘనముగా సరళముగా తేజుతోడ.
తోరమ్ముగా వర్షధార లొందియును
గట్టిగా నీ నగ్నగౌరదేహమును
ఆవరించియె యున్న దది యిప్పటికిని
అతి పేశలంబైన యంశుక మట్లు.

పరిచిత పరిహాస పటిమతో గాంచి
అఖిల విశ్వము నిన్ను హసియించుచుండె.
నీ వట్టె కనుచుంటి నిర్నిమేషముగ.
దూరకాలమునకో దూరదేశముకొ
ఎచటికో నీ హృది యేగె నొంటరిగ
తడవుచు ధూళిలిప్తము లగు స్వీయ
పదచిహ్నరేఖల ప్రతి పదంబునకు.
వీక్షింప వీక్షింప వెనుకటి పుడమి
పరిచయ మెల్లను స్మరణకు వచ్చె.
నలుమూలలందుండి నాలుగు దెసల.

దిశబద్ధమై కుతూహలముతో సర్వ
సంసారమును నీదు సమ్ముఖమునకు
అరుదెంచినది. వచ్చి యంతికమునకు
ఆశ్చర్యమున నాగి అట్టె నిల్చినది
అనిమేష దృష్టితో నమ్రముమిర
పూర్తిగా విరిసిన పుణ్యముపలన
నూతన శైశవస్నాత సంపూర్ణ
యౌవనంబును నద్భుతాతి రహస్య
మయి యగు నగ్నమూర్తియు ప్రస్ఫుటించె–
నవశైశవంబును నవయౌవనమును
శ్యామ పత్రపుటమ్మునందు జంటగను
ఒక వృంతమందున వికసించినట్లు
విస్మృతి నీలాబ్ధి వితతనీరమున
ఉదయించితివి ప్రథమోషస్సు లీల.
విస్మయావిష్టమై విశ్వముపంక
వీక్షించుచుంటి, వా విశ్వము నిన్ను
చూచియు పలుకరించుటలేదు సుంత.
ఉన్నారు లెదురుగ నొక్కరికొకరు
అంతము లేని రహస్యతీరమున
చిరపరిచితిలోన సరిక్రొత్త యెరుక!

24–25 మే 1890 మానసి

## బంగరు పడవ

గర్జించుచున్నవి గగనమునందు
వారిదమ్ములు చండవర్షముతోడ –
ఒడ్డున కూర్చుండియుంటి ఒక్కతనె
ఆశ లేదింక, ధాన్యపుకంకులెల్ల *

---

*పూర్వవంగమున ఒక రకము ధాన్యముపైరు లోతునీటిలో పెరుగును తెప్పలు కట్టుకొనిపోయి వానిపై కుప్పలుగా కంకులు మాత్రము కోసివేయుదురు.

కోసిపై చుట పూర్తిచేసి రెల్లెడల.
దరుల రాయుచు నది క్షురధారవంటి
వాడి స్పర్శమ్ముతో ప్రవహించుచుండె.
ధాన్యపు కంకు లత్తరి కోయుచుండ
వానకాలము వచ్చిపడినది వేగ.

ఒక చిన్నక్షేత్రము నొకతెను నేను ;
వక్రగతుల నలుపై పులయందు
జలములు క్రీడలు సలుపుచునుండె ;
ఆవలి యొడ్డున నగపడుచుండె
మసిపూసికొనినట్లు మ్రాకుల చాయ.
మబ్బులు వేగి గ్రామముమీద క్రమ్మె.
ఈవలిగట్టున నేనొక చిన్ని
పంటవలంతిని, ఒంటిగ నుంటి.

పాటలు పాడుచు పడవనడపుచు
ఆ దరి నెవ్వరో అరుదెంచుచుండె ;
అరయగా నాతని నెరుగుదు నంచు
తోడనే మదిలోన తోచిన దపుడు.
అరుగుచుండెను నిండు తెరచాపతోడ
అత దేపైపును నరయుట మాని.
తరగలు ప్రక్కల నిరుపాయముగను
పగులగొట్టుచునుండె పడవను తాకి.
అరయగా నాతని నెరుగుదునంచు
తోడనే మదిలోన తోచిన దపుడు.

ఏ మయా, ఎచ్చటి కేగుచున్నావు ?
ఏ విదేశమునకు ? నావను దరికి
పట్టు ; మెచ్చటికి పోవంగ నెంచితివొ
అచ్చటి కరుగంగవచ్చును నీవు ;
ఎవరికి సంతోష మెయ్యది యగునొ

వారికి నీయంగ వచ్చును దాని.
కేవల మొక క్షణ మీవలి దరికి
నవ్వుచు నరుదెంచి నాదు బంగారు
ధాన్యము కైకొని తరలుము నీవు.

ఎంత కావలయునో అంతయు నీవు
కైకొని పొమ్ము నీ నౌకపై వేసి
ఇంకను మున్నదా ? ఇక లేదు లేదు,
ఉన్నది పూర్తిగా నొసగితి నేను.
ఇంత కాల మ్మింటి నిట్లు మైమరచి
ఈ నదీతటమున దేనిని నమ్మి
అద్దాని నొసగితి నంతయు నీకు
పొరపొర సందున పూరించియుంచి ;
కైకొను మిప్పుడు కరుణించి నన్ను.

లేదింక స్థానము — లే దింక చోటు.
అల్లదే చనుచున్నదా చిన్నిపడవ
నాదు బంగారు ధాన్యము సంగ్రహించి.
శ్రావణాంబరము సర్వము నావరించి
సంచరించుచునుండె సాంద్రమేఘములు,
పడియుంటి శూన్యశైవలివి తీరమున :
బంగరు పడవ సర్వమ్ము కొంపోయె !

ఫిబ్రవరి_మార్చి 1892 సోనార్ తరీ

## హింగ్ టింగ్ ఛట్

హబుచంద్ర భూపతి యను మూర్ఖరాజు
కలగాంచె రాత్రి : ఆ కలకు నర్థంబు
అరసి గబుచంద్రు డను మూఢ మంత్రి

పూనె మౌనము : స్వప్నమున వానరములు
మూడు తల్లడపైన మూగి కూర్చుండి
పేలు కుక్కుచునుండె ప్రీతి పెంపార ;
కొట్టుచున్నవి యించు కిట్టట్టు కదల.
కన్నులలోన వక్త్రమ్ము లోపలను
కరరుహములతోడ కడు గీర దొడగె.
అవి యదృశ్యము లయ్యె నాకస్మికముగ ;
బోయ దొక్కడు వచ్చి, "పోయెను పక్షి,
ఎగిరి పోయిన"దంచు నేడువ దొడగె.

ఎదురుగా భూపతి నీక్షించి యతడు
ఎత్తి తా మెడమీది కెక్కించుకొనియె.
ఒక్క ఊపున నెత్తి ఒక్క యెత్తైన
గడమీద కూర్చుండగా జేసె నృపుని.
అతి వృద్ధ యొక్కతె యట క్రింద నిల్చి
చక్కలిగింతలు చరణంబులకును
పెట్టగా దొడగెను పెద్దగా నగుచు.
అప్పుడు భూపతి యనియె నీ రీతి :
"ఏమి యీ దుర్గతి ! ఎవ్వరు గాని
వదలింపరారు ! నా పాదముల్ రెండు
లేవ కోరుచునుండె, లేవగా లేవు."
అని తట తట కొట్టుకొనె పక్షి లీల.
భూపతి చెవిలోన బోయవా డపుడు
గుట్టుగా, 'హింగ్ టింగు ఛ' ట్టని పలికె.
ఆ స్వప్నమంగళ మమృతతుల్యంబు,
దాని భాషించు గౌడానంద సుకవి,
ఆలకించెదరు పుణ్యాత్మకు లెల్ల !

హబుపుర రాజ్యంబునం దెవ్వరికిని
నాటి కారేడు దినంబులనుండి

కనులు నిండగ నిద్ర, కడుపులు నిండ
అన్నము లే, దెల్ల రస్థిరు లగుచు
చిక్కన చెక్కిళ్ళ చేతులు చేర్చి
శిరములు వంచి యశేషరాజ్యమున
అరయుచునుండిరి ఆబాలవృద్ధు;
లాటలు మరచినా రఖిలబాలకులు,
పాఠాలు మరచిరి పండితులెల్ల,
మౌనము తాల్చిరి మగువలు కూడ:
కలవర మింత మిక్కటముగా కలిగె.
గుంపులుగా జనుల్ కూర్చుంది రచట;
నోట మాటలు లేవు. నుదురులు వంగె
తలపులు మెండుగా కలిగినకొలది.
భూతత్వవేత్తలు భూగర్భతత్వ
మరయంగ కూర్చుండినట్లు కూర్చుండి
రా నిరాకారమౌ అన్నము కొరకు.
నడుమ నిట్టూర్పులు విడుచుచు వారు
చేయగా సాగిరి చీత్కారములను
హింగ్ టింగు ఛట్టని ఎల్లరు కలిసి.
ఆ స్వప్నమంగళ మమృతతుల్యంబు.
దాని భాషించు గౌడానంద సుకవి,
ఆలకించెదరు పుణ్యాత్మకు లెల్ల!

పండితుల్ నాలుగువైపులనుండి—
కాన్యకుబ్జ మయోధ్య కాంచి కోసలము
మగధ మొదలయిన నగరులనుండి
వచ్చిరి. పండితప్రవరుడౌ కాళి
దాసకవీంద్రు విద్వద్భాగినేయ
వంశము వారలు వచ్చి రుజ్జయిని
అను పట్టణమునుండి. అందరు కూడి
పెనుపొత్తములు చేతగొని పత్రములను

తిరుగవేయంగసాగిరి పలుమారు,
పెనుతల లనెడి పండిన పంటచేలు
శిరములతోడ తెమ్మెర కూగునట్లు
పిలకల శిరము లయ్యెల లూగుచుండ.
కొందరు శ్రుతులను, కొందరు స్మృతుల,
అల పురాణంబుల, వ్యాకరణముల,
కొంద రింకను శబ్దకోశము లెల్ల
అరసిరి : దొరకలే దర్థ మెచ్చటను.
మీరిపోయిన వనుస్వారవిసర్గ
సంహతిస్తూపముల్. సంకటమందు
చిక్కి మౌనము వహించిరి వార లెల్ల.
ఉచ్చస్వరమ్ముతో నున్నట్టులుండి
శబ్దము హింగ్ టింగు ఛట్టని వెశలె.
ఆ స్వప్నమంగళ మమృతతుల్యంబు,
దాని భాషించు గౌడానంద సుకవి,
అలకించెదరు పుణ్యాత్మకు లెల్ల.

హబుచంద్రనృపతి హతాశ్వాసు డగుచు
పలికె : "విద్వాంసులు కలరని వింటి
మ్లేచ్ఛదేశంబున. మీరు వారలను
ఎచ్చోట నుండిన నిటు కొనిరండు,
వార లీ యర్థంబు వాచింతురేమొ ?"
శ్యామనేత్రములు పిశంగకేశములు
కపిశకపోలముల్ కలిగినవారు
యవనపండితులట కరుదెంచి, దక్కి
వాయించి రప్పుడు. వారి దేహముల
కురుచగా కత్తించి కుట్టిన ముతుక
నల్లని చొక్కాలు పెల్లుగా కలవు.
అధికోగ్రవిగ్రహు లంతట వారు
ఎట్టి యుపోద్ఘాత మేని చెప్పకయె

గడియారమును దీసి నుడివి రీ పగిది :
"సమయము పదునేడు నిముసముల్ మాత్ర
మున్నది, వినిపింప నున్న సంగతిని
ఛట్ ఫట్ వచింపుడు" సభలోన నపుడు
శబ్దము హింగ్‌టింగు ఛట్టని వెడలె.
ఆ స్వప్నమంగళ మమృత తుల్యంబు,
దాని భాషించు గౌడానంద సుకవి,
ఆలకించెదరు పుణ్యాత్మకు లెల్ల !

స్వప్నము విని మ్లేచ్ఛవదనము లంత
రక్తోజ్వలము లయ్యె రయమున వారి
ఆననంబులనుండి, అక్షులనుండి
పావకజ్వాలలు బయటికి నురికె.
కుడి పిడికిళ్ళతో నెడమ చేతులను
గ్రుద్దుచు పలికిరి క్రుద్ధస్వరమున :
'పరిహాసించెదరె ఆహ్వానించి' యంచు.
హాస్యోజ్వలాస్యుడై అంత ఫరాసి
పండితుండు శిరంబు వంచి, హస్తములు
వక్షఃస్థలమ్మున బంధించి పలికె :
"మీరు వ్రాకుచ్చిన మేటి స్వప్నమ్ము
నృపయోగ్యమైనది, నిజ, మిట్టి స్వప్న
మిందరికు ఘటింప దెం దదృష్టమున ;
కాని స్వప్నము ననుమానింతు నేను
అయ్యది రాజోత్తమాంగమునందు
ఎంతగా స్థానము నెలసి యుండినను.
భూయిష్టముగ రాచబొక్కసమందు
కల దర్థ మెంత కావలసినగాని.
లేని స్వప్నమున నింతేని యర్థంబు
కనబడ దెంత త్రవ్విన శిరంబందు.
కాని నిష్కపటమ్ముగా చెప్పుచుంటి

ఎంతయో మధురమై హింగ్ టింగు ఛట్టు
అనెడి శబ్దంబులు వినబడుచుండె."
ఆ స్వప్నమంగళ మమృతతుల్యంబు,
దాని భాషించు గౌడానందసుకవి,
అలకించెదరు పుణ్యాత్ములెల్ల !

ఖలులు, ప్రకాండమూర్ఖులు, వీర లెవరొ
పరమ నాస్తికులును, పాషండు లరయ !
స్వప్నము కేవల స్వప్నమాత్రమ్మె !
మస్తిష్కవికృతియా, మన మెటు దీని
విశ్వసింతుము ! జగద్విఖ్యాతమైన
జాతి, ధర్మప్రాణ జాతియే మనది !
పారిపోనిత్తుమే స్వప్నము నిపుడు
మరి చౌర్యమా మట్ట మధ్యాహ్నవేళ !
'ఛీఛీఛి' యని వచించిరి సభాసదులు.
అకు లెఱ్ఱ వడంగ హబుచంద్రు డనియె
"గబుచంద్ర ! వీరికి కావింపు శిక్ష ;
క్రింద కంటకములు కీలించి, పైన
ముండ్లచే పొడిపించు, ముక్కముక్కలుగ
కరిపించు పేట కుక్కలచేత వేగ."
ఆ మ్లేచ్ఛపండితులా పదునేడు
నిముసము లింకను నిండెనో లేదొ
అగపడ రెచ్చటి కరిగిరో వారు.
అంత సభాస్తారు లానందబాష్ప
వారిలో తేలిరి. తిరుగా మరల
ధర్మరాజ్యమ్మున తనరెను శాంతి.
ముఖనయనవికారములతోడ మరల
అల హింగు టింగు ఛట్టనిరి పండితులు.
ఆ స్వప్నమంగళ మమృతతుల్యంబు,
దాని భాషించు గౌడానంద సుకవి,

ఆలకించెదరు పుణ్యాత్మకు లెల్ల!

గౌడదేశమునుండి తోడనే యటకు,
యవనపండితుల గురువులను గూడ
ధిక్కరించెడి శిష్యతిలకు డొక్కండు
అరుగుదెంచెను నగ్నశిరము దీపింప.
పై అలంకారడంబర మేమి లేదు,
మేనిమీదను నభిమానము లేదు,
కచ్చము కుచ్చెళ్ళ కడు జారిజారి
తడవకు తడవకు పడుచుండె క్రింద.
ఆతని క్షీణ ఖర్వాంగమునందు
అస్థిత్వ మున్నదో, యదియు శూన్యంబొ
అనెడి సందేహంబు మనమున విడదు
వాక్యముల్ బయటికి వచ్చునందాక.
ఈ చిన్ని యంత్రమం దింత శబ్దంబు
పుట్టినచో భూమి పొందు విస్మయము.
అభివాదన మెరుంగ, డడుగడు కుశల
మాతడు, తండ్రి పే రడిగిన యెడల
రోకలి పై కెత్తు వీకతో నతడు,—
"ఎద్దాని గూర్చి మీ కీ విచారంబు?
వివరింప గలుగుదు వినిపింతురేని.
త్రిప్పి బోర్లించెద తేటపడంగ
వ్యాఖ్యమూలంబున" నంచు ప్రశ్నించె.
సమసుస్వరంబుతో సభవార లనిరి
గట్టిగా హింగ్ టింగు ఛట్టని యపుడు.
ఆ స్వప్నమంగళ మమృతతుల్యంబు,
దాని భాషించు గౌడానందసుకవి.
ఆలకించెదరు పుణ్యాత్మకు లెల్ల!

విని స్వప్నకథ ముఖంబునను గాంభీర్య

మగపడ జాము సేపై నంత పలికె
గౌడీయ సాధువు : కలకు నర్థంబు
అత్యంతసరళంబు, సతి నిర్మలంబు,
అతి పురాతనమైన ఆ భావమునకు
నవనవావిష్కరణంబు సు మ్మిదియ ।
త్ర్యంబకుని త్రినయనంబులు త్రిగుణ
ములు త్రికాలంబులు— తెలియంగ నవియె
శక్తిభేదముచేత వ్యక్తిభేదమున
ద్విగుణము లగు నవి నిగుణము లగును.
ఆవర్తనంబును సంవర్తనమును
అల వివర్తనమును నాదిగా గల్గు
జీవశక్తుల నెల్ల శివశక్తి యెపుడు
తా విసంవాదంబు కావించుచుండు.
అల వికర్షణమును నాకర్షణమును
ప్రకృతియు పురుషుడు వికృతు లాకృతులు
నగు, తదాణవచౌంబకాఖ్యబలమున.
బహిరగ్రమ్మున ప్రవహమానమగు
జీవాత్మశంప కీ తావున ధార
ణాశ్లేషశక్తి జన్మము నొందుచుండు.
త్రివిధరూపములతో త్రివిధశక్తియును
ప్రకటిత మగుచుండు ఏసుమతియందు.
క్లుప్తముగాను వాక్రుచ్చిరి దాని
సిట్టులు హింగ్ టింగు ఛట్టని యిపుడు.
ఆ స్వప్నమంగళ మమృతతుల్యంబు,
దాని భాషించు గౌడానంద సుకవి
అలకించెదరు పుణ్యాత్మకు లెల్ల ।

సాధు సాధనెడి నిస్వనములతోడ
సంచలించిన వంత సర్వదిక్కులును.
స్పష్టమత్యంత విస్పష్టమటంచు

ఎల్లరు భాషించి, రిప్పుడు మిగుల
స్వచ్ఛ మయ్యెను బోధపడని దంతయును,
నిర్మలాంబర మట్లు, నీరము లట్లు।
హబుచంద్రభూపతి అంత నిట్టూర్చి
నిలుచుండి శిరమునందలి కిరీటమ్ము
పైకెత్తి ఆ క్షీణవంగీయు శిరము
పై హవణించె—తద్భారముచేత
అతని మస్తకమగులనో యేమొ।
బహుదినమ్ముల తరువాత నా చింత
పారిపోయెను నేడు—స్పందింప దొడగె
మునుగుచు తేలుచు ఓనుకుచు నున్న
హబురాజ్య మంతయు— ఆటలాడంగ
సాగిరి బాలురు— క్షణములో నెల్ల
ముగుదల వదనాబ్జములు వికసించె.
పొగత్రాగ దొడగిరి ముసలివారెల్ల.
తొలగెను దేశమందలి శిరోభార
మంతయు చటుకున అర్థము తెలిసె
హింగ్ టింగు ఛట్టన నెల్లర కపుడు.
ఆ స్వప్నమంగళ మమృతతుల్యంబు,
దాని భాషించు గౌడానంద సుకవి,
ఆలకించెదరు పుణ్యాత్మకు లెల్ల।

ఆ స్వప్నమంగళ మను కథ విన్న
జనులకు తొలగిపోవును భ్రమలెల్ల.
అన్యథా తొలగిపోవా విభ్రమములు.
విశ్వము నెప్పుడు విశ్వముగాను
భావించుచుండిన వంచితుల్ కారు.
అటుగాక మిథ్యయే యనుచు సత్యమును
భావించువారలు భ్రాంతు లయ్యెదరు.
ఉన్నదే లేదు, లేకున్నదే కలదు

అనెడి పల్కులు వారి కత్యుజ్జ్వలములు.
సరలభావముతోడ సకలము నెవ్వ
డరయునో ఏ కొంచె మట్టివా డరయ
తనవెంట నతికించుకొనుచుండు తోక.
రావోయి, తమ్ముడా ! అవులింపు మిక,
నిద్దురపుచ్చుము నీ హృదయమును.
స్థైర్యములేని యీ సంసారమందు
ఈ మాట ఒక్కటియే నిశ్చితంబు—
సకలము మిథ్య ఈ జగతియం దరయ,
మాయామయంబు సమస్తము నిజము,
స్వప్నమే కేవల సత్యము సుమ్మ :
అరయగా సత్యము మరి వేరె లేదు !
ఆ స్వప్నమంగళ మమృతతుల్యంబు,
దాని భాషించు గౌడానంద సుకవి,
ఆలకించెదరు పుణ్యాత్మకు లెల్ల !

30 మే 1892 సోనార్ తరీ

## జంటపక్షులు

స్వర్ణపంజరమందు పంజరపక్షి
వసియించె, వనపక్షి వనమున నుండె.
ఆ విధాతృ మనంబునం దేమి కలదొ—
కలయిక యొకనాడు కలిగె రెంటికిని
ఎట్టులో. వనపక్షి యిట్లు వాకొనియె :

*వనపక్షి*

వనముకు, పంజరపక్షి సోదరుడ !
పోవుద మురువురమును, రమ్మ, కలిసి.

*పంజరపక్షి*

వనపక్షి ! రమ్మ, నా పంజరమందు

ఏకాంతమున నుంద మిరువుర మింక.

వనపక్షి

రాను, పట్టుపడంగ లేను సంకెలల.

పంజరపక్షి

బయట నుండుట యెట్లు వనమున కూడి ?

బయట కూర్చుండి తా వనపక్షి చేసె
వనగాన మెల్లను. పంజరపక్షి
పలికె తా నేర్చిన పలుకుల నెల్ల.
రెండు విధంబులు రెండింటి భాష!

వనపక్షి

పాడుము, పంజరపక్షి సోదరుడ!
వనగాన మొక్కింత వినియెద నేను.

పంజరపక్షి

వనపక్షి సోదరా! పంజరగీతి
నేర్చుకొనుము నే నేర్పెద నీకు.

వనపక్షి

వలదు, నేర్చిన గీతి వాంఛింప నెపుడు.

పంజరపక్షి

వనగీతి నే నెట్లు పాడుదు, నకట!

వనపక్షి

గాఢనీలం బెల్ల గగనతలంబు
అం దెచ్చటను గూడ నడ్డంకి లేదు.

పంజరపక్షి

పంజరంబున కిట పరిపాటియైన
ఆచ్ఛాదనం బేది అట నలుదెసల ?

వనపక్షి

నిను నీవు పూర్తిగా ఘననీరదముల
వదలిపెట్టుకొనుము.

*పంజరపక్షి*

బంధించుకొనుము

జనహీనసుఖకోణమున నిన్ను నీవు.

*వనపక్షి*

వల, దట నెగురంగగలను నే నెచట ?

*పంజరపక్షి*

స్థల మేది కూర్చుండ జలదమం దకట !

ప్రేమించుకొన్నవి పిట్టలు రెండు
అన్యోన్య మీలీల. ఐన సాన్నిధ్య
మును పొందలే దవి. ముఖము ముఖంబు
కీలించుకొనుచుండు కెరలి పంజరము
సందుసందులనుండి. సద్దులేకుండ
కనుచుండు నొండొండు కన్నులవంక.
ఆ పక్షి లన్యోన్య మర్మము చేసి
కొనలేకపోయిన ; వొనరి యే మాత్ర
మెరిగికోలేక పోయినవి యొండొండు
రెండును నెగురును రెక్కలతోడ
కదిసి యన్యోన్యము పొదివికొనంగ.
'చేర ర'మ్మనుచు విచారముతోడ
పలికె పంజరపక్షి. వనపక్షి యనియె—
'ఎపుడొ వాకిలి మూతువేను రా నటకు.'
అంత పంజరపక్షి యనియె తానిట్లు—
'ఎగురగా శక్తిలే దింత నా, కకట !'

2 జులై 1892 సోనార్ తరీ

## పోసీయను

బండి తయారుగానుండె వాకిటను,
రెండుజాములవేళ, మెం డగుచుండె

క్రమముగా నా శరత్కాలాతపంబు.
విజనంబులగు పల్లెవీథులయందు
మధ్యాహ్నకాలిక మారుతిములకు
దుమ్ములు లేవగా దొడగె సంతతము.
రౌద్రరూపిణి రాత్రి రా వేగిరించి
శాంతముగాను నిశ్శబ్దముగాను
కావింఛె నాలుగు కడల నస్నట్లు
పెను రావిమాను చిక్కని నీడలోన
చిరిగిన వస్త్రంబు పరచుక బడలి
నిదురించుచున్నది ముది బిచ్చకత్తె
కాని విశ్రాంతిగా కనులకు నిద్ర
మా గృహమందు నే మాత్రము లేదు

అట్టె గతించిన దాశ్వయుజంబు,
పూజల సెలవులు పూర్తి కావచ్చె,
బయలుదేరగవలె బహుదూరదేశ
కార్యస్థలమునకు కడగి యీనాడు
ఒకరిని కేకలిం కొకరు పెటుచును
పలుమారు, తత్తరపాటులతోడ
వివిధములగు త్రాళ్లు పెట్టి బిగించి
పనివారు సామానులను కట్టుచుండి
రీ గదిలోపల నా గదిలోస.
గుండెపై బరువైన బండ యున్నట్లు
అశ్రుపూర్ణంబులౌ అక్షులతోడ
ఇటు బాధపడుచుండె నింటి యిల్లాలు.
అయినను తీరుపా టామెకు లేదు
ఒక్క క్షణము దుఃఖ మొందుటకైన,
ఆ ప్రయాణంబున కాయితపెట్ట
తిరుగుచునుండె తత్తరముతో నామె.
ఎంతగా సామాను లెక్కువైనవియొ

అరయుట లేదామె అపుడు నే నంటి :
"ఈ కలాపం బేటి కిన్ని వస్త్రములు
ఇన్ని పాత్రలు, పెట్టె, లిన్నిసీసాలు,
ఈ మట్టికుండలు, నీ పరుపులును—
సరిపడగలవు రాజ్యమున కంతకును.
ఏమి చేయగవలె నిన్ని వస్తువులు
కొనిపోయి ? వీనిలో కొన్నిటి నుంచి
కొన్నిటి మాత్రము కొనిపోదు" ననుచు.

వినలేదు నే వచించిన మాట లెవరు.
"ఈ వస్తువులలోన దైవవశమున
అది యిది యవసరమైనచో నపుడు
దొరకు నెచ్చోట నా దూరదేశమున
అదనుకు ? సన్నబియ్యము, పచ్చపెసలు,
మూడు నాలుగు బెల్లము బరిఫీ, లింక
నాకులు పోకలు నా కుండలోన
పెట్టి యుంచితి ; ఇందు పెట్టితి నెండు
కొబ్బరి చిప్పలు కొన్నిటి ; నింక
మామిడి తాండ్రయు, మామిడి పొడియు
కల విందు ; రెండు శేరుల పాలు కలవు
ఆ కుండలో ; నింక నా రెంటిలోన
ఆవ నూనెయు కల ; దా కుండలోన
మిష్టాన్న మున్నది. మీర లద్దాని
మనసులో నుంచుక తినవలె సుమ్మ,
ఒట్టు నాపై తినకుండిన పరచి !"
అవిన యిల్లాలి వాక్యములకు యుక్తి
వచనముల్ వ్యర్థ వాగ్వ్యయ మనుకొంటి.
వస్తువు లైనవి పర్వత మంత !
గడియారమును చూచి కొంత ముఖంబు
కనుగొని మెల్లగా వివిచితి—'నింక

వెళ్ళి వచ్చెద'నంచు. ప్రియురాలు వేగ
వదనము మరలిచి, వంచి శిరంబు,
కనులపై చీరకొంగును వైచికొనుచు
జారెడి యశుభాశ్రు జలముల నట్టె
తుడిచికొన్నది కంటబడనీయకుండ.

నా నాలుగేండ్ల చిన్నారి కుమారి
కూరుచున్నది బహిర్ద్వారము చెంత
అన్యమనస్కయై. ఆమె స్నానంబు
ఇతర దినమ్ముల నీ వేళ కపుడె
ముగియుచుండును. రెండు ముద్దలు తినియు
తినకముందే గ్రుచ్చుకొని పోవ కనులు
నిదురపోవును. తల్లి నే డామె విషయ
మరయ లే, దామె స్నానాహారములును
ముగియలే దింత ప్రొద్దైనను గూడ.
తిరిగిన దిప్పటివరకు నా వెంట
ఛాయరీతి. ప్రయాణ సన్నాహ మెల్ల
కనినది మౌనమ్ముగా శ్రద్ధగాను
నిర్నిమేషాక్షులు నిలిపి. తా నిపుడు
అలసి కూర్చుండిన దా బహిర్ద్వార
మందు తూష్ణీంభావ మలరి. ఏమేమి
ఎంచుచు నున్నదో ఎవ్వరి కెరుక !
'అమ్మడూ, నే నింక నరిగెద, నమ్మ !'
అనిన విషణ్ణలోచనములతోడ
వాడిన మోముతో తోడనే యామె :
'నిను నేను పోనీయ' ననుచు వచించె.
ఆమె లేవంగలే దచ్చోటనుండి,
ఆమె నా చేతుల కడ్డురాలేదు,
తలుపు మూయగ లేదు ; తాను కేవలము
తన హృదయప్రియతాధికారమున

'నిను నేను పోనీయ' నని వచించినది.
అయిపోయినది వేళ అప్పటి. కకట
నిలుపక పోనీయవలసి వచ్చినది.

నీ వెవ్వరే ఓసి నా వెర్రిపిల్ల,
ఎక్కడనుండి నీ వే శక్తితోడ,
'నిను నేను పోనీయ' ననుచు పల్కితివె,
ఇంత యహంకార మెసగంగ నీవు!
గర్వితా! నీ చిన్ని కరములతోడ
ఈ ప్రపంచములోన నెవరిని పట్టి
నిలుపగా గలవె! వాకిలి చెంత నుండి
ఈ చిన్ని మేనితో, నింతటి చిన్ని
స్నేహప్రపూరిత హృదయముతోడ,
సమర మెవ్వానితో సలుపుదు వీవు!
భయముతో సిగ్గుతో వ్యధిత చేతస్సు
నందలి ప్రార్థన మట్టె కేవలము
తెల్లముచేయు టెంతేని శోభిల్లు
అవనిలో. కేవల మనవచ్చు, 'నాకు
ఇష్టము లేదు-పో నిచ్చుట' కనుచు.
కాని 'పోనీయను నే'నను మాట
ఎవ్వార లనగల? రిప్పుడు వింటి
ప్రేమమయంబగు పెను గర్వవాణి
మృదువుగా నీ శిశువదనమునుండి.
సకుతూహలమ్ముగ సంసార మపుడు
నను లాగికొని పోయినది వేగ నగుచు-
బాష్పపూరితములు పరి భూతములును
నగు నేత్రములతోడ నట బొమ్మవోలె
కూరుచుంటివి నీవు ద్వారమునందు,
కనుగొని వెడలితి కన్ను లొత్తుకొని.

పోవుచు కనుగొంటి త్రోవ ప్రక్కలను—
ధాన్యపు కంకుల తద్ద భారమున
శారద సస్య కేదారముల్ వంగి
ఆస్వదించుచు నుండె న ట్లాతపమును.
తరుగణశ్రేణు లుదాసీనముగను
రాజమార్గమున పార్శ్వమ్ములయందు
డిన మెల్ల తమ నీడలను చూచుకొనియె
ప్రబల వేగముతోడ ప్రవహించె గంగ
ఆ శారద ప్రవాహముతోడ నిండి.
జనని దుగ్ధములతో సంతృప్తిచెంది
సుఖనిద్ర జెందెడి సుకుమార దేహ
ములను సద్యోజాతములు నగు ధేను
వత్సము లట్టుల పవళించియుండె
గౌరాభ్రఖండముల్ కాలాంబరమున.
యుగయుగాంతరములనుండి క్లాంతంబు,
ఆ దిగంతవ్యాప్త, మాతపదీప్త,
మపరివృతంబునౌ నా ధరవంక
వీక్షించి విడిచితి వేడి నిట్టూర్పు.

ఈ యాకసంబెల్ల ఈ ధరయెల్ల
మునిగిన వెంతటి ఘన దుఃఖమందు !
ఆ ప్రయాణము పూర్తియగు నంతవరకు
'నిను నేను పోనీయ' ననుచు కేవలము
వినుచుంటి నా మర్మభేదకస్వరము.
నీలాంబరమునందు నిఖిలాంచలములు
మొదలు పృథ్వీప్రాంత భూములవరకు
'నిన్ను పోనీయను, నిన్ను పోనీయ'
నను చిరకాలిక, మాద్యంతరహిత
మైన నినాదమే అంతట మ్రోసె.
'నిను నేను పోనీయ' ననుచున్న వెల్ల;

ప్రాణపణమ్ముగా వక్షమునందు
క్షుద్రతృణంబుల గూడ బంధించి
'పోనీయ' నని పల్కె భూజనయిత్రి ;
క్షీణాయు వగు దీపశిఖయును గూడ
అపు డారు నిపు డారు ననుచు రెపరెప
మనుచుండ—నెవరు దానిని లాగినారొ
ఇరుల గ్రాసమునుండి—ఇపుడు పోనీయ
ననుచున్న దెన్నొ పర్యాయము లదియు.
వ్యాపించిన దనంతమగు చరాచరము
భూలోక స్వర్లోకములను 'పోనీయ'
ననెడి గభీరరోదన ; మట్టు లయ్యు
పోవగా వలసెను, పోయితి వెడలి

ఆదికాలమునుండి అరుగుచునుంటి
ఈ రీతి నేను. ప్రసారితవ్యగ్ర
బాహులతోను, ప్రజ్వలితనేత్రముల
తోను 'పోనీయను, పోనీయ' ననుచు
అరచుచు నరచుచు నార్తకలస్వ
రంబుతో విశ్వతీరంబు నింపుచును
ప్రళయసముద్రప్రవాహియౌ సృజన
వాహినిలో బడి ప్రచురవేగమున
నందరు హాహా యని అరుగుదు రెపుడు.
సమ్మకోర్మికలు పళ్ళాల్లహరులును
'నేను పోనీయను పోనీయ' నంచు
కేకరించుచునుండు. కేకరింతలను
కొందరు తలపరు, కొందరు వినరు.

అన్నివైపులనుండి అనవరతముగ
రవళించుచుండె నా శ్రవణములందు
నా కుమారీ కంఠనాదముతోడ

తద్విశ్వ మర్మభేదక కరుణార్తి
బాలికరీతి విశ్వాబోధవాణి-
బహుకాల మెద్దాని పదసియుండినదొ
దానిని విశ్వంబు పోనాడుకొనియె.
పిడికిలి అట్లయ్యు సడలగలేదు.
ఇపుడును నా నాలుగేండ్ల కుమారి
రీతిగా నవికృత ప్రేమగర్వమున
విశ్వ మదే కేకవేయుచున్నదియ,
'పోసీయ' నని. మ్లానముఖముతో బాష్ప
పూర్ణనేత్రములతో చూర్ణమౌచుండె
గడియ గడియకు విగడియ విగడియ
కును ప్రేమగర్వ, మైనను గూడ ప్రేమ
తన పరాభవ మొప్పుకొనుటయే లేదు.
విద్వేషభావంబు వెలయంగ రుద్ధ
కంఠముతోడ వక్కాణించుచున్న
దపుడును పోసీయ ననుచు నా ప్రేమ.
తా పరాజయ మెన్ని తడవలు పొందు
అన్నిపర్యాయము లనుచున్న దదియు :
"ఏను ప్రేమించితి నెవరిని, వారు
దూరము కాగల్గుదురె యెన్నడేని
నాకు ! నా కాంక్షతో జోకగా నింత
వ్యాకుల, మింత సర్వాధిక్య, మింత
ప్రబలంబు, నింత యపారంబు నైన
దేదైన కలదొక్కొ ఈ విశ్వమందు ?"
అని. ఇంత పలుకుచు నధిక దర్పమున
అది ప్రచురించుచున్నదియ 'పోసీయ'
నని. అప్పుడును తన ఆదృత ధనము
తుచ్ఛమౌ ఎండిన ధూళిలా గొక్క
నిట్టూర్పుతో పైకి నెగసి పోవుటయు
కనుగొనుచున్నది-కన్నీటిలోన

అశీలు రెండు తేలాడుచు నుండె.
విచ్ఛిన్నమూలమౌ విటపి చందమున
పడిపోవుచున్నది పుడమిపై నొరగి
హతగర్వభరముతో నతమస్తకంబు.
అప్పుడు ప్రేమ తా నన్నది, "విధికి
సత్యభంగ మెపుడు జరుగదు సుమ్ము ;
దాని మహామోదమేను పొందితిని
దాని చేవ్రాలుతో దాని చిరాధి
కారలిపి" ననుచు. కావున ప్రేమ
అఖిలశక్తిసనాథ మగు మృత్యువదన
సమ్ముఖమందు నిశ్చలముగా నిల్చి
మృదులము కృశమునౌ మెయితీవతోడ
స్ఫీతవక్షముతో వచించె, "మృత్యువవు
కావు నీ"వని. అంత గర్వోక్తి సుమ్ము ;
హసియించినది మృత్యువల్ల కూర్చుండి.
మృత్యుపీడిత, చిరంజీవివియైన
తత్ప్రేమ రుదితనేత్రాశ్రు వారివలె
చిరము కంపించుచు నిరత మపార
సంసృతినెల్ల 'నాచ్ఛాదించుచుండె.
ఒక విశ్వమయ విషాద కుహాస మాళ
నాశావిహీనమై అతి పరిశ్రాంత
మగు దాని బంధించి అట్టె యుంచినది ;
అట్లు కనులకు నే దగపడుచుండె.
అఖిలము వేష్టించి అలమటతోడ
అణగిన అజ్ఞాన హస్తముల్ రెండు
వ్యర్థబంధనముతో నావరించినవి.
చంచల నిమ్నగా జలములమీద
నెగడియుండిన దొక్క విశ్చలచ్ఛాయ.
అశ్రువృష్టిభరిత మగు నెట్టి వారి
వాహ మాయయొ అది ఊహింపరాదు ;

అందుచే వినవయ్యె నంత వ్యాకులత
తరువుల మర్మరధ్వనిలోన నేడు.
ఔదాస్యభరితంబు నలసంబు నైన
మాధ్యాహ్నికపు వేడి మారుతములును
వ్యర్థముగా శుష్కపత్రాళితోడ
ఆటలాడుచునుండె-ఆ సమయమును
అశ్వత్థమూలమునందలి నీడ
పొడవుగా జేయుచు కడచుచు నుండె.
విశ్వమునందలి వెడద మైదాన
మందు నాక్రందించు నట్టుల నుండె
ఆ యనంత మురళి అల్ల మైదాన
మందలి స్వరముతో-ఆ వసుంధరయు
జాహ్నవీతటమున చాల దూరంబు
వ్యాపించియున్న సస్యక్షేత్ర తతుల
ఆతపహారిద్రహాటకాంచలము
వక్షమున బిగించి పరగ కూర్చుండె
తనర నాలూలాయితంబులౌ కురులు.
దూర నీలాభ్రమందున లగ్నమయ్యె
స్థిర నేత్రయుగళి. భాషితములు లేవు
ఆననమున. ఆమె మ్లానాననంబు
అరసితి. ద్వారమునందు లీనంబు
స్తబ్ధము మర్మాహతంబునునైన
నా నాలుగేండ్ల తనయ వదనంబు
లాగున కనిపించె మ్లానముఖంబు.

29 అక్టోబర్ 1892 సోనార్ తరీ

## ఉయ్యాల

నేను ప్రాణముతోడ నేడు క్రీడింతు
మధ్యరాత్రంబున మరణఖేలనము :

వర్షఋతువు ఘనవారిదావృతము,
ఆకాశమందున నంధకారంబు,
వర్షధారలతోడ వాపోవుచుండె
దిక్కులు నాలుగు, తిలకించు మవిగో ।
ఘోరరంగంబున జేరి పోతంబు
భవతరంగంబులపై దేలుచుండె.
బయటికి వచ్చితి స్వప్నశయనము
నవహేళనము చేసి ఆరాత్రివేళ

అబ్ధిలో నభమందు ననిలములోన
ఏ మహో కల్లోల మింతగా నేడు ।
ఊపు మూపుము ।
వెన్కనుండి యేతెంచి
హాహాకారముతోడ, హాస మొనర్చి
మత్తాంధకార ముర్వేత్తు ఢీకొనియె :
లక్షలకొలదిగ యక్షశిశువుల
గందరగోళము చందము దోప—
పాతాలమందు నంబరవీధియందు
మద్యపాయులును నున్మత్తులు నలుపు
ఉరు కలకల మట్టు,
లూపుమా ఊపు.

నా హృదయముచెంత నాదు ప్రాణంబు
కూరుచున్నది మెలకువతోడ నేడు.
ఉండుండి వణకుచునుండి, నాయెడద
పట్టుకొనుచునుండె గట్టిగా నదిమి.
హృదయంబు నిష్ఠుర నిబిడబంధన సు
ఖమ్ముతో నర్తించె— కలవరమందె
ప్రాణము హృదయము ప్రక్కనె యుండి
త్రాసముతోడ నుల్లాసముతోడ.

ఇంతకాల మకట ఏను ప్రాణమును
శయ్యపై నుంచితి సాదరముగను.
వెనుకనుండియె వ్యథ జనియించుచుండె,
వెనుకనుండియె మేలుకొనియె దుఃఖంబు
ఇందుకోసము రచియించుచునుంటి
భోగశయనముపై పుష్పాస్తరణము.
ప్రబలానురక్తితో రాత్రిందివములు
అతిరహస్యముగ గృహమ్ములోపలను
ద్వారము బంధించి దాచియుంచితిని
ప్రాణము నెంతయో యత్నము మీద

ముద్దాడి సస్నేహముగ కంటిరెప్ప
లత్యంతముగ దాని నాదరించితిని.
ప్రక్కనద్దాని శిరంబు నుంచుకొని
మృదుమధురోక్తులు గదుర నెన్నెన్ని
ప్రియనామములు వినిపించితి నేను।
ఝంకారరవముతో చంద్రికారాత్రి
ఎంతగా సంగీత మేను పాడితిని।
సానురాగముగ నొసంగితి దాని
హస్తములందు తీయనివాని నెల్ల
ఆవేశవశమున ప్రాణము చాల
శ్రాంతమైనది సుఖశయ్యపై చివర
కాలస్వరసముతో. అది స్పృశించినను
కొంచెముగూడ మేల్కొనుటయే లేదు.
ప్రసవహారము లతిభారము లయ్యె.
జాగరణమునందు స్వాపమునందు
కలిసియే యుంటి మేకాకారముగను
రాత్రిందినములు మర్మములోన జొచ్చె
ఆవేశవశమున నవశము వేద
నా విహీనము నగు నా విరాగంబు.

మాధుర్యమును నేను మాధుర్యమందు
బోర్లించి వధువును పోగొట్టుకొంటి
అని తెలిసితి. నెంత అరసిన నదియు
అగపడలేదు. భోగాలయమందు
ఆరిపోవుచునుండె నా ప్రదీపంబు.
తిలకించితిని నాల్గుదెసలందు గూడ
దానికై వ్యాకులితాక్షులతోడ.
పడియున్న వెందిన ప్రసవమాలికలు
రాశిరాసులుగ మాత్రము శయ్యమీద.
ఎవరినో వెదకుచు బవరము చేసి
గంభీరమైన స్వప్నాంభోధిలోన
మునిగి నే మరణంబు పొందితి నంత.

అందుకోసమె నేను యామినివేళ
నేడు నవక్రీడ క్రీడింపవలయు
అనుచు చేయుచునుంటి నాలోచనంబు-
మరణడోలికలోన నిరువుర మింక
చేరువగా చేరి కూరుచుండెదము
త్రాళ్లు పట్టుకొని. అంధతమస్సు వచ్చి
అట్టహాస మొనర్చి అంత ఢీకొనును.
రాతిరివేళను ప్రాణము నేను
ఇరువుర మాడెద మీ డోలిఖేల.

ఊపుమా, ఊపుమా,
ఊపుమా, ఊపు!
ఈ మహాబ్ధిని రేపు మింత తుపాను!
మరల నా వధువును దొరకించుకొంటి.
నా యెడి నిండెను- నా ప్రియురాలు
వడిగ మేల్కొల్పెను ప్రళయ చీత్కృతిని.
అంత వక్షోర కమందున మరల

ఎంతటి హిల్లోల మిటె లేచినది ।
నాదు బాహ్యంబున నాదు లోపలను
ఎంతటి కల్లోల మిట్టె మేల్కొనియె ।

ఎగిరె వస్త్రాంచల మెగిరెను కురులు
పవనాహతంబయి వనమాల యెగిరె.
కంకణంబులు మ్రోగె కింకిణుల్ మ్రోగె
మాదక ధ్వనితోడ.
మరి ఊపు మూపు ।

రా రమ్ము, చీకటి । దూరీకరించు
ప్రాణవధువు మీది ఆవరణంబు–
అవగుంఠనాంశుక మపహరించుచును
ఉజ్జగింపుము వేగ.
ఊపుమా, ఊపు.

నేడు ముఖాముఖి నేనును ప్రాణ
మెరిగికొందుము సిగ్గువెరపులు వీడి
అన్యోన్య, మింకను హత్తుకొనెదము
పరగ నిర్వ్యరము వక్షము వక్షమునకు ;
ఇంక తన్మయుల మయ్యెదము భావమున.
ఊపు మూపుమ ।
ఇర్వు రున్మత్తు లిపుడు
బయటికి వచ్చిరి స్వప్నము చూర్ణ
మొనరించి– ఊపుమా,
ఊపుమా, ఊపు ।

27 మార్చి 1893 సోనార్ తరీ

# వీడ్కోలు శాపము

కచుడు

అనుమతి నొసంగుమా, దేవయాని, నేడు
అరుగు దాసుడు త్రిదశాలయమ్ము చేర.
గురుగృహావాస మిక నాకు పరిసమాప్త
మయ్యె; నేవిద్య నేర్చితి నదియు నింక
చిరము నుజ్వలమణివోలె హృదయమందు
అక్షయ మయూఖములతోడ నల సుమేరు
గిరిశిఖరశిరమందు భాస్కరుని పగిది
ఎపుడు జాజ్వల్యమానమై యెసగు నట్లు
కరుణ నాశీర్వదింపుమా, అరుగువాడ!

దేవయాని

పూరితం బయ్యె నీదు మనోరథంబు,
పడసినాడ వాచార్యునివలన నీవు
చాల దుర్లభవిద్యను; సఫల మయ్యె
నీదు వేయేండ్ల దుస్సాధసాధనంబు.
ఇంక నే కోరికయు లేద హృదయమందు
ఎంచి చూడుము.

కచుడు

నాకు లే దెట్టి కోర్కె

దేవయాని

ఎట్టిదియు లేదుగా! ఐన నెంచి చూడు
మరల శ్రద్ధగ, హృదయ సీమాంతికంబు
దనుక పరికించి చూడుము మునిగి నీవు.
అంతరంగంబు పొంత నేదైన వాంఛ
మరుగుపడియున్న నది కుశాంకురము లీల
చూపుల కగోచరంబయి సూక్ష్మ మయ్యు
తీక్ష్ణతమమైన దగును.

కచుడు

మదీయ జీవి
తంబు పూర్తిగ నేడు కృతార్థ మయ్యె :
ఎట్టి దైన్యము, రిక్తత ఎట్టిదియును
ఎందు నాలో, సులక్షణా, ఇంక లేవు.

దేవయాని

సుఖివి లోకత్రయంబున జూడ నీవు ।
గౌరవయుతుండవై స్వీయకార్యమునకు
ఇంక నున్నత శిరముతో నింద్రలోక
మునకు విచ్చేయు ; మా స్వర్గపురమునందు
సరగ చెలరేగు హర్షనిస్వానములును,
మాంగళిక శంఖముల సుషమస్వరంబు
లలర రవళించు ; ఆ యమరాంగనలును
సూనములు — నందనవనంబులోన నపుడు
కోసి తెచ్చిన మందారకుసుమగుచ్ఛ
ములను వర్షింతురు త్వదీయమూర్ధమందు.
అప్సరసలును కిన్నరు లాచరింత్రు
మంగళధ్వానములు స్వర్గమార్గమందు
అలరు కలకంఠములతోడ— అహా, విప్ర ।
అన్యదేశములోన నేకాంతముగను
ఆచరించుచు నతి కిరోరాధ్యయనము
కడపితివి నీవు దినములు కష్టముగను.
ప్రీతిమయగేహమును నిట స్మృతికి తెచ్చు
టకు, ప్రవాసవేదన తగ్గుటకును నిందు
ఏమియును లేదు పేద కుటీరమందు
నే యథాసాధ్యముగ నున్నదే యొసంగి
అతిథిపూజ యొనర్చితి ; అంతకన్న
స్వర్గసుఖముల నెల్ల ఏ చాయనుండి
ఆనయింపంగ గలను । సురాంగనల అ
నిందితాస్యము లెచ్చోట నిందు దొరకు ।

స్వర్గలోకమునకు నీవు చనిన యపుడు
మత్కృతాతిథ్యదోషముల్ మనమునందు
తలపకుండుటకోస మెంతగనొ నేను
హృదయమం దనిశంబు నాశించియుంటి !

కచుడు

సకియ ! ఈ దాసునకు ప్రసన్నమైన
అనుమతంబు సుకళ్యాణహాస మొప్ప
ఒసగవలయు.

దేవయాని

హాసంబ, అయ్యో, వయస్య !
ఇదియు స్వర్గపురమ్మె కా, దిచట తృష్ణ
కుసుమమున కీటమట్లు మేల్కొనియెయుండు.
ముకుళితాబ్జము చెంతకు పుష్పలిహము
సారెకును లాంఛితంబయి చనుచునుండు
చందమున హృదయాంతరమందు వాంఛ
సతము తిరుగుచునుండు వాంఛితము చుట్టు-
ఇచట సుఖ మేగినంతనే స్మృతియు గూడ
శూన్యగృహమున నొంటి కూర్చుండి విడుచు
దీర్ఘనిశ్వాసమును ఈ ప్రదేశమందు
నవ్వు సులభము కా, దిక నాకమునకు
అరుగు, బంధూ ! వృథా కాలయాపనమ్మె
వలన నేమి లాభమ్మె ? దేవగణ మెంతొ
ఉత్కలికతోడ నుందు :

ఓహో, వయస్య !
అరుగుచుంటివ ? పరిపూర్తియైన దొక్క-
అంతయును రెండు మాటలీ వాడినంత ?
ఏమి ఈ వీడుకోలు వేయేండ్ల వెనుక ?

కచుడు

తెలుపు నా దోషమేదియో, దేవయాని !

దేవయాని

అకట సమకూర్చినది వేయి హాయనములు
కాంతకాంతారదేశంబు గారమైన
నీడలను, పర్ణమర్మరనిస్వనముల ;
విహగకూజితముల వినిపించియుండె-
ఇట్టిదానివి నీవు నే డింత సహజ
భావమున వీడిపోయెదే ? వాడిపోయి
నట్టు లున్నది తరురాజి; అరయు మల్ల
కాననచ్ఛాయ నేడు చీకటిగ నుండె
గాఢతర శోకమున మున్గి; గంధవహము
క్రందనముతోడ వీతెంచె ; రాలి పడియె
ఎండుటాకులు క్రింద ; ఒక్కండ వీవు
తరలి పోయెదె హాస్యదీప్తాధరమ్ము
తో, నిశాంతసుఖస్వప్న తుల్యముగను ?

కచుడు

ఆదరించెద నో దేవయాని, సతము
మాతృభూమిగ నీ యాశ్రమమును నేను ;
నా కిట లభించె నూత్నజన్మాధిగమము,
నా కెపుడు దీనిపై లే దనాదరంబు,
ప్రీతిభరమున నెపుడు స్మరింతు దీని.

దేవయాని

ఇదియె ఆ వటతలము ; నీ విచ్చటికిని
ప్రతిదినము గోధనము కాయ వచ్చినపుడు
బడలి మధ్యాహ్న తీక్ష్ణతపమ్ము వేళ
నిద్ర పోయెదివాడవు. నీదు మేన
అతిథివత్సల యగు, ఛాయ అలముకొనగ
సనసన మృదుస్వనమ్ముతో సరిగ విసరి
పల్లవదళమ్ము సుఖనిద్ర పడయజేయు
చుండెడిది ; రమ్ము, సఖుడ, కూర్చుండుమిందు
చివరసారి యించుక సేపు చిరపరిచిత

మైన ఈ తరువర తలమ్మందు నీవు.
ఈ ప్రియచ్ఛాయలో వెలయించు వచన
ములను కైకొని వెడలుము, పొమ్ము రెండు
గడియ లిటనుండి ; నీదు నాకమున కెట్టి
హాని కలుగ దీ స్వల్ప జాప్యమ్మువలన.

కచుడు

చిరము పరిచితమైన ఈ స్నిగ్ధగణము
వీడుకొనువేళ తోచె నవీనముగను.
పారిపోవగ నెంచిన బంధుజనుని
బద్ధుచేయుట కన్నియు వ్యగ్రములయి
స్నేహసంపూర్ణ నవబంధ నివహములను,
అంతిమ ప్రార్థనంబును, నధికరూప
సంపదను విరచించె విస్తారముగను.
ఓయి ఆశ్రిత బాంధవా ! ఓయి విటపి !
నీ కిదె నమస్కరింతు ! నీ నీడలోన
పాంథు లెందరు కూర్చుండబడిరొ యేమొ !
నిర్జనంబు, ప్రచ్ఛన్నము, నీరవంబు
అయిన ఛాయాప్రదేశంబునందు చేరి
ఎన్నిదినములు విద్యార్థు లెంతమంది
నావలె తృణాసనమ్ములపై వసించి
అధ్యయన మొనర్చిరొకో విహంగమ్ముదుల
గుంజన ధ్వనితోడ ! నీ కొమ్మలకును
ఆర్ద్రవల్కలముల నెండ దారగట్టి
యుందురొకొ ఋషిబాలకు లుదయమందు
స్నానమైనంత ! గోపాలచయము లెన్ని
ఆట లాడెనొ మట్ట మధ్యాహ్నవేళ !
వారిలో నీదు స్మృతిలోన ప్రాతబంధు
వెవడు రాజిల్లుచుండు నోయీ మహీజ !

దేవయాని

అదిగొ మా హోమధేనువు ; మదిని నుంచు

కొనుము : స్వర్గసుధాపానము నొనరించి
మరువకుము గర్వమున పుణ్యసురభి నెపుడు.

కచుడు

అమృతమునకన్న నమృతమయంబు దాని
క్షీరము, క్షయించు దాని వీక్షింప నఘము.
స్వచ్ఛకాంతి పయస్విని, శాంతిరూప
ధారిణియు, మాతృరూపిణి సౌరభేయి ;
శ్రాంతి తృష్ణా బుభుక్షల సరకుగొనక
దాని పరిచర్య చేసితి ; దానితోడ
తిరిగితిని దీర్ఘదిన మెల్ల చొరగరాని
వనములోపల పచ్చని పచ్చిక గల
తటిని తటమున. ఆ నదీతటమునందు
దట్టమును కోమలమ్ముస్నిగ్ధమ్ము నైన
తృణనికాయము స్వేచ్ఛగా తృప్తిదీర
తినియు నాలస్య మంథర తనువుతోడ
తరుతలము జేరి తృణశయ్య తగ పరుండి
అభ్యసించుచు రోమంధ మల్లనల్ల
దినము నిద్రించునది; విప్పి తన విశాల
నయనములు నడుమ నడుమ నాదు తనువు
ప్రచురహార్ద్రప్రపూర్ణ నేత్రములతోడ
నదియు లేహన మొనరించునది కృతజ్ఞ
తను వెలార్చు శాంతదృష్టిని నిగుడ్చి-
స్నిగ్ధము నచంచలము నగు నేత్రదృష్టి
శుభ్రమును నిద్దమును పరిస్ఫుటమునైన
దాని మసృణగాత్రము మదిలోన మెలగు.

దేవయాని

దీని, కలనాద, వేణుమతీ స్రవంతి
మనములో నుంచుకొను మీవు.

కచుడు

మరువదీని

కుసుమిత నికుంజములనుండి కూడబెట్టి
మధుగళమ్మున నానంద సుధ నొసంగు
మధురగానముతో గ్రామ్యవధువు లీల
శీఘ్రగతివయి శుశ్రూష చేసినావు
నా ప్రవాసవయస్యవై, నాదు నిత్య
మంగళవ్రతవై, వేణుమతిరో, నీవు!

దేవయాని

హా సఖా! ఈ ప్రవాసమ్మునందు నింక
నొక్క సహచరి ఎవతెయో యున్నది సుమ
నీ సరస! నీదు పరగృహవాస మెపుడు
మరపు కలిగింప పగలు రాతిరియు నామె
హృదయపూర్వకముగను యత్నించియుండె.
అకట, ఓసి దురాకాంక్ష!

కచుడు

ఆమె పేరు
చిరము యోజితమయ్యె నా జీవనమున!

దేవయాని

మనసులో నున్న దొక్కొ, ఏ దినము మొదట
వచ్చినాడవొ ఒంటిమై ఇచ్చటికిని
బ్రాహ్మణ కిశోరుడవు, బాలభానులీల
స్నిగ్ధదీప్తిని కరము వర్షించు గౌర
వర్ణదేహమ్ముతో, ఫాలభాగమందు
చందనముతోడ, కంఠమునందు పుష్ప
మాలతో, పట్టుపుట్టంబు గ్రాల కట్టి,
అధరనయనమ్ముల ప్రసన్నమైన సరల
హాస మలరంగ నిలిచితి వపుడు నీవు
ఇచటి పుష్పవనమ్మున కేగుదెంచి.

కచుడు

అపుడె స్నానముచేసి దీర్ఘార్ద్ర కుంత
లములతో నూత్నశుక్లాంబరము ధరించి

జ్యోతి రఖిషిక్తయై మూర్తి నొందియున్న
ఆ యుషస్సురీతిగ నుంటి వపుడు నీవు :
పూలపుటికను చేబట్టి పూజకొరకు
కోయుచుంటివి నూతన కుసుమములను
ఒంటిగా. నిన్ను ప్రార్థించియుంటి నపుడు :
దేవిరో ! శోభగాలేదు నీవు శ్రమము
పడుట ఆజ్ఞ యొసంగుము ప్రసవములను
కోసి యిచ్చెద" అని.

*దేవయాని*

కనుగొనుచు నపుడు
అడిగితి నీదు పరిచితి నచ్చెరువున.
వినయమున జెప్పితివి : "నీదు జనకునకును
నేను శిష్యుడ నగుటకై నీదు ద్వార
సన్నిధికి వచ్చితిని, బృహస్పతి సుతుండ"
అనుచు.

*కచుడు*

సురపుర బ్రాహ్మణ తనయుడ నని
నన్ను మరలించునేమొ దానవగురుండు
అనుచు సందియ ముదయించె మనములోన.

*దేవయాని*

ఆయన సమీపమునకు నే నరిగి నగుచు
అడిగితిని : "తండ్రి, నీ చరణాంతికమున
ఒకటి భిక్షింతు" నని. తనయొద్ద కపుడు
చేర్చుకొని నన్ను కరముంచి శిరముపైన
అనియె శాంతమృదూక్తుల సాదరముగ :
"తనయ, నీ కీయరాని దింతయును లేదు"
అనిన, "నీ ద్వారమునకు బృహస్పతి సుతు
డరుగుదెంచెను విద్యార్థి యగుచు. నీవు
ఆతని ననుగ్రహింపు, మయ్యదియె నాదు
ప్రార్థన" మ్మంటి. ఇప్పటి కదియు నెంత

కాలమో అయ్యె : అయినను కానిపించు
ఆ దినము నేటి ప్రత్యూష మట్లు మదిని.

కచుడు

దైత్య నివహము నను మూడు తడవ లట్లు
సంహరించిన దీర్ఘ్యాతిశయముచేత-
దేవిని మదీయప్రాణముల్ నీవు నాకు
మరల నొసగితి వప్పుడు కరుణతోడ.
జాగరిల్లియె యుండు నా సంగతియును
చిరకృతజ్ఞతతోడ నా చేతమందు :

దేవయాని

చిరకృతజ్ఞతయా ! దాని మరచిపొమ్మ-
ఏ విచారము లేదు నే నెట్టి మేలు
సలిపితినొ దాని నట్టులే విలువనిమ్మ
దానమునకును ప్రతిదాన మేను కోర.
మతిని లే దొకా ఏ సుఖస్మృతియు గూడ !
అంతరమ్మున బాహ్యమునందు, ఎన్న
దైన ఆనందగీతి నీ మానసమున
మ్రోగియుండిన, ఏ దినమ్మునను గాని
అల్ల వేణుమతీతీరమందు పుష్ప
వనములోన సంధ్యాకాలమునను కూరు
చుండి అధ్యయనము చేయుచుండు నపుడు
మనమున నపూర్వ పులకసంచయము నీకు
పొడమి యుండిన యెడల, ప్రస్ఫుటితకుంజ
పదమునందు, సాయంతనాంబరమునందు
సూనసౌరభసదృశమౌ మానసిక స
ముచ్ఛ్వసిత మలర వ్యాపించియుండెనేని
మదిని ఆ సుఖసంగతి మెదలనిమ్మ :
దవ్వుగా నుండ నిమ్మ కృతజ్ఞత నిక !
ఒక రిచట గాన మొనరించియున్న వేళ
సంతసము కలిగినది నీదు స్వాంతమునకు,

ఒక రిటుల వస్త్రము ధరించియుండ చూచి
స్తావకోక్తి చెలంగె నీ స్వాంతమందు
ఒక్క దినమున. భావించియుంటి వీవు
అట్టివేళ ప్రసన్న హృదంతరమున
తృప్తలోచనములతోడ : "ఇదియు నెంత
అందముగ నేడు దర్శింపనయ్యె" ననుచు
సమయము లభించుచో దాని సంస్మరింపు
నీ సుఖస్వర్గపురిలోన నెగడుచుండి.
దిగ్దిగంతరముల నెన్ని దినము లిచటి
అడవిలోన నాషాఢమం దవతరించె
శ్యామల స్నిగ్ధపటునీల జటలతోడ
వార్షుక నవీన ఘనఘటల్ వరుసగాను.
నిరతమును జలధారలు కురియుచుండు
దుర్దినమ్ముల నెన్నియో దినము లెంత
బాధపడినది హృదయము ప్రబలకల్ప
నాభరమ్మున ; దుఃఖబంధరహితము,
అతుల హర్షహిల్లోల సమాకులంబు
లైన వాసంతయౌవనాహ్లాద మెన్ని
దినము లాకస్మికముగ నేతెంచియుండె ;
గానముఖర మా యుత్కలికాప్రవాహ
మలరులందున, పత్రమ్ములందు, లతల
యందు, కాననమున, కాననాంతరమున
వ్యాప్తి నొంది ప్రమోదప్లవం బొసంగె
తరగ తరగలుగను ; ఒక్క తడవ అరయు
మెన్ని వేకువ, లెన్నియో వెన్నెలలును,
సూనపరిమళఘనము, లమానిశాంధ
తమము లెన్ని యీ వని మిళితంబు లయ్యె
నీదు జీవనసుఖదుఃఖ నివహమందు ;
వానిలో నిట్టి వేకువ, ఇట్టి సంజ,
ఇట్టి ముగ్ధరాత్రియు, ఇట్టి హృదయఖేల,

ఇట్టి సుఖ, మిట్టి ముఖమును నెన్నదేని
కనబడగ లేదె చిరరాత్రిగను. చిరదిన
మట్లు, చిరచిత్రరేఖగా అంకితమయి
హృదయమందు ? కేవల ముపకృతియ ? ప్రీతి
లేదా ? శోభలేదా ? ఏదియు లేదా ఇంక ?

కచుడు

చెలియరో ! ఉన్న దేదియో వెలువరింప
అలవి కాదది— నాదు మర్మాంతరంబు
లోని రక్తమ్మున వహించు దాని నెట్లు
వెలువరించి ప్రదర్శింప వీలుపడును !

దేవయాని

ఎరుగుదును నేను, సఖుడ ! నీ హృదయ మట్లు
చకితమై నాదు హృదయ తేజస్సులోన—
అది నిమేషమాత్రమే యగునుగాక—
ఎన్ని పర్యాయములు చూచియున్న దొక్కొ !
అందులకె నేడు రమణికి నంత స్పర్ధ.
అయినచో నింక నిచటనే ఆగిపొమ్ము,
పోవగావల దిం దుండిపొమ్ము నీవు !
గౌరవఖ్యాతులందు సుఖమ్ములేదు—
మనము వేణుమతీ తీరముననె గూడి
ఇరువురము సృష్టిచేయుద మింక నిచట
అభినవస్వర్గలోకమ్ము. అందు సన్ని
కృష్టములును విస్రబ్ధముల్ హృద్యములును
నైన హృదయమ్ములను రెంటి నంటుకొలిపి
విర్జనంబగు నీ కాన నీడలందు
మరచిపోవుద మఖిలము. నెరుగుదేను
నీ రహస్య మోయి వయస్య !

కచుడు

కాదు, దేవ
యాని, కాదది !

దేవయాని

కాద ! మిథ్యాప్రతార

ణంబ ! అరయలేదా నీ మనంబు నేను !
అరయ ప్రేమ అంతర్యామి యని యెరుగవె !
దాగియుండును ఎల్లవతతులలోన
విరిసిన సుమమ్ము కాని తత్పరిమళమ్ము
ఎచట దాగంగ గలదు ? నీ వెన్ని దినము
లేవిధంబున వదనము నెత్తినావొ,
ఎట్లు తిలకించితివొ, వింటి వే విధాన
నాదు కంఠస్వరంబును, నీదు హృదయ
మట్టులే పూర్తిగా కంపమందియుండె-
అటు నిటును వజ్రమును త్రిప్పునపుడు దాని
కాంతులును వెల్లివిరిసెడి కరణి దోప !
దాని గమనింపలే దొకో నేను, సఖుడ !
పట్టువడితి వీ వందుకే బందివైతి,
విట్టి బంధము కోయలే వింక నీవు,
ఇంద్రు డరయగ నీ యింద్రు డింక కాడు !

కచుడు

ఓ శుచిస్మిత, ఈ దైత్యదేశమునకు
వచ్చి నేను సహస్ర సంవత్సరములు
దీనికోసమ సాధన మూని యుంట ?

దేవయాని

ఎందులకు కాదు, విద్యకే ఈ జగాన
జనులు కష్టమ్మును సహింపజాలుదురొకొ ?
పురుషుడు మహాతపస్సును తరుణి కొరకు
పత్నిగా గోరి ఎవదు సల్పంగ లేదె ?
తా నిరాహారదీక్షతో తపతి కొరకు
సంవరణు డెంతొ కఠినమౌ సాధనంబు
సలుపగా లేదొకో ఆకసమునందు
తీక్ష్ణ మార్తాండు వంకనే దృష్టి నిలిపి ?

ఆకట విద్యయె దుర్లభ మగునె కేవ
లమ్ము ? ప్రేమయే అంత సులభమగునొకొ ?
ఏ ధనము కోసమై నీవు సాధనంబు
వేయి వత్సరములనుండి చేయుచుంటి
వెరుగ వద్దాని స్వయముగా. సరిగ నొక్క
ప్రక్క విద్యను, రెండవ ప్రక్క నన్ను—
ఒక్కతడవ నావంక, ఇంకొక్క తడవ
దానివంక నత్యుత్సుకత్వమ్ముతోడ
నరయుచుంటి, పనిశ్చితమైన నీదు
చేతము రహస్యముగను నర్పించె రెంటి
సప్రయత్నమ్ముగను. నేడు సరిగ మనము
ఒక్క దినముననే వచ్చియుంటి మిట్టు
లిర్వురము పట్టుపడగ: గ్రహించు, సఖుడ,
దేని కోరుచునుంటివో దాని నెరిగి ;
"యశములో, విద్యలో, దేవయాని, సౌఖ్య
మించుకయులేదు; కేవల మీవె నాకు
మూర్తిమతియగు సిద్ధి. ఇప్పుడు వరింతు
నిన్నె" అని పచించితివేని నీవు, క్షతియు
లేదు, లజ్జయు దానిలోలేదు, సఖుడ !
తరుణి మనసు వేయేండ్ల సాధనధనంబు !

కచుడు

"నియతితో మహాసంజీవనీ సువిద్య
ఆర్జనముచేసి మరలి ఈ యమరపురికి
వచ్చెదను సు"మ్మని ప్రతిజ్ఞ పట్టియుంటి
నేను త్రిదశుల శుభసన్నిధానమందు.
అందులకె ఏగుదెంచితి ; ఆ ప్రతిజ్ఞ
నా మది మెలంగు నెపుడు. పూర్ణత్వ మందె
అట్టి నా ప్రతిజ్ఞయు, చరితార్థమయ్యె
ఇప్పటికి నాదు జీవన; మింక నేడు
స్వార్థమగునట్టి దేదియు నభిలషింప.

దేవయాని

ధిఙ్మృషాభాషి ! విద్యయే తెలియగోరి
యుంటివా కేవలము ? గురు నింటి కరుగు
దెంచి నిర్జనమైన ప్రదేశమందు
అహరహంబు శాస్త్రగ్రంథ నిహితదృష్టి
వగుచు ఛాత్రరూపమున నధ్యయన నిరతి
తోనె కేవల ముంటివా ? తొలుతనుండి
పూని అన్నిటియెడ నుదాసీనుడవుగ
నడచితివ ? అధ్యయనశాల విడిచి నీవు
వనవనాంతరములనుండి ప్రసవములను
కోసికొని తెచ్చి మాలికల్ గ్రుచ్చి యేల
హాస్యవికసితముఖముతో నరుగుదెంచి
ఇట్టి విద్యావిహీనకు నిచ్చినావు ?
ఇది కరోరవ్రత మగునె ? ఇట్టి నీదు
వర్తనంబు విద్యార్థివంటి దగునె ?
అల ప్రభాతమునందు నీ వధ్యయనము
చేయుచుండగ నచటికి చేరవచ్చి
వట్టి పూపుటి చేతసుబట్టి నగుచు
నిలిచియుండగ, గ్రంథమట్టులనె మూసి
ఏల లేచి వచ్చితివి ? నన్నేల పూజ
చేసితివి నీవు శిశిరసంసిక్తకుసుమ
తతులతోడ, ప్రఫుల్లచిత్తమ్ముతోడ ?
భూరుహమ్ముల ఆవాలములకు నేను
జలము పోయుచు నపరాహ్ణసమయమందు
అలసియుండుట కని దయకలిగి నీవు
జలము కొనివచ్చి ఏల యొసంగినావు ?
ఏల పాలించితివి నాదు మృగశిశువును
పాఠములను పరిహరించి ? స్వర్గమందు
నేర్చుకొనియున్న గానము నీవు నాకు
ఏల వినిపించితివి సాంధ్యవేళయందు

తిమిరములు మౌనముగ నదీతీరమందు
కమియగా ప్రేమనతలోచనములతోడ
స్నిగ్ధ సుచ్ఛాయతోడి విస్తృతకిసాల
మట్లు ? విద్య నేర్చుకొనంగి నరుగుదెంచి
స్వర్గపుర చాతురీజాల చయముతోడ
ఆహరించితి వేలనో నా హృదయము ?
నన్ను వశమొనరించుక నాదు జనకు
హృదయమున ప్రవేశింపంగ నెంచితి వని
ఇప్పు డెరిగితి. ఇక కృతకృత్యుడవయి
ఇంచుక కృతజ్ఞత నొసంగి యేగెదొక్కొ—
అర్థి లబ్ధమనోరథు డగుచు ప్రభువు
ద్వారమం దుండు నా ద్వారపాలకునకు
మనసులోని సంతోషము ననుసరించి
మూడు నాల్గు ముద్ర లొసంగి పోవునట్లు ?

దేవ.

అకట, అభిమానినీ, నారి : ఆ యథార్థ
మిపుడు విన్నంత సంతోష మేమి కలుగు ?
ధర్మసాక్షిగ నేను ప్రతారణంబు
సలుపగాలేదు. కపటదూష్యములు కాని
ప్రాణములతోడ పరమహర్షాంతరంగ
మొప్పగా నీకు సంతోష మొదవ సేవ
చేసి యపరాధమును నేను చేసితేని
దానికిం దగు శాస్తి విధాత యొసగు ;
మనసులో ననుకొంటి యీ మాట ఎపుడు
వెలువరించరా దనుచు. త్రివిష్టపమున
ఎవ్వరికి నుపకారక మే విధముగ
కానిదియు. నొక్క నీకు నాకే నితాంత
మైనదియు నగు సంగతి నవధరింప
ఏమి యుపయోగమో చెప్పు మిపుడు, నేను
నిన్ను ప్రేమించితినో లేదొ నేడు దాని

నిట్టుల విమర్శనము చేయ నేమి ఫలము ?
ఏది కర్తవ్యమో ఇంక నా కెట్టులైన
దాని సాధింతు నేను – నా మానసమున
స్వర్గ మనిపించకున్నను స్వర్గ మింక,
విద్ధమృగమట్టులు దదీయ విపినమందు
మరగుచున్నను చిత్తము తిరిగి తిరిగి,
అఖిల కార్యములందు నా ప్రాణము చిర
తృష్ణతో దగ్ధమగుచున్న, తిరిగి చనగ
వలయు సుఖశూన్యమైన ఆ స్వర్గధామ
మునకు సకల నిర్జరగణమునకు నింక
ఇట్టి సంజీవనీవిద్య నిచ్చి వార
లకును నూతన దేవత్వలాభ మొసగి
నప్పుడు నా జీవనమును కృతార్థ మగును.
దానిముందు నా సుఖము నెద్దానిగాని
అనుమతింపను. నను, దేవయాని, సైచు
మింక నా తప్పిదము క్షమియింపవలయు !

దేవయాని

ఎక్కడిది క్షమయింక నా హృదయమందు ?
ఈ రమణి మది కులిశకఠోరతరము
సలుపుచున్నావు— నీ వింక స్వర్గమునకు
బ్రాహ్మణుడ, పోయెదవు గౌరవమ్ముతోడ !
నీదు కర్తవ్యరోమాంచ నిచయమందు
నీవు దూరీకరింతువు నీదు సర్వ
దుఃఖముల కష్టముల నిట్టె త్రోసిపుచ్చి !
ఏమి కార్యము నాకు, నా కేది వ్రతము ?
ప్రతిహతంబును మిగుల నిష్ఫలమునైన
ఇట్టి నా జీవనమున నింకేమి కలదు ?
ఎవ్వరికి గౌరవము ? లక్ష్యహీన నగుచు,
నత శిరముతోడ నీ యరణ్యంబునందు
ఇట్టు లేకాకినిగ సంగహీన నగుచు

కూరుచుండు ; నే కడను దృక్కులు మరల్చ
కఠినముగ వేయి స్మృతికంటకములు గ్రుచ్చ
కొనును, లజ్జయు కరచును క్రూరముగను
తడవతడవకు నెదదలో దాగియుండి.
ఛీఛి ! నిర్మమపథిక వచ్చితివి నీవు
ఎచటనుండి ? రెండుగడియ లిచట నాదు
జీవనాటవీచ్ఛాయలో చేరి కడపు
వ్యాజమున కూరుచుండి, పుష్పమ్ము లట్లు
నాదు జీవనసుఖము లంతటను కోసి
తెచ్చి ఒక్క సూత్రమ్ముతో గుచ్చితీవు
మాలగా— పోవువేళ నా మాల నెత్తి
తాల్పలేదు గళాన; అత్యంత హేళ
నమ్ముచేసి యా సూక్ష్మసూత్రమ్ము నిట్టె
త్రుంచితివి రెండుగా— దూళిలోన
పొరలె ఈ ప్రాణమహిమ సంపూర్ణముగను.
ఇదియె నా అభిశాప మదింక నీకు :
'ఎట్టి విద్యకై నన్నవహేళనమ్ము
సల్పినాడవో నీకు వశంబు కాక
యుండు పూర్తిగ నా విద్య; ఉండె దింక
నీవు తద్భారవాహివై కేవలమ్ము !
అనుభవింపగలేవు, నీ వన్యులకును
నేర్పుదువు, ప్రయోగింపగా నేర వెపుడు !'

కచుడు

నీకు వరము నొసంగెద నేను, దేవి !
నీవు సుఖవతి వగుదు, వెంతేని గౌర
వంబు నొంది మరతువు సర్వశ్రమంబు !

10 ఆగస్టు 1893 విదాయ్ అభిశాప్

# వసుంధర

ఎరల న న్నోవసుంధర, తీసికొనుము
నీ యొడిబిడ్డను నీ యొడిలోని—
కురువసనాంచలాంతరమున కీపు;
మృణ్మయీ, జనని, నీ మృత్తికలోన
వ్యాప్తమై యుంటి ప్రపంచించుకొనుచు
నన్ను నే నా వసంతానంద మట్లు
దిక్కులయందు విదిక్కులయందు
సరగ దారించి వక్షఃపంజరంబు
పాషాణబంధము పటు సంకులమ్ము
నగు నిజకారాగృహంబు నూగించి
వడకించి మర్మరస్వనము చేయించి
వెదజల్లి జారిచి విస్మృతి నొంది
భయము జెందుచును కంపమ్ము నొందుచును
ఆ లోకమున రోమహర్షణమందు
ప్రవహించుచును నేను పయనించుచుంటి
అఖిలభూలోకమం దా పొంతనుండి
ఈ పొంతవరకును—నిటు పూర్వదిశకు
యమదిక్కునకును పశ్చిమ దిక్కునకును
కౌబేర దిశకును గమియించుచుందు

శైవాలమందున శాద్వలమందు
కొమ్మలయందు తృణమ్ములయందు
త్వక్కులయందును పత్రములందు
అతిగూఢమైన జీవితపు రసంబు
తోడ నేను రసాన్వితుడనై లేచు
చుందును నే తాకుచుందును పోయి
హాటకశిరముతో ఆనతమైన
సస్య కేదారదేశము ప్రేళ్ళతోడ

నూపుచు. నేనంత గోపనముగను
ఆ సుధాగంధంబు నా మధుబిందు
భారంబును సువర్ణవర లేఖతోడ
నవపుష్పదళము పూర్ణము చేయుచుందు.
నీరధి నీరంబు నీలిమతోడ
అంతట వ్యాప్తమౌనట్టుల చేసి
తీరి తీరమునందు చేరి నృత్యంబు
సలుపుచునుందు నే స్తబ్ధధరిత్రి
కదలేని కల్లోల గానముతోడ.
ఆలోక రంగమునందును. తరగ
తరగల, దిగ్దిగంతరములయందు,
ప్రసరింపచేయుదు భాషను నేను.
శుభ్రోత్తరీయంబు పొప్పున నేను
శైల శృంగంబున స్వచ్ఛహిమంబు
నెగడెడి ఉత్తుంగ నిర్జన స్థాన
మందు నిశ్శబ్ద గోప్యమునందు పరచు
కొనుచుందు.

· గుట్టుగా మనసులో నాకు
తెలియకుండగ నిచ్ఛ కలుగుచునుండు
చాల కాలమునుండి ఝరము చందమున;
అది హృదయమ్ములో అన్ని వైపులను
పరిపూర్ణముగ నింపి బయటపడంగ
కాంక్షించుచున్నది కడు నుదారంబు,
ముక్తము నుద్వేలమును బహూద్దామ
మును నగు వాగుతో విను తడుపుటకు.
ఆ వాంఛ పీడింప నా బంధనంబు
తెరలించుకొని దేశదేశములకును
దశదిశలకును నంతరము భేదించి
శతలక్షధార లేగతి పంపగలను ?

కేవలమును గృహకోణమునందు
కూర్చుండి సర్వదా కుతుకివశమున
ఆసక్తమతితోడ నధ్యయనంబు
సలుపుచుంటిని నేను : జను లెవ రెవరు
దేశమునందును దేశాంతరముల
భ్రమరించిరో అని. వారితోగూడ
నేను చేయుచునుంటి నీ ప్రదక్షిణము
కల్పనాజాలము కడు విస్తరించి.

దుర్గమమైన సుదూరదేశమ్ము :
వృక్షశూన్యము మార్గహీనము, సంత
విరహితమును నగు మరుభూమి, భూరి
తృష్ణకు రంగ ప్రదేశంబు, చూడ
సూర్యతేజస్సులో సూదులరీతి
కన్నులు పొడిచెడి కరణి వెలుంగు
జ్వలిత సైకతరాశి : వసుమతి చూడ
అగ్నికీలామయ మగు వేడి యూర్పు
గుములతోడ, తప్తదేహముతోడ, శుష్క
కంఠముతోడ సంగవిహీనముగను
నిర్దయగా నతి నిశ్శబ్దముగను
ఆ దిగంతవ్యాప్తమగు ధూళిశయ్య
పై పొరలాడెడి ఎగిది గన్పట్టె.
గృహములో కిటికికి కెలన కూర్చుండి
ఎన్నాళ్ళనుండియో ఎదుట కన్గొనుచు
దవ్వల దవ్వల తగు దృశ్యములను
చిత్రించుకొనియుంటి చిత్తములోన
నాలుగువైపుల శైలమాలికలు,
నడుమ నిర్జనమును కడు నీరవంబు
స్ఫటికమువోలె స్వచ్ఛము నిర్మలంబు
నగు నీలసరసి. ఆ నగశిఖరముల

జనని స్తన్యమ్ము నాస క్తితో గ్రోలు
శిశువుల పగిది వేష్టించి కోళిల్లె
జలదఖండములు. తిలకింపనయ్యె
అతిదూరమున దృష్టి నడ్డగించుచును
నీలగిరిశ్రేణి నె త్తముమీద
నీహారరేఖ. వానిని నిశ్చలముగ
నది నిషేధించుచు అమరలోకమును
సారెకు భేదించి, సర్వదా యోగ
నిరతుడౌ ధూర్జటి వరతపోవనము
ద్వారమునను నిలబడినట్టు లుండె.
మనసులో భ్రమణము నొనరించినాడ
దూరపారావారతీరమునకును :
అమ్మహా మేరుదేశమ్మున కేను.
మహియు ననంతకుమారీవ్రతమ్ము
పట్టియుండె తుషారవస్త్రము తాల్చి
నిస్పృహతోడను నిస్సంగముగను
అఖిలాభరణహీన యగుచు తా నచట.
దిన మరుదెంచును దీర్ఘనిశావ
సానమం దచట నిశ్శబ్దముగాను
సంగీత హీనమై. శర్వరి కూడ
వచ్చును. కాని ఎవ్వారును లేరు
శయనించువారలు. శర్వరి యెపుడు
అనిమేషదృష్టితో నభ్రమువంక
కనుచు మేల్కొనియుండు గతపుత్రయైన
జనని యట్టుల శూన్యశయనముమీద
నిదురమంపునను కునికిపడుచుండి.
ఆ నూత్నదేశాహ్వయమ్మును గూర్చి
శీలించిన కొలంది, చిత్రవర్ణనము
చదివిన కొలది తత్సకలము తాక
ఆపించె చిత్తమగ్రేసరి యగుచు.

అంబుధితీరంబునందు గన్పట్టు
చిన్నిచిన్ని నలుపువన్నె శైలముల
సంకీర్ణపథముల సరసన కలదు
పల్లె యొక్కటి గట్టుపై నెండుచుండె
జాలముల్; నావలు జలములపైన
తేలుచుండెను; వాని తెరచాప లల్ల
పైకి లేచుచునుండె, ంట్టుచునుండి
రచటి ధీవరులు మత్స్యవ్రాతములను
సంకీర్ణనది యొండు శైలమధ్యమున
వంకరటింకరి పరుసతో నెట్లో
జాలువారుచునుండె. జనియించె వాంఛ
జనహీన పర్వతోత్సంగము నందు
అలల మాలికల ఘోషలతోడ నిండి
హాయిగా కూర్చుండిన ట్లున్న జన ని
వాసములను బాహుపాశముతోడ
అక్కున బంధించి హత్తుకొనంగ
కాంక్ష జనించె నక్కడ నున్నవెల్ల
స్వేచ్ఛానుసారము సిద్ధముచేయ
ఆ నిమ్నగా ప్రవాహాంబువు లెల్ల
ఉభయతీరమ్ముల నొరసి తమంత
దాహము తీర నూతన నూత్నలోక
వాసంబుల కొసంగవలయు జలంబు,
ప్రవహింపవలె నది పగలు రాతిరియు
కలగానములతోడ క్ష్మామధ్యమందు
పశ్చిమాంబుధినుండి ప్రాగబ్ధి వరకు
ఉత్తుంగపర్వత వ్యూహమాలికలు
ప్రసరించి తమయంత రాజిల్లవలయు
తమ సుదుర్గమ రహస్యమునందు నెపుడు.
కటికిరాల యొడుల కడు తీవ్రతుహిన
వాతమ్ములను దాగి నూతన నూత్న

జాతులవారిని చక్కఁగా పెంచి
పెద్దవారలుగ కావింపంగవలయు.
హృదయములో నిచ్ఛ యుదయించుచుండె :
దేశదేశంబుల తెలియు సమస్త
జనులతో వారల జాతివాడుగను
మెలగవలయు ; ఉష్ట్రముల పాలు ద్రావి
మరుదేశములయందు పెరిగి దుర్దమము
అధిక స్వతంత్రము నైన యారబుల
సంతానమై నేను జనియింపవలయు.
టిబ్బతు శైలప్రదేశములోని
నిర్లిప్తపురములో నెగడెడి బౌద్ధ
మతమున పంచరింపంగ వాంఛింతు.
అల గులాబి వనంబునందు వసించి
ద్రాక్షారసంబును త్రాగుచునుండు
పారసీకుఁడ నగుదు. భయరహితుండు
అశ్వికుండును నగు నల్ల తాతారి
దేశీయుఁడ నగుదు తెలియగాఁబడుదు
అధిక తేజస్వి శిష్టాచారరతుఁడు
నగు జపాన్దేశజుఁ డనగను నేను.
రాత్రిందివమ్ము కర్మానురతుండు
అధికప్రవీణుండు నతిపురాతనుఁడు
నైన చీనావాసి నయ్యెద నేను.
సర్వుల గృహముల జన్మింపవలయు
నని యిచ్ఛ జనియించె. వ్యాధి హీనముగ,
కడు బలిష్ఠముగ, నగ్నముగ మూర్ఖముగ
నతి హింస్రముగ, సకలాచారములను,
బంధ నిర్బంధముల్, ద్వంద్వములెల్ల
ద్వైవిధ్యములను చింతాజ్వరమ్ములను
నిఖిల ధర్మాధర్మ నియమము, లిండ్లు
వాకిండ్లు నెట్టి వే పగిదిని లేక

సమ్మెటమ్మైన దెబ్బ సాచి కొట్టుచును,
భయము లేకుండ దెబ్బలు సహించుచును
ప్రవహించెదను దివారాత్రముల్ నేను
అడ్డులేకను జీవనాంగయందు
పరితాప శిథిలిత ప్రాణినై వ్యర్థ
సంతాపమొంది విచారింప గతిము
మిథ్యాదురాకాంక్ష మీర లక్షింప
నెన్నడు భావిని ఏగుచునుందు
నృత్య మొనర్చుచు నే వర్తమాన
వీచికాగ్రముల నావేగముతోడ
ఆనందమేపార. ఆదరించెదను
శృంఖలారహితమౌ జీవితమేను—
ఆ జీవదంధకారాంతరమంయు
నెరవుగా నిండిన తెరచాప కల్గు
చిన్ని పడవరీతి చెచ్చెర పరుగు
వారిగావలెనని వాంఛ జనించె
ఎన్నొ పర్యాయము లిట్టుల నాకు
అడవిలో ఘాతుక వ్యాఘ్రచయంబు
తమ ప్రకాండ శరీర తతుల వహించు
చండబలమ్ముతో చాల చుల్కనగ.
జలదములందు ప్రచ్ఛన్నాగ్నియైన
వజ్రముచందాన వాని దేహములు
దీప్తోజ్వలమ్ములు. దిగ్గన ఎదును
దారుణ మేఘమంద్రధ్వనితోడ
సంశయవిరహితస్వాంతములైన
పశువులపైన శంపావేగమునను.
ఆయాసవిరహితమైన దా మహిమ ।
హింసాసుతీవ్రమై యెసగు నా ప్రీతి ।
కడు దృప్తమైన దా గరిమ కనంగ ।
వాని యాస్వాదనప్రాప్తికై మదిని

వాంఛింతు నొక్కొక్కపర్యాయ మేను.
వానితో గలిసి విశ్వములోని సకల
పాత్రలనుండియు ప్రత్యగ్రమైన
ఆపగాతతినుండి ఆనందమధ్య
ధారలు పలుమారు త్రావ వాంఛింతు.

వసుమతీ, సుందరీ, వారక నిన్ను
దర్శించినపు డెన్నితడవ లత్యంత
సంతోషభరమున సలిపె గానమ్ము
నాదు ప్రాణము ! సదా నా హృదయమున
జలనిధి మేఖలా సంస్కృతమైన
నీ కటిదేశమ్మునే గాఢముగను
హత్తుకొనుటకునై యభిలషించితిని.
ప్రాభాతికద్యుతివలె దిశలందు
అంత హీనమ్ముగా నంతయు నేను
వ్యాపించి—అడవుల, పర్వతమ్ములను
కదలు పల్లవదోలికలయందు చేరి
అన్ని వేళలను నృత్యమ్ము చేయుదును.
ఒక్కొక్క పూమొగ్గ నొత్తి చుంబించి,
సాంద్ర సుకోమల శ్యామల శాద్వ
లమ్ముల నాలింగనమ్ము కావించి
ప్రతి తరంగాంతర పరమ ప్రమోద
దోలికలందు నుయ్యాల లూగెదను
దినమెల్ల. రాత్రియందున మౌన మూని
నిశ్శబ్దగతితోడ నెమకుచు పోయి
సకల విహంగలోచనముల పైన
నిమురుదు నంగుళాగ్రములతో నేను
జగతి వ్యాపించిన స్వాపరూపమున
ప్రతిశయనమునందు ప్రతినీడమందు
ప్రతిగృహమందున ప్రతిగుహాయందు

వేగ ప్రవేశించి ; పెనువస్త్ర మట్లు
విరివిగా నను నేను విస్తరించుకొని
అఖిల భూమండల మావరించెదను
కడు స్నిగ్ధమగు నంధకారములోన.

నీవు నా పృథివి వనేకవర్షముల
నుండియు, నే యుగయుగములనుండి
ఎన్ని దినంబులో, ఎన్ని యామినిలో
అశ్రాంతగతితో ననంతాంబరంబు
నందు ప్రదక్షిణ మాచరించితిని
దినకరమండలమును చుట్టి నీదు
మృత్తికతో గూడ మిళితమైపోయి.
నాలోన జనియించినది నీదు తృణము,
ప్రస్ఫుటించినవి పుష్పములు రాసులుగ,
పత్రపుష్పపరాగఫలముల నెల్ల
వర్షించినవి పాదపములు నాలోన,
అన్యమనస్కుడ నగుచు నొంటరిగ
చేరి పద్మానదీతీరమునందు
ముగ్ధనేత్రములు సమ్ముఖమున నిల్పి
సంపూర్ణ మనముతో సర్వాంగకముల
యందు నే ననుభూతి నందుచునుంటి—
ఎటుల కంపించి నీ మృత్తికలోన
ఈ తృణాంకూరమ్ము లెట్లు పుట్టినవొ,
ఎట్టి జీవనరస మెల్ల ధారలుగ
ఎల్ల వేళల చరియించె నీలోన,
కుసుమకోరకము లాకులములై యెంత
అంధహర్షమ్ముతో నందములైన
వృంతాగ్రములను పుష్పించుచునుండె,
నూతన సూర్యుని ఆతపమందు
తరులతాతృణ గుల్మతతియు నే లీల

గూఢపుల్కలతోడ మూఢప్రమోద
రసముతో నధిక సంతస మందుచుండె—
జనని స్తన్యము గ్రోలి శ్రాంతమై తృప్తి
కవిన డెందముతో సుఖస్వప్న హాస్య
మొలికెడి వదనమ్ము గల శిశువట్లు.
నే డందుచేత నేనాడొ పక్వమ్ము
లైన శీర్షములతో నలరు బంగారు
పంటపలంతులపై శరత్కిరణ
జాలముల్ పడినట్టి సమయమునందు,
నారికేళదళ గణమ్ములు వాయు
భరమున వణకుచు నురుకాంతిలోన
తళతళలాడుచు తగ వ్యాకులమున
జాగరిల్లిన యట్టి సమయమునందు ;
ఏనాడు నా మదియెల్లను పర్వ—
వనముల పల్లవావాసములందు
స్థలములయందును జలములయందు
గగననీలిమయందు కలిసి వర్తించు ;
ఆ నాటి సంగతి యంతరంగమున
తగిలిన దనుచును తలతును నేను.
అవ్యక్తమైన ఆహ్వానరవమున
జగమెల్ల వందలసారులు నన్ను
పిలిచిన ట్లున్నది. విస్మయ మదియె,
అదియె మహత్తును ! ఆలింపనయ్యె
చిరకాలమిత్రులు చేయు ననేక
విధములౌ ఆనందవిలసనములును
మిశ్రమర్మర మట్లు మించి, పరిచిత
మైన రవమ్ముతో— అచటికి నన్ను
మరల తీసుకపొమ్ము మరియొకమారు,
ఆ విరహంబున నంత మొందించు,
ఉద్బుద్ధ మగుచుండు నుండింది మదిని

ఆ విరహంబె – సంధ్యాకిరణముల
విస్తృత మరుభూమి వీక్షించినపుడు,
దుమ్ములు రేపుచు దూరగోష్టముల
యందుండి ఆవులమందలు తిరిగి
మరుభూమి మార్గాన నరుదెంచునపుడు,
పాదపావృతములౌ పల్లెలనుండి
పొగలు సంధ్యాకాలమున లేచునపుడు,
నిమ్నగ దగ్గర నిర్జనమైన
వాలుకాతటమందు బడలిన పథికు
చందము దోపగా మందమందముగ
దూరాన చంద్రుడు తోచినయపుడు
'నేను ప్రవాసిని నిర్వాసితుండ
ఏకాకి' నని తోచు హృదయమునందు.
పరుగున వచ్చితి బాహువుల్ సాచి
బాహ్యమునెల్ల లోపలికి తీసికొన ;
ఈనింగి, నీ నది, నీ నదిమీది
శుభ్రము శాంతము సుప్తమునైన
వెన్నెల రాశిని ; వేనిని గూడ
స్పృశియింపలేకపోయితి నేను తుదకు.
తిలకించుచుంటి కేవల శూన్యమందు
శోకముతో నేను వ్యాకుల మంది.
అవ్వాని నన్నింటి అంతరమునకు
నను వెండి మును తీసికొనుమ – ఎచ్చోట
అహరహము శతసహస్రరూపముల
మొలకెత్తి ప్రాణమ్ము, ముకుళించి, యంత
మంజరిత మ్మగు, మంజుగానమ్ము
గునగున లక్షల వినదము. లలర
నలుపు నెచ్చోట, నసంఖ్యాకములగు
భంగుల నృత్యముల్ భాసిల్లు నెచట,
భావవాహినిలోన ప్రవహించు నెచట

చిత్తము, ఛిద్రము ఛిద్రమునందు
మ్రోయు నెచ్చోటనో మురళి, యచ్చటికి ;
శ్యామలవర్ణపు కామధేనువవు
నిలుచుంటి యుంటివి నీవు. ని న్నెన్ని
వల్లీద్రుమంబులు, పశుపక్షు లెన్ని,
ఎన్ని యసంఖ్యేయ తృషితజీవులును
వేయి వైపులనుండి చేయుచు నుండె
దోహన మెంతయో తోరముగాను
ఆనందరస మెన్ని యాకృతుల్ వడసి
వర్షించునో యన్ని భంగులతోడ
అత్యంత మోదావహం బగు గీతి
ధ్వనియించు చుండును దశదిశలందు.
ఈ సర్వజగతిలో నెంత విచిత్ర
హర్ష మున్నదియొ ఆ యఖిలముతోడ
ఐక్యమైపోయి నే నాస్వదించెదను
ఒకి ముహూర్తమ్ములో నొక్క మారుగను.
నాదు నానంద మంతయు గ్రహియించి
నీలతరము కాద నీ యరణ్యంబు ?
చరియింపదా నూత్నకింశుకంపంబు
ప్రత్యూషకాంతిలో ? వసుధాతలంబు
నాకాశమును గూడ నంకిలి మగును
నా ముగ్ధభావమ్మునను నాదు హృదయ
రాగముతోడ ఆ రాగము గాంచి
కవిత యుద్భవ మగు కవి మానసమున,
ప్రేమకు నేత్రాల ప్రేమమదమ్ము
సంసక్త మగు, ఖగాస్యములను గాన
మాకస్మికమ్ముగా నరుదెంచుచుండు ;
వసుమతీ, నీదు సర్వాంగకములు
ఎందరో జనుల ఆనందముతోడ
రంజితమైనవి, ప్రాణప్రవాహ

మెన్నియో మారులు నిన్నిల్వరించి
పలుమారు నీదు జీవనములోనికిని
వచ్చుచు వోవుచు వరలుచున్నదియ.
మేళవించినది నీ మృత్తికతోడ
తన హృదయంబునందలి ప్రేమనెల్ల,
లేఖల నెన్నియో లిఖియించియుండె.
వివిధదిక్కులయందు విస్తరించినది
వ్యాకుల ప్రాణాల ఆలింగనమును
దానితో నా సమస్తానురాగమును
సప్రియత్నమ్ముగా సత్తము చేసి
రాగిల్లజేయుదు వేగ సజీవ
వర్ణముతోడ నీ వసనాంచలము
విన్ను శృంగారింతు నీకు నా
మర్పించి. నదుల తోయమ్ములలోని
నాదు గానమ్మను నదుల తీరముల
మురియుచు వినువారు దొరకకుండెదరె ?
అల యుషఃకాంతిలో నలరు నా నవ్వు
నిదుర మేల్కొని గమనించెడివారు
నరలోకవాసు లెవ్వరు కానబడరె ?
శతవత్సరమ్ములు చనిన తర్వాత
ఈ శోభినారణ్య దేశములోని
ఆకుల పొరపొరయందు
నంద దొకొక్క నాదు ప్రాణంబు నేడు ?
ఎంతో కాలమునుండి యింటింట నెన్ని
వందల మందియో వర్తించుచుండి
రింతులు పూరుషు లిట్లు సంసార
లీలలయందు : నే లేశమ్మైన
అవ్వారి ప్రేమలయం దుండ నొక్కొ !
అవతరింపక యుందునా వారివారి
ఆస్యము లందలి హాస్యము లట్లు ?

చారు సర్వాంగక తారుణ్య మట్లు ?
అల వసంతదినంబులం దుద్భవించు
ఆకస్మికమ్మైన యానంద మట్లు ?
మనసు కోణమున నూతనము నున్ముఖము
నైన ప్రేమాంకుర మట్టుల నేను ?
ఒక్కమారుగ నన్ను, నో మాతృభూమి,
వదలివేయుదు వొక్కొ ! వదలిపోవు నాకొ
యుగయుగాంతరములనుండి వర్తించు
అమ్మహామృద్బంధన మ్మమాంతమ్మ ?
వదలిపోదునె లక్షవర్షము లున్న
నిద్దంపు నీ యొడి ? తద్దయి నన్ను
బంధింపవా నాల్గువైపులనుండి—
జీవన పూర్ణమహాపదాన్యంబు
నగు నీ సమీరంబు, నట్టి జాగరణ
పూర్ణప్రకాశంబు, భూజముల్, లతలు,
ఈ పర్వతంబులు, నీ నదుల్, వనులు,
చిరకాల నీలిమాంబరమును, నింక
అఖిలజీవుల హృదయాంతర గ్రథిత
మైన జీవనసమూహంబును కలిసి ?
గిరికొని నిన్ను నే తిరుగుచునుందు .
నేను రాజిల్లెద నీవారి నడుమ ;
పశుపక్షి కీటక పాదపగుల్మ
వల్లుల రూపాన పలుమారు నన్ను
పిలుచుచు ప్రాణతాపిత మగు నీదు
హృదిలోపలికి గ్రహియింతువు నీవు.
చన్ను కుడువనిచ్చి జన్మజన్మమున
యుగయుగమందున నొగి జీవనంపు
లక్షల క్షుధలు తొలంగ చేయుదువు.
లక్షల కొలది ఆహ్లాదము లొసగు
స్తన్యరసామృతధార లన్నియును

గాఢవాత్సల్యంబు గదుర త్రావించి ।
తరువాత ధారుణీ తరుణసంతాన
మగు నేను జగతి మహాదేశమునకు
జ్యోతిష్కమండలినుండి దూరాతి
దూరమార్గమున వత్తును నిర్గమించి.
ఆశ పోలే దింక, నాననమందు
స్తన్యామృతపిపాస సక్తమై యున్న
దింకను : నీ యాస్య ఋంకను మేలు
కొలుపుచునున్నది కోమరైన కలలు
నాదు కన్నులలోన – నీది కించిత్తు
నయితము శేషము నలుపలే దింక.
అఖిలము గూఢ రహస్య పూర్ణంబు :
కనులు నిమేషమ్ములను మాని వెదకి
ఆ యబ్బురపుటంతు నరయగా లేదు.
నీ హృదయమ్ములో నే నిప్పు డుంటి
ఆనన మరయుచు నర్భకు నట్లు.
జననిరో నను తీసికొనుము గాఢముగ
బాహాయుగ్మమ్ముతో బంధించి నీవు.
నీ హృదయమ్మును నా హృదయముగ
ఏకము చేసి గ్రహింపుము నన్ను.
భవదీయ విస్తృత ప్రాణమునందు
కలుగును చిత్ర సుఖాపగ యెచట
ఆటకు కొంపొమ్ము నన్నా గోప్యపురికి
వలదు దూరముగ నన్ వదలగా వలదు !

11 నవంబర్ 1893 సోనార్ తరీ

## నిరుద్దేశయాత్ర

హే సుందరీ, చెప్పు మెంత దూరమ్ము
ఇంక కొంపోయెద ? వే యొద్దు పట్టు

నీదు బంగరు నౌక ? నేను విన్నదుగ
ఊరక నవ్వుచు నుందువు నీవు !
మధురహాసిని, నీదు మనసులో నేమి
యున్నదో తెలియలేకున్నాను నేను !
నిశ్శబ్దముగ వ్రేలు నీవు చూపింతు ;
వా యపారాంబుధి వ్యాకుల మయ్యె :
కడు దూరమున భాస్కరుడు పశ్చిమమున
మునుగుచున్నా డల్ల వినువీథి మూల.
ఏ మున్న దచట ? ఎవ్వారి నందు
అరయు నిమిత్త మీ వరుగుచున్నావు ?

అపరిచితా, చెప్పు మడుగుచున్నాను !
సంధ్యాతటమున వాసర చితి మందు
స్థలమున, తోయమ్ము తరిలానలమ్ము
తళు కట్లు మిరుమిట్లు కొలిపెడి చోట,
గళితమై యాకాశ మెల ఎడుచోట,
అల దిగ్వధువు జలజల బాష్పములను
కార్చుచున్నట్టుల కనబడు చోట,
అచ్చోట నీ యాలయము కల దొక్క——
ఊర్మిముఖరితమౌ యుదధిపారమున
అంబుద చుంబితమైన యస్తాద్రి
చరణతలంబున వరలుచున్నదియె ?
బదులు పల్కవు నీవు వదనము కనుచు
ఊరక నవ్వుచు నుందువు నీవు !

హుహుహుహుహు యనుచు వాయువు నిరంతరము
విరివి నిట్టూర్పులు విడుచుచునుండె.
ఆ జలోచ్ఛ్వాస మంధా వేగమునను
గర్జించుచుండెను. ఘన నీల నీర
మతి సంశయాస్పద మయ్యె. తీరమ్ము

కనబడ దేవైపు గాంచిన గాని.
దరి కానరాని రోదసము జగమును
ముంచి యూగించెడి పొలుపున నుండె.
దానిపై బంగరు తరణి తేలగిలి
పోవుచునుండె ; నా పోతము మీద
వ్యాపించుచుండె సంధ్యామయూఖములు.
దానిలో కూర్చుండి తగ నవ్వెదేల
నిశ్శబ్దముగ ? ఇట్టి నీ విలాసమ్ము
తెలియలే కున్నాను దేనికోసరమొ :

తోడుగా నెవరు వత్తు రటంచు నీవు
పిలిచిన యంతనే తిలకించినాడ
నీ నేత్రముల వంక నే నొక సారి
నవ్యప్రభాతమ్ము నను. నీవు చేయి
సాచి పశ్చిమదిశ జలములపైన
ఆశ రీతిగ చంచలాలోక మదలి
సంచలించు నపార జలనిధి వైపు
చూపించితివి ; అటు చూచి నే నంత —
"అభినవజీవన మచ్చట కలదె ?
అచట నాశాస్వప్న మపరంజి ఫలము
వలె ఫలించునె ?" అని ప్రశ్నించినాడ
పదవపై నెక్కి. కేవలము నవ్వితివి
బదులు పల్కక నాదు వదనము చూచి.

పదపడి మేఘాలు పట్టె నొక పరి,
మార్తాండు డుదయించె మరియొకమారు,
ఒక్క పర్యాయ మా యుదధి క్షోభించె,
శాంత చిత్ర మ్మొక్కసారి కన్పించె.
కడచి పోవుచునుండె కాలము ; గాలి
తెరచాప నిండ నే త్తెర పట్టుచుండె ;

చనుచుండె నే వైపొ జాలువా పడవ.
పశ్చిమదిశవంక పారజూడంగ
అర్కు డస్త్రాద్రిపై కరుగుచునుండె.
అప్పు డింకొక తూరి యడిగితి నిన్ను—
"దొరకునా స్నిగ్ధమౌ మరణ మచ్చోట ?
అమరు నొక్కొ శాంతి ? తిమిరతలమున
కలదె సుప్తి ?" యటంచు. కను లెత్తి నీవు
మారు మాటాడక మరల నవ్వితివి.

ఇంక చీకటి రాత్రి యెరకలు విప్పి
అరుగుదెంచును ; సువర్ణాలోక మెల్ల
మునిమాపు మింటను మూతలు పడును ;
మెరయును నీమేని పరిమళ మొకటె ;
జలకలరవ మెల్లెడల వినిపించు.
వాయు భరమ్మున వచ్చి పై బడును
నీ శిరోరుహములు నా శరీరమున.
వికలమనస్కుండ వికలగాత్రుండ
నగుచు నిన్ పిలిచి నే నడుగుదు నంత
ధైర్యము కోల్పోయి, "తాకుము నన్ను
దగ్గర కరుదెంచి. తరుణి ! ఎచ్చోట
నున్నావు నీ"వని. ఊరకుండెదవు
బదులు పల్కక నీవు. పడయగా జాల
అపుడు నీ నిశ్శబ్దహాసము కూడ ;

11 డిసెంబర్ 1893 సోనార్ తరీ

## ఈమారు నన్ను మరలి రానిమ్ము

జగతిలో ప్రతినిమేషము జనులెల్ల
నిరతులైయుందు రనేకకార్యముల ;

నీవు మాత్రము పారిపోవు బాలకుని
పగిది నున్నా వెటి బాధలు లేక
మధ్యాహ్నవేళను మరుభూమి నడుమ
వనటతో నేకాకివై తరుచ్ఛాయ.
దవ్వుననుండి కాంతారగంధంబు
తాలిచి క్లాంతమై తగ మందగతివి
తప్తవాతము వీచు తరి నీవు మురళి
వాయించుచుంటివి పగలంతవటు
ఇంక లెమ్మోయి. నేడెచటనో యగ్ని
ముట్టుకొన్నది. శంఖములు మ్రోయుచుండె
ఎవరినో జనులను హెచ్చరికింప
ఎటనుండియో ధ్వనియించుచునుండె
అంతరిక్షమ్మున నాక్రందనమ్ము.
చిక్కని చీకటి చెంసాలయందు
శిథిలమై బంధనవ్యధతో ననాథ
ఎవతెయో సాయము నిచ్ఛించుచుండె,
ఏ స్ఫీతకాయుని హేళన మొక్క
దుర్బలు రొమ్ము నెత్తురుధార లింక
వేల ముఖంబుల గ్రోలుచునుండె.
స్వార్థసంజనితావిచారము చూడ
నవ్వుచున్నది వేదనాపీడితు గని.
సంకుచితుండును సాధ్వసాన్వితుడు
నగు క్రీతదాసు డొయ్యన నెవ్వడొక్క
చాటుగా నున్నాడు ఛద్మవేషమున ;
నతశిరస్కుండయి యతడు నిల్చిండె
మౌనము తాలిచి , మ్లానముఖమున
శతశతాబ్దమ్ముల వెతల కారుణ్య
వృత్తమంతయు విరివిగ వ్రాసియుండె.
భారమెంతగ తన్ను బాధించుచున్న
మూపున దాలిచి మోయుచున్నాడు

ప్రాణములున్నంత వరకు నెమ్మదిగ.
తరువాత దానిని తరతరముగను
తన సంతతి కొసంగి తా చనుచుండె.
దేవుని స్మరియించి తిట్ట డెన్నడును ;
దూషింప డెన్నడు తోడిమానవుల ;
అభిమానము నెరుంగ డన్నము మాత్ర
రెండుముద్దలు చప్పరించి యెట్లెట్లొ
కష్టాలతో కడు క్లిష్టములైన
ప్రాణాలు తా నిలువగ పెట్టుకొనును.
ఆ యన్నమును నెవడైన లాగికొన
వాని మర్మాహతుగా నొనరించు
గర్వాంధుడై క్రూరకార్యము సలిపి.
ఎరుగడు న్యాయమ్ము నెవరి ద్వారమున
నిలుచుండి యాచింపవలయునో యతడు.
దీనుల దేవుని మానసమందు
స్మరియించి నిట్టూర్చి మరణించు నతడు,
మూఢము మ్లానము మూకమునైన
ఇందరి ముఖమున నీవలె భాష.
భగ్నమై శుష్కమై బడలిన వీరి
హృదయాన కోరిక వెలిగించవలయు ;
ఒక్క ముహూర్తమం దొకచోట తలలు
పైకెత్తి నిలువుడు పరికింతు నేను
ఎవరి భయమ్ముతో నింత భయస్థు
లైతిరో యట్టి యన్యాయవర్తనుడు
మీకంటె భీరువు ; మీరెప్పు డేలు
కొనెదరో పారిపోవును నత డపుడు ;
ఎపుడు మీరలు వాని యెదుట నిల్చెదరొ
అప్పు డకుక్కన జంకి యతడు మీతోడ
కలిసిపోవును వీథిగల కుక్కలీల ;
దైవము విముఖ మాతనికి, నెవ్వార

లతనికి లేరు సాయము చేయువారు ;
నోటితో డంబముల్ నుడువుచునుండు,
తన దైన్యము తెలిసికొనును లోలోన.

అప్పుడు లేచిరమ్మా, కవివర్య !
నీలోన ప్రాణము నిలిచియేయున్న
వేగిర మద్దానివెంట తీసి కొని
దానము చేయుము దానిని నేడు
బహుమనోవ్యథయును బహుళదుఃఖమ్ము —
సమ్మిశ్రమ్మగు కష్టసంసారమందు —
అధిక దారిద్ర్యమ్ము, నంధకారమ్ము,
బద్ధము శూన్యము, బహుళతుచ్ఛమ్ము.
ప్రాణముకావలె నన్నము వలయు,
వెలుతురు కావలె, స్వేచ్ఛానిలమ్ము,
కావలె స్వాస్థ్యము, కావలె బలము,
ఆనందదీప్తాధికాయువు వలయు;
విస్తృతసాహస పీనపక్షమ్ము
కావలె; కవివర్య, కైకొని పొమ్ము
స్వర్గమునుండి విశ్వాస చిత్రమ్ము
ఇట్టి దైన్యములోని కీ వొక్కమారు !

ఈమారు మరలి రానిమ్ము న న్నింక !
కౌతూహలమయి, ఓ కల్పనా, నన్ను
కొని పొమ్ము సంసారకూలమునకును !
ప్రతిసమీరమునందు, ప్రతి తరంగమున,
ఉయ్యాలలో వలె నూగకు మింక :
మరువకు మోహినీమాయను నీవు.
విజనంబును విషాదవిస్తృతము నగు
హృదయకుంజచ్ఛాయ నింక కూర్చుండి
యుండకు; పగ లంతయును దాటి పోయె,

సరగ కావచ్చినది సాయంతనంబు.
ఇరులు క్రమ్ముచునుండె నెల్ల దిక్కులను.
సాంత్వనహీనము, సంబంధరహిత
మైన వాయువులోన తా నిశ్వసించి
విలపించుచున్నది విపినము చూడ.
అప్పటినుండి నే నరుదెంచినాడ
బయటి. కనావృతాంబరము క్రిందికివి—
ధూళి నిండిన రాచత్రోవయందున్న
జనసమూహము మధ్యమునకు వచ్చితిని-
ఎట కేగెదవు. పాంథ, యెచటి కేగెదవు ?
నేను పరిచితుడ కాను. నా వైపు
తిరిగి చూడుము. పేరు తెలుపుము నాకు,
వలదు నాయెడ నవిశ్వాసము వలదు.
సృష్టి మధ్యమ్మున సృష్టికి విడిగ
నే చాల కాలము నివసించినాడ
మిత్రహీనుండనై రాత్రిందివములు.
అందుచేత నపూర్వ మైన నావేష,
మాచారమును నగు నతినూతనమ్ము :
నయనములందు స్వప్నావేశ మున్న
దందులకే. వక్షమం దందు కొరకె
ప్రజ్వలించుచునుండె ప్రబలక్షుధాగ్ని.
ఈప్రపంచములోని కే వచ్చినపుడు
ఎవ్వరో యొక తల్లి యిచ్చిన దొక్క-
మురళి మాత్రము నాకు మ్రోగించుకొనగ.
దీర్ఘ దినమ్ములు దీర్ఘ రాత్రులును
వాయించుచును దాని స్వరమున నేను
మురియుచు నొంటిగా పోయితి వెడలి
చాల దూరము, దాటి సంసారసీమ.
ఈ వంశితోడ నేనే స్వరమ్ములను
నేర్చికొంటినొ వాని నెమ్మితో నేను

శోకపూర్ణము, గీతిశూన్యము నైన
స్వరములు పలికింప జాలితినేని.
మృత్యువును జయించు మేటి కోరికల
గానముతో నట్టి కర్మహీన మగు
జీవనమం దొక్క తావును నేను
పొంగ చేసితి నేని, మూర్తమె యైన
బాధితునకు నది భాష నీయంగ
గలదేని, హృదిలోని గంభీరతృష్ణ
స్వర్గామృతమునకై సరగ మేల్కొనును ;
నా గాన మపుడు ధన్యంబు కాగలదు :
వందలకొలంది ఆనందహీనములు
నా మహాగానమ్ముతో ముక్తి నొందు.

ఏమేమి వినిపింతు, వేమి పాడెదవు ?
తన సుఖమును మిథ్య, తన వంత మిథ్య
అని వచింపుము స్వార్థమున మున్గియున్న
మనుజుడీ విస్మృతమహి నెద నెవడు
విముఖుడై యుండు, జీవించి యుండుటకు
అతడెన్నండును నభ్యసింపండు.
ఈ విస్తృతావనీ జీవనవీచి
కలయందు నృత్యము సలుపుచు నెపుడు
ధ్రువతారగా నిల్చి యెదుట సత్యమును
పరుగిడవలయు నిర్భయముగ నీవు ;
ఎపుడు శంకింపకు మీవు మృత్యువును.
తలమీద దుర్దినమ్ముల యశ్రువారి
ధారాప్రవాహంబు దశముగ పడును.
అద్దాని నడుమనె యద్దాని కడకు
అభిసరించుటకోస మరుగంగవలయు
రక్తి జీవనపు సర్వస్వము జన్మ
జన్మములందు నొసంగినవారు.

ఎవరు వారు ? తెలియ దెవ్వరో వారు.
గురుతుపట్టగలేదు సరిగ వారలను–
ఎరుగుదు కేవల మింత మాత్రమ్ము :
ఒక యుగముననుండి ఒక యుగమునకు
వారికై నైశాంధకారములోన
ఝంఝూనిలములోన జడివానలోన
అశనిపాతములోన నరుగుచున్నాడు
హృదయప్రదీపమ్ము వెలిగించి పట్టు
కొని హెచ్చరికతోడ మనుజయాత్రికుడు.
ఈ మాత్ర మెరుగుదు నిదియును నేను—
అతని యాహ్వానగీతము విన్న
యాతండు నిర్భయప్రాణముతోడ
పరుగిడు సంకటావర్తమున బడ,
త్యజియించు నాతండు తన సమస్తమ్ము,
ఎద చాచి యతడు గ్రహించు యాతనను,
గానమువలె మృత్యుగర్జను వినును :
అతని దహించిన దగ్నిహోత్రమ్ము,
ఆవిద్ధ మొనరించె నతని శూలమ్ము,
ఖండించె నాతని గండ్రగొడ్డలియు,
తన ప్రియవస్తుజాతము సమస్తమ్ము
ఏ విచారము లేక యింధనములుగ
చేసి జ్వలింపగాజేసె హోమాగ్ని
నాతడు జన్మంత మువ్వారికొరకు.
హృత్పిండమును విదారించి యాతండు
భక్తిభరమ్మున రక్తపద్మార్ఘ్య
బహుళోపహార మర్పణ మొనరించి
అవసానమున వారి నర్పించె తనదు
ప్రాణముల్ మృతిలో సఫలము చేసికొని.
వినియుంటి – వారికై చినిగిన బొంత
గ్రహియించినాడు తా రాజపుత్రుండు,

అధ్వమందలి భిక్షువైనా డతండు
విషయ సౌఖ్యములపై విరతి జనించి,
క్షణముక్షణమ్ము సంసారములోని
క్షుద్రబాధలను హెచ్చుగ సైచినాడు
తా మహాప్రాణుడై, దర్భాంకురములు
అనుదినమ్మును గ్రుచ్చుకొనియె పాదముల,
అతనిపై చూపి రసనమ్మకమ్ము
అల వివేకవిహీనులైన విజ్ఞులును,
అతిపరిచితమగు నవమతితోడ
అపహాస మొనరించి రా ప్రియజనులు
అవ్వాని నన్నింటి నతడు క్షమించి
కరుణనేత్రములతో నిరుపమాన మగు
సౌందర్యమూర్తిని డెందములోన
నిలిపి పోవుచునుండె నిశ్శబ్దముగను.
అతని పాదములయం దర్పించినారు
మానమ్ములను నభిమానశేఖరులు,
ధనము లర్పించిరి ధనికులు, వీరు
లాత్మల ప్రాణాల నర్పించినారు,
కవియును లక్షలక్షల గానములను
అతని గూర్చిరచించి యఖిలదేశముల
కడిది ప్రచారము కావించినాడు.
ఇదియును నెరుగుదు నింతమాత్రమ్ము.—
వారిధియందున వాయువునందు
అతని మహత్తరమైన గంభీర
మంగళధ్వనియు వినంగనౌ నెపుడు.
అతని వస్త్రపుటంచు నావరించుకొని
తిరుగుచునుండు నుప్పురవీథి యెపుడు.
విశ్వవిజయినియు విశ్వపూర్ణయును
నగు నట్టి యతని దివ్యప్రేమమూర్తి
ప్రియజనముఖముల వికసించుచుండు

పరమక్షణమ్ముల. ఎరుగుదు నిదియు—
విశ్వప్రియమ్మైన ప్రేమకు నతడు
తుచ్ఛత బలియిచ్చి దూరముగాను
వదలగావలయు జీవనమున గల్గు
సర్వావమతులను సమ్ముఖమందు—
ఏ మస్తకంబున నెన్నడు భయము
వ్రాసియే యుండదో, దాసత్వధూళి
ఏ శిరమందు చిహ్నితమై కళంక
తిలకము పోలిక వెలయదో యట్టి
యున్నతశిరమెత్తి యుండగా వలయు.
హృదయములోన నాప్రేమను నిల్పి
ఒంటిగా జీవనకంటకాకీర్ణ
మార్గము వెంబడి మాటాడకుండ
అరుగంగవలయు ధైర్యమ్ము వహించి.
నిర్జనస్థలమున నేత్రాశ్రువులను
తడిపోవ నొత్తుక దైనికకార్య
ములయందు ప్రతిదిన మలసతలేక
ప్రజలెల్ల సుఖపడ వర్తింపవలయు.
అటుపైన దీర్ఘమార్గాంతమునందు
అచ్చట జీవయాత్రావసానమున
శ్రాంతపాదములతో రక్తముతోడ
తడిసిన వేషము తాలిచియుండి
శ్రాంతిహరమ్మగు శాంతికోసరము
బాధావిహీనమౌ భవనమునందు
అవతరింపగవలె నత డొకనాడు.
అంత ప్రసన్నమౌ నాస్యముతోడ
మందహాసముతోడ మహిమారమయు
భక్తకంఠంబున వరమాల్య మపుడు
తాను శృంగారించు – తత్కరాంబుజము
తాకుట సర్వబాధాగ్లాని తొలగు ;

అల యమంగళములు నష్టె శాంతించు.
చరణాల రక్తిమ సరి తొలగించి
ప్రక్షాళనముచేయు పాదతలములు
ఆజన్మరుద్ధబాష్పాంబులతోడ-
సమ్ముఖమ్మున చిరసంచితమైన
ఆశను ప్రకటించి యలమటతోడ
తా జీవనాక్షమతను నివేదించు.
ఆశించును ననంతమగుక్షమ; నంత
దూరీకరింపనౌ దుఃఖయామినిని ।
తృప్తిని గను నొక్క-ప్రేమతో జీవ
నములోని ప్రేమతృష్ణయు నఖిలమ్ము ।

6 మార్చి 1894 చిత్రా

## బ్రాహ్మణుడు

అంధకారవనచ్ఛాయ లలముకొన్న
ఆ సరస్వతి తీరమం దస్తమించె
సాంధ్యసూర్యుడు. ఋషితనూజాతులెల్ల
ఆహృతేంధనభారోత్తమాంగు లగుచు
మరలి నిస్తబ్ధ మగు నాశ్రమంబులోని
కరుగుదెంచిరి కాననాంతరమునుండి.
అంత నంభారవంబుల యదరుతోడ
శ్రాంత మగు హోమధేనువ్రజంబుమరలి
స్నిగ్ధశాంతేక్షణములతో చేరుకొనియె
ఆశ్రమములోని గోష్ఠగృహమ్ములకును.
స్నానసంధ్యలు ముగియించి ఛాత్రు లెల్ల
కూడి గురు గౌతముని చుట్టు కూరుచుండి
రా కుటీరాంగణమున హోమాగ్ని ప్రభల.

నిర్మలము ననంతమ్మునౌ నింగియందు
ధ్యానమగ్నమహాశాంతి తనరుచుండె.
స్తంభిత కుతూహలమ్ముతో తారకాళి
స్థిరత నిశ్శబ్దముగ నున్న శిష్యులట్లు
గుంపులుగ గుంపులుగ మింట కూడియుండె.
శాంతమగు నాశ్రమపదంబు సంచలింప
తాను వాక్రుచ్చె నిట్లు గౌతమమహర్షి :
"సావధానమనస్కులై ఛాత్రులార,
అవధరింపుడు బ్రహ్మవిద్యను వచింతు !"

ఆ కుటీరాంగణమున కా యవసరమున
కరపుటమ్ముల నిండ నర్ఘ్యము గ్రహించి
తరుణబాలకు డొకడల్ల నరుగుదెంచె.
వచ్చి యాతడు గురుపాదపద్మములకు
పుష్పపత్రఫలార్పణ పూర్వకముగ
ప్రణతు లొనరించి భక్తి భరమ్ముతోడ
అమృత సుస్నిగ్ధ సుస్వరం బలరుచుండ
కోయిలగళమ్ముతోడ వాకొనియె నిట్లు :
"బ్రహ్మవిద్యగ్రహింపంగ పరమకాంక్ష
నరుగుదెంచితి నిటకు, మహానుభావ !
అల కుశక్షేత్రము నివాస మగును నాకు,
నామధేయము నగు సత్యకాము డనగ."
ఆతని మాటలు బ్రహ్మర్షి యాలకించి
వదనమున మందహాసంబు కుదురుకొనగ
స్నేహముగ శాంతముగను భాషించె నిట్లు :
"కుశలం మగుగాక ! సౌమ్య, నీ గోత్ర మెద్ది ?
బ్రహ్మవిద్యను తెలియంగ బ్రాహ్మణునకు
నొక్కనికి మాత్ర మధికార మొదవు, వత్స !"
బాలకుం డంత ధీరత పలికె నిట్లు :
"ఎరుగను, మహాత్మ, నా గోత్ర మేదొ నేను !

అనుమతి యొసంగినను పోయి, జనని నడిగి,
ఉదయమున వత్తు" నని ఋషిపదములకును
సత్యకాముడు ప్రణతులు సలిపి వెడలె
ఘనతమోమయ విపినమార్గమ్ము వెంట.
స్వచ్ఛమై క్షీణమై కడుశాంత మగుచు
తగు సరస్వతి దాటి పదవ్రజమున,
స్వప్నమౌనము తాలిచి సైకతముల
దరిని గల పల్లె చెంగట తల్లి పర్ణ
శాలలో ప్రవేశించె నా బాలకుండు.

సంజదీపము వెలిగించి సద్మమందు
వాకిటను నిల్చి తనయుని రాకకొంకు
చూచు తల్లి జబాల తా సుతుని చూచి
అక్కునను చేర్చి, శిరము ముద్దాడి, యంత
కుశలమును మంగళంబును గూర్చి యడిగె.
"జనని నా జన్మవంశంబు, జనకు నామ
ధేయమును దెల్పు, మమ్మ! నే దీక్ష నొంద
గౌతమమునీంద్రుకడ కేగ నాత డనియె—
'బ్రహ్మవిద్యను తెలియంగ బ్రాహ్మణునకు
నొక్కనికి మాత్ర మధికారి మొదివు' నంచు:
కనుక నా గోత్ర మేదియో, జనని, చెపుమ!"
అనుచు నా సత్యకాముడు వినిచె నపుడు.
ఆత్మజుని మాటలకు తల్లి యవనతాస్య
యగుచు మృదుకంఠమున నిట్టు లనియె "వత్స!
సతము దారిద్ర్యవశత కష్టములు పడుచు
సలుపుచుంటిని బహుపరిచర్య నేను:
యౌవనంబున సంప్రాప్తమైతి వీవు:
జనన మందితి వంతట. సత్యకామ,
భర్తృహీన జబాల గర్భంబునందు:
ఏ నెరుంగను నీ గోత్ర మేదొ, తండ్రి!"

పరదినంబు తపోవన తరుశిఖాళి
పైన నూత్న ప్రసన్నప్రభాత మయ్యె.
శైశిరస్నిగ్ధ తరుణ తేజస్సు లనగ,
భక్తి బాష్పాంబు పరిధౌత భవ్యనవ్య
సుకృతరోచిస్సు లన నొప్పి, సుప్రభాత
మజ్జనులు, స్నిగ్ధరుచులు, సౌమ్యాత్మమూర్తు,
లార్ద్రశిఖులును, శౌచశోభాన్వితులును,
తాపసకుమారు, లుజ్వలతనులు కూడి
గురుని గౌతము చుట్టును గూరుచుండి
రచటి ముదిమఱ్ఱి నీడలయందు చేరి.
విహగకులకాకలీగాన లహరితోడ
భ్రమరఝంకారనాదగీతములతోడ
సలిలకలకలరవముతో కలసి మెలసి
మధురగంభీరమై చిత్రమై చెలంగు
తరుణకంఠవిమిశ్రనాదమ్ముతోడ
సామగీతులు చెలరేగె శాంతముగను

సత్యకాముడు తత్ప్రదేశమున కరిగి
మౌని పాదమ్ములకు మ్రొక్కి మౌనముగను
కరుణదృష్టి వెలార్చుచు సరస విలిచె
అపుడు దీవించి ఆచార్యు డడిగె "సౌమ్య,
ఏది, ప్రియదర్శనా గోత్రమేది ?" అనుచు.
అపుడు తల యెత్తి బాలకుం డనియె నిట్లు :
తెలియలే దేదొ, భగవన్, మదీయగోత్ర,
మమ్మ నడుగగ నామె యిట్లని వచించె
'సలుపుచుండగ బహుపరిచర్య నేను
ప్రాప్తమైతివి నాదు గర్భమున, నంత
జననమును గాంచితివి నీవు, సత్యకామ,
భర్తృహీన జబాల గర్భంబునందు ;

ఏ నెరుంగను నీ గోత్ర మే మొ, తండ్రి ।'

అతడు చెప్పిన కథ నెల్ల ఆలకించి
అబ్బురంబును కలవరం బతిశయింప,
ప్రచురమధుకోశమున లోష్టపాతమైన
కలగి తేటులు చెదరెడి కరణి తోప
గుసగుసలువోయె విద్యార్థి విసరమెల్ల.
నగిరి కొందరు ధిక్కార మగపడంగ
అరయు డీ సిగ్గులేని యనార్యు గర్వ
మనుచు కొందరు నిందించి రతని నపుడు.
ఆసనము వీడి నిల్చి మహర్షి యంత
కరయుగము సాచి బాలుని కౌగిలించి,
పలికె సాదరముగ నిట్లు. "వత్స । నీవు
సత్యకులజాతుడవు, ద్విజసత్తముడవు,
కాని యబ్రాహ్మణుండవు కావు, తాత ।"

18 ఫిబ్రవరి, 1895 చిత్రా

## పురాతన భృత్యుడు

ఆకార మెంత దయ్యమువోలె నుండు
అంత భయంకర మగు బుద్ధిహీను,
దే వస్తువైన పోయిన యప్డు గృహిణి
గర్జించు 'కిష్టాయిగాడె' దొంగయని;
కూర్చుండ నిలుచుండ కూకలతోడ
తండ్రి పేరును బెట్టి లగ తిట్టుచుండు.
వినుచుండినను చెవి బెట్టడు వాడు,
దెబ్బలు తిన్నంత తినడు జీతంబు;
అయినను బుద్ధి రా దణుమాత్ర మేని,
అవసర ముండి నే ప్రాణపణముగ
'కిష్టాయి' అని పెద్ద కేకలు పెట్టి

పిలిచెద, నైనను తెలియదు వాని
జాడ యెంతటి యవసరమున్న గాని,
దేశమెల్లెడ చూచి తిరిగి వచ్చినను.
ఒక వస్తువె మిగిలి యుండు మూ డిడిన,
ఎక్కడ నుందునో తక్కిన రెండు.
ఒక్క వస్తువు నీయ నొక నిముసమున
కొని వచ్చు తా మూడు తునుకలు చేసి.
ఎక్కడ నుండిన తక్కక నిద్ర
పోవును రెండు జాముల వేళ పగలు.
తీవ్రముగా నెంతొ తిట్టుదు వాని-
"కటికి దౌర్భాగ్యుడా, గాడిదా, నీచ"
అనుచు - ద్వారము కడ కరిగి నిల్చుండి
వాడు నవ్వుచునుండు ; వాని చూడగనె
ఒడలు మండును ; కాని విడనాడు టెంతొ
కష్టము వానిపైగల గాఢ మమత :
ఎంతో పురాతన భృత్యుడు వాడు !

ఉగ్రమూర్తి ధరించియుండి యిల్లాలు :
"ఇక సహింపగ జాల, నిల్లు వాకిలియు
మీది, 'కిష్టాయిని' మీరు పెట్టుకొని
ఊరేగు డిక, చెవి యొగ్గడు వాడు
ఏమి నే జెప్పిన ; నెటకు పోయినవొ
ఆహారవస్తువు లాసనములును
వస్త్రాలు పాత్రలు వరుస నన్నియును.
జలము విధాన కేవలము రూప్యములు
నష్టమైపోవుచున్నవి వానివల్ల.
బాజారు కరిగిన పగ లెల్ల వెదకి
కనుగొన వానిని కష్టమే యగును.
దొరకదా వేరు నౌకరు ప్రయత్నింప
కష్టుడౌ ఈ దొంగ 'కిష్టాయి' కన్న !"

అనుచు కోపించు నే నా మాటలు విని
అమితకోపమ్ముతో నతి వేగముగను
పరుగిడి చని జుట్టు పట్టుక వాని
యీడ్చుకొనుచు వచ్చి, "ఇంక నీనాడె,
నీచుడా పో పోర నిన్ను వదలితిని,
బయటికి పో !" అని పలుకుదు; నంత
"వాడు పోవును మెల్ల పీడ తొలంగె
ననుకొందు మరుదినమున లేచి చూడ
హుక్కాను పట్టుకొని ప్రక్క నిల్చుండు—
వాజమ్మ 'కిష్టాయి' ఎరిమమూర్ఖుండు,
ఎట్టి దుఃఖము నొందఁ డెపుడు ప్రసన్న
వదను డత్యంత నిర్భయమానసుండు ;
ఇంకను వాని నేనేమి చేయుదును,
ఎంతో పురాతన భృత్యుడు వాడు !

భాగ్యవశమున నా వత్సర మేను
బారి దలారి వ్యాపారము చేసి
కొలదిగా పైకము కూడ బెట్టితిని
తమిని శ్రీ బృందావనమునకు బోవ
తలచితి, నిల్లాలు తాను నా వెంట
వచ్చెద నని చెప్ప వచియించినాఁడ
'పతి పుణ్యమే సుమీ సతిపుణ్య' మనుచు,
'అది కాక ఎక్కువ వ్యయ మగు' ననుచు,
తాళ్ళతో మూటలు తగ బిగియించి
కంకణమ్ములు మ్రోయగా పెట్టె సర్ది
అన్నది యిల్లాలు కన్నీళ్ళతోడ
"పరదేశమునకు మీ రరుగుచు వెంట
'కిష్టాయి' గొనిపోవ కష్టాలు కలుగు"
అని యన, "రామ రామా వాని గొనను,
వల దని వారింప తొలగిపోవు" నని

పలికితి. పొగబండి పరువెత్తసాగె.
పరికించితిని దిగి వర్ధమానమున,
కృష్ణకాంతుడు 'వరప్ కిష్టాయి' యకట
చక్కసిద్ధముచేసి హుక్కాపొగాకు
ప్రచుర ప్రశాంతభావమున నందిచ్చె.
ఇది వాని స్పర్ధ ! నే నేరీతి నింక
ఎన్ని నిత్యమ్ము సహింపగలాడ ?
ఎంత దూషించిన సంతసమగును
ఆ పురాతన భృత్యు నరసిన యపుడు.

శ్రీధామమును నేను చేరినయంత
ఎదుటను, కుడిప్రక్క, నెడమవైపునను,
వెనుకను నను పట్టుకొనిరి పండాలు.
నిముసాన నాదు ప్రాణములను కంఠ
గతము చేసిరి వారు. కడకు నా రేడు
గురు మనుష్యులతోడ పరమా ప్తభావ
మొప్ప నొక్కెడ కూడియుండగా వసతి
నేర్పాటు చేసితి. హృది ననుకొంటి
కడచును విశ్రాంతిగా దినమ్ము లని.
వ్రజబాల యెచటనో, వనమాల యెటనొ,
వనమాలి హరియు నేవైపున గలడొ,
చిరవసంత మ్మెట వరలునొ, యకట
చావనుంటిని నే వసంతరోగమున.
స్వప్నమట్టుల నున్న బంధువులెల్ల
భయమున పోయిరి వసతిని వీడి.
ఒంటిగా నింటిలో నుంటిని నేను.
వ్యాధితీవ్రాళుగ వ్యాప్తము లయ్యె
సకలాంగకంబులు. సకరుణముగను
క్షీణస్వరమ్ముతో, "కిష్టాయి, రార !
ఇన్ని దినమ్ములు చన్న తర్వాత

ఈ విదేశమ్మున కేతెంచి యిపుడు
నిలుపుకొనగజాల నేను ప్రాణాలు
అవి తోచుచున్నది, నను చేర రార !"
అనుచు పిల్చితి వాని దినము రాత్రియును.
వాని ముఖము చూడ వాడె నా పరమ
ధనమని హృదయంబు ఘనముగా పొంగె.
వదలక నింటిలో పగలు రాత్రియును
నిలబడియే యుండె తలగడవైపు
ఎంతో పురాతన భృత్యుడు వాడు.

కుశలము నడుగును, గొంతులో నీళ్లు
పోయును, శిరముపై వేయును చేయి,
నిశ్శబ్దముగ నట్లె నిలిచియే యుండు;
నిదుర లే దవ్వాని నేత్రములందు,
అవ్వాని నోటికి నన్నము లేదు,
పలుమారు, "మీ కేమి భయము లేదండి,
దేశమునకు మీరు తిరిగి పోయెదరు,
మా యమ్మగారిని మరల చూచెదరు,
విను డయ్యగా"రని యనుచుండువాడు.
నిమ్మళించెను వ్యాధి, నేను లేచితిని
పట్టుకొన్నది యింక వానిని జ్వరము.
వేగుచు నా కాలరోగభారమ్ము
తాను వహించెను తన శరీరమున.
పడియుండె స్మృతి లేక వాడు రెన్నాళ్లు,
బద్ధమైనది నాడి – వాని నే నెన్ని
తూరులో పొమ్మని తొలగించినాడ,
నేడు తొలగిపోయె వాడే తనంత.
బహుదినముల తరువాతను నేను
తీర్థయాత్ర ముగించి తిరిగివచ్చితిని
నా నివాసమున కా నా దొంటరిగను.

నా చిరమిత్రుడు నా వెంట లేడు—
ఎంతో పురాతన భృత్యుడు వాడు !

23 ఫిబ్రవరి 1895 చిత్రా

## ఊర్వశి

సుందరీ, ఊర్వసీ, నందనోద్యాన
సంవాసినీ, నీవు జననివా కావు,
కన్యకవును కావు, కావు కోడలివి !
స్వర్ణవస్త్రము తాల్చి శ్రాంత శరీర
సంధ్య యవతరింప సరగ గోష్ఠమున
సాంధ్యదీపమ్ము నే సదనమునందు
వెలిగించ లే దీవు. వేపితమైన
హృదితోడ, వంగిన దృష్టులతోడ,
ద్వివిధజడత్వమందిన చరణముల
తో, మందహాసముతోడ, నిషేక
శయ్యకు సిగ్గుతో చనియుండలేదు
నిష్పందమగు నర్ధనిశ యెన్నడేని.
ఆ యుష స్సుదయించినట్టుల నీవు
అనవగుంఠితవును నత్యకుంఠితవు.

వృంతహీనమ్మగు విరియు తనంత
విచ్చిన ట్లెప్పుడు వికసించితీవు !
ఆది వసంతర్తువం దుదయమున
సాగరమ్ము మథింప జనియించినావు
దక్షహస్తమున సుధాపాత్ర పట్టి
వామపాణిని విషభాండము పట్టి.
వంచి కోట్లకొలంది పడగల గముల

మంత్రశాంత భుజంగమమ్ము చందాన
ఉచ్ఛ్వసితమ్ములౌ యూర్ములతోడ
ఆ మహార్ణవము నీ యడుగుల బడియె.
మల్లియ చందాన తెల్లని నగ్న
దివ్యతేజమ్ముతో దివిజాధినాథ
వందిత వీవు, ననిందిత వీవు!

అంతరహిత యౌవనా! ఎట్టి కాల
మందును కోరక మట్టుల నీవు
బాలికావయసులో వరలంగలేదు.
ఉదధితలంబున, ఊర్వశీ, నీవు
చిమ్మచీకటిలోన చేరి యొక్కతవు
మాణిక్యమౌక్తిక మాలలతోడ
శైశవక్రీడలు సలుపుచు నుంటి
వెవరి యింట వసించి యెప్పుడు నీవు?
రత్నదీపావళీరాజితమైన
అంతఃపురమ్ములో నకలంకహాస్య
వదనముతోడ ప్రవాళపర్యంక
మందున నెవ్వరి యంకమునందు
సాగరకల్లోల సంగీత మెలయ
నిదురించుచుంటివి నీ వింతవరకు?
నిద్ర మేల్కాని నంతనే విశ్వమందు
సంపూర్ణమగు వికాసముతోడ నీవు
యౌవనఘటితవై యలరితి వంత.

ఊర్వశీ, ఎన్నియో యుగములనుండి
విశ్వంబునకు నెల్ల ప్రేయసి వీవు!
మునిగణధ్యానంబు పోగొట్టి నీదు
పదములపై తపఃఫల మిచ్చుచుంటి
వో యపూర్వమనోజ్ఞ, ఊర్వశీ, నీవు!

తావకాపాంగఘాతమ్మున మూడు
జగములు యౌవన చంచలము లగు,
తావకమద్యగంధాంధమారుతము
దిశలందు వీచును. తిరిగి యేతెంచు
మధుమత్త భృంగంబు మాదిరి కవియు
ముగ్ధుడై యెంతయు లుబ్ధ చిత్తమున
స్వేచ్ఛగా గానము చేయుచు నెపుడు.
వ్యాకులాంచలముతో పాదమంజీర
శింజితములతోడ చెలువుగా చనెదు
శంపాలత విధాన చంచల వగుచు.

ఓ లోలహిల్లోల, ఊర్వశి ! నీవు
నిర్జర సభలోన నృత్యము నెపుడు
సలుపుదు ముదముతో పులకింప మేను,
సింధుమధ్యమ్మున ఛందోనుబద్ధ
నృత్యము నపు డొనరించు వీచికలు.
సస్యశీర్షమ్ముతో జగతివస్త్రమ్ము
గగ్గురుపాటుతో కంపించుచుండు.
తారలు నీ స్తనహారాళి నుండి
ఊడి రాలుచునుండు నుడువీధిమీద.
పురుషుని యెడదలో పరవశమందు
చటుకున చిత్తమ్ము – సలుపు నృత్యము
రుధిరధారయు, నట్టె తృటితమౌ నీదు
వదులు మేఖలయును, వస్త్రవిహీన !

త్రిదశాలయములోని ఉదయాచలమ్ము
నందు మూర్తివి గొన్న అయుష స్సీవు–
ఓ జగన్మోహినీ, ఊర్వశీ ! నీదు
తను తనిమమ్మును ధౌతమౌ సుమ్ము
జగతియందలి యశ్రుజలములచేత–

ఆ త్రిభువన హృదయాస్రముతోడ
అంకిత మయ్యె నీ యంఘ్రిరక్తిమము-
విశ్వాంతమండలి వికసితపద్మ
మున నతి లఘుభారములు నీదు పాద
పద్మము లింతు. వో స్వప్నసహచరి!
అఖిలమనఃస్వర్గమందున నీవు
పారహీనమ్మగు పరిహాసయుతవు!

నరసురలోకముల్ నలుదెసలందు
విను మదే నీ కయి విలపించుచుండె
ఓ నిష్ఠురా, ఒహో ఊర్వశీ, బధిర!
ఆ పురాతనమైన ఆదియుగమ్ము
మరల నీ జగమున కరుదెంచు నొక్కొ!
అంతులేని సముద్ర మందుండి మరల
తడి వెండ్రుకల తోడుతను జనియింతె?
ఆ నీదు తనువుతో కానిపించెదవె
ఆదిప్రభాతమ్మునందున మొదట?
అఖిలలోకముల నేత్రాఘాతముననె
వారిబిందువుల రూపమ్మున నీదు
నఖిలాంగకమ్ములు నపుడేడ్చు నొక్కొ!
అకస్మికమ్ముగా నా మహాంబుధియు
అలరి తరంగిత మగు నొక్కొ యపుడు
కడు నద్భుతంబగు గానముతోడ!

రావల, దూర్వశీ, రావద్దు మరల;
అస్తంగతుండయ్యె నా కీర్తి చంద్రు;
డస్తాద్రి వాసినీ! అందుచే నేడు
ధారుణిలో వసంతానంద జనిత
మైన యుచ్ఛ్వాసమునందున కలిసి
చిరవిరహజమయి పరగు నిట్టూర్పు

ఎవ్వరిదో ప్రవహింపగా దొడగె
దిశలెల్ల పూర్ణిమా నిశయందు పూ
హాసమ్ముతో నిండి నవ్వు దెచ్చోట
నుండియో మ్రోయుచు నుండె దూరంపు
స్మృతిని వ్యాకులితము చేయుచు మురళి.
జారుచున్నవి బాష్పధార లేకముగ.
అయినను ప్రాణాల యాక్రందనమున.
అప్రతిబంధనా, ఆశ మేల్కొనియె !

8 డిసెంబర్ 1895 చిత్రా

## స్వర్గమునుండి వీడ్కోలు

ఓ మహేంద్రా ! కంఠసీమను నాదు
మందారమాలిక మలినమై పోయె;
తేజోమయమ్మగు తిలకము గూడ
మోమున మలినమై పోయిన దారి.
పోయెను క్షీణించి పుణ్యబలంబు.
దేవీగణంబ, యోదేవగణంబ !
నేడు స్వర్గమునుండి వీడుకోల్ నాకు.
శతలక్షవర్షముల్ సంతోషముగను
చేసితి వాసమ్ము. శేషవిచ్ఛేద
కాలమునందు స్వర్గాక్షులలోన
కనిపించు నశ్రురేఖలు లేశమాత్ర
మనుచు నాశించితి. అరయుచు నుండె
హృదయహీనము శోకహీనము నైన
సుఖమందు స్వర్గమ్ము జోక్యములేక.
ఎన్నియో లక్షల యేడులనుండి
నిమిషములే లేవు నిర్జరాక్షులకు.

అశ్వత్థ శాఖాచయమ్ములనుండి
రాలగా జీర్ణ పత్రమ్ములు విటపి
కెంత బాధగనుండు నంతమాత్రమ్మ
వ్యథయైన కలుగదు స్వర్గమ్మునకును.
ఎప్పుడో శతశతగృహములనుండి
చ్యుతములై పడిపోవు జ్యోతిర్విహీన
నక్షత్రగణము చందాన నే నొక్క
మూర్తములో స్వర్గపురినుండి రాలి
జగములో తుదిలేని చావుపుట్టుకల
వాహినిలో నింక పడిపోవువాడ ;
కాని ఈ వేదన కారించుచున్న
విరహంపు ఛాయల గురుతు కాన్పించె.
స్వర్గచిరజ్యోతి వాడిపోగలదు ;
మృత్యులోకమువలె మృదుల శైశిరపు
బాష్పాంబువులతోడ వడి నిశ్వసించి
నందనవనియు నొనర్చె మర్మరము ;
తటములయందు మందాకినీనదియు
కరుణగీతమ్ములు కలకంఠ మెలయ
పాడుకొనుచు జాలువారుచునుండె ;
సంధ్యయు దివసావసానమునందు
అరుదెంచి నిర్జనమ్మగు మరుభూమి
కావలి దరినుండి యరిగె దిగంత
ములకు నుదాసీనముగను. నక్షత్ర
సభలోన వైరాగ్య సంగీతలహరి
ఝిల్లికామంత్రమ్మ చెలగ నిశ్శబ్ద
నిశయందు వినిపించె- నిర్జరపురిని
నాట్యమ్ము సల్పు మేనక కాలి కనక
మంజీరములలోన మధ్యమధ్యమున
తప్పెను తాళము. తపనీయ వీణ
ఊర్వశీ స్తనముల నూగుచునుండి

అకస్మికమ్ముగా నన్యమనమున
నున్నట్లు ఝంకార మొనరించె గట్టి
నొక్కులచే కడు నోర్వగా రాని
కరుణమూర్ఛనలతో. కనిపింపజేసె
అశ్రురహిత నిలింపాక్షులయందు
నిష్కారణముగ కన్నీటిరేఖలను.
ఏకాసనమ్మున హృదయేశు చెంత
ఇంద్రాణి కూర్చుండి ఇంద్రనేత్రముల
చటుకున నపుడు తృష్ణావారికొరకు
వెదకుచున్నట్టుల వీక్షింపనయ్యె
వసుమతీదీర్ఘనిశ్వాసమ్ము గూడ
నడుమ నడుమ భూమి కడనుండి వెడలి
చెలరేగి గాలితో చేరి యేతెంచె ;
నందనకాననమందలి కుసుమ
మంజరుల్ రాలి యమాంతము పడియె.

హాస్యముఖమ్ముతో నలరుమా, దివమ!
అమరులారా, చేయు డమృతపానమ్ము!
సౌఖ్యప్రదేశమ్ము స్వర్గము మీకు ;
పరదేశి నగుదు నే ; స్వర్గము కాదు
ఆ మర్త్య భూమియు ; నది మాతృభూమి.
ఆ కారణమ్మున నా మాతృభూమి
కన్నుల ప్రవహించు కన్నీటి జాలు
రెండు దినంబు లం దుండిన పిదప
ఎవరేని పీడిపోయిన రెండు గడెలు.
ఎట్టి క్షుద్రులనైన, నెట్టి దుర్బలుల
ఎట్టి యయోగ్యుల, నెట్టి పాపులను
అయినను నందర వ్యగ్రతతోడ
ఆలింగనము చేసి యామె కోరుకొను
తనదు కోమల వక్షమున హత్తుకొనగ.

ఆ తల్లి హృదయంబు నట్టె చల్లబడు
పాంసు లిప్తశరీర పరిరంభణమున.
స్వర్గమం దమృతమ్ము ప్రవహించుగాక :
ఆ మర్త్యలోకమం దానంత్య సుఖము
దుఃఖ మిశ్రితమయి తులకించుచుండు,
అనురాగధారయు నశ్రులతోడ
వసుధాతలంబున స్వర్గఖండముల
శ్యామలములుగను సలుపుచు నుండు.

ఓ యప్సరా, వాదకుండు సుగాకి
నీ నయనజ్యోతి యేనాడుకూడ
ప్రణయవేదనతోడ— స్వర్గమునుండి
ఆజ్ఞగైకొందును— ప్రార్థింప వీవు
ఎవరిని; దుఃఖింప వెవ్వరికొరకు
అవనిలో నాదు ప్రేయసి దీనతముని
సదనమునందున జన్మించియున్న,
ఆపగా తీరమ్మునం దొక్క-పల్లె
చేరువ నశ్వత్థ శిఖి నీడయందు
ప్రచ్ఛన్న కుటిలోన వసియించుచున్న.
ఆ బాల తన హృదియందు నాకొరకు
అమృత భాండమ్మును నమరిచియుంచు
సప్రయత్నమ్ముగా— శైశవమందు
తటిని తీరమున ప్రాతఃకాలమందు
శివుని మూర్తిని ప్రతిష్ఠించి ప్రార్థించు
నను గోరి సాయంతనమున దీపమ్ము
వెలిగించి వాహినీ జలములమీద
శంకిత కంపిత స్వాంతముతోడ
తేలాడ జేసి తా తిలకించుచుండి
ఏకాగ్రమనముతో నేకాకినిగను
ఘట్టముపై నిల్చి కావించుచుండు

తనదు సౌభాగ్యపు గణనమ్ము నెపుడు.
చందన చర్చిత చరణము లలర
ధరియించి రక్తపీతాంబర మంత
మా యింటి కొకనాడు మంచి మూర్తమున
ఉత్సవ నాగ స్వరోదిత గీతి
కాదులతో వచ్చు ; నంతట నామె
కళ్యాణ కింకణ కరముతో, సుదిన
మందును దుర్దిన మందును గూడ
సీమంత సీమను క్షేమదమైన
సిందూర బిందువు చెలగగా గేహ
లక్ష్మియౌ కష్టములను సుఖములను,
సంసార సింధు శీర్షమ్మున వెలుగు
పూర్ణిమా శశియగు బుధులార, నదుమ
స్వర్గము జ్ఞప్తికి వచ్చుచునుండు
చాల దూరము చన్న స్వప్నము లీల.
ఒకనాటి నిశివేళ నున్నట్టు లుండి
మెలకువ కలిగి నే తిలకింప నాదు
స్వచ్ఛమౌ శయ్యపై ప్రసరించియుండు
వెన్నెల ; ప్రక్కన ప్రేయసి నిదుర
పోవుచునుండు, పొరలుచునుండు
శిథిల హస్తములు, సిగ్గు ముడియును
విడివడియుండును ; ప్రేమ పూర్ణముగ
మెత్తని ముద్దిడ తత్తరమంది
కను విచ్చి చిక్కని కౌగిలితోడ
బంధించు నామె నా వక్షము నపుడు
తీవెలతో వలె ; తీసుకవచ్చి
దక్షిణానిలము లతాంత గంధమును,
దూరపు శాఖల దూరి మేలుకొని
గండుకోయిల యపు గానము సేయు.

ఓ దీనురాల, ఓహో యశ్రునయన,
మలిన, దుఃఖాతురా, మానవభూమి :
జననిరో, నేడు నా మనము నీ కొరకు
బహుదినమ్ముల తదుపరి విలపించె.
వీడ్కోలు చింతచే పెల్లుగా నెట్లు
ఎండిన కన్నుల నిండె నశ్రువులు ;
ఆ విధంబున లీన మయ్యె నెచ్చటనొ
అలస కల్పనవంటి యమరాలయమ్ము
నీడ బొమ్మగ; నిక నీ నీల నభము,
నీ ప్రకాశంబును, నీ పరిపూర్ణ
జననివాసమ్ములు, జలనిధి తీర
మందలి దీర్ఘమ్ములగు సైకతములు,
నీలాద్రి శిరమున నిర్మలమైన
హిమరేఖలును, పాదపముల మధ్యమున
కాంతారుణోదయ చయములు, శూన్య
నిమ్నగాపరతీర నికటమునందు
అవనత ముఖముతో నలరు సంధ్యయును
అద్దమ్ములోవలె నన్నియు గూడ
ప్రతిఫలించుచునుండె బాష్పకణముల.

అంతిమ విచ్ఛేదనావసరమున,
హృతపుత్ర, జనయిత్రి, ఏ శోకబాష్ప
ధారలు నీదు నేత్రమ్ములనుండి
జారి నీ మాతృ కుచంబుల మీద
అభిషేక మొనరించె నా బాష్పధార
ఇన్నాళ్ళ తరువాత నెండిపోయినది.
అయిన నే నెరుగుదు నంతరమందు :
నీ నివాసమునకు నే వచ్చినంత
మంగళ శంఖముల్ మానక మ్రోయు,
గ్రహియించు నను నీదు కరయుగ మంచు

భయ దుఃఖములతోడ ప్రియములతోడ
నక్తమౌ ప్రేమ సంసారములోన
స్నేహ సుచ్ఛాయలో నీ నివాసమున
నీ కుమారులలోన, నీ కుమారికల
నడుమ గ్రహింతువు నన్నును ప్రాత
పరిచిత గణముతో సరిసమానముగ—
ఆ మరు దివసంబునందుండి నీవు
కాచియుందువు మేలుకని యెప్డు నాదు
తలగడ కడ శంకితాంతరంగమున,
వణకుచునుండిన ప్రాణముతోడ
దేవతలను గూర్చి స్మిత నూర్ధ్వమున
కరుణ దృక్కులు నిల్పి కాంక్షించుచుండు—
'వెవరిని పొందితి నిప్పుడు, వాని
పోగొట్టు కొనక నెప్పుడు నుందు' ననుచు.

9 డిసెంబర్ 1895 చిత్రా

## జీవన దేవత

అంతరతమ, నాహృదయము
నందు ప్రవేశించినంత
తీరిపోయె నాకొక్క నీదు
తృష్ణ యెల్ల ? సుఖదుఃఖము
లెన్నో యెన్నో ధారలుగా
విచ్చితి పాత్రికలు నింపి ;
దారుణ బాధలు సహించి
దళితంబగు ద్రాక్షవోలె
నా వక్షము పిండినాను ;
నానావర్ణంబులతో
ఎన్నో పరిమళములతో

ఎన్నియొ రాగములతోడ
ఎన్నో గీతములతోడ
సంతరించినాను ప్రణయ
శయ్యను నీ కోసరమే.
ప్రతిదినమ్ము కరగించుచు
వాసనాసువర్ణమ్మును
నీదు క్షణిక ఖేలనకై
నిత్యనూతనంపు మూర్తి
నిర్మాణము చేయుచుందు.

ఎరుగను నన్ను వరించితి
వెట్టి యాశతోడ నీవు,
చేపట్టితి వేటికొ నను !
జీవననాథా ! మదీయ
వర్తనంబు నచ్చినదా ?
రాత్రివేళయందు గాని
ప్రభాతమ్మునందు గాని
నా నర్మమునందు గాని
నా కర్మమునందు గాని ?
ఒక్కడవే సింహపీఠి
నుపవిష్టుడవై వింటివ
వానకారునన్, శరత్తు
లోన, శిశిర ఋతువునందు
గానము మ్రోగినదో నా
మానసమ్మునం దెట్టుల ?
చేరిచి మానసకుసుమము
చెండులోని, కవల గ్రుచ్చి
దామములో తాల్చినావె
త్వదీయకంఠంబునందు ?
మనసా విహరించెదవో

మామకీన యౌవనవని ?

ఏమి కాంతు వో బంధూ,
హృదయములో కన్నులుంచి ?
క్షమియించితి వాక్కొ నాదు
జారుపాట్లు, లోపమ్ములు,
అపరాధము లెన్ని యెన్నొ ?
అర్చన చేయని దినముల,
ఆరాధనలేని రేల
ఎన్ని సారు లో నాథా,
ఏగుదెంచి మరలినావొ !
రాలి పడియె నర్చాకుసు
మాలు విజనవిపినమందు ;
ఈ వీణాతంత్రులు నీ
వే రాగమ్మునకై శ్రుతి
ఆ తంత్రులు సారె సారె
కవనతమ్ము లగుచున్నవి !
నీవు రచించిన రాగిణి
నే పాడంగలన కవీ !
నీ తోటను తడుపబోయి
నీటితోడ. నీడలోన
నిద్రించితి పండుకొనుచు ;
కావివచ్చితి నీ సందెను
కనులనిండ బాష్పవారి.

నా యది యేదైన ప్రాణ
నాథ, మిగిలెనే యియ్యెడ—
సౌందర్యము, పాట, బ్రదుకు
జాగరణము, నిద్రమంపు ?
భుజబంధము శిథిల మయ్యె,

పోయె మదిర చుంబనమున,
ఏమి తెల్లవారినదా
ఈ జీవిత కుంజమందు
అభిసారక్షప యిప్పుడు ?
అగు పక్షమునందు నేటి
ఆయోజన తొలగింపుము.
కాని రావలె నవరూపము,
కాని తేవలె నూత్నశోభ,
అమితపురాతన నగు నను
అభినవమ్ముగ చేసి మరల
స్వీకరింపవలయు ; నూత్న
జీవితసూత్రమ్ముతోడ
నవకల్యాణమ్మునందు
నను బంధింపంగవలయు !

11-2-1896 చిత్రా

## విభావరి - ప్రభాతము

ఎన్న మధు నిశీథమందు
వెన్నెలలో కుంజవనిని
యౌవన ఫేనిల మదిరను
నీ వదనమునం దానితి
ఆనందంబున; నావై
పవలోకించితివి పాత్ర
కరమున మెల్లగ గ్రహించి
గాఢ చుంబనమ్ము చేసి
బింబాధరమును మధురా
వేశమ్మున గ్రోలినావు

నిన్నటి వెన్నెల రేయిని;
నీ యవగుంఠనము ద్రోసి
కమల కోమలంబగు నీ
కరము లాగి హత్తుకొంటి
వక్షఃస్థలిమీద; పార
వశ్యమ్మున మూత వడియె
భవదీయాంబక యుగ్మము,
పలుకులేదు ముఖమువెంట—
పాశము సడలించి నీదు
కేశరాశి విరియబోసి,
నమితమైన నీ వదనము
నా గుండెకు హత్తుకొంటి
ప్రమద భరముతోడ; నాదు
ప్రణయ చేష్టితములు సఖీ,
హాస్య ముకుళితాస్యముతో
అన్నియు సహియించినావు.
నిన్నటి మధుయామినిలో
అభినవ సమ్మేళనంపు
హర్షములో వెన్నెలలో -

నేడు శాంత విభాతమున
నిర్జన తటినీ తటమున
నిర్మల పవమానములో
చనుచుంటివి మెలమెల్లన
స్నానానంతరము నీవు
స్వచ్ఛాంబరమును దాలిచి.
కుసుమమ్ముల నెన్నిటినో
కొసి, ఎడమచేత నున్న
పుష్పసముద్గకమునందు
పోసినావు; దూరముగా

మురళిలోన దేవళమున
మొరసినది ఉషోరాగిణి.
శాంతవిభాతమ్మునందు
జాహ్నవీ తీరమందు
స్వచ్ఛపవనమందు నేడు
దేవీ, సీమంతమూల
దేశమునఁ నూత్నారుణ
సిందూరపురేఖ యొకటి
చిత్రితమైయుండెను సుమీ.
తాల్చినావు వామబాహూ
తలమున తరుణేందురేఖ
వలెను శంఖవలయమ్మును -
ప్రభాతకాలమ్మునందు
ప్రత్యక్షము చేసినావు
ఏ మంగళమయమూర్తిని!
ఏమందును ప్రాణేశ్వరి?
ప్రేయసి రూపమ్ముతోడ
రేయి వచ్చియుంటివి కద.
నీ వీ ప్రభాతమందు
దేవీ వేషంబు నెపుడు
వేసి యుదయమొందినావు
హాసముతో సమ్ముఖమున!
నేను సంభ్రమమ్ముతోడ
నిలిచినాను దూరముగా
నిర్జన తటినీతటమున
వాల్చి మస్తకంబు శుభ్ర
వాత విభాతమ్మునందు.

12-2-1896 చిత్రా

అక్క

పశ్చిమ దేశమ్మునుండి
వచ్చిన శ్రమజీవి యొకడు
ఇటుకలు చేయంగ నదీ
తటమున మను ద్రవ్వుచుండె.
వచ్చుచు పోవుచు నుండెను
వాని కౌమారిత చిన్నది,
కొన్ని కొన్ని పళ్ళెరములు
గిన్నెలు బిందియలు తోమి
కడుగుటకై నూరుసార్లు
ఘట్టమునకు చక చక చక.
ఇత్తడి ఎలయమ్ముతోడ
ఇత్తడి పళ్ళెరముమీద
వాయించును గణగణ మని.
వ్యాపకమ్ము కలది పిల్ల.
బోడి శిరము కలుగువాడు
బురద పులుముకొన్నవాడు
దిస మొలతో నుండువాడు
పసి తమ్ముం డరుగుదెంచి
పెంపుడు పిట్ట విధమ్మున
వెనువెంటనె, ఎత్తు దిబ్బ
మీదను గూర్చుండును తన
సోదరి యానతి చొప్పున
ధైర్య స్థైర్యములతోడ.
తన శిరమున నీళ్ళబిందె
పళ్ళెరమ్ము నెడమ చంక,
బాలు కరము కుడిచేతను
ప్రతినిధియై తల్లి కార్య
భారమ్మున వంగె పిల్ల.

2-4-1896 చైతాలి

# దుస్సమయము

మందమందమంథరముగా సందె వాలుచునున్న,
ఇంగితంబున సర్వసంగీత మాగినను,
సంగి లేకున్నను విశాలాంబరమునందు,
కాయమున మెల్లగా క్లాంతి వంగుచునున్న,
శంక మౌనమ్ముగా జపము చేయుచునున్న,
అఖిలదిక్కులు కూడ నవగుంఠితములైన,
మన్మథవిహగమా మడువవే రెక్కలను !

వనములో మర్మరధ్వని కాదు సు మ్మిద్ది,
ఉరగఫూత్కారంబు కిరణి నుద్వేలమై
కదలి చేసెడి ఘోష ; కా దిద్ది కుందసుమ
రమణీయకుంజంబు, రత్నాకరంబులో
ఘోరకల్లోలోత్థగురుఫేనపుంజంబు.
ప్రసవపల్లవ పుంజభరితతీరం బెచట,
ఎచ్చోట నీ నీడ, మెచట నాశ్రయశాఖ !
మన్మథవిహగమా మణచవే రెక్కలను !

కడుదీర్ఘ మగు రాత్రి కలదు ముందెంతయో,
పవళించె నస్తాద్రిపై సుదూరమ్మనగ
అర్యముడు ; పీఠంబు నధివసించి జగత్తు
నిశ్వాసవాయువుల్ నిగ్రహించుచు యామ
గణన మేకాంతమ్ముగా జేయుచున్నయది ;
దరిలేని తిమిరసాగర మీదుచు దిగంత
మందు వక్రక్షీణచంద్రుండు కనబడును ;
మన్మథ విహగమా, మణచవే రెక్కలను !

కలిపి ప్రేఖలు తారకలు పైన గగనాన
ఇంగితం బొనరించి ఈక్షించు నీవంక.

నిమ్న భాగమునందు నీపైపె పరుగిడును
అస్థిరమ్మ గభీరమగు మృత్యు వీయెడను
ఉద్వేలమై సహస్రోర్మిజాలమ్మతో.
ప్రార్థనాస్వరముతో బహుదూర తీరాన
నిన్ను రమ్మని పిలుచుచున్నారు జాలిగా
మన్మాథవిహగమా, మణవవే రెక్కలను !

భయము స్నేహపు మోహబంధమ్మ వాంఛయుగా
లేవు ; మరి ఆశయో కేవలము ఛలమౌను.
లేదు భాషయు, లేదు రోదనము కూర్చుండి,
అయ్యొ గేహము పుష్పశయ్యారచన లేవు.
కలవు కేవల పక్షములు ; నిబిడతిమిరాంకి
తం బున్నయది విశాలాంబర మహాంగణము.
మన్మాథ విహగమా, మణవవే రెక్కలను !

27-4-1897 కల్పనా

## భ్రష్ట లగ్నము

అప్పుడె శయనీయము తలగడ కడ
దీప మారినది; తెలివి వచ్చినది
కల్య కోకిలా కలరావంబున.
అరుగుదెంచుచును అలసగమనమున
కూరుచుంటి నే సోరణగండ్లను.
విడిపోయిన జడముడిలో నూతన
దామమ్మను నే ధరించుచుండగ
అరుణ పరాగపు సరణిని గనబడె
అరదంబున నొక తరుణ యాత్రికుడు.
పసిడి కిరీటము పై బడుచున్నది
ఉషః ప్రకాశం, బొప్పుచున్నయది

తారహార మాతని కంఠంబున ;
వ్యగ్రతతో నా ద్వారము కడకే
వచ్చి. కాతరస్వరమున నాతడు
ఆమె యెచ్చటని యడిగె ద్వివారము.
నేనే అయమ నేనే అని నే
చెప్పలేనయితి సిగ్గున నక్కట !

అసుర సంధ్యవేళ యయ్యె
అయినను దీపమ్ము నేను
వెలిగింపనైలేదు; పసిడి
తిలకము ఫాలమ్మునందు
దిద్దుచుంటి; వాతాయన
మందు కనక ముకురంబును
హస్తంబున కీలించుచు
పరధ్యాన పరాయణను
బంధించుచునుంటి కబరి-
సంధ్యాధూసర పథమున
చనుదెంచెను తరుణ పథికు
డరదంబున. నపుడు దయా
భరితములౌ నయనమ్ముల-
స్వేదంబున నశ్వంబులు
స్విన్నంబులు వ్యాకులములు.
ఆ తరుణుని వస్త్రంబులు
ఆభరణంబులు పరాగ
భరితములై యున్న ; వతడు
ద్వారమ్మును జేరవచ్చి,
'ఆమె యెచట ఆమె యెచట'
అని కాతరముగ నడిగెను.
'ఆమె నేనె శ్రాంతపథిక'
అనలేనైతిని సిగ్గున

అణగారిన నే నప్పుడు.

ఫాల్గునయామిని, గృహమున
ప్రదీపములు వెలుగుచున్న,
వణగారం బొచ్చె దక్షి
ణానిలమ్ము వచ్చి నాదు
వక్షముపై ; నిద్రించెను
వదరుబోతు గోరువంక
స్వర్ణ పంజరంబునందు.
పండుకొన్నవారు ద్వార
పాలురు సమ్ముఖమందే.

ధూసరితము శయనగృహము
ధూపధూమ పటలితోడ,
అగురుగంధ విలిప్తంబు
లవయవమ్ము లాకులములు;
నీలకంఠ వర్ణ చిత్ర
నిచోళమ్ము తొడిగినాను;
వసనాంచలము బిగించితి
వక్షః స్థలమున దూర్వా
శ్యామల వరాంకితంబు ;
జనవిహీన రాజపథము
వంకను వీక్షించుచుంటి
వాతాయన నిమ్నభాగ
పరాగమున గూరుచుండి;
పాడుచుంటి నొంటరిగా
'ఆమె నేనె ఆమె నేనె
హతాశపాంథా' యటంచు.

20-5-1897 కల్పనా

# స్వప్నము

స్వప్నలోకమున చాల దూరమున
సిప్రాతీరస్థితోజ్జయినిపురి
వెదకబోయితిని వెనుకటి జన్మపు
నా [illegible]ప్రియ నొకనాటి కాలమున.
ముద్దు మొగంబున లొద్దుగ పుప్పొడి,
కరమున లీలాసరసీజంబును
శ్రవణమూలమున నవకుంచంబును,
కోమలశిరమున కురవక కుసుమము
తనుతరమగు తత్తనువున రక్తాం
బరమ్ము నీవీబద్ధం బయినది.
చరణనూపుర స్వరమ్ము కొలదిగ
ఎసంగుచున్నది, వసంతదినమున
తెరవు వెదకుచును తిరిగితి దూరము.

మహాకాళవిభు మందిరమ్ములో
అపుడు మ్రోగినవి ఆరతిఘంటలు
గంభీరముగా ఘనమంద్రముగా.
అప్పుడు జనశూన్యము పణ్యాధ్వము
ఆవలి కరుగగ నంధకారమున
హర్మ్యము మీదుగ నగపడె సంధ్యా
కాంతిరేఖ నా కన్నుంగవకును.

చాల కుటిలమును సంకీర్ణంబును
జనశూన్యంబును ఘనగహనంబును
అగు పథమున ప్రియురాలి మందిరము.
శంఖచక్రములు చారుద్వారము
నం దంకితములు; సుందరమ్ములగు
బాలనీపములు పదయుచు పత్ర

ప్రీతి నిరుదెసల పెరుగుచు నున్నవి.
తోరణసీమను స్థూలశ్వేత
స్తంభమ్ములపై దంభ భరమ్మున
కంఠీరమ్ముల గంభీరాకృతు
లుపవిష్టములై యున్నవి శిలపై.

క్రమ్మర ప్రేయసి కపోతసంఘము
ఆవాసంబున కరుగుదెంచినది.
నిద్దుర మునిగెను నీలకంఠములు
హాటకనివాస యష్టులమీదను.
దీపకరముతో ధీరధీరముగ
అంతలోననే అవతరించెనా
మాళవికయె; తన్మందిరతోరణ
ప్రాంతమునను సోపానమ్ములపై
సంధ్యాలక్ష్మీ సదృశముగా కర
తారక తోడను; తత్తను కుంకుమ
కేశధూప మృదు వాసనతోడను
కలియుచు నా యంగమ్ములమీదను
నెరపెను వ్యాకుల నిశ్శ్వాసమ్మును.
అర్ధచ్యుత వసనాంతర చందన
పత్రలేఖ తద్వామపయోధర
భాగముమీదను ప్రకాశించినది
అగడుపడంగా నగరకలకలము
శాంతంబగునా సంధ్యావేళను
ప్రతిమ విధంబున ప్రణయిని నిలిచెను.
కనుగొని ప్రియ నను కరదీపమ్మును
నిలుపుచు తోరణ నికట భాగమున
ధీరముగా నరుదెంచి యెదుటికిని
స్వీయకరము నాచేతియందు నిడి
సకరుణదృక్కుల శాంతముగా గని

"బాగున్నావా, బంధూ ?" అనియెను.
అవలోకించుచు నామె వదనమును
చేసితి యత్నము–చేసితి నేదో
కాని, సఫలతను గాంచనైతి. ఆ
భాషను మరచితి ; బహువారమ్ములు
మా నామమ్ములు స్మరించినారము
పరస్పరమ్మును, స్ఫురింప వాయెను.
ఏమనుకొంటిమొ యిరువుర మన్యో
న్యమ్ముగ ముఖముల నవలోకించుచు.
నిష్పందములౌ నేత్రయుగ్మముల
పడినవి జరజర బాష్ప బిందువులు.

ద్వార నికట తరుతలమున నిరువుర
మెన్నో తలచితి ; మెపుడు దాగినదొ
ఏ మిషతోడనొ ఆమె మృదుకరము
నా కుడిచేతను తేకువ లేదే
సంధ్యావేళను స్వకులాయమ్మును
విహగము చేరెడి విధము తోపగా !

నతవృంతమ్మగు నలినమ్మట్టులు
ఆమె యాననం బల్లన వాలెను
నాదువక్షమున ; నా నిశ్వాసము
ఉదాసమ్ముతో నుద్వేగముతో
వచ్చి యామె నిశ్వాసముతోడను
సక్తంబైనది శబ్దహీనముగ.

చీకటి రాతిరి చేయుచు లుప్తము
ఉజ్జయినీపురి నొనరిచె నేకా
కారము ; దీపము ద్వారపార్శ్వమున
ఆరిన దెపుడో అనిలవశంబున.

స్వ్రపాతటమున శివాలయంబున
ఆరాత్రికమే ఆగిపోయినది.

22-5-1897 కల్పనా

## మదనభస్మానంతరము

బూడిద చేసి యొనర్చిన దేమిటి
పుష్పశరుని, తపసీ!
విశ్వమయుని కావించితి, వాతని
వేదన దుస్సహమై
వదలుచు నున్నట్లున్నది యూర్పులు
వాయువులోపలను,
ఆకాశమ్మున పారుచునున్నవి
ఆతని యశ్రువులు,
నిండిపోయినది రతీవిలాపము
నిఖిల భవంబునను,
స్వయముగానె, విలపించుచు నున్నవి
సకల కకుప్పులును.
అవని ఫాల్గునమునందు క్షణములో
అదరి మూర్ఛపోయె,
ఎవ్వరి సంకేతమ్మువలననో
ఎరుకలేదు నాకు.

ఇప్పటికిని నే గ్రహింపనైతిని
హృదయవీణయందు
ఎవరి వేదనయొ ధ్వనించుచున్నది
ఎంతయు పులకితమై;
ఆకాశంబున భూతలంబుపై
నందరు సమకూడి,

ఆలోచనలో గ్రుక్కిపోవు నా
యతివ కేమి బోధ
చేయంగలమని మంతనంబులం
జేయుచున్నారు
వకులపల్లవ స్వనితంబులలో
వాక్కులు వెడలినవి
సలుపుచున్నవి యేదో భాషను
ఝంకృతి తుమ్మెదలు,
ఊర్ధ్వముఖమ్మున నుండి సూర్యముఖి
ఒక ప్రియు స్మరియించు
ఏరు ముందరికి పారుచున్నది
ఏ పిపాసతోనొ ।

కౌముదిలో పడి యెవ్వరి వస్త్రము
కానవచ్చుచుండె,
నేత్రము లెవరివొ కానవచ్చెనవి
నీలాకాశమున,
అవకుంఠితమై వదనం బెవరిదొ
అగపడు కిరణముల,
కనబడు నెవ్వరి పదములొ కోమల
ఘాసశయ్యమీద,
ప్రోత్సహించుచును మనఃప్రాణముల
నొక్కరి స్పర్శనము
అలమును లతవలె పుష్పపరీమళ
మిళితంబై యెదను.
మదనుని భస్మము చేసి యొనర్చిన
మహితకార్యమేది ।
అతనిని విశ్వవ్యాప్తుని జేసితి
వంతే, సన్యాసీ ।

25-5-1897 కల్యాణి

## దేవతాగ్రాసము

మైత్రమహాశయుడు తీర్థ
యాత్రకునై చను సాగర
సంగమమున కన్న వార్త
చల్లగ వ్యాపించిపోయె
పల్లెకు పల్లెకు ; వృద్ధులు
బాలురు, స్త్రీలును, పురుషులు
చేరిరి సహయాత్రికులుగ ;
సిద్ధముగా నుండె రెండు
పడవలు ఘట్టంబునందు ;
పలికె పుణ్యలోభాతుర
అరుగుదెంచి మోక్షద యిటు :
"అన్నగారు నేను గూడ
అరుగుదెంతు మీ వెంటను."
జవ్వనియగు నా వితంతు
జాలి గొలుపు నేత్రమ్ములు
సమ్మతింప వే యుక్తిని,
సలిపె నామె ప్రార్థనమ్ము.
అతికష్టము త్రోసివేయు
టా యనురోధ మెవరికిని
"మరి యెక్కడ చో"టనుచును
మైత్ర మహాశయుడు పలుక ;
విలాపంబు చేయుచు నా
వితంతు విటు లన్నది – "మీ
పాదంబులు పట్టుకొందు
ఏదో యొక మూల చోటు
చేసికొందు." ఆ బ్రాహ్మణు
చిత్తము ద్రవియించిపోయె ;
అయినను ద్వైవిధ్యంబున

అడిగనాడు – "పిల్లవాడు
చిన్నవాడు, వాని నేమి
చేయుదు"వని బ్రాహ్మణుండు.
ప్రతివచనం బిచ్చెనామె :
"రాఖాలున ? పిన్నతల్లి
యొద్ద నుండగలడు వాడు,
ఉద్భవమందిన యప్పుడు
సూతికా జ్వరంబుతోడ
క్షోభించితి బహుదినాలు .
ఆశలేదు బ్రదుకుమీద.
అప్పుడు మా అన్నద తన
బిడ్డతోడ స్తన్యమిచ్చి
పెంచి పెద్దవాని జేసె.
తల్లి రొమ్ము విడిచి వాడు
తదాదిగా పిన్నతల్లి
అనురాగమ్మునకు పాత్ర
మైనవాడు పొగరుబోతు –
ఎవరిని లక్ష్యము చేయడు –
ఏమైనను శిక్షించిన
పిన్నతల్లి దుఃఖముతో
పిల్లవాని నొడిలోనికి
తీసికొనును ; వాడచటనె
తిన్నగానె ఉండగలదు."

సమ్మతించె నతండు · సత్వరమ్ముగ నామె
సామగ్రులం గూర్చి సంసిద్ధురాలగుచు
పెద్దవారల కెల్ల ప్రీతితో ప్రణమిల్లి
తోడివారల నెల్ల దుఃఖాశ్రువుల నింపె
వీడ్కోలు సమయాన ; వెడలి ఘట్టమ్మునకు
మోక్షదా వీక్షింప, ముందుగా రాఖాలు

పరుగెత్తుకొని వచ్చి, పడవపై భాగమున
నోరెత్తకుండగా చేరి తా కూర్చుండె.
"నీ విచ్చటికి వచ్చినావేల ?" అన తల్లి,
"సాగరంబునకు నే జనువాడ"ననె వాడు.
"పోదువా సాగరంబునకు దొంగా నీవు ?
రాఘాలు, దిగిరమ్ము, రయమునన్ రారమ్ము"
అను తల్లి మాటలకు నా బాలకుడు చూచి
స్థిరదృష్టి ననియె సాగరమునకు బోదునని.
హస్తమ్ములం బట్టి ఆమె లాగిన కూడ
బాలకుడు నావనే పట్టుకొని యున్నాడు.
తుదకు విప్రుడు జాలితో, "ఉండు ముందుమీ !
రానిమ్ము మనతోడ వాని" నని పలుకగా,
"పద, సాగరంబులో పడవేసివత్తు నిను"
అని మహాకోపాన ననె మోక్షదాదేవి.
తన భాషణమ్ములే తగులగా తన చెవికి
ఆమె హృదయమ్మునం దగు తాపబాణమ్ము
నాటుకొని బాధించె ; నయనాలు తుడిచికొని
నారాయణా యన్న నామము ద్వివారమ్ము
పలికి యొడిలోనికిన్ బాలకుం దీసికొని
స్నేహమ్ముతో వాని దేహమ్ము నిమిరినది,
కల్యాణకరమైన కరముతో జనయిత్రి.
"అట్టి మాటలు బల్కు టనుచితం" బని మైత్రు
డామె సంబోధించి యనె మెల్ల చీకట్టి.

కొనిపోవుదు రాకుమారు ననియెడి
వార్త జనంబుల వలనను తెలియగ
అచటికి పరుగున "అన్నద" చని యా
బాలుని గనుగొని, 'బాబా యొచటికి
బయలుదేరు' దని ప్రశ్నముచేసెను.
సాగరమునకును చనుచున్నానే

మరలివత్తునని మందహాసమున
కుర్రడు పలుకగ వెర్రిదానివలె
అరచెను, "ఠాకూర్ అన్నయగారూ!
ఈ నా రాఖాల్ ఎంతో పోకిరి!
రాఖాల్ నెవ్వరు రక్షించెదరో!
పుట్టిన దాదిగ అట్టే కాలము
విడిచి లేదు నను వేరే యెచటను.
కుర్రని నెచటికి కొనిపోవుదురో
ఈవలె క్రమ్మర నీతని మీరే!"
"సాగరమ్మునకు జని, పిన్ని, నే
మరలివత్తు"నని మందస్మితమున
పలికెను బాలుడు: బ్రాహ్మణుడెంతో
స్నేహపూర్ణముగ చెప్పె నీ గతిని:
"అమ్మా, నే నున్నంత వరకు నీ
రాఖాలున కే రాయిడి యుండదు.
ఇది చలికాల మీ్మరోజులలో
ఉండవు నదులం దొడుదుడుకులు, మరి
యెందరొ యాత్రికు లిందున్నారలు.
మార్గములో నేమాత్ర మాపదయు
నుండదు: పట్టును రెండు మాసములు
అమ్మా, రాఖాల్ నప్పగించెదను."

దుర్గానామస్మరణము
తోడ శుభక్షణమునందు
బయలుదేరె నావ; లఘువు
బహుమహిళలు ఘట్టమందు
నిలిచియున్నవారు బాష్ప
నేత్రంబుల; చూర్ణీనది
తటమున గ్రామంబు మిగుల
తళతళలాడుచునుండెను

తత్ప్రభాత శిశిరములో.

తిరిగి వచ్చినది యాత్రికబృందము
తీర్థయాత్ర ముగియ
ఘట్టమునం దా యాత్రికనావను
కట్టివేసినారు ;
అపరాహ్ణంబున పోటు వచ్చు నను
నాళ సన్నగిల్లె.
బాలుని మానస మింటి పైపునకె
పరుగెత్తగ సాగె.
తహతహ లాడెను పిన్నతల్లి యు
త్సంగము కోసరము.
అతడు వికలుం డయ్యెను నీరం
బన్నియెడల గాంచి.
స్నిగ్ధము, కృష్ణము, మసృణకుటిలమును
నిష్ఠురమైనట్టి
క్రూరభుజంగము రీతి తరంగపు
కోటి పడగ లెత్తి,
ఫూత్కరించుచును కోరుచున్నయవి
భూశిశుగణములను,
అనవరతమ్మను లుబ్ధము దీర్ఘము
లగు ముఖాలతోడ
ఓహో మృత్తిక, ఓ స్నేహమయీ
ఓ మూకధరిత్రీ,
ఓ పురాతనా, ఓ సర్వంసహా,
ఓ సుస్థిరరూపా ।
ఓ ప్రమోద భవన స్వరూప :
ఓహో శ్యామల మృదుల ।
అహరహంబు నీ వాకర్షింతువె
అదృశ్యరూపమున

ఆహా యెచ్చటివారల నైనను
    బాహువులం జాపి ।
ఎంతటి ప్రబలాకర్షణమో నీ
    శాంత వక్షమునకు ।
దిగంత విస్తృతమో ముగ్ధా,
    భవదీయోరః సలము ।

అధీరంబు చంచలంబు
నగు కంఠముతో బాలుడు
సారె సారె కరుగుదెంచి
జలోచ్ఛ్వాసవిషయంబై
అడుగుచుండె తాకూరును.

ఆకస్మికముగ నప్పుడు
స్థిమితముగా నున్న నీట
తీవ్రాందోళనము రేగి
తీరంబులు రెండింటిని
మేలుకొలిపె నాశపుట్ట.
మృదులంబగు నార్తనాద
మున నాకర్షణము పడియె
మోటు మోకు మీద నపుడు ;
ప్రవేశించె నదిలోనికి
రత్నాకరు విజయరథము
కలరవంబుతో ; జనించె
జలోచ్ఛ్వాస మాక్షణమున-
దేవతా స్మరణముతో
నావికు లుత్తరముఖముగ
నావను శీఘ్రముగ విడిచి
నారు : మైత్రమహాశయుని
సమీపించి బాలకుండు,

"స్వగ్రామము చేరుటకై
యెన్నినాళ్లు పట్టు" ననుచు
విన్నపంబు చేసినాడు.

అస్తమించెనో లేదో
అర్యముండు. క్రోశద్వయ
మరిగె నావ ; వాయువేగ
మధికమయ్యె క్రమక్రమము.
రూపనారాయణంబు
నాపగా ముఖంబునందు
దృష్టిగోచరమ్ము లిసుక
దిబ్బలు. సఙ్కీర్ణం బగు
తరంగిణీ మార్గమందు
ద్వంద్వయుద్ధ మొదలె జలో
చ్ఛ్వాస భూరి వాహినికిని
ఉత్కట, ముచ్ఛృంఖలమగు
నుత్తర దిగ్వాతమునకు.
చేరుపవలయును-నావను
తీరంబున కని యాత్రిక
బృందము భయమున పెట్టెను
పెడబొబ్బలు : తీరమేది ?
నలువైపుల చెలరేగిన
జల మున్మత్తముగ రుద్ర
నృత్యంబున తాళమ్ములు
విజలక్ష కరమ్ములతో
వేయుచుండె ; నాకసమును
వెక్కిరించుచుండె ఫేన
మాక్రోశముతో ; సుదూర
మందు నొక్కవైపు తీర
భూమి నీలగహనరేఖ

పొదకట్టుచునుండె : అపర
దిక్కున లుబ్ధము క్షుబ్ధము
తీవ్రం బుద్ధత జిఘాంసు
వగు సలిలము పొంగుచుండె
అస్తమాన సూర్యువైపు.
లంగరు నే మాత్రమైన
లక్ష్యము చేయదు నీరము.
ఉత్త చంచలుండు మూఢు
డుద్రిక్తోన్మత్తువోలె
అతలకుతలమయ్యె నావ
ఆ సమయంబున భయహిమ
మతి శీతలవాతముతో
కలిసిపోయి స్త్రీపురుషుల
గడగడలాడింప జొచ్చె
కొందరు హతవాక్కులయిరి.
కొందరు రోదించుచుండి
రాత్మీయుల దలచుకొనుచు
అత్యుచ్చైస్స్వరముతోడ
మ్లానమైన వదనముతో
మైత్రమహాశయుడు కనులు
మూసి జపముచేయుచుండె;
ముఖముదాచి విజజననీ
వక్షములో రాఘవుడు
వడవడ వడకుచునుండెను.

అపుడు విపన్నులైనట్టి నావికులు
వచ్చి యెల్లరగూర్చి వచియించిరిట్లు
"ఒక్కరు మీలోన, ఓ బాబులార,
చేసినారెవ్వరో మోసకృత్యంబు :
చెల్లింపదలచియు చెల్లింపలేదు

ఏదియోదేవత; కీకారణమున
ఆ సమయంబున సలిలాందోళనమ్ము
చెలరేగె - ముడుపును చెల్లింపవలయు
ఇపుడైన - మీరలు కుపితదేవతను
శాంతింపజేయుడు, చాలునాటకము".
నీటిలో వేసిరి నిర్విచారముగ
తమకడ నేమున్న - ధనము వస్త్రములు.
అయిన తరంగము లాక్షణంబుననె
భయదంబుగా పొంగిపడె నావలోన.

నావికులన్నారు మరల :
"దేవదత్తమైనదేదొ
కొనిపోవుచు నున్నవారు
విను డీ పర్యాయమైన !"
అపుడు బ్రాహ్మణుండు లేచి
ఆకస్మికముగ, మోక్షద
గూర్చి పలికె నీ రీతిని :
"కొనిపోవుచున్న దామె
దొంగతనముగా తనయుని,
తొలుత నిత్తు దేవత కని."
'పడవేయుము నీట' ననుచు
భయద కఠోరముగ నరచె
యాత్రిక బృందము ; మోక్షద,
"అన్నగారు రక్షింపుడు
రక్షింపుం"డని రొమ్మున
రాఖాలుని హత్తుకొనియె.

అప్పుడు బ్రాహ్మణు డదలించుచును
అనె గర్జించుచు నావేశముతో:
"నే రక్షకుడను, నీవు కోపమున

ఒడ లెరుంగకయె బుడుతని దేవత
కర్పణ చేసితి వమ్మవె యయ్యెను.
చివరకు నే రక్షింతును వానిని
దేవత ఋణమును తీర్చుము తొలుతను,
సత్యభంగమును సలిపిన యెడలను
సాగరమున నీ జనులు మునుంగుచు
జీవములను గోల్పోవుట తథ్యము."

మోక్షద యిట్లనె . మూర్ఖురాలనే !
అంతర్యామీ, ఆగ్రహవశమున
ఆడిన మాటలె అగునా సత్యము ?
ఎంతటి మిథ్యయొ యెరుగవ దేవా,
ఆకర్ణించిన యప్పుడె పలుకులు !
నోటి మాటలనె పాటించెదవా
జననీహృదయము సంగతి వినవా !"

అట్లనుచుండగా నామె, నావికులు
త్రాడు లాగెడివారు దరిసి రాఘాలు
బలవంతముగ తల్లి వక్షంబునుండి
విడ లాగిపైచిరి; విప్రుండు కనులు
మూసి, యావలకును ముఖమును త్రిప్పి
చెవులలో వ్రేళ్ళను జేర్చియున్నాడు
పండ్ల బిగింపున ప్రహరించినట్లు
విద్యుత్కశలతోడ, వృశ్చికదంశ
మైనట్లు తోచిన దాతని కపుడు.
'పిన్ని పిన్నీ పిన్ని' అన్న శబ్దంబు—
నిరుపాయు డైనట్టి నిర్భాగ్యబాలు
చివరి వాక్కు నిరుద్ధ శ్రవణంబు లందు
అగ్నిశలాకతో నడచినట్లయ్యె.
'అగు డాగు' దటంచు నరచె విప్రుండు

మోక్షదాదేవియు మూర్ఛిల్లి తనదు
పాదాలమీదను పడియుంట గాంచె
ఉలికిపాటున నాతడొక నిమేషాన.
ఆర్తితో బాలకుం దక్షిలు విప్పి
'పిన్ని పిన్ని' యని పిలుచుచు, పొంగు
నీటిలోపల నొక్క నిముసంబునందు
మెండు చీకటిలోన మిళితమైనాడు.
కేవల మొకసారి క్షీణంపు ముష్టి
పైకి లేచుచు వెర్రి బలముతో వెతకి
ఆకాశతలమున నాశ్రయ, మపుడె
అణగిపోయె హతాశమై నీటిలోన.

"నిన్ను క్రమ్మర దెత్తునే" నంచు రొప్పు
తో బ్రాహ్మణుడు పల్కి దుమికె జలాన
క్షణములో ; ఆవల కానరాలేదు।
అస్తాచలంబున కరిగె సూర్యుండు.

అక్టోబరు 29, 1897 కథా ఓ కాహినీ

## అభిసారము

(బోధిసత్వావదాన కల్పలత)

ఒక్కనాడు నిరాబారి
ఉపగుప్తుడు మధురాపుర
ప్రాచీరతలమ్మునందు
పరుండి నిదురించుచుండె;
నగరిలోని ప్రదీపాళి
నష్టమయ్యె గాలివలన,
బద్ధమ్ములు పురములోని

భవనద్వారములన్నియు,
ఆకాశమునందు శ్రావ
ణార్ధ రాత్రివేళ తార
లంబుద సంఛన్నంబులు.

ఆయన వక్షముమీదను
ఆకస్మికముగ నెవ్వరి
నూపుర శింజిత చరణపు
తాపు మొరసె : మేల్కాంచెను
తాపసవరు డులికిపడుచు.
స్వప్నజడిమ భగ్నమయ్యె
క్షణములోన; దీప తీవ్ర
కాంతి వెల్లివిరిసె నతని
క్షమాముగ్ధ నేత్రంబుల.

యౌవనమదమత్తయగుచు
అభిసారార్థము చనియెడి
నగరనటీ శరీరమున
నల్లని వసనమ్ము మెరసె;
మొరసిన వాభరణమ్ములు;
చరణము సన్యాసితనువు
తాక నాగె వాసవదత్త.

హస్తములోని దీపికతో
నవలోకించిన దతనిని;
నవగౌరద్యుతి దేహము,
హసాన్విత సౌమ్యముఖము,
భాసమాన దయాకిరణ
భరితంబులు నేత్రంబులు.
శుభ్రలలాటమున స్నిగ్ధ

సోమద్యుతిసదృశకాంతి,
లజ్జ కనుల జడిగొనంగ
లలిత వాక్కుతోడ బలికె
లలన యిట్టు లతనితోడ -
"ననుక్షమింపుమో కుమార,
నాయింటికి దయచేయుము.
ఈ ధరణీస్థలి కఠినము
ఇది శయ్యగ తగదు నీకు."

జాలి గొలుపు కంఠముతో
సన్యాసి వచించె నిట్లు :
"ఓహో లావణ్యమయీ,
యుక్తఘటిక రాలేదే
ఇంకను : చనుమిపుడు నీవు
ఏగనున్న తావునకే.
వత్తు నీదు కుంజమునకు
స్వయముగ తరుణమ్మునందు."

విపులాస్యము తడిచ్చిఖను
విప్పెను ఝంఝూవాతము
తటుకున ; కంపించిపోయె
తరుణి భయభ్రాంత యగుచు.
వినవచ్చెను ప్రళయశంఖ
నినదము ఝంఝూనిలమున,
ఆకసమున పిడుగు భీక
రాట్టహాస మొనరించెను.

అంతము కాలేదు వర్ష
మరుగుదెంచె చైత్రసంధ్య,
అకులమై చంచలమై

అనిలము వీతెంచుచుండె,
అధ్వవృక్ష శాఖలయం
దంకురించె ముకుళమ్ములు.
వికసించెను పాటలములు
వకుళంబులు రేరాణులు
ప్రభు నుద్యానమ్మునందు.

మదిరవోలె మురళీధ్వని
మాదకమై మంద్రంబై
మారుతంబుతోడ గలిసి
దూరముగా వినవచ్చెను.
పుష్పోత్సవమున కిరిగిరి
పురవాసులు మధువనమున,
కాకసమున పూర్ణచంద్రు
డాలోకించుచును శూన్య
నగరమ్మును మెలమెల్లన
నగుచుండెను నీరవముగ.

వెన్నెలవెలుగున నొంటిగ
విజనపథమువెంట నప్పు
డరుగుచుండె నిరాబారి:
శిరముమీద తరువీథిని
కోకిల వారంవారము
కూజితమ్ము చేయుచుండె.
ఇంతకాల మైనపిదప
ఏతెంచిన దొక్కొ నేటి
కీతని యభిసరణరాత్రి?

చేరినాడు నగరప్రా
చీరము సన్యాసి, అవల

ప్రాపించినవాడు పరిఖ :
పడియుండెను రమణి యతని
పాదసమీపమ్మునందు
సహకారారామములో
ఛాయాలోకములలోన.

నల్లబడిన యామె మేను
పెల్లుగ ఘోర మశూచీ
పిటికలతో నిండియుండె :
విషసంసర్గమ్ము తొలగ
వేయుటకై పరిఖ కవల
విడిచినారు జను లామెను.

అతడు కూర్చుండి ఆమె
యవశమస్తకంబు నిజాం
కములోనికి జేర్చికొనుచు
కమండలూదకము నామె
యెండిన పెదవులను బోసి
ఎత్తి శిరసు మంత్రము పఠి
యించుచు శీతలచందన
గంధము నిజహస్తంబున
కాయం బెల్లెడల బూసె.

కోరకములు రాలుచుండె,
కూయుచుండె కోకిలమ్ము,
జ్యోత్స్నామత్తవిభావరి.
"ఓ కరుణామయ, ఎవరో
వచ్చితి" వని యడిగె నళివ.
"వాసవదత్తా, తరుణం
బగుటచేత నీ యామిని

అరుగుదెంచినాను నేను"
అని సన్యాసి వచించెను.

5-10-1899 కథా ఓ కాహినీ

# కర్ణ - కుంతీ సంవాదము

*కర్ణుడు*

పుణ్య భాగీరథీతీర భూమియందు
సలుపవచ్చితి సాంధ్య భాస్కరునుపాస్తి,
అధిరథుండను సూతుని ఆత్మజుండ,
రాధ గర్భోద్భవుండ, కర్ణాహ్వయుండ;
ఎవ్వరో నీవు, జనని, నాకెరుగజెపుమ !

*కుంతి*

మహిని నీ జీవన ప్రథమ ప్రభాత
వేళ నీ పరిచయము నీ విశ్వమునకు
ఎవతె కలిగించె ఆ నేనె ఇపుడు నీకు
చేయవచ్చితి నా పరిచితిని, వత్స !

*కర్ణుడు*

దేవి ! నీ నతనయనాంశు దీప్తిఁడుట
ద్యుమణి కరఘాతమున శైలహిమము పగిది
విగళితంబయ్యె నా మనోవీథియెల్ల
పూర్వజన్మంబు లోనిదివోలె నాదు
కర్ణముల జొచ్చి భవదీయ కంఠరవము
ఏలనో యపూర్వవేదన మేలుకొలిపె
అపరిచితురాల ! నీతో రహస్యసూత్ర
బద్ధమైయున్నదొక్కొ నా ప్రభవవిధము !
ఎరుకపడునట్లు వివరింపు మిపుడు నాకు.

*కుంతి*

ఒక్కక్షణ మూనుమా ధైర్య మోయి వత్స !

సూర్యభగవాను నస్తాద్రి చేరనిమ్ము,
సాంధ్యతిమిరము లలమనీ సాంద్రముగను,
వివిచెదను నీకు - నేను కుంతిని, కుమార !

కర్ణుడు

అర్జునుని తల్లివా, కుంతివా, నిజమ్మె !

కుంతి

అర్జునుని జనయిత్రినేయగుదు, నిజము;
అందులకు ద్వేషమువహింపకయ్య మదిని;
జ్ఞప్తియున్నదె ఆ హస్తినాపురమున
నాటి యస్త్రపరీక్షాదినంబు నీకు :
తారకాశోభి ప్రాగ్దిశాంతమ్మునందు
అభినవోదితుడగు సహస్రాంశువట్లు
వయసు కౌమరుడ వత్తరి వచ్చితీవు
ధీరగతితోడ రంగప్రదేశమునకు.
తెరల మాటున చేరిన తెరవలందు
మౌనముగ నున్న ఆ భాగ్యహీన యెవరు !
తనివితీరని స్నేహ శుధా భుజంగ
జాల మెవ్వరి శిధిల వక్షమ్మునందు
చెంగలించెనో, నీదు సర్వాంగకముల
దీవెనల ముద్దులిడె నేరి దృష్టి యపుడు
అర్జునుని జనయిత్రియే యామె సుమ్మ !
పిదప కృపు డరుదెంచి నీపితరు నామ
మడిగి నవ్వుచు పలికె, "రాజాన్వయమున
జనన మందని వారి కర్జునునితోడ
యుద్ధ మొనరింప నధికార ముండ"దనుచు.
అంత నారక్త మానతం బగుట మొగము
నిలిచియుంటివి నీవేమి పలుకలేక.
అప్పుడే భాగ్యహీన హృదంతరమ్ము
నెల్ల నీసిగ్గుచాయ దహించివైచె
అగ్నిసమతేజ మేపార - ఆమె యెవరు ?

అర్జునుని జనయిత్రియే యామె సుమ్మ !
ఆ కుమారసుయోధనుడే కృతార్థు
డాక్షణమె నిను నంగరాజ్యమున కెల్ల
తానె యభిషేక మొనరించె. ధన్యు డతడె !
పరగు నభిషేక జలముతోపాటు నాదు
నేత్రయుగ్మమునుండి కన్నీరు పొంగి
దొరలె మానసికముగ నీ శిరముమీద.
అప్పు డానంద విహ్వలుండగుచు సూతు
డధిరథుండును మార్గమ్ము నరసికొనుచు
సరగ రంగస్థలంబున కరుగుదెంచె.
అత్తరిని నీవు రాజచిహ్నములతోడ
నాల్గువైపుల జనము లానంద మంద
వచ్చి యా సూతవృద్ధుని పదములందు
తనరు నభిషేక సిక్తమస్తకము వాల్చి
భక్తి ప్రణమిల్లితివి పితృభాషణముల.
క్రూరహాస్యంబు మీర ధిక్కారములను
పలికె రప్పుడు పాండవ బంధుజనులు.
పరమగర్వంబు మీర నా తరుణమందు,
వీరచూడామణీ, నిన్ను వీరు డనుచు
ఎవతె ఆశీర్వదించె ఆ యింతి నేనె ;
అర్జునుని జనయిత్రినే అగుదు నోయి !

కర్ణుడు

అమ్మ, నీకు ప్రణామమ్ము లాచరింతు !
ఏల నొంటిగ వచ్చితి విచటి కీవు ?
రాజమాత వీ. విదియు సంగ్రామభూమి.
అఖిలకురుసైన్యములకు నాయకుడ నేను.

కుంతి

భిక్ష నర్థింప వచ్చితి. విఫల నగుచు
మగుడి పోకుందు గాక, కుమార, నేను !

కర్ణుడు

ఏమి! క్షత్రియా! నా కడనే! నిజమ్మె!
ఆజ్ఞ యొసగు మస్మద్ధర్మ మస్మదీయ
పౌరుషము దక్క నింక నెవ్వానినైన
అర్పణముజేతు యుష్మత్పదాంతికమున.

కుంతి

వత్స! నిను గొనిపోవగా వచ్చినాను

కర్ణుడు

ఎచ్చటికి నన్ను గొంపోవు వచ్చి తీవు?

కుంతి

తృషితవక్షమ్ములోనికి – తిరిగి జనని
హృదయమునకు దీసికొనిపోయెదను నిన్ను

కర్ణుడు

తనయపంచకమును గల్గు ధన్య వీవు,
భాగ్యవతి వీవు – కుల శీల వర్జితుండ,
స్వల్పనరపాలుడను నేను – స్థాన మెచట
ఒసగెదవు నాకు?

కుంతి

సర్వోచ్చపదము

నందు – నా పుత్రులందర కగ్రమందు
నిలిపెదను – జ్యేష్ఠసుతుడవు నీవె యగుదు.

కర్ణుడు

ఎట్టి అధికారగర్వమ్మ తొట్టి నేను
అట ప్రవేశింతు? వంచితులైరి వారు
సకల సామ్రాజ్యసంపదలకును, కాని
మాతృవాత్సల్యధనము సమగ్రముగను
కలిగియుండగ వారు భాగమ్మ నేను
ఎట్లు కొననగు నొక్క నా కెరుగ జెపుమ!
మాతృహృదయము సుమ్మ విధాతృదాన,
మమ్మకొనలేదు ద్యూతపణమ్మగాను,

బాహుబలమున వారు కొల్పడగ లేదు.

కుంతి

ఓయి నాపట్టి ! నీవును నొక్కనాడు
ఆ విధాతృని యధికారమనుసరించి
ఏగుదెంచితి కాదె ఈ హృదయమునకు ;
మరల రమ్మట్టి యధికారసరణితోడ :
గౌరవము మీరగా, నిర్విచారముగను,
అరుగుదెమ్మోయి ! సకలసోదరుల నడుమ
తల్లి యొడిలోన — నస్మదుత్సంగమందు
కొనుము నీ సానమును నీవు !

కర్ణుడు

వినగనయ్యె

దేవి, నీ వాణి స్వప్నసదృశ మగుచు ;
అంధకారము దిగ్విదిశాంతరముల
నలముకొనసాగె, నలెసల్ తెలియరావు,
జాహ్నవీనది కూడ నిశ్శబ్ద మయ్యె.
తీసికొనిపోయె నను భవదీయవాణి
కనని మాయాపరీతలోకమ్మునకును,
విస్మృతనికేతనమునకు, విమలచేత
నాప్రభాతమునకు ! పురాణంబు, సత్య
సమము భవదీయభారతి ; సంస్పృశించె
నస్మదీయవిముగ్ధహృదంతరమును.
కనగ నస్ఫుటశైశవకాల మొకొ్క ;
మాతృగర్భమం దేను తపస్సుచేత
పెనగొనంబడినట్లు కాన్పించు నాకు.
సత్యమగుగాక, అగుగాక స్వప్న మిదియు ;
స్నేహమయి, రాజజననిరో, చేరరమ్మ,
క్షణము తావక దక్షిణకరము నాదు
ఫాలసీమను, చిబుకమ్ముపైన నుంచు ;
జనము లాడుకొనంగ నే వినుచునుంటి

జనని నన్ను పరిత్యజించినదటంచు.
కాంచితి నిశీథినీ స్వప్నఘటనములను
ఎన్నిమారులో - నాతల్లి నన్ను చూడ
* అల్లనల్లన నరుదెంచినట్లు కంటి.
అపుడు దుఃఖాభిభూతుడ నగుచు నేను
ఆర్తనాదముతో నంటి నామెతోడ-
'అంబ, అవగుంఠనము సుంత అపనయించు,
కనుగొనెద నేను తావకాననము!' ననుచు.
అట్లు మూర్తి లభింప తృష్ణాతురముగ
కలను భంగించుకొంటి నుత్కంఠ దగిలి.
అట్టి స్వప్నము నేటి సాయంతనమున
శరణక్షేత్రమందు, భాగీరథీన
దీ నితంబమునందు ప్రాప్తించె నిట్లు
పాండవేయుల మాతృరూపము వహించి.
దేవిరో! చూడు మావలి తీరమందు
పాండవుల శిబిరంబున ప్రజ్వలించె
దీపమాలిక. లీవలి తీరమందు
అనతి దూరమ్మునను కౌరవాశ్వశాల
కలుగు లక్షాది హయఖుర ఖరరవమ్ము
ఉద్భవంబయ్యె. రేపటి యుదయమందు
అదరి యారంభమగును మహారణంబు.
అర్జునుని తల్లి కంఠస్వరంబునందు నేటి
రాత్రి నాతల్లి కంఠస్వరం బదేల
వినగనయ్యెనో! ఆమె యాననమునుండి
నాదు నామము మధురగానమ్ము వోలె
ఏల మ్రోగుచునుండెనో! ఏల నేడు
ఆదరంబున తమ్ములారా యటంచు
బంచపాండవులను బిల్వ పరుగులెత్తు
అప్రయత్నమ్ముగా మదీయాంతరాత్మ!

కుంతి

అయినచో రమ్ము పోద, మట్లయిన రమ్ము.

కర్ణుడు

పోవుదము, తల్లి, ఇక తల్లి పోద మమ్మ :
ఏల యని ప్రశ్నచేయ, నింతేని సంశ
యింప, వేరేమి భావింప నించుకేని.
నీవు నాతల్లి వౌదేవి ! నీవు పిలిచి
నంత మేల్కాంచె నా యంతరాత్మ, జనని !
సమరభేరులు విజయశంఖములుగాని
వినబడుటలేదు సుంత నా వీనులకును.
జయమును, పరాజయమ్మును, సమరహనన
వీరకీర్తులు మిథ్యగా వెలసెమదివి.
ఎటకు పోనగు నను,గొని యేగు, మమ్మ !

కుంతి

అల్లయావలియొడ్డున నచ్ఛమైన
వాలుకాతటమందు దీపములు వెలుగు,
పోదమచటి స్కంధావారమునకు, రమ్ము

కర్ణుడు

అచట మాతృవిహీనున కాత్తమగునె
శాశ్వతమ్ముగ జనయిత్రి ? జాగరిల్లి
నిత్యనిశయందు ధ్రువతార నిలుచునొక్క-
వీడు సుందరోదార సునేత్రములను ?
ఇంక నొకపరి ఎల్గా-మా యేను నీదు
పుత్రుడ నటంచు, దేవి !

కుంతి

నా పుత్రకుడవె !

కర్ణుడు

అట్టులైన నగౌరవమందు నన్ను
ఇట్టికులశీల మానవిహీనమైన,
అంధమైన, అవిజ్ఞాతమైన, మాతృ

నేత్ర విరహితమైన ధరిత్రియందు
త్రోసివైచితి వేలనో దూరముగను ?
ఈ యవజ్ఞాస్రవంతిలో నేలనన్ను
తేలిపోజేసితివి చిరకాలమిట్లు ?
భ్రాతృవర్గమునుండి నిర్వాసితునిగ
అమ్మరో, ఏలచేసితి వకట నన్ను ।
అర్జునుని వేరుకావించినట్టి కతన,
బాల్యముననుండి కనరాని బయలుపడవి
చటుల హింసాస్వరూప పాశమ్ముచేత
కరము వారింపరాని ఆకర్షణమున
ఇట్లు బద్ధులమైతి మే మిర్వురమును.
మారు పల్కవేమమ్మ నా మాటలకును ?
తిమిరపుంబొరలెల్ల భేధించుకొనుచు
నాదు సర్వాంగకంబుల నీదులజ్జ
సంస్పృశింపంగ దొడగె నిశ్శబ్దముగను :
మూతపడజేసె నా నేత్రములను గూడ.
ఉండు మ టెనచో కొంచె ముండు మమ్మ ।
చెప్పవా యేల నన్ను త్యజించినావొ ।
విశ్వసంసారమందు నావిధి యొసగిన
ప్రథమదానము జనయిత్రి ప్రణయ, మట్టి
దైవధనమును నీదు సంతానమునకు
చెందకుండగ నేటికి చేసినావొ,
మారుపల్కంగరాదె ఆ మాటకైన
ఏల నీ యంకమునకు నన్నిపుడు మరల
తీసికొనిపోవ వచ్చితో తెలుపు, మమ్మ ।

కుంతి

వత్స ! నీ భర్త్సనము శతవజ్రసమము,
నా యెద పగిల్చి నూరు తునకలుగ జేసె
నిను త్యజించిన యభిశాపముననె నేను
ఐదుగురు పుత్రులను వక్షమందు దాల్చి

యుండినను గూడ నాచిత్తము త్తలమున
పుత్రహీన స్వభావమే పొందుచుండు.
అయిన నా బాహువులు విశ్వమన్ని యెడల
యందు పరువెత్తు నకట నిన్నరయుకొరకు ;
తిరుగుచుందును నీజాడ తెలియ నెంచి.
వదలిన కుమారు నుద్ధరింపంగ దలచి
మన్మనోదీప్త దీపమ్ము మండి మండి
దగ్ధ మగుచు తనంతన తా నొసంగె
విశ్వదేవత కారతి : వెదకి నిన్ను
పడయ గల్గితి నేడు నే భాగ్యవతిని ।
ఎపుడు నీనోట నొక్క పల్కైని స్ఫుటము
కాకయుండెనొ నీ కట్టి కాలమందె
ఆచరించిన దతికరోరాపరాధ
మీ కుమాత ; ఆ నోట క్షమింపు మయ్య ।
భర్త్సనము కన్న క్షమయె దీప్తాగ్ని యగుచు
వెలుగు గావుత హృదయాని । కలుష మెల్ల
కాలి నిర్మల నగుదును గాక యింక ।

కర్ణుడు

జననిరో, పాదధూళి యొసంగు, మొసగు
పాదధూళి, మదీయ బాష్పములు గొనుము ।

కుంతి

వక్షమున జేర్చికొని పోవవచ్చు నిన్ను
అనెడి సుఖవాంఛ తగిలి నీ యగ్రమునకు
వచ్చియుండగ లేదోయి, వత్స । మరల
నీ నిజాధికారమునకే నిన్ను నేను
తీసికొని పోవగా నరుదెంచియుంటి.
నీవు సూతాత్మజుండవు కావు, పుత్ర ।
రాజసంతానమవు నీవు, రమ్ము మరలి
ఐదుగురు సోదరుల చేర నరుగుదెమ్ము.

కర్ణుడు

తల్లి ! నే సూతసుతుడ, నాతల్లి రాధ.
అధికమర్యాద లేదు నా కంతకన్న
పాండవులు నుంద్రు గావుత పాండవులుగ,
కౌరవులు నుంద్రు గావుత కౌరవులుగ !
లేదు నాకీర్ష్య యెవ్వరిమీద గాని.

కుంతి

నీదు బాహుబలమ్ముచే నీదు రాజ్య
ముద్ధరించి గ్రహింపుమీ, వో కుమార !
ధవళచామరములు వేయు ధర్మసుతుడు,
ఛత్రము ధరించు భీముడు, సారథియగు
వీరుడు ధనంజయుండును నీ రథమున
ధౌమ్యుడు పురోహితుండు శస్త్రంబులైన
వేదమంత్రంబులు పఠించు. వీర, నీవు
శత్రుజేత, వఖండతేజమ్ము మీర
బాంధవజనాళితో నిస్సపత్నరాజ్య
మందు వర్ధిల్లు రత్నసింహాసనమున !

కర్ణుడు

ఏమి, సింహాసనమ్మ ! అదెట్లు, తల్లి !
జనని యనురాగపాశమ్ము సడలినట్టి
అతని నోదార్చె దొక్క రాజ్యాశ కొలిపి !
వంచితుడనైతి నెట్టి సంపదకు నాడు
అట్టి దానిని మరల నీయంగ నేడు
నీ కసాధ్యము. నేను జన్మించినట్టి
క్షణమునందె నిర్మూలము సలిపినావు
తల్లిరో, నీవె యొక ముహూర్తమ్ములోన
నాదు రాజకులమ్మును, నాయనుజుల,
నాదు జననిని ! సూతజనని సుతుండు
తన జనని రాజమాతయే యనుచు నేడు
పలుకునేనియు, కౌరవపతికి తనకు

బద్ధసంబంధమును త్రెంచి పరుగువారు
నేనియును రాజసింహాసనేచ్ఛదగిలి
ఏలకాల్పనె నాజన్మమింక, ఛీ ఛి!

కుంతి

ఓయి నాపుత్ర! నీవు ధన్యుడవుసుమ్ము!
వీరుడవు నీవె! ఇంత కఠోరమగునె,
ధర్మమా, అక్కటా, నీదు దండనమ్ము!
ఎవరెరుగుదు రాదిన మిట్టులగుట!
చిన్నిశిశువును, నసహాయు, కన్నవాని,
అయ్యయో సంత్యజించితి, నాతదెపుడొ
ఒంది బలవీర్యములను తా నొక్కనాడు
ఏ ప్రదేశమునుండియో యేమొ మరల
నంధకారపథమ్మున నరుగుదెంచి
ఆత్మజనయిత్రి యుత్సంగమందు నున్న
ఆమె సంతతికే హాని నాచరింప
నెంచునే! ఎట్టి శాపమో యెరుగ నకట!

కర్ణుడు

భయముచెందకు మాతరో, పాండవులకె
విజయము లభించునంచు చెప్పితిని గాదె!
తారకలకాంతిలోన ప్రత్యక్షముగను
ఘోరరణఫల మీ యంధకారఫలక
మందు నీరాత్రి కాంచితి నమ్మ, నేను!
శాంతనిష్పందమైన ఈ క్షణమునందు
ఆ యనంతాంతరిక్షమ్ము నందునుండి
విజయవిరహిత చేష్టల విశదగీతు,
లాశ లెడలిన కార్యప్రయత్నములను
చొరబడియె నాదు మానసాంతరమునందు;
శాంతిమయ శూన్యపరిణతి స్పష్టపడియె.
అపజయమునొందు పక్షంబు నటుత్యజించి
రమ్మనుచు చీరగా వల దమ్మ, నన్ను.

పడయుదురు గాక విజయమ్ము పాండుసుతులు,
వెలయుదురు గాక రాజులై ; నిలుతు నేను
నిష్ఫలము నిరాశమునౌ ననీకమందె ;
జననమందిన రాత్రియే, జనని, నీవు
గృహవిహీనునిగను నామహీనునిగను,
భూతలమ్మున బడవైచి పోతివి కద ;
అమ్మరో నేడుకూడ నన్నావిధాన
అట్టి నిర్మమచిత్తమ్ము దిట్టపరచి,
ద్యుతివిహీనము కీర్తి వర్జితమునైన
పరిభవమునందు నను వీడి యరుగు మమ్మ ;
విజయలోభముచే గాని, విపులరాజ్య
లోభమున గాని, కీర్తి ప్రలోభముననె
కాని, వీరసంభావ్య సద్గతిని బాసి
భ్రష్టతను పొందకుండ దీవన లొసంగు –
మింతమాత్రము దీవించి యేగు, మమ్మ ;

16-2-1900 కాహినీ

## గాంధారి ఆవేదనము

దుర్యోధనుడు

ప్రణమిల్లెదను, తండ్రి, పాదమ్ములకును ;

ధృతరాష్ట్రుడు

ఓరి దురాశయా, కోరిక యిపుడు
సాఫల్య మందెనా ?

దుర్యోధనుడు

జయము పొందితిని.

ధృతరాష్ట్రుడు

కలిగిన దాకాంక్ష సుఖమ్ము నీ కిపుడు ?

*దుర్యోధనుడు*

జనక, నే విజయి నైతిని.

*ధృతరాష్ట్రుడు*

ఓరి కుమతి !

అఖిల రాజత్వజయమ్మును గాంచి

నట్టి నీవు సుఖమ్ము నందెద వెట్లు ?

*దుర్యోధనుడు*

కోరుటలేదు, మహారాజ, సుఖము ;

జయము కోరుచునుంటి, జయి నైతి నేడు.

కురుపతీ ! క్షత్రియు క్షుధ తీరు నొక్క-

స్వల్పసుఖమ్ముతో ? జయరస మన్న

వెలుగు మంటల నిప్పుకలను వర్షించు

అమృతమే ! అదియె ఈర్ష్యాసింధుమథన

సంజాత ; మద్ది యీ క్షణమున నేను

పానము చేసితి : కాను నే సుఖిని.

జనక, ఈ నాడు నే జయిని, నే జయిని !

కౌరవుల్ పాండవుల్ కలిసి యొక్కెడను

ఆ శశాంకుని వక్షమందు కలంక

మున్నట్లు బద్ధులై యుండిన యెడల

జనక, నే నుందునా సౌఖ్యమ్ముతోడ ?

కర్మహీనంబును గర్వహీనంబు

దీప్తిహీనము నగు తృప్తిని బొంది

పాండుకుమారుల గాండీవరవము

వలన శత్రుగణంబు ద్వారము కడకు

రాకుండు రనుచు హర్షమ్మున మునిగి

యుందునా ? పాండవు లుర్వర నెల్ల

విజయదర్పముతోడ పితుకుదు రింక

అని సోదరప్రీతి అతిశయింపంగ

వారి భాగమొసంగి వారికి నేను

సుఖముగా నుందునా ? సుఖముపొందుదునె

అంతరహిత కౌతుకాళితో నేను
నిర్విచారమ్ముగా నిత్యనినూత్న
సుఖభోగములతోడ సోలుచునెపుడు ?
పాండుసూనుల జయధ్వనియు కౌరవుల
వీనులలో ప్రతిధ్వానముతోడ
ఆక్రమించినయప్పు; డా పాండుసుతుల
బలకీర్తిబింబముల్ ప్రతిబింబములును
ఉజ్వలాంగములతో నొనర నేతెంచి
కౌరవమలినవక్షమ్ములు వెలుగ
చేసినయపు డుందునా సుఖమ్ముగను ?
జనక, మీతేజ నాశ మ్మొనరించి
పాండవ గౌరవపదమున స్నిగ్ధ
శాంతరూపమ్ముతో జడతాంధువందు
హేమంత మండూక మెలసెడిరీతి
సుఖముగా నుందునా ? సుఖపడగాదు;
పాండుపుత్రులు పరాభవము వహించి
వెడలిపోయెదరు నే డడవికి నింక,
నేను సుఖినికాదు – నేడు నే జయిని !

*ధృతరాష్ట్రుడు*

సోదరద్రోహమ్ము కాదొకో, ఛీ ఛి !
కౌరవులకు నల్ల కౌంతేయులకును
మరచితివా పితామహు డొక్కడంచు ?

*దుర్యోధనుడు*

మరవంగలేదది; మానమునందు,
ధనమందు, తేజాన తగనొక్కడగునె ?
దూరవర్తులైయైన దుఃఖమ్ములేదు :
శర్వరియందలి శశియు ద్వేషింప
జనదు మధ్యాహ్న భాస్కరు నెప్పుడేని.
అయినను పూర్వదిగంచలమందు
ప్రత్యూషమున రెండు భ్రాతృసూర్యోద

యమ్ము లుదయశిఖరమ్మున నెపుడు
వర్తించుచుండవు; ద్వంద్వమ్ము నేడు
నశియించె, విజయు నీనా దొక్కరుడనె:

ధృతరాష్ట్రుడు

అది యీర్ష్య, విషఫణి; అదియు క్షుద్రమ్ము.

దుర్యోధనుడు

క్షుద్రమ్ము కా దీర్ష్య, సుమహతి యదియు,
బృహతి ధర్మ మీర్ష్య; రెండు వృక్షముల
నడుమ నెప్పుడు నుండు నెడ మారయంగ,
పెనగొని లక్షల తృణము లొక్కటిగ
ఒకదాని వక్షాన నొకటి లీన మగు,
లక్షల కొలదిగా నక్షత్రములును
బద్ధమ్ము లగుచు సౌభ్రాత్రమ్ము నెరపు,
అయినను శశి యొక్క దర్పముం దొకదె;
అస్తమించినది దూరారణ్య మధ్య
మందున పాండు శశాంకరేఖయును:
ఒకడె కౌరవసూర్యు, డొక్కడ నేను,
నేడు నే నొక్కడ, నేడు నే జయివి.

ధృతరాష్ట్రుడు

ధర్మమ్మును పరాజితమ్మయ్యె నేడు

దుర్యోధనుడు

జనక, లోకధర్మమ్మును
జననాథుని ధర్మమ్మును
కా దొక్కటి; సమకక్షులు
గా నుండెడు జనులు లోక
సమాజమున సాహాయ్యము
సౌహార్దము ననెడి బంధ
నములతోడ విశ్వాసము
నాటి ప్రవర్తించుచుంద్రు.
అయిన, నృపతి యేకేశ్వరు,

దాతనికిని మహాశత్రు
వరయ నొక్క సమతయె.
ఆతదె చిర విఘ్నంబును,
స్థానము దుశ్చింతలకును,
సమ్ముఖమున నాటంకము,
పశ్చాద్భాగమున భయము,
పగలు రేలు యశశ్శక్తి
గౌరవమ్ములకు క్షయంబు,
కలిమిని నంశాపహారి.
అల్పజనుడు బలాంశంబు
నంది బంధుజనముతోడ
కలసిమెలసియుండి మిగుల
బలవంతుం డగుచునుండు.
అరయ రాజదండమెన్ని
యగునొ ఖండఖండంబులు
అంత దాని దౌర్బల్యము,
అంత దాని విక్షీణత;
తానొక్కడె సర్వులకును
పైన రాజు తనశిరమ్ము
నెత్తి యుంచకున్నయెడల,
ఎల్లప్పుడు జనులెల్లరు
ఆతని సముద్ధత శిరమ్ము
నారయలేకున్నయెడల
అఖిలజనులమీద నట్టి
ప్రభు శాసనదృష్టియెట్లు
ప్రసరించును బహుదూరము?
లేదు భ్రాతృధర్మంబును,
లేదు బంధుధర్మంబును,
రాజధర్మమందొక్కటె
రాజిల్లును జయధర్మము.

అందుచేత నేడు నే మ
హారాజా, చరితార్థుడ :
అందుచేత నే విజయిని.
ఆటంకము తొలగె నెదుట,
పంచశిఖరమయమగు నా
పాండవగిరి యవనతమగు.

*ధృతరాష్ట్రుడు*

ఓయి లజ్జాహీన, ఓ యహంకారి
కపటంపుద్యూతాన గాదె నీ జయము;
అదియును నొక జయ మ్మగునె హర్షింప ?

*దుర్యోధనుడు*

అగు నెవ్వరికేదిబలమొ
అది యవ్వారల కస్త్రము-
సమరమున సంబలంబు;
వ్యాఘ్రపు నఖదంతమ్ముల
కరయ నేవి సమము కావు,
అయిన ధనుర్బాణమ్ముల
నద్దాని వధించినపుడు
ఏ నరుండు సిగ్గుపడును ?
మృత్యు మధ్యమునకు దూకి
మూఢునివలె నాత్మార్పణ
మును జేయుట రణముకాదు;
ఆజికి నేకైక లక్ష్య
మది జయలాభమ్మె, జనక !
అందుచేత నే విజయిని.
అహంకార మందులకే !

*ధృతరాష్ట్రుడు*

నేడు నీవు విజయి వగుట
నిన్నుగూర్చి నిందాధ్వని
ఉర్వ్యాకాశములు నిండె

నుచ్చై ర్ధిక్కారముతో.

*దుర్యోధనుడు*

నిందా, తండ్రీ? నేనా
నిందకు భయమంద నింక;
నిందకులను గొంతు పిసికి
మ్రందించెద, నిస్తబ్ధ
మ్మగ జేసెద వాచాల
మ్మగు నగరము నింక నేను.
స్పర్ధగల్గు నాలుకలను
బలముతోడ నణచియుంతు
నా పదపీఠమ్ముచెంత.
"పాపిష్ఠుడు సుయోధనుడు,
నృశంసుండు సుయోధనుడు,
హీనుడు దుర్యోధనుండు"
అనెడి పల్కు లిన్నినాళ్లు
వినుచుంటిని బదులులేక,
రాజదండ మేను, మహా
రాజా, స్పృశియించి యనెద:
పామర జనముల చేతను
పలికించెద నింక మీద.
"మహారాజు సుయోధనుడు,
సహింయింపడు రాజనింద,
సైపడు నృప విమర్శనము,
నిజనామము సుయోధనుడు
నిజకరమున దాల్చు"ననుచు.

*ధృతరాష్ట్రుడు*

అలకింపుమోయి వత్స!
ఆ నిందను నిందించెడి
వారి నాల్కలందు నుండి
దూరీకృత మొనరించిన,

మనమున గూఢాంధకార
మున నెలకొని దాని మూల
మధోముఖముగా దవిష్ఠ
మల్లుకొనుచు గాఢముగా
అగుచునుండు దుర్భేద్యము ;
చిత్తమ్మును ననవరతము
చేయుచుండు విషతిక్తము ;
నాలుకపై నా నిందయు
నర్తిల్లుచు చంచలముగ
శాంతించును తనయంతనె.
శబ్దహీనముగ నది తన
శక్తి వృద్ధిపరచుకొనగ
ధ్వాంత దుర్గమందు దాని
కీయవలదు రక్షణంబు ;
ఎపుడు శాంతిపరచు మీవు
స్నేహమంత్ర బలముతోడ ;
నిందక భుజంగ దళమున్ను
వంశీనాదమున, హాస్య
వదనముతో చెరపట్టుము

దుర్యోధనుడు

వ్యక్తము కానట్టి నింద
వలన రాజమర్యాదకు
కలుగదెట్టి క్షతియు ; దాని
కై భ్రూక్షేపమ్మెనను
సలుప నెపుడు ; చింతలేదు
కలుగక యుండినను ప్రీతి.
కావి స్పర్థ యేమాత్రము
కాంక్షింపను మహారాజ !
స్నేహదాన మెల్లప్పుడు
స్వేచ్ఛాధీనముగ నుండు.

దీనునకును దీనతమున
కే నొసగుదు ప్రీతి భిక్ష;
దాని నత దొసంగుగాక
తన పెంపుడు పిల్లలకును,
వాకిట కుక్కలకునైన,
పాండవ సోదరులకైన,
పనిలేదిక దానితోడ,
భయమును నే కోరుచుంటి,
అదె నా రాజప్రాప్యము,
ఆ దర్పోద్ధతుల దర్ప
మెల్లను నాశమ్మొనర్చి
ఇచ్చగించుచుంటి జయము.
పితృదేవా, నాదు మనవి
విను మిన్ని దినాలనుండి
అస్మన్నిందక సముదయ
మట్లు భవత్సింహాసన
మునకు చుట్టు మూగియుండి
మన నడుమను నిష్ఠుర మగు
ప్రాచీరమ్మన కంటక
పాదపమ్మువోలె నెపుడు
విరచించుచునుండె వ్యవధి.
వినుచునుంటి నిత్యమ్మను
మెండుగ మామకనిందయు
పాండవగుణ గానమ్మును.
పితృదేవా, ఇట్లు నేను
పిత్రనురాగమ్మునుండి
దూరీకృతుండనైతివి.
దుర్బలులముగా నుంటిమి
శైశవమ్మునుండి మేము.
జనకా, పితృవాత్సల్య

స్రవంతి కెట్టయెదుట పా
షాణచయమ్మడ్డు పడుచు
పరిక్షీణమును శీర్ణ
ప్రాయమునగు నస్మదీయ
పదము గమనశక్తిలేక
నష్టప్రాణమ్మయ్యెను
పదే పదే ప్రతిహతమై.
పదపడి, ఓ మహారాజ,
నిందకదళమును వేగమె
నేటినుండి సింహాసన
పార్శ్వమ్మునుండి దవ్వ
పారదోలవలయు; నట్లు
సలుపనిచో విదురుండును,
సంజయుండు, పితామహుడు
భీష్ముండును కలసి విజ్ఞ
వేషముతో, హితకథతో,
ధర్మప్రస్తావముతో,
తర్కముతో, నిందతోడ
ధిక్కారముతోడ, సదుప
దేశముతో నిముస నిముస
మునకు రాజకార్య సూత్ర
మును సలుపుచునుందురింక
ఛిన్నభిన్నముగ నెప్పుడు.
క్రన్నన నారాజదండ
మును భారాక్రాంతముగా
నొనరింతురు; రాజశక్తి
యందు గూడ ద్వైవిధ్యము
అడుగడుగున కడ్డుపెట్టి
మలినముగావించెద, రప
మానముతో లజ్జతోడ

మామకీన మకుటంబును-
మహారాజ, క్షమియింపుము!
కాంక్షింపను సింహాసన
కంటకశయనంబు నేను;
పితృదేవా, వనవాసము
వినిమయముగ గ్రహించి ని
ర్వాసితుండనగుదు నేను
రాజ్యమొసగి పాండవులకు.

ధృతరాష్ట్రుడు

అకట, వత్స, అభిమానీ!
ఆప్తుల గూరిచి కఠోర
నిందావాక్యములు వినుచు
నీపై నా పితృస్నేహ
మించుక కొరవడిన యెడల
ఎసగియుండు కళ్యాణము.
అధర్మమున నిలిపి మనసు
హరించుకొంటిని జ్ఞానము-
ఇది నా పితృవాత్సల్యము!
ఇపుడు నీకు సర్వనాశ
నమ్ము సలుపుచున్నవాడ-
నా పితృవాత్సల్యమ్మిది!
అతిపురాణ కురువంశమ
హారణ్యతలమునందు
రగులు కొలుపుచుంటిని ఘో
రమ్మగు కాలానలంబు -
ఇది నా పితృవాత్సల్యము!
ఇపుడును స్నేహము లేదని
ఎంతువ, కుమార, దోషము?
ఏను మణిప్రాప్తి కొరకు
కాలాహిని కాంక్షించితి;

లీల నొసగుచుంటి దాని
ఫణము నేను స్వహస్తముల
పట్టుకొనుచు నీకిప్పుడు.
అంధుడ-అంధుండను బా
హ్యాభ్యంతరములను నేను.
విను నే ప్రళయాంధకార
మున గొనిపోవుచు నుంటిని ;
హాహాకారధ్వనితో
నఖిల బంధుగణము నన్ను
నిషేధించుచున్న యదియ :
నిశాచర విహంగ చయము
సలుపుచుండె చీత్కారము ,
సంకీర్ణం బగుచున్నది
సరణి గూడ పదేపదే.
శరీరమ్ము కంటకి త
మ్మగుచున్నది ప్రచురముగను
ఆసన్న విపత్తుచేత
భయంకర స్నేహముతో
పక్షమునకు హత్తుకొనుచు
అట్టి యెడను నిన్ను నేను
అంధ మహావేగముతో
మహా వాయుబలము తోడ
మత్తమూఢ హాసముతో
వినాశముకు గ్రాసముగా
వేగ పరువువారుచుంటి
ఉల్కాలోకమ్ములోన.
ఉంటిమి నీవును నేనును,
సహచరు డంతర్యామియె
జ్వలిత వజ్ర హస్తముతో.
లేదు వెనుక నడ్డగింత,

లేదు ముందు చూపేమియు.
దారుణమగు విపాతంపు
ఘోరాకర్షణముతోడ
దిగుచున్నారము క్రిందికి.
దిగ్గన నొక సమయంబున
చైతన్యము చకితమగును ;
చప్పున నొక ముహూర్తమున
తలపై బడు ధాతృగదయు :
తరుణం బట్టిది వచ్చును.
అంతవరకు పితృవాత్స
ల్యమును సంశయింపవలదు.
సడలింపకు కౌగిలింత,
స్వార్థమును హరించుకొనుము
త్వరిత హస్తముల తోడను.
తనయ, నీవు విజయి వగుము—
అగుము సుఖివి, రాజవగుము,
అగు మేకేశ్వరుడ వీవు.
'రాజు' నీదు జయవాద్యము,
నీ జయ కేతన మెత్తుము
నే, ద్రోహీ, శూన్యమందు.
నేటి జయోత్సవమునందు
భ్రాతలు ధర్మము న్యాయము
రవళింప రెవ రింతయు.
శాంతనవుడు విదురుండును
సంజయుండు రొద సలుపరు.
లోకపు లజ్జాభయములు
లోకనింద ఘోషింపవు;
రవళింపదు కురువంశపు
రాజ్యలక్ష్మి యేమాత్రము.
ఇంక సద్దు సలుపువార

లీ యంధ కుమారుండును
అంధ జనకుడును మాత్రము:
అటు పిమ్మట కాలాంతకు
డగు యముడును; కేవలమ్ము
పితరుని స్నేహము, పిమ్మట
విధాతృ శాపమును దప్ప
పెరవారెవ్వరు నుందరు.

చారుని ప్రవేశము

చారుడు

అగ్నిహోత్రములు దైవోపాసన
లన్నియు వర్జించి
సంధ్యార్చనలను పరిత్యజించియు,
చతుష్పథమునందు
వేచియున్న, దో మహారాజ, ఆ
విప్రసమూహంబు
పాండవులకునై ప్రతీక్షించుచును;
పౌరు లెవరు లేరు
భవనంబులలో; మూసియున్నయవి
పణ్యశాలలెల్ల
ప్రభూ, ఘంటలును శంఖంబులును
భైరవాలయమున
మ్రోయుటలే, దిక శోకాతురులగు
పురుషులు స్త్రీ లెల్ల
దళము దళముగా పట్టణ సింహ
ద్వారము వైపునకు
దీన వేషముల సజలనయనముల
తోడ వెళ్ళినారు.

దుర్యోధనుడు

ఈ సుయోధనుడు జాగరూకుడని

ఎరుగరు మూఢులు భాగ్యవిహీనులు,
నేడు దుర్దినము సమీపించినది—
నేడు రాజునకు ప్రజలకునుంగల
ఘనమును కఠినమునగు పరిచయమే
కలుగంగలం, దిక నెన్ని దినంబులు
నిలిచియుండునో ప్రజల స్పర్థయును
నిరస్త్రదర్పమ్ముల హుంకారము,
నిర్విషభోగుల నిష్ప్రయోజనపు
నిజభోగాస్ఫాలనము గాంచెదను.

ప్రతీహారి ప్రవేశము

ప్రతీహారి

పట్టమహిషి గాంధారియు
పదసన్నిధి, మహారాజ,
ప్రార్థన సలుపుచునున్నది
భవద్దర్శనమ్మునకై.

ధృతరాష్ట్రుడు

ఆమెకొరకు వేచియుందు.

దుర్యోధనుడు

అట్లులైన చనెద నేను.

దుర్యోధనుని నిష్క్రమణము.

ధృతరాష్ట్రుడు

పారిపొమ్ము, పో, మ్మకటా,
ఏ రీతిని సహియింతువు
సముద్యతమ్మైన పరమ
సాధ్వి జనని వజ్రదృష్టి ?
నీకు, నోరి పుణ్యభీత,
నాకంటెను సిగ్గులేదు.

గాంధారి ప్రవేశము

గాంధారి

నాథ, కలదు మీ శ్రీచరణ

ణముల చెంత మనవి యొకటి;
ప్రభువులు నా యనునయంబు
పాటింపగవలయు నుందు.

*ధృతరాష్ట్రుడు*

అసంపూర్ణ మయ్యెనె ప్రియు
రాలి కోర్కె యెన్నడేని ?

*గాంధారి*

ఈపరి త్యజియింపవలయు ;

*ధృతరాష్ట్రుడు*

ఎవరిని మహిషీ ?

*గాంధారి*

యెవ్వని
భీషణశాణమ్ము పాప
పీడనమున ధర్మఖడ్గ
మందు పడెనొ ఆ మూఢుని.

*ధృతరాష్ట్రుడు*

ఆ జను డెవ్వం, డెచ్చట
కల, డాతని పేరు మాత్ర
తెలుపుము ;

*గాంధారి*

పుత్రుడు దుర్యో
ధనుడు.

*ధృతరాష్ట్రుడు*

వాని విడువ వలెనె ?

*గాంధారి*

అవియె నాదు నివేదనము
భవదీయ పదాంతికమున.

*ధృతరాష్ట్రుడు*

ప్రార్థనమ్ము దారుణమో
గాంధారీ, రాజమాత !

గాంధారి

కౌరవ ఇది కేవలమ్ము
నా ప్రార్థనమే కా, దిటు
లీ ప్రార్థన చేయువార
లా కురుకుల పితామహులు
అహరహమ్ము దివమునుండి.
నృపతీ, వీడుము, వీడుము ।
ఎవని దురాచారముచే
కౌరవ కళ్యాణలక్ష్మి
కలగి బాష్పవదన యగుచు
అహర్నిశలు తొలగిపోవు
నా క్షణమునకై ప్రతీక్ష
సలుపుచు నున్నదొ– వానిని.

ధృతరాష్ట్రుడు

శాసించుము ధర్మ మతని–
ధర్మము నుల్లంఘించు న
ధర్మపరుని; నే నాతని
తండ్రిని మాత్రము :

గాంధారి

నేనును
తల్లిని కానా వానికి ?
గర్భభారశీర్ణత్వము
గనుచు వాని మోయలేద
జాగ్రత్ హృత్పిండముకడ ?
స్వచ్ఛమైన క్షీరధార
స్తనద్వయమునందు పొంగి
ప్రణయగళిత చిత్తముతో
ప్రవహింపగలేద వాని
అకలంకమ్మగు శిశుముఖ
మవలోకించిన యప్పుడు ?

శాఖాబంధమున ఫలము
చాడ్పున తన చిన్ని బాహు
వల్లులతో నన్ను చుట్టి
పట్టుకొనుచు నుండలేద
వత్సరంబు లనేకములు ?
నా నవ్వులతో నవ్వులు
నా మాటలతో మాటలు
నా ప్రాణముతో ప్రాణము
నగుచు ననుచు తేజరిలుచు
అలవరచుకొనంగ లేద ?
అయిన ననెద, మహారాజ,
ఆ పుత్రుని దుర్యోధను
త్యజియింపు డటంచు నేడు.

*ధృతరాష్ట్రుడు*

వానిని త్యజియించి యింక
దేనివి మిగుల్చుకొందును ?

*గాంధారి*

తావకీన ధర్మంబును.

*ధృతరాష్ట్రుడు*

ధర్మము నీ కే మొసగును ?

*గాంధారి*

అభినవమగు దుఃఖమ్మను
అధర్మపణమున జయించి
పుత్ర సుఖము రాజ్య సుఖము
పొందగలుగు టే విధముగ,
కంటకద్వయమ్మ మీరు
కౌగిలించి వక్షమ్మున ?

*ధృతరాష్ట్రుడు*

అక్కటకట, ప్రియురాలా,
ఆ ధర్మమునకు లోబడి

ఒక క్షణమున మరల నిచ్చి
యుందు పాండవులకు ద్యూత
బద్ధులగుచు నోడినట్టి
ప్రాజ్య రాజ్య ధనము లెల్ల.
ఉత్తర క్షణంబు నుండి
ఉడుగక నా పితృప్రేమ
చెవుల చెంత గొణగొణమని
చెప్పదొడగె : "ఓరి యేమి
పనిచేసితి, వేకకాల
మున ధర్మాధర్మములను
తరణుల రెండిటి మీదను
చరణమ్ముల నుంచువారు
బ్రతుకరు సు మ్మెవ్వారలు.
పాప స్రవంతి లోపల
కురుసుతగణ మెప్పు డొక్క-
పరి దిగిపోయినదో అ
ప్పుడు ధర్మము తోడ సంధి
పొసగుటయే మిథ్యయగును.
పాపాంతర్ద్వార సమీ
పమున పాప సాహాయ్యము
భిక్షించిన దా గణంబు.
వృద్ధుడ, హతబుద్ధీ, హత
భాగ్యుడ, దుర్బలుడా ! అటు
ద్వైవిధ్యములో పడి నీ
వేమి పని యొనర్చినావు ?
ఏకీభావ మ్మందదు
అవమానక్షతరాజ్య
మ్మా పాండవులకు నొసంగి
యున్న గూడ - కేవలమ్మ
హుతాశమునియందు క్రొత్త

సమిధల నుంచుటయె యగును.
క్షమతాస్త్రము చావుకొరకె
అవమానితు చేతి కిడుట;
అలతిగ బాధించి క్షమా
శీలుని విడువంగరాదు;
శీఘ్రము మర్దింపవలయు.
వారిని కొనిరాదలచిన
ఏరించి సంపూర్ణముగా
త్వరగా తీసికొని రమ్మ.
పాపముతో విఫలముగా
ఆటలాడవలదు సుమ్మ
అట్లు చేయజాలకున్న."
అని యీ గతి పాపబుద్ధి
అనేక విధములుగా నా
వీనులకడ రహస్యముగ
పితృస్నేహ రూపముతో
బాధింపగసాగె నన్ను.
పాండవులను మరలింతున
మరల ? దురోదర మిషతో
సరగ దీర్ఘ వనవాసము
సలుప వదలి వేయుదునా ?
అకటా ప్రవృత్తి వేగమ,
హా ధర్మమ, యెవరి కెరుక
ఈ సంసారపు మర్మము !

*గాంధారి*

ఈ సంపదకును ధర్మము
హేతువు కాదు, మహారాజ !
స్వల్ప సేతువైనకాదు
సౌఖ్యమునకు; ధర్మమునకు
ధర్మమేమ్మె పరిసమాప్తి.

ధర్మవిషయ మేరీతిని
బోధచేయగలను నేను
మూఢురాలనైన స్త్రీని ?
స్వామి, తెలియు మీ కంతయు.
పాండుసుతులు వనములకును
తరలువారు; మరలించిన
మరలిరారు; పణబద్ధులు
వారి; లిపుడురాజ్యమునకు
మీరొక్కరె మహీపతులు;
మీపుత్రుని త్యజియింపుడు
మీ రీ పరి; కైకొనుండు
నిర్దోషత్వవిచారము
నివర్తించి పూర్ణసుఖము.
న్యాయధర్మముల విముఖము
చేయవలదు పౌరవనృప
హార్మ్యమ్మునసుండి మీరు.
అగును నేటినుండి దుఃఖ
మతిశయ దుస్సహ, మెత్తుడు
అర్ధానిని, ధర్మప్రభు,
పైకెత్తుడు, నాదుశిరము
పైబెట్టుడు దానినెత్తి.

*ధృతరాష్ట్రుడు*

నీ యుపదేశము సత్యమె,
నీదువాణి, మహారాజ్ఞి,
అతితీవ్ర, మ్మకక్కటకట !

*గాంధారి*

ఆధర్మమధుమస్తకంబు
నందలి విషఫలముకోసుచు
ఆడుచున్నవాడు సుతుడు;
ఆ ఫలమును మీరువాని

ననుభవింపనీయవలదు
మరచి స్నేహ మోహములను;
సరగ లాగివేయవలయు.
ప్రతారణాలబ్ధంబులు
పాపస్పృతములు నైన
ధనరాజ్యంబులు త్యజించి
చనును గాక దేశాంతర
మతడు గూడ; సమానముగ
అనుభవించు గాక దుఃఖ
భార మట్లు వంచితులగు
పాండు సుతులతో బాటుగ.

*ధృతరాష్ట్రుడు*

ఆ ధర్మవిధి విధాతది ;
ఆయనయును జాగరూకు ;
డాయన ధర్మపు దండం
బనవరత మ్ముత్థితంబు ;
ఆయన రాజ్యములోపల
ఆయన కార్య మ్మాయన
యే నిర్వర్తించు, మనస్వి
నీ. జనకుడమాత్ర మేను :

*గాంధారి*

మీరు మహారాజులు సుమ,
మీరలు రాజాధిరాజు ;
లా విధాతృవామహస్త ;
మగుటచేత మీమీదనె
సమర్పితము ధర్మమ్మను
సంరక్షించెడి కార్యము.
మిమ్మడుగుచున్న దాన :
మీ ప్రజలం దొకడు సతిని
అబలను పరగృహమునుండి

అపరాధము లేకున్నను
బలాత్కారముగ పీడ్చి
పరాభవించిన మీరలు
వాని నెట్లు శాసింతురు ?

*ధృతరాష్ట్రుడు*

వానికి నిర్వాసనమ్ము.

*గాంధారి*

అట్లులైన నేడు నేను
అఖిల స్త్రీలోకమునై
రాజపాదమూలమ్మున
ప్రార్థించెద విచారింప
బాష్పవారి స్రవింపంగ ·
అపరాధి సుయోధనుడు,
ఆత్మజుండు, మహారాజ !
మీకు తెలియు, హే రాజన్ !
మీరె ప్రమాణము దానికి.
పురుషులు తమతమ స్వార్థ
మ్ముల కోస మ్మహారహమ్ము
బాధపెట్టుకొనుచు నుంద్రు.
వాని మంచి చెడ్డ లెరుగ
నేను , దండనీతి, కూట
నీతి, భేదనీతి – యిట్టి
వెన్నియొ వందలు ; పురుషులె
యెరుంగుదురు వారి గతులు ·
కౌశలమ్మునకు ప్రతిగా
కౌశలాభిఘాతమ్మును,
బలముతోడి విరోధమున
బలము, నింక ఛలముతోడి
విరోధమున ఛలము లెన్ని
విధములుగా మేలుకొనునొ !

మేము దూరముగ నుందుము
మా మా గృహకార్యమ్ములు
నలుపుకొనుచు నంతఃపురి
శాంతముగా ; నెవడు బయటి
వివాదవిద్వేషాగ్నిని
వెంటబెట్టుకొనుచు వచ్చి,
పురుషుల వీడుచు నంతః
పురములోన ప్రవేశించి,
నిరుపాయయు, గృహధర్మా
చరణరతయు నగు రమణీ
పవిత్రదేహము మీదను
పాపపరుష మగు స్పర్శము
కావించి యమర్యాదగ
కాయముపై చెయి వేయునొ ;
పతితోడ ఘటించినట్టి
వైరమునకు నే పురుషుడు
తత్పరిహారమునకునై
తత్పత్నిని భంగపరచు
నాతడు పాషండుడె కా
దతడు కేవలము కుజనుడు :
అతని, కో మహారాజ,
వ్యవస్థ యెట్టిదొ చెప్పుడు ?
అకలుష పురు వంశమందు
అఘ ముద్భవ మయ్యేనేని
అదియు గూడ సహియింతును.
అట్లుగాక, ప్రభూ, మాతృ
గర్వభరము తోడ నాదు
గర్భమందు వీరపుత్ర
గణము జనించినదటంచు
ఘనముగ భావించుచుంటి ;

అకటా, అసహాయయైన
యాజ్ఞసేని యార్తనాద
మా దినమున, నాథా, ప్రా
సాద శిలాభిత్తి గూడ
ద్రవియింపగ జేసినైచె.
త్రపతో, ఘృణతో, కరుణా
తాపముతో గవాక్షమ్ము
నరస కరిగి చూచియుంటి ;
సభామధ్యమున నా సతి
వస్త్ర మ్మూడగ లాగుచు
పకపక గాంధారీ సుత
పిశాచములు నవ్వుచుండె.
విదితమ్మది ధర్మమునకె ;
జన్మావధి చూర్ణమయ్యె
జనని శేషగర్వ మపుడు.
కౌరవ రాజగణంబా,
భారతమును వీడి యెటకు
పౌరుషమ్ము పారిపోయె ?
మీరలు జడమూర్తు లట్టు
లుంటి రచట కూరుచుండి
యొకరి మొగ మ్మొకరు కనుచు.
కొందరు నవ్వుచునుండిరి,
కొందరు గుసగుసలు వోవ
సాగిరి కౌతుకముతోడ.
చంద్రహాసములు కదలక
పిడుగు పడిన యట్లు, లుప్త
విద్యుత్తులతో సమముగ
కునుకుచుండె కోశమ్ముల.
వినుడు, ప్రభూ, మహారాజ,
వినుడు నాదు మనవి యింక ;

జనని లజ్జ దూరీకృత
మొనరింపుదు, వీరధర్మ
మును సముద్ధరింపు డిపుడు,
చల్లార్పుడు పాదాహత
సాధ్వీత్వ క్రందనంబు :
అవనతమ్మలైన యట్టి
న్యాయధర్మములను వేగ
సన్మానింపుడు మీరలు.

*ధృతరాష్ట్రుడు*

సంతాపానలముచేత
జర్జరితంబైన నాదు
స్వాంతమునందో మహిషీ,
ప్రహరించుచు నుంటివి ని
ష్ప్రయోజనమ్ముగ నిప్పుడు.

*గాంధారి*

వేధించుటలేద, నాథ,
వేదన నను శతగుణముగ ?
దండితు డగు వానితోడ
దండదాత సమానాఘా
తముతో దుఃఖించు నెపుడు
తద్విచారణమ్మ ప్రభూ,
తద్దయు సర్వోత్కృష్టము,
ఎవ్వని కోసము ప్రాణ
మ్మెట్టి వ్యథయు పొందకుండు
అవ్వానివి దండించుట
అగును బలాఢ్యం దొనర్చు
నన్యాయాచరణము సుమ
ఏ శిక్షావేదన మీ
రీయలేరో ఆత్మజునకు
దాని నేరి కీయవలదు

తనయుండేకాడు దోషి,
తండ్రియైన కావచ్చును;
అతండు మహాపరాధి
యైన యెడల విచారకులు
అతనికినిగూడ మీరె.
అందరమును విశ్వవిధా
తృని సంతాన మటంచును
వినియుంటిని; వియతముగా
తన పుత్రుల విచారణము
తన హస్తమ్ములతోడనె
ఆ నారాయణుడొనర్చు.
వ్యథ కలిగించును, సమముగ
వ్యథ నొందును దానితోడ.
అట్లు పొందకుండినచో
ఆయనకే విచారించు
నధికార మ్ముండబోదు.
ఈ శాస్త్రము లభియించిన
దీ మూఢాంగనకు హృదిని.
పాపియైన పుత్రుని విచా
రింపక క్షమియింతు రేని
ఎంతమంది యపరాధుల
కిట్టుల నిరవధికముగా
నెన్ని శిక్ష లొసగినారొ
అన్నియు నవి, మహారాజ,
మరల దండదాతయైన
నరపతినే పొందుచుండు.
న్యాయమ్మును విచారించు
నప్పటి మీ మమత్వమ్మె
పాప మగుచు మిమ్ములనే
బాధించును : త్యజియింపుడు

పాపియైన సుయోధనుని.

ధృతరాష్ట్రుడు

చాలింపుము ప్రియురాలా,
చాలింపుము నీ వాక్కులు.
ఎట్టులైన మోహజాల
మేను త్రెంపివేయజాల
ధర్మకథయు కేవలమ్ము
తగ వ్యర్థము సుకఠోరము
నగు వ్యథ కలిగించుచుండె.
అపరాధి యగు కుమారుడు
ఆ విధాతకును త్యాజ్యం,
డాతని నాయనయె పరి
త్యజింపలే కున్నవాడు ;
ఆయన కే నొక్కండను.
కొమరుం డుస్మత్త తరం
గముల నడుమ తన తనువును
అర్పించుచు నుండ జూచి
అవ్వానిని వదలి యెట్టి
హృదయముతో నరుగువాడ ;
వదలినాడ నుద్ధరించు
నాశ; అయిన వక్షమునకు
హత్తుకొనుచునుంటి వాని ;
వానితోడ నేను నాకే
పాపమ్మున దూకుచుంటి
మునిగి నే నొకే వినాశ
మున బడి మరణించువాడ
అవ్యాకులితుండ నగుచు.
ఆతని దుర్గతిలో నే
నందువాడ భాగమ్మను ;
ఆతని దుర్మతిలో నే

ననుభవింతు సగము ఫలము :
అదే నాకు సాంత్వనంబు.
ఇప్పు డిక విచారింప
వియ్యది సమయమ్ము కాదు
లేదు ప్రతీకారమేమి,
లేదు మార్గ మెట్టిదియును.
ఘటింపవలసిన దేదియొ
ఘటియించిన : దిక ఫలింప
వలసినదియు ఫలియించును.

ప్రస్థానము
*గాంధారి*

ఓ నా యశాంతహృదయమ
ఉండుమింక సుస్థిరముగ;
వంచిశిరము ధైర్యముతో
ప్రతీక్షించుచుండుమీవు
ఇక నా విధివిధానమును.
ఏ దినమున దీర్ఘరాత్రి
అంతమందు మేలుకాంచి
అపుడె తన్ను కాలము శో
ధనము చేసికొనునొ, అట్టి
దినము ఘోరదుఃఖదినము –
తాపముచే దుస్సహంబు.
కదలక గతిహీనమగుచు
నిదురించుచునున్న వాయు
వాకస్మికముగ మేల్కని
అగుచుతాను ఝంఝూవిల
మాత్మీయజడత్వంబును
అక్రమించుకొవినయట్లు;
తెరపిలేక గ్రుడ్డితేలు
దీప్త వజ్రశూలమువలె

తన భీషణపుచ్ఛముతో
తనశిరమునె కుట్టునట్లు-
ఆ లీలను కాలమెపుడు
మేలుకొనునొ, అపుడు దాని
అకాల మని యెల్లవార
లందురు కడు భయముతోడ.
వంచుము, శిరమ్ము వంచుము,
ప్రణమిల్లుము, రమణి, నీవు
అట్టి మహాకాలమునకు.
అదిగొ వజ్రఘర్ఘరిత
మ్మట్లు దాని రథచక్రపు
టారావము రుద్రలోక
మునుండి సుదూరముగా
వినంబడుచునుండె; నీదు
శిథిలమ్మను నార్తమ్మగు
హృదయమ్మను స్థాపింపుము
ఆ రథమార్గమ్మునందు.
అంతట ఛిన్నము సిక్తము
నైన హృదయపిండ రక్త
శతదల మంజలి ఘటించి,
జాగరిల్లి, నీరవముగ,
నిర్నిమేషముగను నీవు
నిరీక్షించుచుండు మింక.
పిమ్మట గగనమున నెపుడు
దుమ్ములు రేగునొ, ధారుణి
కంపించునొ హఠాత్తుగను,
క్రందనంబు శూన్యంబున -
అయ్యో, అయ్యో రమణీ,
అకటా ఓసి యనాథా,
అక్కటకట వీరవధూ,

అయ్యయ్యో వీరమాత,
అని హాహాకారము లెపు
దన్ని యెదల బయలుదేరు
నపు దవనత శిరముతోడ
అక్షులు మూసికొని ధూళి
యందు దొర్లుచు పడి : పిదప-
నమో నమో విశ్రుతపరి
ణామా- నిర్వ్యాజనిర్మమ
ఘోరకరుణశాంతి నమ
స్కారో, నమః కళ్యాణ
కఠోరకాంత, నమస్కృతిః
ద్వేషఘోర సుఖా, నమః
ప్రేతభూమి భస్మశీర్ష,
పరనిష్కృతి నమో నమః.

దుర్యోధన మహిషి భానుమతి
ప్రవేశము దాసీగణముతో

భానుమతి

పరభృతికే, ఇందుముఖీ!
వస్త్రమాల్య భూషణమ్ముల
అలంకరింపుము శిరమున.

గాంధారి

మెల్లమెల్లగ, హే వత్సే!
ఏమి మహోత్సవము నేడు
ఈ పౌరవ భవనమ్మున?
ఎట కేగెదు వస్త్రాలం
కృతులను ధరియించి, వధూ!

భానుమతి

శత్రు పరాభవ శోభన
సమయమ్ము సమాగతమ్ము.

*గాంధారి*

ఆత్మీయ జనం బేరికి
అగుదురొ శత్రువులు వారి
కాత్మయె నిత్యము శత్రువు,
అరాతి ధర్మము వారికి-
అజేయమగు శాత్రవుండు.
ఆ నూతన భూషణములు
హే కళ్యాణీ, యెవరివి ?

*భానుమతి*

ఇవి పాంచాలికి తదీయ
పంచపతులు భుజ బలమున
వసుమతి జయించి యొసగిన
రత్నమణి విభూషణములు.
ద్రౌపది దేహమున నుండి
ఈ మణిమయ భూషణములు
ఎల్లెడ యజ్ఞదినంబున
సంపదహంకారములను
శతసూచీ ముఖములతో
వెదజల్లిన ; వీ కురుకుల
సుదతుల హృదయములలోన
పొడుచుకొనిన ; వవ్వానివి
పోవునపుడు వనికి వార
లలంకరించుకొనుచుంటిని.

*గాంధారి*

హాహా ఓ మూఢురాల,
జనియింపగలేదు నీకు
జ్ఞాన మింక ; నా రత్నమ
యా భరణములు ధరించియు
నంత యహంకార మొక్కొ !
ఏమి యీ ప్రళయ వేష,

మేమి యీ భయదకాంతి।
ఆ మణిమంజీరంబులు
అల్ల యుగాంతోల్కలట్లు
నిను దహియించుట లేదా?
నీదు సుసౌభాగ్యమునకు
ఆ మణిమయ లాలాటిక
అశని వహ్నిశిఖయె సుమ్ము।
నిను చూచినయంత నాదు
తనువునందు సంచరించె
సాధ్వసంపు ప్రస్పందము;
జనించె దుఃఖము మనమున-
ఉన్మాదిని యగు శాంకరి
యుద్ధృత తాండవఝంకృతి
గొనివచ్చెడి చెవులకు నీ
మణిమయభూషలు గనంగ.

భానుమతి

తల్లి, మనము క్షత్రియవని
తలము భయమునడ మెప్పుడు
దురదృష్టమ్మనకు నుంత,
పరగు జయమ్మొక్కసారి.
పరాజయము వేరొక పరి;
వరలును క్షత్రియమహిమా
భాను దభ్రమధ్యమునం
దొక్కసారి, అస్త్రాద్రిని
నొక్కతూరి; తల్లి! దాని
సంస్మరించి క్షణము సేపు
శంకాహృదయముననుండు
క్షత్రియ వీరవధూమణి.
సంకటమున భయంపడదు.
దుర్దిన దుర్యోగమ్ములు

తోరముగా వచ్చునేని,
అననుకూల భాగ్యమ్మును
అపహాసముతోడ చరచి
ఎట్టుల మరణింపవలెనొ
ఎరుగుదు, నోదేవి, యింక
నెట్టుల జీవింపవలెనొ
ఏ మీ శ్రీ చరణమ్ములు
సేవించుచునుండి తగిన
శిక్ష పొందియున్నదాన.

*గాంధారి*

ఆ యమంగళము, వత్సె,
అకట కాదు నీ కొకతెకె;
నిజపక్షంబును నా క్షుధ
నిశ్శేషము చేయునెపుడు
హాహాకారములు లేచు
నపుడె, యెన్ని వీరరక్త
వాహినులం దెంతమంది
పతిహీనల బాష్పధార
లపుడు పడునొ; వధూజనము
హస్తమ్ములనుండి మణిమ
యాభరణము లూడి పడునొ—
ఆ ఝుంఝూవాతములకు
ఆమ్రలతా కుంజవనము
నందలి మంజరులరీతి.
వత్సె, భంగింపవలదు
బద్ధసేతువును, విప్లవ
కేతువు నెత్తంగవలదు
గృహమున క్రీడాచలమున.
అరయ నేడు కాదు మనకు
నానందించెడి దినమ్ము—

స్వజనుల దుర్భాగ్యవేళ
శరీరమ్మునిండ నలం
కరణం బొనరించుకొనుచు
గర్వపడగవలదు, తల్లి !
నేటినుండి చిత్తశుద్ధి
నెరయ నిగ్రహమ్ముతోడ
ఉపవాసవ్రతము గొనుము ;
ఊడదీసి వేణి నీవు
శాంతాంతఃకరణముతో
సలుపుము దేవార్చనమ్ము.
ఇట్టి పాపసౌభాగ్యపు
పెగ్గుదినమునందు నీవు
గర్వాహంకృతులతోడ
కలిగింపకు లజ్జ ప్రతి
క్షణమునందు విధాతృనకు.
కలాపములు నూతన ర
క్తాంబరమ్ము తీసివేసి,
ఆపివేయు ముత్సవ వా
ద్యమ్ములు, రాజాడంబర
మంతయు బిడ్డా, నీవిక
అగ్నిగృహమ్మునకు పొమ్ము ;
ఆహ్వానించి పురోహితు,
కాలమునకు ప్రతీక్షించు
కరము శుద్ధచిత్తముతో.

భానుమతి ప్రస్థానము.

ద్రౌపదితో పంచపాండవుల ప్రవేశము.

*యుధిష్ఠిరుడు*

జననీ ! ఆశీర్వాదము
గొన వచ్చితి నీదుకోలు
సమయమందు ;

*గాంధారి*

వత్సలార !
సౌభాగ్యద్యుమణి యింక
ద్విగుణోజ్వలముగ నుదయ
మ్మగును దుఃఖరాత్రి చివర.
అనిలుని నుండి బలంబును,
అర్కునుండి తేజంబును
పుడమినుండి క్షమాధైర్య
ములను పొందుదో దుఃఖ
వ్రతులారా, పుత్రులార !
దైన్యమందు రహస్యముగ
దాగియుండి రమాదేవి
దీనకపట వేషముతో
తిరుగుచుండు మీవెంటనె ;
సర్వదా రహస్యముగను
సంచయ మొనరించుచుండు
నక్షయ సంపద మీకై
ఆర్తినుండి యెల్లప్పుడు :
ఈ నిర్వాసమ్మె మీకు
ఎల్లప్పుడు నిర్భయ మగు ;
అఘము వినా దుఃఖభోగ
మందు దీప్త తేజమ్మును
అగ్నిశిఖాదగ్ధదీప్త
మైన సువర్ణంబు వోలె
అనుషంగము సలుపుచుండు.
అట్టి మహోదుఃఖము మీ
కగును మహాసాహాయ్యము ;
ఆ మహోదుఃఖమందు
ఆ ధర్మప్రభువు విధియు
అధమర్ణుడు కాగలండు ;

ఆయన తన ఋణమును నిజ
హ_స్తమ్ములతో శోధన
మొనరించిన యపుడు జగతి
మనుజాలు దేవత లెదురుగ
మీ సరణిని నిలుతు రెవరు ?
నా సుతు డొనరించినట్టి
ఆ యపరాధముల నెల్ల
నా యాశీర్వాదమ్మే
పూ_ర్తిగ ఖండించివేయు.
పుత్రాధిక పుత్రులార !
అన్యాయాధిక పీడన
మా గభీర కళ్యాణ మ
హా సింధువును మథించును.

[ద్రౌపదిని కౌగలి చుకొని.

హే రాహుగ్ర_స్త శశీ,
హే భూలుంఠిత సువర్ణ
లతికే, వత్సే ! ఒకపరి
లలాటమ్ము నె_త్తి సరిగ
నాలింపుము నా పలుకులు :
ఆతని యవమానమ్మును
నీ యవమానమ్ముతోడ
నిలిచిపోవు శాశ్వతముగ -
అక్షయమౌ కలంకముగ.
అఖిలావనిలోని కులాం
గన లెల్లరు భాగములను
గ్రహియించిరి, వత్సే నీ
యవమానపు రాశిలోన—
ఆ కాపురుషత్వ కర
మ్ముల చేతను సతీమణికి
కలిగిన యవమానములో.

అరుగుమింక పతులగూడి
అమలిన వదనమ్ముతోడ,
అరణ్యమును స్వర్గలోక
మట్టుల కావింపు మీవు ;
సుఖ మొనరింపుము వంతను,
సుదుస్సహమైన పతుల
వెతను హృదయమున వహించి
సతీత్వమ్ము సార్థకమ్ము
సలుపుకొనుము; రాత్రిం దివ
ములు రాజ గృహమ్మునందు
అనేక సుఖములకోసము
ఆయోజనములు జరుగును;
అడవిని నీ వేకాకిని;
వఖిలసుఖం, బఖిలసంగ,
మఖిలైశ్వర్య విశిష్టత,
అఖిలసాంత్వనం బచ్చట
అరయగ నీ వొక్కతవే ;
అఖిలమునకు నాశ్రయంబు,
శ్రమంబునకు విశ్రామము,
శాంతి, వ్యాధులకును సేవ,
శుభలక్ష్మియు దుర్దినముల,
సుభూషణము తిమిరమునకు,
మూర్తిమతి ఉషస్సు నీవె ;
పొలుపుగ సర్వప్రీతియు,
సర్వ సేవయును, గృహిణివి,
జననివి నీ వొక్కతెవే ;
సతీత్వ ధవళాంభోజము
సంపూర్ణ సౌరభముతో
శతదళములతోడ విచ్చి
జాగరిల్లు గౌరవముగ ;

## వైశాఖము

హే భైరవ, రౌద్రమూర్తి,
హే వైశాఖా, పరాగ
ధూసర పింగళ చంచల
మాసర జటాజాల జూట,
భీమతపః క్లిష్టదేహ !
భీకరమైన విషాణము
పెట్టుకొనుచు నోటిలోన
పిలుచుచు నున్నాడ వెవరి ?
ఓహో వైశాఖ, రౌద్ర,
ఓహో భైరవమూర్తీ !

దగ్ధతామ్ర వర్ణదిగం
తములందలి యే వివరము
లందునుండి ఛాయామూర్తు
లగు నీ యనుచరు లెల్లరు
అరుగు దెంచుచున్నవార
లతిరయమున; కానరాని
భీకరనృత్యంబుతోడ
ఆకసమున మధ్యాహ్నము
విశ్శబ్దముగా చురుకుగ
నీ యనుచరులగు ఛాయా
మూర్తులు మత్తెక్కినారు.

మొనసి నృత్యమొనరించుచు
బడలి నీదు పరిజనములు
విడుచుచున్నవారూర్పుల
వీతిహోత్రకిరణమ్ముల.
ఉండి యుండి దహియించుచు.

మెండు జవంబున గిరగిర
తిరుగుచున్నారువారు;
తృణపర్ణమ్ములను సుడిని
త్రిప్పుచు, ధూళికణమ్ముల
గగనమునన్ ఘూర్ణమాన
గతి నావర్తింపించుచు
విడుచుచున్నార లూర్పు
వీతిహోత్రమయూఖముల.

జలములేని యేటిదరిని
సస్యహీన తృషాదీర్ణ
మరుభూమి ప్రవాసివోలె
అరుణనేత్రములు లలాట
భాగమునకునెత్తి బద్ధ
పద్మాసనమున వసించి
ఉదాసీనభావముతో
నున్నారవు శీర్ణయతీ!

లోలుపములు చితానల
జ్వాలలు సువిశాలమైన
నీలాకాశము నాకుచు
నీ కెదురుగ జ్వలియించును;
అతీతవత్సరములందు
అఖిలజనులు త్యజియించిన
మృతస్తూపముల నొనర్చు
చితి బూదిగ నీ యెదుటనె.

వైరాగీ ఇంక శాంతి
వరియింపు; ముదారవాణి

ప్రసరించుత కుడి యెడమల ;
ప్రవాహమ్ము దాటిపోయి
పూర్ణము కావించి భూమి
పోవుగాక ప్రతి పల్లికి.
బైరాగీ, ఇంక శాంతి
పఠియింపుము, బైరాగీ ;

మంత్రముతో పాటుగ నే
మర్మభేది యగు దుఃఖము
విస్తరిల్లు గాక నిఖిల
విశ్వంబున ; క్షీణజాహ్న
వీ క్రాంత స్వరమునందు,
అలసిన కపోత గళమున,
అశ్వత్థఛాయలోన –
బాధ దయామంత్రముతో
పాటు విస్తరిల్లుగాక ;

సుడివడు నీ పూత్కార
క్షుబ్ధంబగు ధూళితోడ
సుఖదుఃఖంబుల నాశా
నిరాశలను సమానముగ
నింగికి వ్యాపింప నిమ్ము :
నికుంజమున రాలు పూల
వాసనతో నిండనిమ్ము
వ్యాకుల గగనతలంబును.

తావకీన గైరిక వ
స్త్రంపు కొంగు పరపుమయ్య :
జరామృత్యు క్షుత్తృష్ణల,

జనసమూహ చింతాకుల
స్వాంతంబుల వైరాగ్య
చ్ఛన్నంబులు గావించుము.
గైరికవసనాంచలమును
గగనమునం బరపుమయ్య!

ఓ భైరవ, రౌద్రమూర్తి
ఓహోహో వైశాఖా!
ఉద్ఘోషింపుము, మధ్యాహ్న
తంద్ర వదలి, నిద్ర లేచి,
ద్వారమువెలి కరుదెంతును;
దగ్ధతృణప్రాణి శూన్య
చక్రవాళ మీక్షింతును
శాంతముగా నీరవముగ.
ఓ భైరవ రౌద్రమూర్తి
ఓహోహో వైశాఖా!

మే 1900 కల్పనా

## నూతన వర్షము

నేడు మయూరమ్మువోలె
నృత్య మాడు నా హృదయము—
నృత్య మాడు నా హృదయము
నేడు మయూరమ్మువోలె.
బహువర్ణంబుల గూడిన
భావోచ్ఛ్వాసంబు నేడు
నీలకంఠకలాపమ్ము
వోలెను వికసించె నోయి!

ఆకులితప్రాణంబులు
ఆకాశమువంక జూచి
ఉల్లాసంబున నెవ్వరి
నో యాచనచేయు నోయి!
నేడు మయూరమ్మువోలె
నృత్య మాడు నా హృదయము.

మృదు గంభీరధ్వనితో
మేఘము గర్జించు నోయి!
అంబుద ధారలు పరుగున
సరుగుదెంచుచున్నవోయి!
నూతన ధాన్యపు మొక్కలు
ఆతతముగ నూగునోయి!
కపోతములు కులాయముల
కాతరమున కంపమొందు.
బెకబెకలాడుచు నున్నవి
పెల్లుగ మండూక వితతి.
మృదుగంభీర ధ్వనితో
మేఘము గర్జించునోయి!

జలధరాభ్ర నీలాంజన
మలముకొనియె నా కన్నుల;
ఘన విపినచ్ఛాయను నవ
తృణదళంబునన్ మదీయ
హృదయము విప్పారినయది;
వికసిత మత్ప్రాణంబులు
విహారమ్ము చేయునేడు.
జలధరాభ్ర నీలాంజన
మలముకొనియె నా కన్నుల.

ప్రాసాదాగ్రమున వేల
దీసినారు నే దెవ్వరు
కేశపాశముల కబరీ
కేశపాశముల నోహో!
నవనీరద నీలవసన
మెవరు లాగి రొమ్ముమీద
విద్యుదగ్ర చంచలాభ
విహరించెడివా రెవరో!
ప్రాసాదాగ్రమున వేల
దీసినారు కబరి నెవరు!

ఎవరు నదీతటమునందు
తృణతలమున గూరుచున్న
వారు తాల్చి స్వచ్ఛమైన
వస్త్రంబును శ్యామమైన
వసనము, వారెవరోహో!
చూచుచున్న దెవ్వారిని
సుదూర గగనమున నామె?
ఘట్టమ్మును విడిచి యెటకు
ఘటము తేలిపోవునహో!
ఎవరాయమ దంతంబుల
నవమాలతి మృదుదళములు
పరధ్యాన పరాయణత
కొరికివేయుచున్నదెవరు?

నే డూయెల నూగునెవరు
విర్జన వకుళోపవనిని?
పొగడలురాలును జరజర,
గగనమ్మున వ్యాకులమగు
తదీయ వసనాంచలంబు,

ముంగురు లాడుచు గాలికి
మూయుచున్న వామె కనులు-
ఊదిపోవు కబరితోడ
ఊయెల నూగుచున్నదెవరు ?

వికచకేతకీసుమతట
వికటంబున నిజతరణిని
నిలిపి కట్టువారెవరో ।
శైవాలదళంబులెవరు
చలదంచలమున రాశిగ
సంతరించు వా రెవరో ।
బాష్పపూర్ణ నయనంబుల
ప్రాణహారిణివి రాగిణి
పాడుచున్నవారెవరో ।
వికచకేతకీ సుమతట
వికటంబున తరుణతరణి
నిలిపికట్టువా రెవరో ।

నేడు మయూరమ్మువోలె
నృత్యమాడు నా హృదయము.
ప్రవహించును ఘనధారలు
నవపల్లవ వితతిమీద
జరజర; ఝిల్లీరవమున
అరణ్యంబు కంపించును;
ఒరసికొనుచు కూలంబుల
పరుగువారు వడివడిగా
కల్లోలిని కలరవమున
పల్లిసవిధమ్మునందు
నేడు మయూరమ్మువోలె
నృత్యమాడు నా హృదయము ।

2-6-1900 కవికా

# విరహము

చనిన యపుడు నీవు రెండు జాములైనవి;
అంబరంబు నడుమ నుండె నపుడు సూర్యుడు,
కాయుచుండె నాతపంబు ఖరతరంబుగా.

ఎల్లపనులు పూర్తిచేసి యింటిలోపల
తోరణ గండ్లయందు నేను కూరుచుంటివి
ఒంటిదాన నేమేమో యోచన చేయుచును,
చనిన యపుడు నీవు రెండుజాములైనవి.

చైత్రమాసమందు బహుక్షేత్రసీమల
వివిధ పరిమళముల గొనుచు వేడిగాడుపు
తెరచియున్నవాకిట వీతెంచు చుండెను.
శాంతిలేక పావురములజంట దినమున,
ఒక్కమొగిని గుబాళించుచుండె గృహమున,
బహు క్షేత్రవార్తల గొని భ్రమర మొక్కటి
ఝంఝం రొదతోడ తిరుగుచుండె నింటిలో.

మార్గములో లే రెప్పుడు మనుజులెవ్వరు,
గ్రామముండె నపుడు క్లాంతి కాతరమ్ముగా,
ఉర్వీరుహము శాఖలయందుండి రావము
ఉప్పతిల్లె కొంచెమైన ఉడుగకుండగా,
ప్రాణి నొకతెనే యప్పుడు బహుదూరమునుండి
చేరు వేణు తానముతో కూరిచినాను
అంబరమున నెవ్వని నామాక్షరంబులో;
మార్గములో లేరప్పుడు మనుజులెవ్వరు,
గ్రామముండె నపుడు క్లాంతి కాతరమ్ముగా ః

ప్రతిగృహాన ద్వారమ్ములు బద్ధమైనవి.

మెలకువతో నుంటి నేను; మృదువాయువులో
కట్టుకొనని నాదు కురులు కదలుచున్నవి.
తటతరువుల చాయక్రింద తటిని జలముల
తరగలు లేచుటయె లేదు; త ప్తగగనము
శ్వేతాలస మేఘమ్ముల శిథిలమైనది.
ప్రతిగృహాన ద్వారమ్ములు బద్ధమైనవి.

చవిన యపుడు నీవు రెండుజాములైనవి.
కాలియున్న శుష్కపథము నేలమీదను
కాయుచుండె నాతపమ్ము ఖరతరమ్ముగా.
సాంద్రమైన వటశాఖా చ్ఛాయలోపల
పారావతయుగ్మమ్మె పలుకుచుండెను;
శూన్యశయన మందిరమున సోరణగండ్ల
ఒక్కతెనే కూరుచుండియుంటిని నేనే ;
చవిన యపుడు నీవు రెండుజాములైనవి.

3-6-1900 క్షణికా

## కృష్ణకలి

అమెను నేను కృష్ణకలి
యందు ; పల్లెలోనివారు
అందురు కాళి యనుచు ; మబ్బు
లావరించినట్టి నిందు
నల్లపిల్ల నీలహరిణ
నయనంబులు గాంచినాను
పొలములోన ; లేదాయమ
తలమీదను మేలిముసుగు.
దొరలుచుండె ముక్తవేణి

పిరుదులపై, నల్లనిదా ?
నలుపైనను హరిణనీల
నయనంబులు గాంచుచుంటి

చిక్కని మేఘాలవలన
చీకటి గ్రమ్మినది ; రెండు
నల్లగోవు లంబా యని
పెల్లుగ ధ్వని చేయుటచే
వ్యాకులమున శ్యామకన్య
వదలి తనదు కుటీరమ్ము
ఈవల కరుదెంచి త్రస్త
భావముతో బొమలు ముడిచి
వియత్పథము వంక జూచి
వినెను మరల మేఘగర్జ
నల్లనిదా ? అయిన నెంత
నలు. పాయమ నీలహరిణ
నయనంబులు గాంచుచుంటి.

తూర్పుగాలి వేగముగా
తోలిన దున్నట్టులుండి
ఒక్కగాలి తరంగంబు
ఊచివేసె పంటపొలము.
ఒంటిగ నిలిచితి గట్టున,
ఒరులు లేరు పొలములోన.
నన్ను గనుంగొనెనా లేదొ
నల్లపిల్ల, నే నెరుగుదు
పిల్లకు సైతము తెలియును ;
నల్లనిదా ? అయిన నెంత
నలు, పాయమ నీలహరిణ
నయనంబులు గాంచుచుంటి.

ఇట్లె జ్యేష్ఠమాసమందు
ఈశాన్యపు దిక్కునుండి
కజ్జల తుల్యంబులైన
కాలమేఘములు జనించు.
ఆషాఢంబున నిట్లే
శ్యామల కోమల కాంతులు
అవతరించు తమాలాటవి.
ఆకస్మికముగ శ్రావణ
యామినియందీ తీరున
అతిశయించె చిత్తంబున
హర్షము ! నల్లని దొక్కొ-
నలు పయినను, నీలహరిణ
నయనంబులు గాంచుచుంటి.

ఆమెను నేను కృష్ణకలి
యందు నన్య లేమన్నను.
మయనాపాడా ప్రదేశ
మైదానమునందు నేను
నల్లపిల్ల నీలహరిణ
నయనంబులు చూచుచుంటి.
శిరముమీద ముసుగుకైన
సిగ్గుకైన వ్యవధిలేదు.
నల్లనిదా ? అయిన నెంత
నలు, పాయమ నీలహరిణ
నయనంబులు గాంచుచుంటి.

18-6-1900 శిలీకా

# ఆవిర్భావము

విహంకాలము క్రిందట నొక
ఫాల్గునమాస దినంబున
వాంఛించుచు నుంటి విన్ను :
వచ్చినావు నీవు నిబిడ
వర్షమునన్ తుంగతుముల
ఫణితిని, నవవారివాహ
గంభీరారావముతో
ప్రాణంబుల మ్రోగుచున్న
గానము పూర్ణము చేయుము
వాన కురియు నీ దినమున.

అవలోకించితి నీ స్వ
ర్ణాంచలంపు టావరణము,
నవ చంపాభరణ మొక్క
నాడు సుదూరమ్మునుండి.

నికటమునకు వచ్చి భవ
న్నిబిడ నీల నూతనావ
గుంఠనమ్ము చూచినాను.
కొంతవరకు తిరిగినాను
చంచల విద్యుద్దీప్తిని.
చంపకాభరణ మేది ?

నిమిషనిమిష మా దినమున
నీవు వనస్థలి తాకుచు
పూరేకుల నూగించుచు
పోవుచుంట కనుగొంటిని.
క్షీణకటిని జుట్టియున్న

కింకిణీ మృదునిక్వాణము
వినబడిన ట్లయ్యె నపుడు ;
వినువీధికి జనెడివేళ
వనతలమును స్పృశియించుచు
తావక విశ్వాస సుగం
ధము లభించు మాడ్కి తోచె.

అరుదెంచితి వీ దినమున
అఖిల పృధివి జుట్టివేసి,
ఆకసంబు నింపివేసి,
ఆకుల కేశములతోడ
పరివేష్టింపంగ నీదు
పాదములకు వనసుమములు.

ఛాయ తావకీన భూరి
సజల సఘన మాయతోడ
ఆవరించె నన్ను ! నేడు
ఆకుల పరచెదవు హృదయ
సాగరోపకూలమందు
శ్యామలాభ సుమవేష్టిత
చరణ ద్వంద్వంబుతోడ

ఫాల్గునమాసమున కుసుమ
వనతలమున గూరుచుండి
నే గూర్చిన దామమ్ములు
నీ కుపహారముగ తగవు.

నే నెచ్చోటికి జనినను
నీ స్తోత్రపు గీతములే
వెనువెంటనె స్వయముగానె

వినవచ్చుచు నుండునాకు.

చిన్నివీణ మీదనున్న
సన్నని తంత్రు లెరుంగవు
తద్గానము మ్రోగింపగ;
తగ దుపహారముగ నీకు.

వృష్టిని దూరీకరించు,
విద్యుద్దర్శనము గూర్చు
క్షణలబ్ధంబైన మూర్తి
అని యెవ్వారికి దెలియును ?
యోగ్యమైన రీతి నీకు
నుండలేదు నా మందన
మని సిగ్గిలజేతువు న
న్నని యెవ్వారికి తెలియును ?
శయనిగృహ ద్వారంబున
సంతరించు పూజార్ఘ్యము
ఏ విధముగ గోచరించె ?

క్షమియింపుమ ఆయోజన
చాలనట్టి ప్రమాదమ్ము.
అపరాధం బెంత యైన
నద్దానిని క్షమియింపుము.

దీపాలోకమున రమ్ము
ధీరముగా తాత్కాలిక
నిర్మితమౌ కుటిలోనికి :
నీ కటాక్షేక్షణమ్ము
వాలుగాక ఈ వేతసి
వంశిమీద : క్షమియింపుము !

నే నుండగ కోరికతో
నీపై నూతన ఫాల్గున
మాసంబున రావైతివి.
ఈ సమయమునందైనను
అరుగుదెమ్ము ; చేలాంచల
మాకసమున వ్యాపింపగ
పారద్రోలి స్వప్నంబుల,
ప్రాణమ్ములు నింపుచున్న
గానమ్మును పరిపూర్ణము
కావింపగ నరుదేరుము
ఈ వర్షాదినమునందు !

24-6-1900 క్షణికా

## ఉద్బోధనము

ఓ నాదు ప్రాణమా, ఊరకే పాడుమా
కారణము లేకుండ క్షణిక సంగీతమ్ము
క్షణికదివసావలోకమ్ములో ఈనాడు !
ఎవరు వచ్చుచు పోవుచున్నారో
ఎవరు నవ్వుచు చూచుచున్నారో
ఎవరు వెనుకకు తిరిగి కన్గొనరో
ఎవరు పరుగిడుదురో నృత్యాన
ఎవరు ప్రశ్నింపరో దేని
ఎవరు పుష్పించి రాలుదురో
అట్టివారలకొరకె ప్రాణమా,
క్షణికసంగీతమ్ము పాడుమా,
క్షణిక వాసరకాంతిలోన.

ప్రతినిమేషములోని కథను

అతుకబోకుము కూరుచుండి.
స్మృతివాహినిని సాగనిమ్ము,
ఎవరు వత్తురో వారి రానిమ్ము,
ఏ మగునో దాని కానిమ్ము,
వెడలిపోయెడి వారి శోకమ్ము
తుడిచివేయుట మేలు సుమ్ము
ప్రతినిమేషము రాగరాగిణుల
పాడుచును భూర్భువమ్ములకు
పరుగిడెడి వారి నాపకుము—

ముగియుదానిని ముగిసి పోనిమ్ము,
తెగిపడిన దండలో పూలు
తిరిగి కూర్పగ నీవు పోవకుము,
తెలియకున్నట్టి జనములకు
తెలుపగా నీవు పోవకుము,
నీకు లభ్యులుకాని వారలను
నెమకంగ యత్నించబోకు,
ప్రాప్తమైనది యేది గాని
తృప్తి తీరకముండె నీకు
తెరలుచో దాని పోనిమ్ము.

నిలుపు మోయీ, నీదు రోదనము ;
నిజముగా బిగియించుకొన్న
బంధమును రెండు హస్తాల
పారవేయుము తెంచి పటపటని ;
సహజముగ నెవ్వరున్నారో
సముఖమున వారినే పిలిచి
ఆదరమ్మున నీవు వారి
హత్తుకోవలె హృదయమునకు,
సాధ్యములు కాని వెన్నున్న

సంపూర్ణ మొనరింపవలయు
సద్యఃకృతులు వోలె వాని
క్షణికోత్సవం బోయి నేడు,
క్రందనం బాపుకోవోయి ।

నీవు పరుగెత్తవలె నేటి
నీటిపై బడు కాంతి తళతళ
కారణం బేమి లేనట్టి
భూరి హర్షమ్ముతోడుతను.
ధరణిపై శిథిలబంధమున
తళతళల కాలయాపనము
చేయగా నిమ్ము జీవితము
శిశిర హిమబిందు సంస్పర్శ
పులకలంగాంచెడి శిరీష
పుష్పకింజల్కముల రీతి
నీ వకారణ హర్షమునను
నిండిపో గానతానమున.

జూలై 1900 క్షణికా

## ప్రతిజ్ఞ

కాను నేను తాపసుండ
కాని జనము లేమియన్న,
తోడుగాను తపస్వినియే
దొరకకున్న కాను, కాను.
నేను కఠినపణము పెట్టి
నాను: లేక వకుళవనము,
తలచినట్లు నా మనస్సు
తానె జయము పొందకున్న,

తాపసురాలు దొరకకున్న
తపసిని నే కాను, కాను.

విడువనేను మందిరమ్ము
వెలుపల సన్యాసికాను,
ఎవ్వరేని ఇంటిబయట
ఈ లోకము మరపించెడి
హాసమ్మే చేయకున్న
నే సన్యాసినినే కాను
కమ్మని మారుతములోన
కదలి కదలి నీలాంచల
మాటలాడకున్న యెదల,
హాటకకంకణనూపుర
శింజానము మ్రోగకున్న,
చిక్కకున్న తపస్వినియె,
కాను కాను సన్యాసిని—
కాజాలను కాజాలను.

నేను తపసి కానేరను
నీ యాన । తపోబలమున
నూతనహృదయమునందొక
నూతన భువనము సృజించి
వీణావాదనముతోడ
వివృతము కావింపకున్న,
ఏదో మర్మద్వారము,
ఏదో నూతననేత్రపు
టింగితమ్ము గ్రహియింపక,
తపస్వినియె లభియింపక
తాపసి నే కాను కాను.

## యథాస్థానము

ఓసి నా గీతికా, ఏ సంతలో నీవు
భావింతు వమ్ముడై పోవగా గీతికా. ।
స్థాన మెట నీకు విద్యారత్నవల్లిలో
పండితుల్ కూర్చుండుపట్టునన్ నశ్యంబు
ఆవరించును రేగి ఆకాశతల మెల్ల,
సాధ్య మెవ్వారి కచ్చట నిల్చుటకునైన ।
అచట రేయింబవ ళ్లతిసూక్ష్మతర్కంబు—
తైలంబు పాత్ర కాధారమా ? పాత్రమే
తైలంబునకును నాధారమా ? – అని సాగు.
అచట మోహధ్వాంత మంతంబు చేయగల
పుస్తకంబులు కలవు ; పోయి నీ వందులో
ఒకదానిలో పీఠ మొంద గోరుదు వాకో ?
ఆలించుచును గీతి ఆ వాక్కు లేదులే
దని యుత్తరం బిచ్చె గునగునద్వారమున.

ఓసి నా గీతమా, ఏ సంతలో నీవు
భావింతు వమ్ముడై పోవగా, గీతమా ।
ఇప్పు డాకర్షణం బే దిక్కునను నీకు ?
పాషాణనిర్మితప్రాసాదములయందు
శ్రీమంతు లెందరో చేయుదురు వాసంబు ;
నిండుగా నుండు సుస్నిగ్ధమ్ములౌ దేవ
దారు చెక్కలతోడి బీరువా లన్నిటను
అలరారు కోశమ్ము లయిదువే – లవ్వాని
పైన చిత్రితమైన పసిడి వ్రాల్ చెరగలే
దెవ్వాడు తెరవబో దెన్నండు పత్రముల్.
ఆస్వాదితము కాని ఆఘ్రాతముం గాని
యూథికాకుసుమాల యోజ నుండను కృతులు.
దులుపుదురు సేవకుల్ ధూళి ప్రతివాసరము

చక్కగా గనబరచు జతనమే వారలది.
యాత్ర చేయుదు వొకో అటకు ఛందోమయీ !
గీత మా పలు కాలకించి గునగున మనుచు
కర్ణమూలమునందు కాదు కా దని పల్కె.

ఓసి నా గీతమా, ఏ సంతలో నీవు
భావింతు వమ్ముడై పోవగా, గానమా !
సమ్మాన మెచ్చోట సంభవించును నీకు ?
సమవేతులై పరీక్షల చదువుకై నూత్న
విద్యార్థు లున్నారు : వీరి మనసులు మాత్ర
మెటనుండి యెచటికో ఎగిరిపోవుచునుండు.
తెరచియున్నవి ముందు నిరుపయోగములైన
గ్రంథముల్; పెద్దవారల భీతి కావ్యముల్
కూర్చియున్నవి గోడ గూళ్ళలో పెల్లుగా.
క్రీడింతువా వీరి క్రోడమ్ములో చపల !
ఆ వాక్కు లాలించి దై ్వవిధ్యమున దాల్చె
గానయ్ము మౌనమ్ము గమన విషయమ్ములో.

ఓసి నా గీతమా, ఏ సంతలో నీవు
భావింతు వమ్ముడై పోవగా, గానమా !
త్రాణ మెచ్చట నీకు ? ధనకోశగృహమునన్
లక్ష్మివధూటి సంలగ్నమై యున్నయది.
అవకాశము లభించునపుడెల్ల వేగమే
తన కక్ష్యకుంటోయి తలగడం గదలించి
క్రింద నిహితంబైన గ్రంథంబు దీసికొను
వెలుపలికి, తన బిడ్డ చిలిపి చేష్టలవలన
ఛిన్న భిన్నంబులై చెదరియుండును పుటలు–
కజ్జలము పెట్టుకొని దిద్ది సిందూరంబు
పటవాసములు కేశపటలిలో నింపుకొని
చిన్న వేషంబుతో చేరం దలంతువే

శయ్యాసమీపంబు సత్వరంబుగ నీవు ?
ఎదమీద నిట్టూర్పు వదలి, లోభభరాన
గానమ్ము స్తబ్ధమ్ముగా నుండె నవ్వేళ.

ఓసి నా గీతమా, ఏ సంతలో నీవు
భావింతు వమ్మడై పోవగా, గానమా!
ప్రాణమెచ్చట నీకు ప్రాప్తించు ? నెచ్చోట
ఆనందపరవశంబై విహారముచేయు
తరుణు లన్యుల దృష్టి తప్పించుకొనుటకై
అన్వేషణముచేయు నంధకారము కొరకు,
వినిపించు పాటలన్ విహగముల్ వారికై.
వాహినుల్ వినిపించు వారికై గాథలను,
సరళ హాసధ్వనులు సజల నేత్రంబును
విశ్వమోహన మురళి వెల్లివిరియుచునుండు;
అచ్చోటి కరుగంగ నాసక్తి యున్నదా ?
వెంటనే లేచుచున్ విడిచి నిట్టూరుపున్,
అచటనే నా స్థానమని ఎక్కె నా గీతి.

జులై 1900 క్షణికా

## ఆ కాలమున

క్రౌళిదాసు నాడు తనువు
తాల్చి నే నున్న యెడల
నవరత్నంబుల మాలిక
నవుదు దశమరత్నమ్మను :
ప్రభువు నొక్క శ్లోకముతో
ప్రస్తుతించి కోరినచో
పొందియుందు ఉజ్జయినీ

పుర విజన ప్రాంతమందు
ఆరామము నడుమ గృహము ;
అథవా రేవాతటమున
చంపక వృక్షమ్ము క్రింద
సంధ్యాకాలమున సభను
సమావేశపరచియుందు ;
పాడియుందు విపశ్చిదనై
క్రీడాశైలమ్ముమీద.
మందాక్రాంతాతాళము
నందు జీవితంపు నౌక
అందముగా తేలియుందు.
కాళిదాసు నాడు తనువు
తాలిచి నే నున్న యెడల.

చింత కిత్తు జలాంజలిని,
శీఘ్రత యేమియు నుండదు,
జరామృతులు లేని యట్లు
చరింతు నే మృదుపదముల.
షడృతువులు పూర్ణముగా
స్తరములుగా మేళవించు
తద్వృత్తము కావ్యములో
ఘటియింతును సర్గ లారు.
విరహబాధ దీర్ఘ మగును
వేడి యశ్రునది విధాన
జరిగియుందు మందగతిని
కరుణ దీర్ఘ గాథారచన.
ఆషాఢమ్మున మేఘము
లట్లు మందమందముగా
సాగియుందు జీవితమ్ము
వేగిరపాటేమి లేక.

ప్రేయసి పదతాడనమున
ఆయమ గండూషమ్మున
అశోకకుంజమ్ము పూయు,
వకుళతరువు వికసించును.
సకల ప్రియసఖుల పేర్లు
ఛందోరీతుల రేవా
సుందరతట కలహంసల
మధురధ్వనివోలె మొరయు :
మందాలిక చిత్రరేఖ
మంజులికా మంజరిణులు
మనోహరాభిఖ్య లెన్నొ
ఝంకరించుచుండు; వారు
చైత్ర కౌముదీయామిని
అరుగుదెంత్రు కుంజవనికి.
అశోకమ్ము ప్రేయసి చర
ణాఘాతోత్ఫుల్లమగును.

నీలకేశరాజివి ప్రియు
రాలు తాల్చు వకుళచూడ,
కరమున లీలాకమలము
ధరియించును దేనికొరకొ,
అలకలు కుందమ్ములతో
అలంకరించుకొనును, చెవిని
దాలుచును శిరీషమ్మును,
వ్రేలదీయు నవ కదంబ
మాలికలను మేఖలలో;
ధారాయంత్రంబు క్రింద
తానమాడు, పిదప కేశ
ములకు వేయు ధూపంబును,
ముఖమున కద్దుకొను లోధ్ర

కుసుమ శుభ్రపరాగమ్ము,
కోమలి ఘనసారాగురు
అలదుకొనును, కృష్ణకేశ
ముల కురువకమాల దాల్చ-

కుంకుమ పత్రములతో న
లంకరించు వక్షమ్మును ;
అంచుల నికటమ్మునందు
హంసమిథున మంకితమ్ము ;
విరహమ్మున కాతరయై
వేచియుండి ఆషాఢము
ప్రియతము నాగమనమునకు
పూజాపుష్పంబుతోడ
ప్రొద్దు గణన చేయుచుండు.
వక్షముపై దాల్చి వీణ
పాడుచు సంగీతమ్మును
పరవశయై మరచుచుండు
పాటలోని మాట లామె.
పడుచుండును జారి యామె
బాష్ప పూర్ణనయనంబుల
పైనను రూక్షాలకములు,
చరణ వక్ర నూపురములు
మొరయును మేళన యామిని :
వక్షఃస్థలిపై కుంకుమ
పత్రరచన శోభిల్లును.

ప్రియు నామము వీకతోడ
పెంపుడు శారికకు నేర్పు,
కనక కంకణముల ఝణా
త్కారముతో మయూరముల

నృత్యము చేయించుచుండు :
నిజపక్షస్థలముమీద
నెమ్మితోడ కపోతమును
ముద్దాడును హత్తుకొనుచు
ముఖముమీద ముఖము నుంచి.
తెచ్చి పద్మకోరకములు
తినిపించును సారసిచే.
అలక లల్లలాడ, వేణి
యాడు చుండగా, తన ప్రియ
సఖికంఠము కౌగిలించి
శౌరసేని ప్రాకృతమున
పలుకు, 'హలా పియ సహి'యని.
సలిలమ్మును పోయు తరుణ
సహకారము పాదులోన,
ప్రియునామము పికతోడ
పెంపుడు శారికకు నేర్పు.

ఒక్కకోణమందు నొదిగి
యుందును నవరత్నసభను,
దోయిలింతు హస్తమ్ములు
దూరముననె దిఙ్నాగా
చార్యున; కాళింతు వారి
సమాజమ్మునందు నామ
ధేయమ్ములు - విశ్వసేన
దేవదత్త, వసుభూతి
త్యాదులు గౌరవసూచిక
లగు నభిధల నొకటి నాకు.
స్రగ్ధరనో మాలినినో
సంశ్రయించి బింబాధర
సంస్తుతి కావ్యములు రెండు

మూడు రచింతును చిన్నవి;
ముగిసినంత శ్లోకరచన
పోవుదు వింటికి జవమున-
ఒక్క-కోణమందు నొదిగి
యుందును నవరత్నసభను.

కాళిదాసునాడు తనువు
తాలిచి నే నుంటినేని
కట్టువడుదు నే మాలవి
కాజాలములో నేమో ;
ఒక్క- వసంతోత్సవమున
ఒక ఫాల్గున శుక్లరాత్రి
మంజరితంబైన యొక్క-
కుంజ రహస్యాంతరమున
మొరయుచుండగా వీణా
మురళీ కలనాదంబులు
నివ్వెరపాటొంది క్షణము
జవ్వనంపు కొత్త మైక
మునను రాజు చిత్రశాల
కనియుందుదు నెవ్వరినో.
తగులుకొనును ఛలమువలన
తద్వస్త్రం బామ్రశాఖ-
కాళిదాసునాడు తనువు
తాలిచి నే నున్నయెడల.

కాళిదాసు కాల మకట
కడచిపోయె నేనాడో
వివదించుచునున్నవారు
విద్వాంసులు తిథికొరకై ;
వత్సరమ్ము కొరకును, త

ద్వర్షమ్ములు గడచిపోయె.
స్తబ్ధమయ్యె నితిహాసము,
సంకటమ్ము తొలగిపోయె.
సర్వము మిథ్యాకలకల,
మక్కటకట! వానితోనె
యరిగిరి యానాటి పౌర
మహిళలు — నిపుణిక చతురిక
మాలవికయు; కొని చని రే
స్వర్గమునకొ పల్లెరములు
వరమాలా భరితంబులు!
కాళిదాసు కాల్మెపుడొ
కడచిపోయె నక్కటకట!

ఎవరితోడ సమ్మేళన
మే ఘటిల్ల లేదొ నాకు
ఆ వరారోహలెల్ల
అన్యమనస్కల జేసినారు
విరహబాధ గూర్చి, అయిన
వేరొక హర్షంబు కలదు:
వకుళతరువు వికసించును
వరనారీవదన మధుర
మదిర ఏమి సోకకున్న;
మధురముగా దక్షిణ ది
జ్మారుతమ్ము. మలసి తాకి
మైమరపించును ఫాల్గున
మాసమ్మున ఆ యశోక
పాదపమ్ము క్రింద బడలి
పండుకొనిన మాకు పూర్వ
భంగివి; పలు దెసలనుండి
బహువిధముల సాంత్వనములు

లభియించుచు నున్నవి ఆ
లలన లిపుడు లేకున్నను.

ఈ కాలంబునను మర్త్య
లోకమందు వర్తించెడి
లోలాక్షుల సౌందర్యము
కాళిదాసు నేత్రములకు
కమనీయముగా నుండును.
జూతా మోజాలు తొడిగి
షోకు షోకుగా నడతురు,
పరదేశ విధానములో
పలుకుచుంద్రు కథావార్త ;
లయినను సాక్ష్య మ్మొసంగు
ఆ కటాక్ష వీక్షణములు.
కాళిదాసునాటి భంగి
కానబడును కేవలమ్ము—
చూడుము—చనిపోను నేను
సోదర, నిపుణిక చతురిక
శోకముననను ; మర్త్యలోక
మందు వివిధ నామమ్ముల
అందరు వర్తిలుచుందురు.

తిరుగుచు నున్నాద నిపుడు
గరువముతో హర్షముతో
గంతులు కూడను వేయుదు ;
కాళిదాసు పేరొక్కటె
కాలంబున మిగిలియున్న :
దేను సజీవముగా ను
న్నాను, కాళిదాసునాటి
యనుభూతి సుగంధంబులు

నాస్వదించుచున్నవాడ
అల్లన మృదుమందముగా ;
అస్మదీయకాలగంధ
మా మహాకవికి లవము
సోకియుండ బోదు; వేణి
సొగసుగ వ్రేలాడుచుండ
చనియెడి యాధునిక వినో
దిని చిత్రము తత్కవీంద్ర
కల్పనలో నుండలేదు,
కాని ప్రియా, తరుణ నయన
కటాక్షము యాచించు
కాళిదాసు గోలుపోయి
గర్వముతో గంతులిడుదు.

జులై 1900 క్షణికా

## న్యాయదండము

ఓహో రాజాధిరాజ !
ఒక్కొక్కని హస్తమ్మున
న్యాయదండ మర్పింతువు,
స్వయముగ వేరొక్కనిపై
శాసనభారము నుంతువు.
అనుపమ సమ్మానమునకు
ఆ దురూహ్యకార్యమునకు
వంగి మ్రొక్కి లిడి శిరసా
వహింతు వినయమున నేను.
నీ కార్యాచరణములో
నే నెద్దానికి బెదరను.

హే రుద్రా ! క్షమ దుర్బల
మెచట నగునో క్షీణించుచు
నీ యాదేశమున నచట
నేను నిష్ఠురుండ నగుదు.
నీ యింగితమైన నిశిత
నిస్త్రింశము వోలె నాదు
రసనమీద సత్యవాక్కు
రంజిల్లుత తళతళ మని.
నీ ధర్మాసనము మీద
నేను కూరుచుండి నపుడు
కాపాడుదు గాక భవ
ద్గౌరవమ్ము, రుద్రదేవ !

ఎవ దన్యాయము చేయునొ
ఎవ దన్యాయము సైచునొ
ఎండుగడ్డివోలె నీదు
ఏవగింపు వాని గాల్చు.

జూన్–జూలై, 1901 నైవేద్య

## ప్రార్థన

భీతి లేకుండునో ఏ తావునను చిత్త,
మెచ్చోట మస్తకం బెత్తుకొనియుండునో,
జ్ఞాన మెచ్చట స్వేచ్ఛగా మెలంగుచునుండు,
ఏ గృహప్రాచీర మే వేళయందేని
తన యంగణం బందు ధారుణీభాగమును
చిన్న ఖండములుగా చేయకుండగ నుండు.

హృదయంపు సెలయూట వదనంబునం దుండి
వాక్య ముచ్ఛ్వసితమై వచ్చునో యెచ్చోట.
చరితార్థమై కర్మ సతతమ్ము ప్రవహించు
నిర్వార్యమై యెందు నిఖిలదిక్కులయందు,
ఎచట తుచ్ఛాచార ప్రచుర మరువాటికా
సంఘ మాలోచనా సరణి మ్రింగకయుండు,
పౌరుషమ్మును నెందు భాగింపకుండునో,
ఎచ్చోట నీ వుందు వెల్లవేళలయందు
అఖిలకార్యాలోచనానందనేతగా,
తండ్రి, నీ చేతితో దయవీడి మర్దించి
భరతదేశమ్ము నా స్వర్గానలేపుమా।

జూన్-జూలై, 1901 నైవేద్య

## ముక్తి

వైరాగ్య సాధనలవలనను ముక్తి—
అట్టి మోక్షమ్ము నా కక్కరలేదు.

పొందెద మోక్షానుభూతి మోదంబు
పరిమితియే లేని బంధంబులందె.
వివిధవర్ణములతో వివిధగంధములతో
అలరారుచున్న నీ యమృతంబు నింపుదువు
మాటి మాటికి నేల మట్టిపాత్రలలోన।
దీపమ్ము వోలె మదీయవర్తుల నెల్ల
నిఖిల ప్రపంచంబు నీ శిఖన్ వెలిగించి
నీ మందిరంబునందే కాంతి వెలయించు.

ఇంద్రియద్వారంబు లెల్ల బంధించి

యోగాసనమ్మున నుండగా జాల,
గంధములో రూపగానమ్ములందు
ఒక్కింత యానంద ముండు నద్దాన
నీ మహానందమే నిలుచునుకాదె ;
మోహమ్ము వెల్గుత ముక్తిరూపమున,
భక్తిగా నా ప్రేమ ఫలియించు గాక ;

జూన్-జూలై, 1901 నైవేద్య

## త్రాణము

ఈ మందభాగ్యంపు భూమినుండి సమస్త
తుచ్ఛ భయములు నీవు తొలగించి వేయుమా—
నృపభీతి; జనభీతి, మృత్యుభీతిని గూడ.
దీనదుర్బలుల పాషాణంపు భారమ్ము,
ఈ నిత్యపేషణ, మీమ్మ ధూళి తలపగఁ
నిత్యావమానమును నిముసనిముసమ్మునకు,
అనులిప్తకుం గల్గు నాత్మావమానమ్ము,
వెలుపలఁ లోపలఁ బలు దాస్యపాశమ్ము,
వేలకొలంది పాదాల సన్నిధియందు
మస్తకమ్మును వాల్చి మాటిమాటికి భీతి,
నరగౌరవాభిమాన చిర త్యాగంబు—
ఏ తదీయమహాహ్రీరాశి దూరమ్ము
కావింపుమీ పదాఘాతాన పొడిచేసి
మంగళోదయవేళ మహనీయకాంతిలో
విపులగగనమ్ములో వివృతానిలమ్ములో
ఎత్తంగనిమ్ము మా యుత్తమాంగమ్ములను ;

జూన్-జూలై, 1901 నైవేద్య

# ప్రతినిధి

ఓ శివు ప్రేమించితివి ఈ శ్యామల ధరిత్రి
పరిపూర్ణ పరితృప్తి భరితహాసము నీది;
నిఖిల వాహినులతో నీవు సమ్మిశితవై
సుఖముగా చరియించుచుంట తెలియును నీకు;
అందుచే నీ హృదయ మాకర్షకం బయ్యె
మాదు ప్రాణంబులకు మనసులకు గుండెలకు
శ్యామవసుమతి నీకు నాత్మీయమైనయది.

నీ నీలనయనముల్ నే దుదాసావనివి
వీడి యాకాశాన విహరించున ట్లుండె;
ఎల్లరన్ స్పృశియించి ఈ తాళవనవల్లి
వీడుచున్ వీడ్కోలు పాడుచుం బోవు నీ
హాసంబు గ్రహియింప నానందదాయకము.

నీకు నచ్చుటచేత నీ దృష్టి నా నేత్ర
యుగళమం దంకితం బొనరించి చనినావు ;
ఏకాకినైన నే నిప్పు డుభయుల చూతు,
నీ ముగ్ధదృష్టి నా నేత్రమ్ములన్ నిల్పి
భోగించుచున్నావు బాగుగా నా మదిని.

కంపించు నీ శీతకాలప్రకాశంబు
వనములోపల; రాలి పడుచున్నవి శిరీష
పత్రముల్ గాలిలో; బాగుగా సర్వదా
మన మనస్సులు శీతమధ్యాహ్నకాలాన
స్వనియించు వనములో ఛాయాప్రకాశాల
ఆలోలకంపనం బందు కేళి యొనర్చు.

నా జీవితములోన నీవు జీవింపుమా ।

యాచింపుమా కోర్కె నా చిత్తమార్గమున.
అతిగుప్తముగ మదీయాంతరంగమునందు
నేడు నా రూపాన నీ వుంటివని తెలియు :
నా జీవితమ్ములో నీవు జీవింపుమా !

18-12-1902 స్మరణ

## జన్మకథ

'ఎచ్చోటనుండి నే వచ్చితి, నమ్మ !
ఎచ్చటనుండ నన్ దెచ్చితి నీవు !'
అనుచు తల్లిని బిల్చి యడిగె బాలుండు.
ఆ మాటలకు తల్లి హర్షాశ్రు లురల,
బిడ్డ నక్కున జేర్చి బిగి కౌగిలించి,
అనురక్తి నీరీతి ననియె : "నా తండ్రి !
నా మది నుంటివి నా కోర్కెవగుచు."

"నా బొమ్మలాటల నగుచుంటి నీవు.
ఉదయాన శివపూజ లొనరించు వేళ
నిను చిదిపితి మరి నిర్మించుకొంటి.
శివుని పూజించెడి సింహాసనమున
నీవు నా దేవు సన్నిధి నుంటి వోయి.
ఆ దేవు నర్చించు నవసరమందు
నీ పూజలను గూడ నెరపితి నోయి

"నా చిరాకాంక్షను, నా ప్రేమయందు,
మా యమ్మ మమతలన్, మా నాయనమ్మ
మనసులో, మా పురాతనగేహమందు,
ఇలవేల్పు గుడిలోన వింత కాలమ్ము

ఎట దాగియుంటివో యెవ్వారి కెరుక !

"అలరియుండగ సిగ్గు యౌవనమందు
కలిసియుంటివి పరిమళము చందమున,
నా తరుణాంగకోన్నతి నావరించి
వర్ధిల్లె నీదు లావణ్యమార్దవము

"అఖిలదేవాదృతం బగు ధన మీవు,
ప్రాచీనతకు నతిప్రాచీనుడవును,
సమవయస్కుడ వుషస్సమయదీధితికి.
ఆ జగత్స్వప్నంబునందుండి వెడలి
ఆనందవాహినియందు వచ్చితివి
నా హృది వెలసితి నవ్యుడ వగుచు.

"నిర్నిమేషాక్షుల నిను తిలకింతు,
కాని నీ మర్మంబు కనుగొనరాదు.
ఎందరో యుండ నా కెట్లు దక్కితివి !
ఆ మేనుతోడ ముద్దాడి యీ మేను
మధురహాసంబులు మహి వెలయింప
తల్లికి బిడ్డవై తనరితి వీవు.
పోగొట్టుకొందునేమో యన్న భీతి
హత్తుకొనం జూతు నక్కున నిన్ను—
క్షణము విడిచితినేని కళవళంపడుదు.
ఈ మమతాజాల మేమో యెరుంగ
నా క్షీణకరముల నడుమ ని న్నెపుడు
విశ్వధనంబును బిగియింప నెంతు !"

సెప్టెంబరు, 1903 శిశు

# వీరపురుషుడు

దేశవిదేశాలలోన
తిరుగుచు నా జననితోడ
బహుదూరము పోయితి నని
భావింపుడు మానసమున.
మేనాలో ఎక్కి, అమ్మ !
దాని తలుపు లొకకొంచెము
తెరచియుంచి, కూరుచుండి
తెరువున పోవుచునుంటిని ;
ఎఱ్ఱని గుఱ్ఱమ్ము నెక్కి
నేను టక్కు టక్కు మనుచు
వచ్చుచు పోవుచు నుందును.
పల్లకి కిరు ప్రక్కలందు
తురగము రెక్కల తాకున
ధూళి యెఱ్ఱ రంగుతోడ
మబ్బువోలె లేచుచుండు
మార్గమునందుండి మిగుల.
అయ్యెను సాయంకాలం
బస్తమహీధరము మీద
సూర్యుడు వాలుచునుండెను.
జోడాదీఘి మైదానము
చేరినార, మెటు చూచిన
చిటచిటలాడుచునుండెను.
కానరారు జీవు లెవరు,
కాన పరధ్యానముతో
జంకుతోడ నుండి నీవు,
"చనుదెంచితి మిపు డెచటికి"
అని తలపోయుచు నుందువు :
"అమ్మా, భయ మేమి లేదు

నదిలో క్షీణప్రవాహ
మదిగో" అని యందు నేను.

కంటకఘాస మ్మెల్లెడ
గ్రమ్మిన మరుభూమి నడుమ
వంకరగా జను త్రోవను
వత్సమ్ములు గోగణములు
కానరావు, సందెవేళ
గ్రామము వైపునకు జనియె.
ఎచ్చటి కరుగుచు నుంటిమొ
ఎవరికి తెలియదు ; బాగుగ
చీకటిలో కానబడదు .
"చెరువు కడను వెలుతురేమి ?"
అని యందువు నన్ను బిలిచి.

అపుడు హారేరేరేరే
అని బొబ్బలు పెట్టుచు జను
లరుదెంతురు ; భయముతోడ
అందలమున నొక మూలను
ఒదిగియుందు వీ వీశ్వరు
మదిలో ధ్యానము చేయుచు.
ప్రక్కనున్న కంటకవని
పల్లకి బోయీలు దింపి
వణకుచుంద్రు వడవడవడ ;
వచ్చి యపుడు, నిన్ను బిలిచి,
"అమ్మా, నే నుంటిని గద,
అట్లు భయం బేల ?" నందు.

చేతులలో లాఠీలను,
శిరములపై దుబ్బు జుట్లు,

జపాసుమము లుండు వారి
శ్రవణద్వంద్వంబునందు-
నేను వచ్చి యప్పు డందును :
"నిలువుడు ! భద్రము ! వేరొక
యడుగైనను వేయు నెడల
అగ్రమునకు చూడుడు నా
హస్తమందు ఖడ్గము మి
మ్మందర ఖండములు చేయు."
ఆకర్ణించుచు వారలు
హారెరే అని లంఘింతురు.

పోవలదుర బాబా యని
నీ వందువు · వీక్షింపుము
ఊరక యని నే నందును.
వారువమ్ము నవల కేను
వారల మధ్యమ్మునకే
పరుగెత్తింతును : డాలును
కరవాలము ఖణఖణమను
నిట్టి భయానక సమరము !
నిట్టనిలువు కంటగించు
విన్నయపుడు నీ దేహము :
వెరపున పరుగెత్తిపోదు
రొక కొందరు ; పడిపోవును
ఒక కొందర శిరములు తెగి.

ఇంతమందితోడ పోరి
అంతమొందియుండు బాబు
అని తలంపవచ్చు నీవు-
అపుడు నేను రక్తసిక్త
దేహమ్మున స్వేదజలము

దిగజారుచునుండ మరలి
అరుగుదెంచి, పోరు ముగిసె
నని నీతో వచియింతును.
వినినంతనె పల్లకి దిగి
చనుదెంచుచు నీవు నన్ను
చేర్చుచు నొడిలో అందువు :
"చేరువలో చిన్నబాబు
ఉండుటచే మే లయ్యెను
ఉండకున్న నేమగునో !"

ప్రతిదిన మెన్నెన్నొ జరుగు
పక్షమునందేల యిట్లు
సత్యముగా జరుగరాదు ?
సరిగా నపు డది కథ యగు–
వినెడివార లెల్లవారు
వెంటనె నిర్వాక్కు లగుదు :
"రయ్యె నెట్లు ? బాబు తనువు
నం దింతటి శక్తి కలదె ?"
అని పలుకును పెద్దయన్న.
ఆలకించి పేటలోని
అందరు జను లిటు లందురు :
"అదృష్టమ్మె బాబు తల్లి
యంతికమ్మునం దుండుట !"

సెప్టెంబరు, 1903 శిశు

దాగిలిమూత

చేసితినేవి అమ్మ నేను

చిలిపిపనులు, చంపకమ్మ
పై సుమముగ వికసింతును :
ప్రభాతవేళ శాఖమీది
శ్యామలపత్రములమీద
కోమలముగ దొరలుచుందు,
ఓడినట్లు నావలనిను
ఒప్పుకొందు వపు డమ్మా !
అప్పుడు గుర్తింపగలవె
అమ్మా, నను ? పాపాయీ
ఏ కడ నున్నావనుచును
ఎలుంగెత్తి పిలిచెదవే.
నిశ్శబ్దముగా నూరక
నేను నవ్వుచుందు సుమా !

ఎప్పు డెపుడు చేయుచుందు
వే పని యైనను, దానిని
నేత్రములం దెరచి చూతు ;
నీ స్నానం బైన పిదప
వీపుమీద కేశరాశి
వ్రేలాడగ చంపకమ్మ
క్రిందుగ పోదువు పూజా
మందిరమునకు ; సుగంధము
తగులును దూరమ్మునుండి ;
తనయుని దేహమ్మునుండి
పరిమళమ్మ వచ్చు ననుచు
భావింపం జాలవమ్మ !

అయిన పిదప భోజనమ్ము
లందరవిని, కూర్చుందువు
మధ్యాహ్నపు వేళయందు

మహాభారతమ్ము పట్టి.
వృక్షపు నీడ గవాక్షము
వెంటవచ్చి, ఇంట నీదు
నొడిమీదను వీపుమీద
పడు ; నీ గ్రంథము మీదికి
కొని వచ్చుచు నా నీడను
గూడ నాట లాడింతును :
నీకన్నుల భాసించును
నీ బిడ్డవి చాయ యనుచు
నీ వమ్మా, గ్రహియింపగ
లే వాసమయమ్మనందు.

అమ్మా, దీపములు పెట్టి
అసుర సందెవేళ నీవు
గోష్ఠమునకు జనినప్పుడు
కుసుమకేళిలో చప్పున
మహీతలము మీద దుమికి
మరల నగుదు పాపాయిని ;
ఆవల నీ కడకు వచ్చి
అడుగుదు కథ చెప్పుమనుచు.
ఎక్కడ నుంటివి దుష్టూ
ఇంత సేపు నీ వందువు ;
అందుకు ప్రతివచనముగా
ఆ సంగతి చెప్ప నందు.

సెప్టెంబరు 1903 శిశు

## జగదంబుధి తీరంబున

జగదంబుధి తీరంబున

జరిపిరి బాలకులు మేళ.
కలదు శిరముపైన నంత
గగనతలం బచంచలము.
నిరతము న ర్తించును త
న్నీలజలము మీద నురుగు.
వేలాతటమున నేదో
కోలాహల ముప్పతిల్లె :
బాలురు గుమి గూడినారు.

ఇండ్లు కట్టుచున్నవార
లిసుకతోడ క్రీడలతో
నీలవిపుల సలిలముపై
ఆలిచిప్ప కేళి నౌక
తేలవేయుచున్నవారు.
బాలురు, తమ చేతులతో
హేల ఆకు తెప్ప చేసి
సంసారాంబుధి తటమున
సమావిష్టులైనవారు.

వారెరుగరు సంతరణము,
వల వేయుట చేతకాదు.
ముత్యమ్ములకై కొందరు
మునుగుచున్నవారు ; వేగ
వణిజులు చనుచున్నవారు
పడవలు నడుపుచు ; బాలురు
గులకరాల నేరి తెచ్చి
కుప్ప వోయుచున్నవారు ;
వెదకరు ధనరత్నంబులు,
వేయుట వల చేతకాదు.

అంబుధి నురుగులు గ్రక్కుచు
హసియించును, వేల కూడ ;
ఉయ్యేల పట్టుకొని తల్లి
ఊపుతోన పాడునట్లు
భీషణమ్ములౌ తరగలు
బిడ్డల కర్ణమ్ములలో
తరలమైన తానముతో
విరచించును గాథావళి.
ఆటలాడు శిశువులతో
అంబుధి, హసియించు వేల.

సంసారాంబుధి తటమున
సంక్రీడింతురు బాలురు.
వీచును ఝంఝూవాతము
వియత్తలమునందు ; మునుగు
తరణి దూరజలములందు ;
మరణదూత లేచిపోవు ;
జగదంబుధి తటమునందు
జరుగును శిశుభూరిమేళ.

సెప్టెంబరు, 1903 శిశు

## అపకీర్తి

ఏల వత్స, కళ్ల నీళ్ల ?
ఎవ రే మన్నారు నిన్ను ?
చెప్పు విప్పి ; వ్రాయబోయి
చేతులకును ముఖమునకును
సిరా పూసికొన్నావా ?

నీవు మురికివాఁడ వనుచు
నిందించిరె ఎవ్వరేని ?
అట్టే అది ఉచితంబా ?
అనఁగలుగునె యెవ్వఁడేని
పూర్ణచంద్రబింబంబును
బోలు నీదు వదనమందు
మసి కొంచెము కాంచినంత
మలినమూర్తి వనుచు నిన్ను ?

బాబా, ఎల్లరును తప్పు
పట్టుచున్నవారు— తోచు
అసంతుష్టు లయినట్టులు.
ఆడుకొనం బోయి నీవు
చిరిగిపోవు బట్టలతో
తిరిగివచ్చినావు ; కాన
అదృష్టహీనుండు బాలు
డనుచున్నారా యెల్లరు ?
బాగుగ లే దీ పద్ధతి :
ప్రభాతంబు హసియించును
అంబుదములు చీలినప్పు,
డది దౌర్భాగ్యం బగునే ?

ఒరు లే మన్నను చెవి
యొగ్గబోకు, మపయశమ్ము :
మధురపదార్థముల మీఁద
మమత నీకు : ఇంటివారు
బయటివారు నిందింతురె
బహులోలుపు డనుచు నిన్ను ?
ఏ మగుదురు దాన, నిన్ను
ప్రేమించెడి వార లపుడు ?

# సమవ్యథ

అమ్మా, నే బాబు గాక
అగుదునేని కుక్కపిల్ల
అపుడు నీదు పళ్లెమందు
అన్నముపై మూతిపెట్ట
యత్నించెడు నన్ను నీవు
ఆదరింతువా నిజముగ ?
చెప్పు, మోసగింపవలదు,
ఛీఛీ దూరము దూరము-
ఎచటినుండి వచ్చినదో
ఈ కుక్కని నీ వనునెడ
దింపివేయు మొడినుండియె-
తినను నీదు చేతినుండి
తినను నీదు పళ్ళెరమున.

అమ్మ, బాబు గాక నేను
అగుదునేని నీ చిలుకను
ఎగిరిపోదునను భీతిని
తగిలింతువె నాకు గొలుసు ?
నాకు నిజము చెప్పు, మమ్మ !
నన్ను మోసగింపవలదు.
పాడుపిట్ట గొలుసు త్రెంపి
పారిపోవ దలచుచున్న
దని యందువ యేని నన్ను
నపుడు దింపివేయు మమ్మ !
ఏ నుండను నీ యొడిలో
ఎగిరిపోదు వనమునకే.

సెప్టెంబరు 1903 శిశు

# సమాలోచకుడు

నాయన పుస్తక మంతయు
వ్రాయుచున్నవాడు తానె.
ఏమి వ్రాయుచున్నాడో
ఇంచుకయును తెలియ దమ్మ !
వినిపించెను కద నీ కా
దినమున తన గ్రంథంబును
తెలిసినదా నిజము చెప్పు !
దీనివలన లాభ మేమి :
అమ్మా, నీ నోట విన్న
యట్టి కథల బోలు మంచి
వాని నెందుచేత నాన్న
వ్రాయడు ? మన నాయనమ్మ
ఎప్పుడైన రాజు కథలు
చెప్పలేద ? మరచినాడ ?

స్నానవేళ యగుట చూచి
నాన్న నెంతగానొ పిలుతు;
అన్నము గొని నీవు కూరు
చున్నను పట్టించుకొనక
ఆయన దినమెల్ల వ్రాత
యందె క్రీడ చేయుచుండు.
ఆడుకొనం బోయినప్పు
డాయన గదిలోనికి నే,
పెద్దపిల్ల వా దందువు;
చేతునేని గోల నన్ను
బెదరింతువు "నాన్నగారు
గదిలోపల వ్రాసికొనుచు
నున్నారని చూడలేద ?"

ఓహో ఈ వ్రాతవలన
ఉందు లాభ మేమొ చెప్పు !"

సెప్టెంబరు, 1903 శిశు

## కథ చెప్పు

చెప్పుము కథలను చెప్పుము కథలను
ఆదిపూరుషా, అనంతమహిమా !
అనంతరాత్రిని అవలోకించుచు
ఉపవేశించెద వూరక యేటికి ?
యుగయుగాంతములనుండియు తావక
శరధితలంబున దొరలుచు నుండెడి
వాని గాథలను వచియింప గదే !
ఎన్ని జీవముల యెన్ని ధారలో
కలియును తావక సలిలములోపల—
అచటికి చేరిన యాపల నుండదు
వాని ప్రవాహము, వాని కలధ్వని
సమసిపోవు నిశ్శబ్ద మౌనమున.
ఎచటికొ భంగవిహీన భయంకర
మౌనముతోడను వాని గొని చనెదు.
హే అతీత, నా
హృదయములోనికి
చెప్పుము కథ చెప్పుము కథ !
చెప్పుము కథలను చెప్పుము కథలను
స్తబ్ధా, గోపనచారి, అతీతా !
కా వచేతనుడ వీవు— చెప్పవే
ఏటికి కథ ? నా హృదయములోపల
చల్లని నీ సంచారము వినబడు.

బహుకాలముగా బహుసంచితమును
చేర్చిపోయెదవు జీవములోపల.
భువనభువనముల భూరికార్యములు
నిర్వర్తింతువు నీవు గుప్తముగ.
సంభ్రమ వాసరచాంచల్యములో
ఓ యతీత, నీ వుందువు తిరముగ.
అంతరంగమున నతిరహస్యముగ
చెప్పుము కథలను చెప్పుము కథలను.

చెప్పుము కథలను చెప్పుము కథలను
ఎట్టి కథలు నీ వెన్నడు మరువవు.
గ్రథనము చేయుచు గ్రహింతు వన్నిటి.
చెప్పుము కథలను చెప్పుము కథలను.
ప్రాణములందలి ప్రతిపత్రముపై
కలిపి మజ్జతో కానబడని లిపి
పితామహుల కథ విలిఖించెదవే.
ఎవరి చరిత్రము లెల్లరు మరతురొ
నీ వవ్వారల నించుక మరవవు.
అణగి విస్మృతములైన గాథలను
నీవు వహింతువు నిస్తబ్ధవై,
వాక్కొసంగుము వానికి, ఓ ముని!
చెప్పుము కథలను చెప్పుము కథలను.

1903 కథా ఓ కాహినీ

## మరీచిక

నిజపరిమళమ్ముతోడ
నేను తిరుగుచున్నాడను

కస్తూరీ మృగమురీతి
గహనము గహనము నందును.
ఫాల్గునంపు రాత్రివేళ
పవమానము కొరకు నేను
తిరుగుచుంటి గాని నాకు
దిక్కులేమి తెలియలేదు.
ఎద్ది నేను వాంఛింతునొ
అద్ది యెల్ల భ్రమాన్వితము ;
ప్రాప్తమైన దాని మీద
భావంబే లేదు నాకు.

వెడలి గుండెలోన నుండి
వెలుపల విచలించునట్టి
పరిమళము మరీచికా
ప్రాయమ్మగ గోచరించు.
బాహువులం జాపి దాని
పట్టి రొమ్ము కదుముకొన్న
అది క్రమ్మర నాకు లభ్య
మగుట లేదు హృదయమ్మన
ఎద్ది నేను వాంఛింతునొ
అద్ది యెల్ల భ్రమాన్వితము,
ప్రాప్తమైన దానిమీద
భావంబే లేదు నాకు.

వెర్రివానివలె భావా
వేశమ్మన నాదు మురళి
బంధనమున నుంచ గోరు
పగిదివి విజగానమ్మల
వేనివి బంధించితినో
వాని నడుమలో రాగిణి

అగపడకున్నది యెంతో
అన్వేషణ కావించిన.
ఎద్ది నేను వాంఛింతునొ
అద్ది యెల్ల భ్రమాన్వితము.
ప్రాప్తమైన దానిమీద
భావంబే లేదు నాకు.

1903 ఉత్సర్గ

## శుభక్షణము

అమ్మా, రాజకుమారుం
దరుగు నేడు నా మందిర
సమ్ముఖ మార్గమ్ము వెంట-
చక్కబెట్టుచుండు టెట్లు
ఇంటి పనుల ? నలంకరణ
మే రీతిని చేసికొందు ?
ఎట్లు సంస్కరింతు కబరి ?
ఏ విధాన ధరియింతును
ఎట్టి రంగుచీరె, చెపుమ !

అమ్మా, నీ కేమి వచ్చె !
అటు చూచెద వేల నాదు
వదనమ్మును మౌనముగా !
వాతాయన కోణమ్మున
నిలుతునేని నన్నాయన
తెలియును వీక్షింపండని.
లిప్తలోన వీక్షణము స
మాప మగును, చను నతండు

దూరము : కేవల మాతని
తోడ నుండు మురళి మ్రోగు
వ్యాకుల స్వరంబుతోడ
ఏ కోణమునుండి కాని.
అయినను రాజకుమారుం
డరుగును నా యింటి ముందు ;
అది నిముసం బగును గాక
అలంకరించుకొనక నేను
అమ్మా, యెట్లుందు చెపుమ !

అమ్మా ! రాజకుమారుం
డరిగెను నా యింటి యెదుటి
పథమున ; తళ తళ లాడెను
ప్రాభాతిక కాంతి యతని
పసిడిరథము కొసను దాకి ;
నెట్టి ముసుగు కనుగొంటిని
నిముసమాత్ర మమ్మా, యవల
మణిహారము త్రెంచి యతని
మారధూళిలో విసరితి.

అమ్మా, యేమి వచ్చె నీకు
అట్లు మాట లేక చూతు !
మాలనుండి జారిపడిన
మణుల నతం డేరలేదు :
పడి రథచక్రముల క్రింద
పొడి యయినవి ; ఇంటి యెదుట
అరదపు చిహ్నములు మాత్ర
మంకితమ్మా ; లెవరికి నే
నే మిచ్చితినో ఎవ్వరు
నెరుంగ రా ధూళివలన.

అయినను రాజకుమారుం
దరిగెను నా యింటి ముందు ;
హృదయమణీహార మతని
కెగురవేయ కుండు టెట్లు?

29-7-1905 క్షేయా

## అనావశ్యకము

అడిగితి నామెను శూన్యనదీతట
మందలి తాళవనాన :
"బాలా, ఒంటిగ ధీరగమనమున
పథము వెంట జనెదు
చేల మడ్డమిడి ప్రదీపమునకును
చెప్పుము నీ వెవరు ?
ఇంట దీపమును వెలిగింపగలే
దిట నిడు దీపమును."
నిలిపి యామె నా వదనము మీదను
నీలనేత్రయుగళి,
"దీపము వెలిగించుటకే వచ్చితి
దినాంతముని నేను
కూలమ్మున" కని బదులు పల్కినది
గోధూళీవేళ.
రెప్పలు వాల్పక నిలిచి చూచితిని
రెల్లుదుబ్బులందు
ఆరిపోయినది ప్రదీప మయ్యెడ
నకారణమ్ముగను.

అవసానం బయి సంధ్య, చీకటులు
వ్యాపించిన పిదప

అంటి నే విటులు. నిజగృహదీపము
లన్నిటి వెలిగించి
"ఏగెదు బాలా, ఏతద్దీపిక
నెవ్వరి కొసగంగా ?
దీపము లింటను పెట్టలేదు నే,
దీని నుంచు మిచట."
నీలనేత్రములు నా ముఖమ్ముపై
నిలిపి యొక్క క్షణము,
"ఈ నా కాంతిని గగనదీపమున
కెత్తుదు శూన్యమున !"
అని వచియించిన దన్యమనస్కత.
అకారణమ్ముగను,
కానంబడియెను వెల్గుచు దీపము
గగనకోణమందు.
అమవస చీకటి నర్ధరాత్రమున
నరిగి యామె కడకు
అంటిని : "రామ్మున దీపం బిడుకొని
అరిగె దెవరి కొరకు ?
దీపము లింటను పెట్టలేదు నే,
దీని నుంచు మిచట."
నీలనేత్రములు నాముఖమ్ముపై
నిల్పి యొక్క క్షణము,
"తెచ్చితి దీపము దీపావళిలో
దీని గూర్చవలెను"
అన్నది ఆయమ. లక్షల దీపము
లం దాయమ దివ్వె
అకారణమ్ముగ వెలిగిన దయ్యెడ
ఆలోకింపంగా.

10-8-1906 శ్రీయా

# కృపణ

గ్రామమ్ములోని మార్గముల వెంటను నేను
తిరిపెమ్ములం గొంచు తిరుగుచుంటిని ; నీవు
చనుచుంటి వపుడు నీ కనకంపు టరదాన.
అంత స్వప్నప్రాయ మైన దృశ్యం బేదొ
తోచె వింతగ నాదు లోచనమ్ముల యెదుట.
భవదీయతేజంబు, భవదలంకారంబు
ఎంతొ వింతగ నున్న; వెవరో మహారాజు
వని యా క్షణంబులో మనమునంబొడసూపె.

ఇట్టు లనుకొంటి నపు : "డీ రాత్రి గడచినది
ఇక శుభక్షణములే, ఇల్లిల్లు తిరుగంగ
ఈనాడు పనియుండ దింక నా కించుకయు."
ఆ తలంపున వెలికి నరుదేరగా నేను
ఎవరి దర్శనమొ లభియించె నా మార్గాన,
అరుగుచుండగ నరద మిరుపార్శ్వములవెంట
రాలె ధనధాన్యముల్ రాశిగా రాశిగా :
గుప్పెళ్లతో తీసికొన దలంచితి వాని.
ఆకస్మికమ్ముగా నరదమ్ము నా కడకు
వచ్చి యాగెను; నాదు వదనంబు గనుగొనుచు
నరదంబు డిగినావు దరహాసమున నీవు.
శాంతించినవి నాదు సకలవ్యథలు కూడ
చూడగా నీ యాస్యశోభాప్రసన్నతను.
ఇంతలో, 'నాకు నొక్కింత యొసగు' మటంచు
చాపినా నేటికో చప్పునన్ హస్తంబు.

నే జచ్చిపోను ! హే రాజాధిరాజ, ఈ
మాట యెట్టిది ? వినుచు మస్తకమ్మును వంచి
నిలిచితివి యొక క్షణము; నీకు లోపం బేమి ?

బిచ్చకత్తెను గూడ భిక్షంబు యాచింతె ?
కికురింతయా యిద్ది కేవల క్రీడయా ?
ఒసగితివి నే జోలెనుండి చిన్నికణమ్ము.

అవల నింటికి వచ్చి ఆ పాత్ర బోర్లింప
కానవచ్చెను స్వర్ణకణము గింజలలోన !
ఆరాజ భిక్షువున కర్పించినది నేను
కనకమై నా కడకు క్రుమ్మరిలి వచ్చినది–
అంబకంబులు నిండి అశ్రువుల్ రాలినవి :
ఏల నా సర్వస్వ మీయనైతిని నీకు !

22-3-1906 ఖేయా

## వీడుకోలు

ఓ సహోదరులార, ఒసగుండు వీడ్కోలు
క్షమియించి నన్ను ! నే కర్మమార్గమునందు
విపుడులే ; నిక మీర లెల్లరున్ కంఠాల
విజయమాలలు తాల్చి వెడలుండు క్రమముగా,
విపినంబులో నీడ వెనుకబడి యుండుటే
నావాంఛితం బింక, నన్ను పిలువక పొండు.

చాల దూరము మనము చనుదెంచి యున్నాము
చేతులం జేతులన్ జేర్చి యెల్లర, మిచట
మార్గద్వితయసంధి ; మానసమ్మెట్టులో
అయ్యె నే పుష్పగంధావేశ వశమునవో,
అవ్యక్త నూతన వ్యాకులత్వమ్మునవో.
కలిసిపోవుట మనము ఘటియిల్ల దికమీద.

ఇపుడు పరుగిడుదురో యెద్దాని వెనువెంట
మీర, లయ్యది నాకు మిథ్యగా గనిపించు.
రాజ్య నాశనమైన, రాజ్య నిర్మాణమై
అగుగాక, రత్నాది కాన్వేషణము కాని,
ఆత్మీయమౌ మతవ్యాప్తికై యుద్ధమ్మ
లఖిలదేశమ్ములం దాచరించుట కాని,
తుంగశాఖలతోడి గాంగేయ చంపకా
వని రుహంబుల యాలవాల సేచనమైన—
ఇంక పోవంజాల నెద్దాని వెనువెంట.

వ్యాపించి యంతటన్ స్వాంతమ్ము మరపించు
హాసమ్ము నేడు నా యంతరంగమ్ములో
మ్రోగించుచున్న యది మురళీరవంబులన్,
ఆలస్య మగుచున్న దధ్వాన జనువేళ.
అఖిల కార్యంబులం దాకస్మికమ్ముగా
కలుగుచున్నది బాధ ; కాని తృప్తి యొసంగు
"ప్రేమించుచున్నాను, ప్రేమింతు నే నకట"
అను వార్త మామకీ నాంతరంగమ్ములో
చిత్తమున్ పరవశము చేయు హాసము మాత్ర
మతిశయిల్లినది సర్వాతిశాయిగ నిపుడు.
సెల వొసంగుడు నాకు, సిద్ధులారా, యింక!
గ్రహియించితిని వ్యర్థకార్యమ్ము, స్వేచ్ఛగా
జలధరాధ్వము వెంట జనువారి నీ నాడు,
అంగీకరించినా నని లాస్యమున బోవ.
కూలమ్ము లేని యకూపారమున దేలి
పోవు నౌకకు నేను నావికుండను సుమీ!
విహరించుచుందు నావేశమున నూరకయె.
సెల వొసంగుడు నాకు, సిద్ధులారా, యింక!

క్షేయా

## బంది

"కఠినమ్ముగా విన్ను
కట్టి రెవ్వరు, బంది ?"

ప్రభువు వజ్రఖరరజ్జువుతోడ
నను బంధించెను ; నా మానసమున
అందరకన్నను నధికుడ కావలె
నను కోరికతో, నాత్మగృహంబున
భూరిరాజధనమును సమకూర్చితి ;
రాగా నిద్దుర రాజశయ్యపై
పండుకొంటి నిజభాండారమ్మున,
మెలకువ యావల కలిగిన యంతనె
ప్రస్ఫుట మయ్యెను బంధనవైఖరి.

"ఎవ్వారు బంధించి
రీ వజ్రబంధనము ?"

స్వయముగ యత్నము సలిపి, బంధనము
నిర్మించితి, నే నిఖిల జగత్తును
నాదు ప్రతాపముచే గ్రసియింతును
చేసి యెల్లరను దాసజనంబుగ-
ఒక్కడ నేనే యుందు స్వతంత్రుడ
గా నని తలచితి ; కావున చేసితి
లోహశృంఖలము లహోరాత్రములు
నిర్మాణమ్మున నిప్పు మంటలను
ఆఘాతమ్ములు నసంఖ్యేయములు :
నిష్ఠురశృంఖల నిర్మితి కాగా,
ఏ నిర్మించిన యీ సంకెలలే
నను బంధించిన వని కనుగొంటిని.

22-4-1906 శేయా

## భారతతీర్థము

భారతదేశ మన మహామానవుల
పవిత్ర తీర్థంబు
ఓ నా చిత్తమ మేలుకొనుమ
ఈ యుదధి తటమునందు
ఈ ప్రదేశమున నిలిచి బాహువుల
నెత్తి నమస్కృతిని
వారి కొనెర్చెద నుదారవాక్కుల
పరమానందమున
ఈ భూధరములు ధ్యానముద్రలో
నెంతో గభీరములు,
తటినీ నామక జపమాలికలను
ధరించె క్షేత్రములు,
ప్రతిదినమ్ము దర్శించుచు నుందుము
పవిత్రధారుణిని,——
భారత మానవసాగర తటమున
పవిత్రధారుణిని.
ఎవరి కెరుక యే యాహ్వానంబున
నిచ్చటి కేతెంచి
మానవవాహిను లెచటినుండియో
మహాధాటితోడ
కలిసిపోయినవి ఎతత్సాగర
గర్భము లోపలను.
ఈ ప్రదేశమున ఆర్యు లనార్యులు
నిచ్చట ద్రావిడులు
ఇచ్చట చైనీయులును శకులును
నిచటనె హూణులును
ఇటనె పఠానులు మొగలులు సైతం
బేకదేహు లయిరి.

పశ్చిమ దిక్కున ద్వారము తెరవగ
బహుజనంబు లిపుడు
తెచ్చుచు నున్నా రుపహారంబులు
తిరిగి పోవరింక,
ఇత్తురు కొందురు కలిసి కలుపుదురు
ఏత త్తీరమున-
భారతమానవసాగరతటమున
పవిత్రధారుణిని.

సంగరధారలు ప్రవహింపంగా
జయగానము చేసి
మహోన్మత్తముగ కలరవములతో,
మరుక్షేత్రములను
పర్వతభూములు దాటుచు వచ్చిన
సర్వజనంబులును
విరాజిల్లెదరు నాలో ; ఎవ్వరు
విడిపోవగ లేదు.
ధ్వనించుచున్నది నా శోణితమున
వారి చిత్రరవము.
మ్రోగుము మ్రోగుము రుద్రవిపంచిక
మ్రోగు ; మసహ్యమున
ఎవ్వరు దూరముగా నున్నారో
ఈనాడును గూడ
వారును బంధము లూడిపోవగా
వచ్చి చుట్టుకొనుచు
నిలుతురు భారతమానవసాగర
నికట భూమియందు

ఒకనా డిచ్చట నవిరామముగా
ఓంకారారవము

హృదయతంత్రులం దైక్యమంత్రముగ
నెంతయు మ్రోగినది
ఒక్కయగ్నిలో తపోబలంబున
పెక్కాహుతు లుంచి
విస్మరించి భేదంబులు, లేచెను
విరాణ్మానసమ్ము.
ఆ బహుసాధన యారాధనముల
యజ్ఞశాల తలుపు
ఉన్ముక్తంబై యున్నది వంచుచు
నుత్తమాంగములను
సర్వజనమ్ములు చేరవలయు నీ
సాగర తీరమున—
భారత మానవ సాగర తటమున
పవిత్ర ధారుణిని.

ఆ హోమాగ్నిని జ్వలించుచున్నది
ఆర్తి రక్తశిఖయే,
హృదయ దాహమును సహింపగావలె
ఇదె యదృష్టరేఖ!
మనసా, సహింపు మీ దుఃఖమ్మును
విను మైక్యపు పిలుపు,
జయింప లజ్జాభయముల న్యక్కృతి
చను దూరముగాను,
వెడలి పోవుచో దుస్సహ దుఃఖము
విశాల జీవితము
ప్రాదుర్భావము నొందును, యామిని
పరిసమాప్త మయ్యె;
జనని మేలుకొనె విపులనీడమున
సాగరతీరమున—

భారతమానవసాగరతటమున
పవిత్ర ధారుణిని

ఏతేరగవలె ఆర్య లనార్యులు
హిందు ముసల్మాన్
ఆంగిలేయులును క్రైస్తవజాతులు
నరుదేరగవలెను :
నిర్మల మొనరిచి మీ చిత్తంబులు
నిఖిలలోక కరముల్
పట్టుకొనుండో బ్రాహ్మణులారా !
పతితజనములార,
త్వన్నికారభారంబును ద్రోయుచు
త్వరితముగా రండు.
మాతృదేవతకు నభిషేకముకై
మంగళ కలశంబు
ఇంకను నిండినయట్టులు తోచదె
ఎల్లరి సంస్పర్శన్
పవిత్ర తీర్థముతో రత్నాకర
సవిధదేశమందు—
భారతమానవసాగరతటమున
పవిత్రధారుణిని.

2-7-1910 *గీతాంజలి*

## అవమానిత

ఓ నా దురదృష్ట దేశ
మా, నీ వెవ్వరి నవమా
నించితివో నీవు కూడ
వంచనమ్ము పొందవలయు

వారి తోడ సమానముగ.
మానవాధికారమ్మున
హీనత పొందిన వారల,
సముఖమునం దున్ననైన
స్థానమొసగ లే దెవ్వరికి
క్రోధమందు వారలతో
నీవు కూడ సమానముగ
నికారమ్ము పొందవలయు.

ప్రతి దినమ్ము నందు జన
స్పర్శకు దూరముగ నుండి
ఏవగించినావు వారి
జీవన దేవతను గూడ.
ద్రుహిణుని రోష వశమ్మున
దుర్భిక్షి ద్వారమ్మున
అందరితో విభాగించి
అన్న పానీయములను
ఆస్వాదింపవలసియుండు,
అందరతో సమముగానె
పొందవలయు నికారమ్ము.

నిజ పీఠము నుండి వారి
నెట్టితి వెట గేలిచేసి,
అచ్చటనే నీ శక్తియు
హరించిపోయినది సుమ్మి!
పాదదళితులై యెవ్వరు
పడియున్నారో ధూళిని,
ఆ నీచ స్థానమునకు
అవతరింపవలయు నీవు
కాకున్న పరిత్రాణము

లేకుండును నీకు నిజము ;
అందరతో సమముగానె
పొందవలయు నికారమ్మ.

నెట్టుదు వెవ్వని క్రిందికి
నిన్నాతడు కట్టివేయు
నిమ్నతలమునందె ; ఎవని
నీవు వెనుక బెట్టినావో
విను వెనుకకు లాగు నతడు ;
పెను మోహపు చీకటితెర
వెనుక నెవని కప్పియుంతు
నాతడు నీ మంగళమున
కంతరాయ మేర్పరించు.
అందరతో సమముగానె
పొందవలయు నికారమ్మ.

అన్నివంద లేండ్లనుండి
అవమానము బరువు నీవు
శిరముమీద దాల్చినావు ;
నరరూపమునందు నున్న
నారాయణునకు నెన్నడు
నమస్కార మొనరింపవు ;
కన్నులు క్రిందికి త్రిప్పుము :
కనుగొనవా భగవానుని
పరాగమ్మునందు హీన
పతితజనుల మధ్యమ్మున
అందరతో సమముగానె
పొందవలయు నికారమ్మ.

నిలిచియున్నవాడు ద్వార

నికటమ్మగు మృత్యుదూత
కనుగొనవా, నీ జాతికి
గలుగు నహంకారముపై
శాపముద్ర వైచినాడు ;
సర్వజనుల బిలిచి యిపుడె
సమావేశపరపవేని,
అభిమానం బన్ని దెసల
నలముకొనుచు బంధ మగును ,
అపుడు మృత్యు మధ్యమందు
అందరు చితి బూడిదలో
పొందగలరు సమత్వంబు ।

4_7_1910 *గీతాంజలి*

## ధూళిమందిరము

చాలు భజన పూజనములు,
సాధనారాధనములు—
తెరవని తలుపుల చీకటి
దేవాలయకోణములో
ఏల దాగి మనసులోనె
ఎవరిని పూజింతువోయి
గుప్తముగా; పరికింపుము
గుడిలో దేవుండు లేడు

అరిగినా డతండు బెడ్డ
విరిచి రైతు కృషి చేసెడి
స్థానమునకు; కూలి జనము
శ్రమపడి పండ్రెండు నెలలు

రాలు పగుల గొట్టి మంచి
రహదారిని చేయు నెదకు.
ఎండలోన వానలోన
ఎల్లరకడ నున్నవాడు.
అతని హ స్తయుగళమునం
దలముకొనియె పరాగమ్ము.
విడిచి ధౌతవస్త్ర మతని
విధమున రా ధూళిలోకి.

ము క్తి? ఓహో పొందవలెన?
ము క్తి యెచట కల దోయీ?
ప్రభువు స్వీయసృష్టిలోన
బద్ధుం డెల్లరతోడను.
చాలింపుము నీ ధ్యానము.
పూలపుటిక నుండనిమ్ము.
వస్త్రంబులు చినుగ నిమ్ము.
పడనీయుము దుమ్ము ధూళి.
ఆయనతో కర్మయోగ
మందు సహకరించి నీదు
కాయముపై ఘర్మజలము
కారనిమ్ము ఝరములుగా.

11-7-1910 *గీతాంజలి*

## పోవునాడు

పోవునా డీ మాట పల్కి పోదును గాక।
నేను చూచినవి పొందినట్టివి నిస్తులమ్ములు.
ఈ జ్యోతిరబ్ధి నడుమ నేది ప్రకాశించు

ఆ శతదలంపు పద్మములో అమృతము నేను
ఆస్వాదన హేతువుచే నైతిని ధన్యుడను
పోవునా డీ మాట తెలిపిపోదును గాక ।

విశ్వరూపు కేళీ గృహమున వేలకొలది యాట
లాడినాను ; తెరచి రెండు నంబకములతో
నీ రూపుండైనవాని నేను చూచితి
వేనిని తాకుటకునైన వీలు కలుగదో
అతడు పట్టుపడినవాడు అఖిలాంగముల
చేయునేని నిశ్శేషము చేయవచ్చు నిచట
పోవునా డీ మాట తెల్పిపోదును గాక ।

5-8-1910 *గీతాంజలి*

## శంఖము

పడియుండ ధూళిలో భవదీయ శంఖంబు
ఏ పగిది సైరింతు ; దీపమ్ము వాతాన
ఆరిపోయిన, దిద్ది అక్కటా, దౌర్భాగ్య,
మెవడు యుద్ధము చేయు ? ఇంక టెక్కెమ్మును
కొనిరమ్ము ; స్తుతిగీతమును మానివేయుమా ।
రా దలంచినవారు రండు వేగమ్ముగా
చనుదేరవలదు నిశ్శంకమ్ముగా, అదిగో,
అభయశంఖము ధూళి యందు పడియున్నయది.

పుష్పార్ఘ్యముం గొనుచు పూజాగృహములోని
కరిగితిని, పూర్ణ దివసాంతమున వెదకితిని
శాంతినాకం బెచట సంభృతంబో యనుచు
ఈమారు మాను నా హృదయక్షతం బనుచు,

మలిన చిహ్నములు నిర్మలినములౌ ననుచు
తలపోయుచును మార్గతలము వీక్షించితిని
భవదీయ శంఖంబు పడియుండె ధూళిలో.

గ్రుచ్చవలయునె జపాకుసుమ దామమ్ములన్?
ఇది నాదు సంధ్యయా? ఈ యారతిని నేను
ముట్టింపవలయునే కట్ట! రజనీగంధ,
విగ్రహాంతమునందు విశ్రాంతి లభియించు
ఋణము తీర్తునటంచు నెంచుచుండగ నంత
లోనె వచ్చినది నీ మౌనశంఖము పిలుపు.

సలుపుమీ యౌవనస్పర్శమణి సంస్పర్శ
దీపకంబునను ఉద్దీప్తమ్ములౌ ప్రాణ
పంచకము ధ్వనియించు ప్రమదమ్ముతో నపుడు
రేయి గుండియ చీల్చి ఆ యంబరము నింపి
యుష్మదీయంబైన యుద్బోధనమ్ముతో,
గాఢాంధకారమ్ము కార్కొన్న దిక్కులకా
పురికొల్ప కడ్గముల్; కరయుగమ్మున నేను
ఈనాడు నీ శంఖ మెత్తిపట్టుదు సుమీ.

ఏ నెరుంగుదు మాంద్యమింక నుండదు మదీ
యాంబకమ్ముల; శ్రావణాభ్రధారలవోలె
నాటుకొను బాణముల్ నా వక్షమున నంచు.
అరుదెంతు రెవ్వరో పరుగునకా చెంతకును,
కాదేని విట్టూర్చి క్రందనం బొనరింత్రు.
దుస్స్వప్నమున భీతితోడ కంపము నొందు
శయనంబు, నీ మహాశంఖ మీ దినమందు
ఉద్వేలమైనట్టి యుత్సాహమున మ్రోగు.

పడయంగ విశ్రాంతి భవదంతికమునందు

తలవోయ లజ్జయే కలిగినది కేవలము.
సర్వావయవము లాచ్ఛాదించి ంణసజ్జ
నరుచెమ్మ, నూతన వ్యాఘాతములు నన్ను
తాకినన్ తాకనీ, స్థైర్యమ్ముతో నుందు
వ్యధతోడ మ్రోగు నా పక్షమ్మున నీ్నదు
జయశంఖ, మిచ్చెదను సర్వశక్తినిగూడ,
గ్రహియింతు నీదు శంఖముతోడ నభయమ్ము.

26-5-1914 బలాకా

## చిత్రరువు

కేవలమ్ము చిత్తరువువ
నీవు ? పటముమీద లిఖిత
మైన పట్టిబొమ్మ వేన ?
అంతరిక్ష నీడమ్మున
ఆ సుదూరనీహారిక
యందు గుంపు గూడియుండి
అంధకారపథమునందు
హస్తంబుల కాంతితోడ
ప్రయాణమ్ము చేసెడి గ్రహ
రవితారకలట్లు నీవు
కావా సత్యం ? బకిటా !
కేవలమ్ము చిత్తరువువ ?
సంతత చాంచల్యంబున
శాంతమ్ముగా నుందెదేల
పథికుని సంగము కైకొను
పథహీనా ! పవలురేలు
అందరకును నడుమనుండి

అంత దూర చిరతారల
అంతఃపురమున నిలుతువు!
ధూసరాంచలంబునెత్తి
ధూళి వాయుభారమ్మున
పరుగెత్తును దశదిశలకు.
వైశాఖాన తపస్విని
విధమున దోచెడి ధరణికి
వితంతువుగ భూషలూడ్చి
గైరికవసనం బొసంగు
కరణి మందనమ్మొనర్చు.
వసుంధరా శరీరమున
వసంత సమ్మేళనంపు
ఉషఃకాలచిత్రరచన
మొనరించుచు నున్న ధూళి
యొక్కటె సత్యం బకటా!
విశ్వచరణ తలమునందు
విలీన మేత త్తృణంబు.
అస్థిరమ్మ లనుటచేత
అన్ని యివ్వి సత్యంబులు-
స్థిరముగ నీవుందు కతన
చిత్తరువువె కేవలమ్మ.

మాతోడనె యొకనాడీ
మార్గంబున బోవుచుంటి,
వప్పుడు నిశ్శ్వాసముతో
నైనది తరంగితము నీ
వక్షము; ప్రత్యంగంబున
ప్రాణము రచియించె నెన్నొ
నృత్యంబులు గానంబులు
నీ నవ్యకవిత్వముతో

మేళన చేయుచు విశ్వపు
తాళముతో తాళమ్మను.
ఎంతో కాలము గడచిన
దేతదీయ జన్మంబున,
ఈ నా భువనంబునందు
ఎంతో నిక్కముగ నుంటి;
నీ విశ్వమందు, నాదు
నీక్షణంబులందు నీవు
కై కొనుచును రూపతూలి
కను రసమూర్తిని లిఖించి
నావు దిశల; ఉదయవేళ
నీవె మూర్తిమంతమైన
విశ్వవాణివలె నుంటివి.

వెనుక నొక్క రాత్రివేళ
చనుదెంచుచు నాతోడనె
సరణి వెంట ఆగినావు
యామిని జవనిక వెనుకను.
అవల రేయింబవళ్లు
అరుగుచుంటి సమ్ముఖమున
ఎన్నో సుఖదుఃఖంబుల.
మిన్ను సముద్రంబునందు
ఆటున పోటున పయనము
అంధకారకాంతులలో
చేయుచుంటి ; నిరుప్రక్కల
చిత్రవర్ణ సుమ దళములు
అరుగుచునున్నవి నీరవ
చరణమ్ములతో పథమున
పరుగిడు దుర్దమ జీవన
వాహిని సహస్ర ధారల

మరణ కింకిణీ రవాన
మత్తుడనై పథప్రీతి
నరుగుచుంటి సుదూరమ్ము.
అజ్ఞాత స్వరముతోడ
నీ వాగిన తావుననే
నిలిచియుంటి వధ్వములో
ఈ తృణ మీ ధూళి అల్ల
ఋక్షంబులు చంద్ర సూర్యు
లీ యెల్లర మాటు నందు
నీవు వట్టి చిత్తరువవు!
ఏమి ప్రలాపములు, కవీ!
ఈవు వట్టి చిత్తరువువ ?

కావు కావు కావు నీవు
కేవలమ్ము చిత్తరువవు:
నీ పీ రేఖల చెరలో
నిస్తబ్ధ క్రందనమున
ఉన్నావని యెవరన్నా
రోహో ఆ ఆనందము
ఆగునెడల నీ వాహిని
వీగును తరంగ వేగము:
తన బంగరు లేఖన మీ
స్తనయిత్నువు తుడిచివేయు
నీ చిక్కని చికురమ్ములు
నీడ వీడునేని విశ్వ
మవు డొక దివసమున చంచ
లావిల లీలాయిత మగు:
మాధవీ వనమ్ములోవి
మర్మర ముఖరచ్ఛాయను
స్వప్నవస్తు సదృశమగును.

స్మరింప మానితినె నిన్ను ?
జీవన మూలస్థానము
నీవు గ్రహించిన కతమున
ఒదవెను సుమ్మీ లోపము !

మది మదిలో లేక నేను
మార్గమునం బోవుచుండి
మరచిపోవ లేదొకో
కుసుమములను తారకలను ?
కూర్చు నవ్వి పరిమళము
నిశ్శ్వాసానిలములకును,
నింపుచుండు సుస్వరమును
విస్మృతి శూన్యతలంబున.
దాని కెపుడు మరపులేదు
దానినె మరువంగవలయు !
విస్మృతి మర్మమునం దుప
వేశించుచు నా రక్తము
వికలం బొనరించుచుండు.
నేత్రమ్ముల యెదుట లేవు
నీవు. కాని గ్రహించితివి
చక్షుర్మధ్యమునందే
స్థావరమ్ము కాన నేడు
శ్యామలమున శ్యామలమై
నీలిమలో నీలిమమై
నెగడుచు నున్నావు, కాంచు
నీలోనే నా జగత్తు
నిజస్వాంత సమత్వంబు.
నే నెరుంగ, నొరు లెరుగరు
నీ స్వరంబె నా గానము
నందు మ్రోగుచుండు ననుచు.

అగుదువు కవి హృదయంబున
కవివి; కావు చిత్తరువువు.
కావు నీవు చిత్తరువువు.
కేవల చిత్రమవు కావు!

ప్రాప్తించితి వేదో యొక
ప్రాతఃకాలమున నాకు.
అవల కోలుపోతిని నిను
యామవతీ సమయమందు.
అటుపిమ్మట లభియించితి
వగోచరాంధకారములో.
కావు నీవు చిత్తరువువు.
కావు కావు చిత్తరువువు!

20-10-1914 బలాకా

## షాజహాన్

యౌవనంబును ధనము మానము
జీవితంబును కాలవాహిని
తేలిపోవుట నిశ్చయంబని
తెలియునా నీకు?

షాజహానూ, భారతేశ్వర,
శాశ్వతంబుగ మిగిలి పోవును
తావకాంతర దుఃఖమొక్కటె
తరిగిపోకుండన్!

చక్రవర్తికి నిదే సాధనంబయ్యేనే?

కఠినమ్ము దంభోళికన్న భూపతిశక్తి,
సంధ్యారుణిమతోడ సమముగానుండునది,
కానిమ్ము తంద్రలో లీన మొక పక్షమున-
నిట్టూరు పొక్కఁజే నిత్యోచ్ఛ్వసిత మగుచు
కావింపనిమ్ము సకరుణమ్ము గగనమ్ము-
ఉండె నీ యాశయే యుష్మన్మనంబులో.
వజ్రముక్తామణివ్రాతమ్ము పోనిమ్ము
లీనమై ఐంద్రజాలికు పురందరచాప
కాంతి పోలిక శూన్యకకుబంతములయందు,
కన్నీటి బిందువై కాలగండతలాన
వెలుగు పాండుర సముజ్వల తాజమహలుగా.

మానవస్వాంతమా, దేనివంకనుగూడ
తిరిగి చూచుటకునై తీరికేమియులేదు.
నిత్యంపు సంసార నిష్ఠురపు వాహినిన్
కదలిపోవుచు, భువనఘట్టాలదేలుచున్
ఒక సంతలో గూడియున్నట్టి భారమున్
వేరొక్క సంతలో విడిచిపెట్టుచునుందు ;
వే క్షణంబులలోన దక్షిణానిలమంత్ర
గుంజనంబున భవత్కుంజోపవనములో
మాధవీ వాసంతమంజరుల్ నిండునో,
పీడోక్కలు గోధూళి వీతెంచి పదద్రోయు
ఛిన్నమైన దళాల చేసి చిందరవంద
రారామతలచంచలాంచలపు ధూళిపై.
అదియు సమయమ్ము కా దందుచేతనె మరల
విరియంగబారు శైశిరశర్వరులయందు
కుంజంబులందు నవకుందకుసుమంబులను
తీరుగా వాని సింగారించుకొనుటకై
ఆనందబాష్పంబు లలర హేమంతమున.
అక్కటక్కట హృదయమా, నీదు సంచయము

దివసాంతమందు రాతిరి తీరుగడయందు
పారవేయంగవలె నూరకయె మార్గమున,
కా దద్ది సమయంబు కాదు సమయము కాదు.

సార్వభౌమా, నీదు శంకిత హృదయమ్మ
నందుచే సమయహృదయ మ్మపహరింపగా
అభిలషించుచునుండె నందనమున మైమరచి.
దాని కంఠమునందు సూనదామము వేసి
వరియించినావె రూపాభావమరణమును
కలిగించి యంతమ్ము గనని యద్భుతసజ్జ.
ఉండ దా చింత పంద్రెండు మాసములేని,
అందుచే శాంతింపనట్టి క్రందనమందు
చిరమౌనజాలమున జేర్చి బంధింతువా
కఠిన బంధనముతో; కౌముదీయామినుల
నీ రహోమందిరము చేరి మెల్లగా
ప్రేయసిని నీవెట్లు పేరుతో పిలిచితివో,
చెవిలో రహస్యముగ చీరియుండిన పిలుపు
ఆగినది యిచ్చట ననంతకర్ణమ్ములో;
ప్రేమయందలి కరుణకోమలత యిచ్చోట
పుష్పించి సొంపైన పుష్పపుంజంబులో
చక్కని ప్రశాంత పాషాణ రూపమ్ములో!

హే కవీంద్ర, హే సమ్రాట్,
ఇది నీ హృచ్చిత్ర మొక్కొ!
అభినవమగు మేఘదూత
మగుచు వెలయు నొక్కొ ఇదియు,–
అపూర్వంబు నద్భుతంబు
లగు ఛందోగానంబుల
అదృశ్యంపు దిశల కెగయు;
విరహిణియో నీ ప్రేయసి

అరుణకాంతిలో ప్రభాత
మందు కలిసియున్నట్లును,
క్లాంతమగుచు సందెవేళ
గగనంబున విడిచినట్టి
జాలి యూర్పునజా, విదేహా
చమేలి లావణ్యమునను
పున్నమిలో, వాగతీత
భూమి యందు, యాచించెడి
వీక్షణములు కవాటమ్ము
వెంట మరలి వచ్చునట్లు-
"మరవలేదు నిన్ను ప్రియా,
మరవలేదు మరవలేదు"
అను వార్తను నిర్వాక్కుగ
గొని, నీ సౌందర్య దూత
కాలయామికులను లెక్క-
కావింపక యుగయుగాల
సేవనకై అరిగినాడు.
మహారాజా వెడలిపోతివి
బహుదినంబుల నాడు; స్వప్న
ప్రాయమై భవదీయ విస్తృత
రాజ్యమంతయు తొలగిపోయెను,
చన్న దెటకో మయూర సింహా
సనము; పదభారంబు చేతను
వసుధ దద్దరిలంగ జేసిన
భటదళంబుల స్మరణ మియ్యెడ
వాయు వశమున రేగి దేహాలి
పథములను వ్యాపించుచున్నది
ధూళి మీదుగ; లేదు గాన
స్తుతులు చేయగ వందిమాగధు,
లేది నౌబత్తిపుడు యమునా

హ్రాదినీ జల భంగములతో
కలుప తానము ; భవన్నగరీ
కామినీజన నూపుర ధ్వని
భగ్నసౌధపు కోణములలో
లగ్నమై ఝిల్లీరవంబున
అంతరిక్షము నేడిపించును.
అయిన నమలిన దూత క్రాంతి
క్లాంతిహీనము, రాజ్యభంగము
కాని నిర్మాణంబు కానీ
గణన చేయక, చావు పుట్టుక
లేమి లక్ష్యము చేయకుండగ
ఏకతానముతోడ పలుకును
ఎన్నివందల యేడులైనను
విస్మరించుటలేదు, మత్ప్రియ,
విస్మరించుట లేదు లే దని
విరహవాణిని స్వీకరించుచు.

అంత మిథ్యావార్త ; ఎవ్వం
డనును విస్మరణంబులేదని ?
ఎవ్వడను స్మృతిపంజరపు తలు
పీవు తెరవనె లే దటంచును ?
పూర్వమం దస్తంగతంబయి
పోవు తిమిరము నేటికిని నీ
హృదయమున బంధించినావా ?
అదియు విస్మృతి ముక్తిమార్గము
వదలి యీవల పడనెలేదా ?
ఒక్కచోట సమాధిమందిర
ముర్విధూళిని విలిచి స్మరణా
వరణమున మరణమును మూయుచు
చిరస్థాయిగ నున్న ; దెవ్వడు

జీవితమ్ము‌ను నిలుపగలుగును ?
దాని నాహ్వానించుచుండును
తారకలు గగనమ్మునుండియు,
నవనవం బగు వాని యాహ్వా
నమ్ము ప్రతిలోకమ్మునందును
పూర్వపర్వత కాంతిలోనను ;
పోవుచున్నది స్మృతిగ్రంథిని
నరకి బంధవిహీన విశ్వపు
సరణి వెంటను ; మహారాజా !
ఏ మహాసామ్రాజ్యమేనియు
ఎన్నిదినములో నిన్నునిలుపగ
నేరదాయె, సముద్రవలయిత
ధారుణీస్థలి నిన్ను పూర్ణుని
జేయజాలకపోయె ; కావున
జీవనోత్సవ శేషవేళను
దాని పాదయుగంబుతోడను
తన్నివేసితి నీవు మృత్పా
త్రమును పారదన్నిన యట్లు.
తావకీన ఖ్యాతికంటెను
నీవె మహనీయుడవు ; కావున
నీదు జీవనరథము కీర్తిని
నెట్టి వెనుకకు మాటిమాటికి.
నీదు చిహ్నం బిచట నున్నది
నీవు మాత్రము లేకపోతివి !
ఎట్టి ప్రేమము ముందు వెనుకల
నెరుగదో, నిజసింహపీఠిని
పొందియుండెనొ మార్గమధ్యము
నందు, దేని విలాససంభృత
భాషణమ్ములు భవత్పదముల
బట్టి యుండెనొ ధూళిరీతిని,

అట్టిదానిని నీవు క్రమ్మర
నెట్టినాడవు ధూళిలోనికె.
తోడనే వెనువెంటనే పద
ధూళి పైబడె వాయుభరమున
చేతమందుండి విడి యెపుడో
జీవదామమునుండి యూడుచు
వేగముగ బీజమ్ము వడుపున
వెడలిపోతివి నీవు దూరము ;
బీజ మమరాంకూరమై విను
వీథి వైపున కుద్గమించుచు
ఇట్లు గంభీరముగ పాడును :
"ఎంతదూరము చూచుచున్నను
నెచట నా పాంథుండు కనరా,
డాపజాలక పోయె ప్రియురా
లతని, రాజ్యము త్రోవ యిచ్చెను,
అడ్డు పెట్టగజాల వతనికి
అబ్ధులును ధరణీధరంబులు :
రాత్రి యాహ్వానమున నాతని
రథము పయనము చేయుచున్నది
ఉడుగణంబుల గీతితో నే
డుదయసింహద్వారసీమకు.
ఇందుచే స్మృతిభరముతో నే
నిచటనే బడియున్నవాడను ;
కాని యాతడు భారముక్తుడు
కావుననె లే దీ స్థలంబున."

31-10-1914 బర్లిన్

# చంచల

ఆహా విశాల తటినీ
అదృశ్యములు నిశ్శబ్దము
లగు నీ జలములు పోవును
అవిచ్ఛిన్న, మవిరళమై,
నిరవధికమ్ముగ; నీ భీ
కర శరీరహీన వేగ
కారణమున స్పందించుచు
గగనతలము పులకించును.
వస్తువిహీన ప్రవాహ
బలిష్ఠఘాతమ్ము తగిలి
పుంజములుగ వస్తు ఫేన
ములు జాగరితమ్ము లగును.
పరుగువారు తమమునుండి
ప్రభాచ్ఛటలు వికీర్ణములై
వర్ణధారగా లేచును.
సూర్య చంద్ర తార లెన్నొ
సుడిగుండములన్ గిరగిర
తిరుగాడుచు నంచెలుగా
సురుగును బుద్బుదము లట్లు.
ఓ భైరవీ, విరాగిణి!
ఊరక పోవుచు నుందువు,
నీ గమనం బేరాగిణి
నీరవమైనట్టి స్వరము
అంతరహితమైన దూర
మనవరతము నీ కొసగునె
ఆహ్వానము? కావుననే
అఖిలమ్మును తుడిచిపెట్టు
నద్దానియెడం గలిగిన

ప్రీతిచేత గృహము విడిచి
పెట్టితివా పూర్ణముగా ?
ఉన్మత్తాభిసరణమునం
దురముమీది హారమ్ములు
ఆందోళన చెందు మిగుల ;
అటులే నక్షత్రమణులు
అగు చిందరవందరగా.
గాలి దుమారమున నీదు
లోలకేశజాల మెగిరి
విద్యుద్దోలల నూచును
విహాయసమునందు ; చంచ
లాంచలంబు తృణములపై
అడవుల చంచల పల్లవ
పుంజంబుల మీద దొరలు ;
పుష్పంబులు జారిపడును
మాటికి సంపెంగ, అడవి
మల్లెలు, వకుళ సుమంబులు,
పాటలములు నీ ఋతువుల
పాత్రనుండి పథమునందు.

పరుగిడుదువు, పరుగిడుదువు
పరుగిడె దుద్దామమైన
వేగముతో కేవలమ్ము,
వెనుదిరిగి విలోకింపవు ;
అందినదంతయు తావక
హస్తంబుల వెదజల్లుచు
పోవుదు. వించుకయైనను
ప్రోగుచేసి సమకూర్చవు ;
దుఃఖము లేదు భయము లేదు,
త్రోవలోని మోదముతో

బాధావిహీన గతితో
పాథేయము విరజిమ్మెదు.

నీవు నిండియున్నప్పుడు
నీ కేమియు మిగుల ; దందు
వలన సదా శుచివి నీవు :
భవత్పాద సంస్పర్శను
మరచిపోవు విశ్వధూళి
మాలిన్యము ; క్షణక్షణము
మృత్యువు ప్రాణం బగుచును
అత్యంతము పైకి లేచు.
క్లాంతి భరమ్మున నీ వొక
క్షణలేశము నిలుతువేని
చప్పున, పుంజీభూతము
లగు వస్తుప్రతతితోడ
అద్రివిధంబున విశ్వం
బగును స్ఫీత ; మపుడు మూకు
లంధులు, పంగుకబంధులు,
మహాకాయు లెల్లవారు
మార్గమున న్నిలిచియుంద్రు
అన్నింటిని నెట్టికొనుచు
అనుపమాన బాధతోడ.
అంతరిక్ష మర్మమందు
అణువులు నిజభారముచే
పుంజీభూత గతివిహీన
భూరి వికారవశమ్మున
విద్ధము లగు కాలుష్యపు
వేదన శూలములవలన.

ఆహా నటి, చంచలాప్స

రా, అలక్ష్యసుందరి! నీ
నృత్యవియద్గంధ పొంగి
నిత్యము మృత్యుస్నానము
చేత విశ్వజీవనమును
చేయుచుండు పావనముగ.
నిఖిల గగనతలము నధిక
నిర్మల నీలిమతోడను
ఉజ్వలంబు చేయుచుండు.
ఓయి కవీ, నేడు నిన్ను
నలుపుచున్న దస్థిరునిగ
ఝంకారోన్ముఖరయైన
అచలకాంచి అవారితముగ
అకారణముగా, నలక్షిత
చరణంబుల సంచారము.
చంచల చరణధ్వానము
వినబడు ప్రతి నాడియందు.
వెడలు ఝణఝణాత్కారము
నీ వక్షమునందు, నేడు
నృత్యము చేయుచు నున్నవి
నీరక్తమునను సాగర
తరంగము లటంచు నెవ్వ
రెరుంగుదురు? కాననముల
వ్యాకులతయు వర్తించును;
వచ్చు నేడు స్మరణమునకు—
'యుగయుగములనుండి భ్రంశ
మొందుచు నిశ్శబ్దముగా,
ఒక రూపము విడుచుచు వే
రొక రూపమ్మును దాల్చుచు,
వ్యత్యస్త ప్రాణముగా
వర్తిల్లుచు రేయియందు

పరువాతను, కల దంతయు
కరమునందు వ్యయము చేసి,
గానమునుండి గానమ్మున
దానమునుండి దానమ్మున
నేను క్షయము చేసితి' నని.

అవలోకింపుము ముఖరిత
మగుచున్నది. మిత్రంబా,
ఆ వాహిని ; కంపంబున
గడగడలాడుచు నున్నది
పడవ ; నీదు సంచితమును
పడియుండగ నిమ్మోయీ
తీరమునందే ; దానిని
తిరిగి చూడవలదోయీ !
సమ్ముఖవాణి నిన్ను లాగి
చనును మహాస్రోతస్సుకు,
పశ్చాద్భాగమునందలి
ప్రబలకలకలంబునుండి
అంతులేని తమములోని
కపారమైన కాంతిలోకి.

18_12_1914 బలాకా

## దానము

ఈ ప్రభాతమున ఓ ప్రియ, చెపుమా
నిజహస్తంబుల నీ కే మిత్తును ?
ప్రభాతగీతమ ? ప్రభాతంబు తన
వృంతముపై రవి వేడి కిరణముల

వాడి వివశమై వాలుచునున్నది;
శ్రాంతగాన మవసానము చెందును.

అరుగుదెంచి దివసావసానమున
ద్వారసన్నిధికి కోరెద వెయ్యది ?
ఓహో, బంధూ, ఒసగుదు నెయ్యది ?
సంధ్యా దీపమ ? స్తబ్ధభవనమున
ఈ కోణమునకె ఈ దీపద్యుతి.
చను మార్గంబున జనమధ్యమునకు
కొనిపోవంగా కోరెద దీనిని ?
అయ్యో, గాలికి ఆరునె త్రోవను !

ఉపహారము నీ కొసగగ సత్తువ
కలదా ? సుమముల ? కంఠహారమా ?
వాని భారమెటు పూనం జాలుదు ?
ఒక్కదినంబున నిక్కముగా నవి
యన్నియు వాడునొ, భిన్నము లగునో ?
నిజహస్తంబుల నీదు కరంబుల
దేని నుంతునో దానిని మరచును
శిథిలములగు నీ చేతుల వ్రేళులు;
ధూళిం బడి యది తుదకు భస్మమగు.

అంతకంటె నెపుడైన దొరకునెడ
అవకాశము, నా యారామమ్మున
వసంత ఋతువున పరధ్యానమున
పోవుచు నేదో పుష్పపరిమళ
హర్షవశమ్మున అబ్బురపాటున
ఆగి నిలిచెదవు; అపుడు మార్గమున
పోయిన కానుక నీ యదియే యగు.
నా చిన వీథిని నడచుచు నుండగ

నీ నయనంబుల నిషా యెక్కగల;
దాకస్మికముగ నవలోకింతువు—
సంధ్యాకబరీ స్ఖలితం బగు నొక
వర్ణాలోకము వడవడ వణకుచు
స్వప్నముమీదను స్వర్ణరత్నమును
తాకం జేయుచు; ఆ కాంతియె నీ
కణ్ఠాతంబుగ నగు నుపహారము

ఉత్తమధన మెది యున్నదొ నా కది
తళుకుబెళుకుతో తనరి లీన మగు
నిమేషమ్ములో: నీ పేరేదో
విశదము చేయక వెడలిపోయితివి
ఝళన్నూపుర స్వనమున సరణిని
అదరం జేయుచు; ఆటకు తెరువెరుగ,
అచటికి జేరవు హస్తము, వాణియు;
నీవు కోరకయె నీ వెరుంగకయె
అచటినుండి తనయంతన తానే
అరుగుదెంచునది అగు నుపహారము
నీ కో బంధూ! నే నీయంగల
దేయది యైనను ఎంత సామా
న్యంబగు-కుసుమమొ, ఆ గానంబొ!

25-12-1914 బలాకా

## విచారణ

హో నా సుందర, ఏగుచు నేగుచు
పథహర్షంబున ప్రమత్తుండవై
యున్న యెడను నీ యొడలి నిండుగను

చల్లిరి ధూళిని ఎల్ల జనంబులు.
అయ్యో అయ్యో అని విలపించెను
హృదయము, సుందర ! ఈ దినముననే
వ్యథతో పలికెద : న్యాయదండమును
చేపట్టుచు మరి చేయు విచారణ
అవల జూడగ నద్భుత మే మిది ?
ఉన్మత్తంబై యున్నది సుమి నీ
ధర్మమందిరద్వారము, సాగును
న్యాయవిచారణ మన్ని వేళలను.
కలుష శోణములు కన్నులు వారివి ;
ప్రభాతకాంతులు పడు కన్నులపై
శబ్దహీనముగ ; స్వచ్ఛమల్లికా
లతాంతవాసన లాలసచేతను
ప్రబలిన,యూర్పుల స్పర్శ యొనర్చును
సాధ్వి తపస్విని సంధ్యాకరముల
బొలుచు సప్తర్షి పూజాప్రదీప
మాలిక వారల మత్తతవై పే
యామిని యంత్రట నవలోకించును.
ఓయీ సుందర, న్యాయస్థానము
పూతవనమ్మున పుణ్య సమీరము
తృణపుంజములో తేటి రొదలలో
వసంతకాలపు వయోరావముల
తరంగ చుంబిత తటములు పల్లవ
వ్యజనంబులతో నలరుచున్న యది.

మత్ప్రియ ! వారలు మహా నిర్దయులు
ఆవేగంబో ఆప నశక్యము
హరించి భవదీ యాభరణంబులు
తమ నగ్నావాసమును వానితో
అలంకరించెడి తలపున చాటుగ

వారు తిరుగుదురు ; వారి ఘాతములు
ప్రేమాంగంబుల బ్రామిన యప్పుడు
నేను సహింపగ నేరక పిలిచితి
అశ్రుపూరితములగు నక్షులతో,
"కరవాలంబును ధరింపు నా ప్రియ
సలుపగవలెను విచారణ"మని నిను.
ఆవల జూడగ నద్భుతమాయెను—
ఏ యెడ నున్నది న్యాయస్థానము ।
వారల యుగ్రత పైన రాలినవి
స్నేహమునణా జననీ బాష్పంబులు
పరిమితి యెరుగని ప్రణయిని విశ్వా
సము కటళించును క్షత పక్షముపై
ద్రోహుల శూలము ; ఓహో నా ప్రియ,
త్వద్విచారణ స్థానాగారము
అప్రమత్తమౌ ననురాగ స్థిత
నాదహీన యగు వేదన లోపల ;
మహిళా నిర్మల మందాక్షములో,
స్నిగ్ధుల గుండియ నెత్తురు పాటున
పథ ప్రార్థినీ ప్రణయ చ్ఛేదిని
యామిని లోపల ; అశ్రు పరిప్లుత
కరుణాపూర్ణ క్షమాకుల్యలో—

నా రుద్రా, మరి వారలు లుబ్ధులు
దాటుచు సింహద్వారము మూర్ఖులు
పిలుపు లేకయే తొలిచి కన్నమును
త్వద్భాండారము తస్కరించినా,
రపహృతధనము మహాదుర్భరమై
నిముస నిముసమును నెరకుల దాకుచు
అణగం ద్రొక్కును. అసాధ్య మెంతయు
భారము క్రిందికి పడవేయుటయే ।

వారి క్షమింపుము నా రుద్రా యని
ఎన్నో సారులో ఏడుపు గొంతున
నీకు జెప్పితిని. నిదానించి నే
కనుగొనగా నీక్షమ దిగుచున్నది
గాలి దుమారముగా ; పడిపోయిరి
వారలు, ద్రవ్యపు భారము గాలికి
ఎచటికొ బెదరుచు నెగిరి పోయినది.
గర్జన చేసెడి ఖరవజ్రానల
కీలల, సాయంకాలమ్మందున
అస్తమాన సూర్యాభీలం బగు
నంకన మందును నసృగ్వర్షమున
ఆకస్మికముగ నన్యోన్యము లగు
ఘర్షణముల నీక్షమ నా రుద్రా !

27-12-1914 బలాకా

## మాధవి

ఏ దినమున పుష్పించిన
దీ మాధవి ధరణీస్థలి,
బహులక్షల వర్షమ్ముల
పా టొనర్చు తపః ఫలమొ !
యుగయుగ మాచ్ఛాదితమై
యున్నది యీ హర్షచ్ఛవి
అలక్ష్య హృదయాంచలమున.

ఇటులే నా స్వప్నమ్మున
ఏదో దూరయుగాంతర
ఋతు వసంత కాననమున

ఏదో యొక కోణమ్మున
ఏదో యొక ముఖమునందు
హాసరేఖ యుజ్జ్వలించు
నను నాసయె నాదు హృదయ
మందు దాగు గభీరముగ.

10-1-1915 బలాకా

## ప్రేమ స్పర్శ

నిన్ను నేను, భువనంబా,
నిండుగ ప్రేమింప నంత
దాక నీదు నాలోకము
తన సమస్త సంపత్తిని
వెదకి వెదకి పొందలేదు ;
విహాయసము సర్వంబును
చూచుచుండె దీపికతో
శూన్యమైన పథము వెంట.

పాట పాడి నాదు ప్రేమ
వచ్చె, నేమి మంతనంబు
జరిగెనో నీ కంఠమందు
స్వకీయ దామమ్ము నుంచె ;
ముద్దు కనులతోన నగుచు
నెద్ది యొసగె కొంచెము నీ
గుప్తమైన హృదయంబున
గూఢముగా, నద్ది తార
కా మాలిక నడుమ నెపుడు
గ్రథితంబై యుండు గాక !

12-1-1915 బలాకా

## నారీద్వయము

ఏడిచి అతల శయ్యాస్థలి
వెడలెను నారీద్వయంబు
సృజనసింధు మథనములో
ఏదో యొక క్షణమునందు.
సుందరి ఊర్వశి యొకర్తు
అందు, నిఖిలకామరాజ్య
రాజ్ఞి ; స్వర్గమం దచ్చర,
రమణి అపర లక్ష్మిదేవి,
విశ్వజనని, స్వర్గమునకు
ఈశ్వరి, కల్యాణి, తెలియు.

ఒకతె చేసి తపోభంగ
ముచ్చహాస్య వహ్నిరసము
ఫాల్గునంపు సురాపాత్ర
పరిపూర్ణముచేసి, కొంచు
పోవు ప్రాణమానసముల,
పొందికగా కరములతో
వానిని వెదజల్లుచుండు
వసంతకుసుమంపు రొదల,
రాగరక్త కింశుకముల,
రమ్యమగు గులాబిపూల
స్వాపహీనమైన తరుణ
జనముల గానమ్ములందు.

తరుణి అపర కొనివచ్చును
మరల శిశిరసిక్తమైన
బాష్పవారి స్నిగ్ధమైన
పరిమళమ్ములోనికిని ;

హేమంతమునం దలరెడి
హేమకాంతి సఫలమైన
శాంతి సమగ్రతలోనికి ;
సమస్తలోకాశీస్సును
స్థిరలావణ్యంపు మధుర
దరహాసామృతమునకును
మరల నామె కొనివచ్చును ;
తిరిగి తీసికొనివచ్చును
జీవనమరణములు కూడు
పావనమగు తీర్థతటము
నందలి యనంతు పూజా
మందిరాంతరమ్మునకును.

3-2-1915 బలాకా

## బలాకలు

సంధ్యారుణ కాంతిలోన
ఝలఝలలాడెడు ఝీలము
నిమ్నగా వక్రధార
నీలం బయి దూరె నంధ
కారంబున, వక్రం బగు
కరవాలం బొరలోవలె;
ఆటు ముగిసిపోవ పగలు
పోటు వచ్చి రాత్రివేళ
నీలజలము మీద చుక్క-
పూలు తెచ్చి తేలవేసి.
పంక్తులుగా దేవదారు
పాదపమ్ము లంధకార

పర్వతతటమందు విలిచె;
చెప్పటోయి స్వప్నములో
సృష్టి యేదొ చెప్పలేక.
స్పష్టముగా— అవ్యక్త
ధ్వనిపుంజము బుడుపులుగా
దట్టమైన చీకటిలో
నెట్టుక వచ్చినటుతోచు.

ఆ క్షణమున వినబడినది
ఆకస్మికముగ సంధ్యా
నభమున రవవిద్యుచ్ఛట
నాకు; శూన్యమగు మైదా
నమ్మున పరుగిడె నయ్యది
దూరముగా దూరముగా
దూరతరమ్ముగ క్షణమున.
గగనంబున విస్మయ జా
గరణమును తరంగితమ్ము
గావించుచు జనె రాశీ
భూత ప్రమదాట్టహాస
పూరంబుల, జంఝూరవ
యుక్త మత్తపక్షంబులు
ఓహో హంస బలాకలు!
ఆ ధ్వని శబ్దస్వరూప
యగు నచ్చర, కదలిపోయె
తపోభంగ మొనరించుచు
స్తబ్ధత్వమ్మున కయ్యెడ.
అంధకార మగ్నమైన
అవనిధరశ్రేణి వడకె;
అదరె దేవదారువనము.

ఇట్లనిపించినది నాకు :
ఈ పక్షిశ్రేణివాణి
నిమేషమ్మునం బులకిత
నిశ్చలతా హృదయమునకు
ద్రుతగతి యావేగంబును
తోడితెచ్చి పెట్టినదని.
వాంఛించెను నిరుద్దేశ
వైశాఖ వలాహకమ్ము
వలె నుండగ పర్వతమ్ము,
పాదపముల పంక్తి లపుడు
పక్షమ్ములు విప్పె, మట్టి
బంధనమ్ము త్రోసివేసి.
ఆ శబ్దము ననుసరించి
ఆకాశాంచలములనే
అన్వేషించుచు దిక్కుల
అణగిపోవ వాంఛించును.
హే బంధ విహీనశకుని,
ఈ సంధ్యాస్వప్నభంగ
మగుచు వేదనాతరంగ
మతి దూరము జాగరితం
బగుచున్నది హద్దులేక ;
ఇచ్చట కా, దిచ్చట కా,
దిం కెచటనొ యనువ్యాకుల
భాషితములు మ్రోగె నిఖిల
ప్రాణి సమూహమ్మునందు.

ఓహో హంసబలాకలు !
ఉన్న స్తబ్ధతావరణము
నా సవిధమునుండి తొలగ
జేసినారు ; నిస్తబ్ధత

క్రింద శూన్యమందు, జలము
నందు, ధరాతలమునందు,
శ్రవణగతం బగు ప్రచండ
చంచల పక్షిరావము.
వెనుకటి వలె తృణ దళములు
పృథివీ గగనముల మీద
ఆడును చరిచర ; ధారు
ణ్యంధకారమునకు క్రింద
నవగతి మెవ్వరికి తావు ?
కోట్లకొలది బీజము లం
కుర పక్షంపు బలాకిల
దెరచుచున్న ; వియ్యెడ నీ
గిరిరాజిని గనుగొంటిని ,
తెరచుకొన్న రెక్కల నీ
యరణ్యమ్ము నిర్గమించు
దీవి నుండి ద్వీపమునకు
తెలియని పలు తావులకును.
ఉడు పక్ష స్పందనమున
ఉప్పరంపు తెరవు నందు
ఆలోకా క్రందనమున
నంధకార మేచి మెరయు.

ఆలకించినాను మాన
వావళి వాక్కులు దళముగ.
దళములు దళములుగా కదు
అలక్షితాధ్వముల వెంట
అస్పష్టము లతీతంబు
లగు యుగముల కెగసిపోవు
నట్టి మానవోక్తు లెన్నొ
ఆలకించినాను నేను.

ఆవాసము విడిచినట్టి
యీ విహంగ మసంఖ్యేయ
పక్షులతో పగలు రేలు
ప్రకాశమున చీకటిలో
ఏ దిశ నుండి యే దిశకో
ఎగిరిపోవుచుంట నాదు
హృదయంబున వినబడినది.
ఇచ్చటకా దిచ్చటకా
దెచ్చటనో ఎచ్చటనో
విశ్వాగరు త్తతుల నుండి
వెడలిన ఈ గానముచే
హదలిపోయె శూన్య మెల్ల.

అక్టోబరు - నవంబరు, 1915 బలాకా

## ముక్తి

ఏమి చెప్పనిమ్ము వైద్యు
డెంత చెప్పియున్న గాని
తెరచియుంచు కిటికి తలుపు
తెరచియుంచు తలగడ దెస ;
తగులనిమ్ము దేహమునకు
ధారాళముగ సమీరము.
ఔషధమా ? తీరిపోయె
ఔషధమ్ము తీసికొనుట.
క్షణక్షణము దినదినమును
కారమ్ములు, తిక్తమ్ములు,
ఆయుర్వేదౌషధములు
ఆయా చిట్కా మందులు,

ఇంచుక అశ్రద్ధ చేయ
నెంతో ప్రమాదించువాని
నీ జీవనమున గ్రహింగితి.
ఇక బ్రతుకుపై రోగముగా
ఇపుడు తేలిన ట్లున్నది
ఇది మంచిది యిది కాదని
ఎవ్వరేది చెప్పెదరో
అవ్వానిని నాదరించి,
కనులు మూసికొనుచు, మస్త
కమున ముసుగు లాగికొనుచు,
ఇరువది రెండేండ్లు నేను
ఈ మీ గృహమున గడపితి.
ఇంటివారు బయటివార
లెల్ల రందుచేత నన్ను
'మహాలక్ష్మి, చాల మంచి
మానిసి, సతి' యనెడివారు
ఈ సంసారములోనికి
నేగుదెంచినాను తొమ్మి
దేండ్ల వయసు పిల్లను; నే
నీ కుటుంబదీర్ఘ వీథి
నెట్లో దాటుచు పిమ్మట,
ఎత్తుకొనుచు పది కోర్కెల
బరువును, నీ జీవనంపు
భారము మోయుచు మోయుచు
చివరకు నీ మార్గము కడ
చేరినాను నేడు నేను
సరిగా కష్టసుఖమ్ముల
సంగతి యొక్కింత మదిని
నాలోచించుకొనంగా
నంత వ్యవధి యేది నాకు ?

మంచిదియో సామాన్యమొ
మందమైనదో ఈ జీ
వన మటంచు విచారించు
కొనుట యెప్పు డింక నాకు ?
వెనుక ముందు విమర్శించు
కొనుట యెప్పు డింక నాకు ?
కార్యచక్ర మొక్కరీతి
క్లాంత వినాదమ్ముతోడ
గిరగిర తిరుగుచు నున్నది.
ఘూర్ణనంపు మత్తుతోడ
గ్రుడ్డిదాన నగుచు నేను
ఇరువదిరెం డేడు లుంటి
ఈ చక్రంబునకు సదా
ఇట్టుల బంధించుకొనుచు.
ఎరుగను నే నెవ్వతెనో,
ఎరుగ నీ విశాలవసుధ
నే యర్థము కలదో నిండి.
మహాకాలు వీణలోన
మానవభాషితము లేవి
మొరయుచున్నవో వానిని
నెరుగను– నే వినగలేదు.
ఎరుగుదు కేవల మొక్కటి :
వరుసగ భోజనము, పిదప
వంట, మరల భోజనమ్ము,
వంట మరల జరుగుచుంట.
ఇరువది రెండేండ్లు నేను
ఇట్టు లొక్క చక్రమునకు
బంధించుక మనుచుంటిని.
స్వాంతంబున దోచె నిపుడు
ఆ చక్ర మ్మాగు ననుచు.

ఆగినచో నాగనిమ్ము :
ఔషధ మింకేల నాకు ?

ఏగుదెంచినది వసంత
మిరువదిరెండేడ్లు వన
ప్రాంగణమునకు ; సుగంధము
చెంగలింప, మైమరపును
గలిగించెడి గంధవహము
జలముల స్థలములయందలి
మర్మడోలికల నూపెను
మరల మరల. 'ద్వారములను
తెరువు డింక, ద్వారమ్ముల
తెరువు' డంచు కేక లిడితి.
ఎపుడు వచ్చునో ఆయన,
ఎపుడు వెళ్లునో తెలియదు ;
కలిగినదేమో మదిలో
కలవరమ్ము రహస్యముగ ;
అనాలోచితముగ మనసు
నందు మరపు కలిగినదో ;
స్వాంతమందు జన్మాంతర
బాధ యేదొ బాధించుచు
నున్న దేమొ , నిరీక్షించు
చున్నదేమొ కారణంబు
తెలియరాని కష్టసుఖ
మ్ముల ప్రాణ మ్మెవ్వరిదో
వినిన యట్లు పాదధ్వని
విహ్వల మగు ఫాల్గునమున.
వత్తువు కచ్చేరి నుండి,
వచ్చి సందె వేళ నీవు
చదరంగం బాడంగా

చనెదు పేటలోని కెటకౌ.
అ టుండవీ ఆ సంగతి ;
అరుగుదెంచె మది కేలనొ
ప్రాణమునం గల క్షణిక
వ్యాకుల మంతయును నేడు.

ఈ యిరువది రెండేండ్లకు
నీ దినమున ప్రథమముగా
నాదు జీవనమున వచ్చె
నా యింటికి వసంతమ్ము.
గగనమ్మను కిటికి నుండి
కనుగొనగా నానందము
జాగరిల్లుచుండె నేడు
క్షణక్షణము ప్రాణములో :
'నే మహిళను సుమి, నే మహ
నీయను సుమ' యనుచు నాదు
స్వరము తోడ నిద్రలేని
శశి జ్యోత్స్న వీణలోన
మేళవించె తన స్వరంబు.
మిథ్యయగును నేను లేని
యెడ సంధ్యా తారోదయ,
మగును మిథ్య కాననమున
అలరులు పుష్పించుటయును.
మనసులోన నున్నది యీ
యనంతకాలము బందిగ
మీ యీ గేహమ్ములోన
మెలగుచుంటి ననుచు నేను.
అయినను దానికి దుఃఖ
మ్మందగ లే దింతయేని.
అనుభూతి విహీనమ్మగు

దినము లెన్నొ గడచిపోయె,
ఇంకను జీవించినచో
నింక గడచిపోవుచుండు.
జ్ఞాతు లెచట లక్ష్మి యనుచు
నన్ను ప్రశంసించినారొ
ఆ గృహమున నలుగురు న
న్నట్లనుటే నాకు పరమ
ధన్యత యీ జీవనమున.
తటుకున తెగిపోవునొ బం
ధన పాశ మ్మే దినమున ;
తటములేని యీ విరాణ్ణ
దీముఖంబునం దైక్యము
తిరముగ పొందుచున్నవి
జననమ్మను మరణమ్మను.
ధన గేహప్రాచీరము
లెల్ల దాని యడుగునబడు
ఎటనొ నురుగు తునియలవలె.

విశ్వాకాశమునందున
వివాహవంశి మ్రోగిన
ట్లున్నది ప్రప్రథమమ్మున
విన్ని దినమ్ములకు నేడు,
ఇరువదిరెండేడులు నే
నీ గృహకోణమ్మునందు
పడియుండిన నుండనిమ్ము
పరాగమ్మునందు దోగి.
మరణదిన గృహమ్మున నా
కొరకు ప్రార్థనమ్ముతోడ
పిలుచుచున్నవాడు నన్ను
తలుపు సమీపమున నతడు.

అతడు ప్రభువె కాడు సుమా—
అవహేళన చేయ డెపుడు.
నాకడ వాంఛించుచుండె
నా గుప్తము గభీరమ్ము
నగు నమృతరస మ్మతండు.
గ్రహతారల నడుమ నిలిచి
కనుగొనుచున్నా డతండు
నిర్నిమేషదృష్టితోడ
నే నా వదనమ్ము వంక
మధుర మ్మీ భువనమ్మను,
మధురమ్మైన మహిళను నే,
మధుర మ్మీ మరణమ్మను ;
మరి తెరువుము ద్వార మింక
ఓ నాయనంత భిక్షుక !
ఈ నా యిరువదిరెం డ
బ్దముల వృద్ధజీవనమును
తరియింపగ జేయు మయ్యా
సరగ కాలవనధి నుండి.

అక్టోబర్, 1918 పలాతకా

## పతనము

వెలికత్తెల యాహ్వానము
చెవిజేరిన యంత నాదు
చిన్ని బిడ్డ మెట్లు దిగుచు
చేరుచుండె క్రింది తలము.—
ఆగి యాగి బెదరుతోడ
అంధకార గృహమునందు.

పాపచేతిలోన నుండె
దీపము ; చేలాంచలమ్ము
అడ్డుపెట్టి చనుచునుండె
అత్యంతము భద్రముగా.

నింగియందు రిక్క లెన్నొ
నిండియున్న చైత్రరాత్రి
పైయంతస్తున నుంటిని ;
పాపయేడ్పు వినబడగా
త్వరితముగా లేచిపోతి.

నడచుచుండ గాలివలన
నడుమ దీప మారిపోయె.
వామీ, ఏమైన దనుచు
పాపను ప్రశ్నించినాను ;
'జారిపోతి' ననుచు పాప
జవా బిచ్చె రోదనమున.

నిండు చుక్కలున్న చైత్ర
నిశాసమయమందు మరల
అంతస్తును జేరు పిదప
అంబరమ్ము జూడ దోచె :
ఎవరో ఒక చిన్ని కన్నె
ఏకాకినిగా పోవుచు
అడ్డుపెట్టి నీలాంబర
పంచు చేతి దీపశిఖకు
ఆరిపోవుచో దీపం
బాకస్మికముగ నిలుచుచు
ఆకసంబు నిండునట్టు
లరచును నే జారితినని.

అక్టోబరు 1918 పలాతకా

## స్మృతి

జనయిత్రికి నే బాగుగ జ్ఞప్తి యుండను.
ఆడుకొనగ నేను పోయినపుడు తటుకున
గునగునమని ధ్వని యేదో వినబడు చెవుల;
అమ్మమాట కలిసిపోవు నాటల నెటులో.
ఉయ్యేలలో అమ్మ నన్ను ఊపు చూపుచు
గానము చేయు గీతిక నాకు జ్ఞప్తికి వచ్చు;
వెడలిపోవు చామె పాట విసరిపోవును

ఆశ్వయుజము మాసమునం దహర్ముఖమున
శేఫాలీవనమున హిమసిక్తవాతము
వెడలి కుసుమ సౌరభంబు వీతెంచినవేళ
అంతరంగమందు తోచు నమ్మ వాక్కులు.
అమ్మ పూలపుటికతోడ నరుగుదేరగా
ఆమె పరిమళమున కలియునంచు తోచును.

కూరుచుండి పడకగదిలో ఊరక నేను
మూలగవాక్షమ్మునుండి నీలగగనము
దూరముగా జూచునపుడు తోచుచుండును
నన్ను రెప్పవాల్చక చూచుచున్న దమ్మని,
ఒడిలోపల పెట్టుకొనుచు ఒక్కొక్కప్పుడు
అమ్మ నన్ను చూచు చూపు లాకసంబున
వ్యాప్తిగాంచి నిలిచిపోయె నని తలంతును.

25-9-1921 శివ భోలానాథ్

## తపోభంగము

ఓహో! కాలాధీశ్వర,
ఓ భోళా సన్యాసీ!

యౌవన వేదనపు రసం
బధికముగా నుబ్బొంగెడి
ఆ నా దినములు మరచితి
వా యన్య మనస్కుఁడవై ?
తరళ చైత్రరాత్రి మనో
హర కింశుక గుచ్ఛమ్ముల
తో పాటుగ నవి యన్నియు
తొలగబారి పోయినవా
అయత్నముగ శూన్యమందు
నకాలమున తేలుటకై ?
ఆశ్వినమున వృష్టిరహిత
మైన శీర్ణ శుభ్ర వలా
హక ఖండ ప్లవములపై
అరిగినవా విస్మరణపు
దరి స్వేచ్ఛగ విహరించెడి
కరువలి యాటలలో నవి
కడు నిర్మమ హేలతోడ ?

ఒకనా డా వాసరములు
ఒప్పుగ నీ కపిల జటా
జాలమ్మును ధవళ రక్త
నీల హరిద్రాది వివిధ
వర్ణ లతాంతముల తోడ
పరగ నలంకారములను
పచరించిన వద్భుతముగ.
వానిని మరచితె, భిక్షుక !
ఆ దస్యులు నగుచు నగుచు
అపహరించినారు తుదకు
నీ శృంగము ఢమరుకమును ;
నీ చేతికి నొసగినారు

శోభన వంశిని వారిలు.
సుగంధ భరమున నా మం
దర మగు మధుమాసోన్మా
దరసముతో పూరించి క
మండలువును ముంచినారు
మాధుర్య ప్రచురభోగ
మం దధికాలస్యముతో.

ఆ దినమున నీ తపస్య
ఆకస్మికముగ నాగుచు
శూన్యములో తేలిపోయె
శుష్కపత్రఘూర్ణన వే
గమ్ముతోడ గీతివిహీ
నమ్మగు హిమమరుదేశము
నం దుత్తరముఖముగాను.
కుసుమపరీమళముతోడ
గూడి లక్ష్యభంగకారి
దక్షిణానిలమ్ము నీదు
ధ్యానమంత్రమును కౌతుక
మున బాహ్యతటమ్మునకును
గొనివచ్చెను ; గన్నేరులు
గులాబీలు కాంచనములు
ఆ మంత్రముచే మదించె.
అడవి వీథిలో నవీన
పర్ణమ్ముల నా మంత్రము
వలన శ్యామవహ్నిశిఖయు
ప్రజ్వలించె ప్రబలముగను.

ఆ వసంతవన్యానది
యం దవసానంబు నందె

సన్న్యాసము ; జటిలమైన
జటాబంధమున జాహ్నవి
బాష్పమ్ముల కలతానము
పరవశమై వినసమ్యేను.
భవదీయైశ్వర్యంబును
నవనవముగ నున్మేషము
నందిన దా దినమునందు.
హృదిలో నుద్వేలంబై
నది తనంత విస్మయంబు ;
తానే సమకూర్చెను సౌం
దర్యంబు నుదారముగా
హస్తమునందు ధరించితి
వానందముతో జ్యోతి
ర్మయమగు దివ్యసుధా పా
త్రిక-విశ్వక్షుధను నీవు

ఆ నా డున్మత్తుడవై
యే నృత్యముతోడ నీవు
వనము వనము తిరిగితివో
ప్రక్క-నుండి విరచించితి
సంగీతం బా నృత్యపు
ఛందోలయములకు నేను
క్షణక్షణము ; నీ లలాట
చంద్రికలో, నందనంపు
స్వప్నాంబక యుగ్మములో
స్పష్టముగా మనసారగ
నే తిలకించితిని నీదు
నిత్య నవ్యలీల లెల్ల ;
అరసితి సుందరమగు నీ
యంతరీన సుహాసవి

లాసంబును ; ఉంచితి నీ
లజ్జాపులకల కుంరిత
భంగిని_సురూపలహరిని.

నాటిది ఆ పానపాత్ర :
నష్టమైన దొక్కొ_ దాని
పరిపూర్ణత నేడు ? తుడిచి
వైచితివా చుంబనంపు
రాగచిహ్న వక్రరేఖ—
రక్తిమాంకనమ్ము నీవు ?
పాడని సంగీతధార
తోడ, బాష్పసంచయంపు
భారముతో నయత్నముగ
పగిలిపోయె నొక్కొ_ నీదు
ప్రాంగణమున దొరలి పాత్ర ?
నీ తాండవ నృత్యములో
నే చూర్ణంబైన దొక్కొ_
ఆ ధూళియు ? నిర్భాగ్యపు
టకాల ఝంఝూనిల ని
శ్వాసములో నా దినములు
వ్యాకులితము లగుచు లుప్త
మైపోయిన వొక్కొ_ యిపుడు ?

పోలే దున్నవి ; వానిని
పూర్తిగనే సంగ్రహించి
గూఢమైన ధ్యానరాత్రి
కొనితెచ్చితి ; ఉంచినావు
నిశ్శబ్దములోన గట్టి
నీవు వాని రహస్యముగ_
నీదు జటల నుండి జారి

నేడు శాంతముగ నున్నది
జాహ్నవి ; నీ లలాటమున
చంద్రుండును దాగియుండె
నేడు సుప్తి బంధనమున
నీవు ధరించెదవు మరల
ఏల యకించన వేషము
లీలాచ్ఛలమున బయటను ?
అంధకారమున దిగంత
మం దెంతటి దూర మరయ—
'లేదు లేదు లేదుర' యను
నాదము వినబడుచునుండె

నీవు కాల గోపాలుడ,
వీవు సంజవేళ నీదు
శృంగంబును మ్రోయింతువు,
చేరవచ్చి దిన ధేనువు
స్తబ్ధ గోష్ఠశాలకు ను
త్కంఠిత వేగమ్ముతోడ.
వెలుగు కొరవి దయ్యమ్ముల
వెలుతురు జన హీనమ్మగు
ప్రాంతరమున- విద్యుదనల
పన్నగంబు యుగాంతాంబు
దమును గొట్టుః దగతోడ.
తమములోన దుస్సహనై
రాశ్యముతో నెన్నో మహా
ర్తములు చంచలములు నిబిడ
బద్ధములై తపస్యా ని
రుద్ధ నిశ్వాసనములలో
శాంత మగుచు నుండు నెపుడు.

ఎరుగుదు, నెరుగుదు నెరుగుదు,
ఈ తపస్సు దీర్ఘరాత్రి
సంధానించుచునున్నది
కంపల నృత్యపు నదిలో
తన యున్మాదావసాన
మను దురంత హర్షముతో.
యౌవనంపు దివసంబుల
యందు శృంఖలములు లేక
బంది మరల బయటపడును
వ్యగ్రతతో, నుచ్ఛ్వకలో
చ్ఛ్వాసముతో మరియు మరియు.
విద్వేషణు డగు నూతన
వీరుడు చూపెట్టుచుండు
స్థవిరుని శాసననాశము
సారె సారెకును ; వారల
సంభాషణమును, సింహా
సనమును విరచింతు నేను.

ఏను తపోభంగదూత
నింద్రు డంపినట్టివాడ ;
స్వర్గవంచనను నే నో
సన్యాసీ, ఓ రుద్రా !
నేను కవిని యుగయుగముల
నీదు తపోవనమునకును
చనుదెంచుచునుందు నెపుడు.
జయించి దుర్జయు నే నా
జయమాలలతోడ పూల
సజ్జ నింపుకొనుచుందును.
నా కవితాక్రందనమున
వీకతోడ మ్రోగుచుండు

ఉచ్ఛృంఖల కలకలమ్ము.
ఉమ్మలికముతోడ నేను
ప్రలాపించు నపుడు నాదు
వాణి మేలుకొనుచునుండు.
గులాబి పువు పూవునందు
కుతూహలపు కలరవమును
కొనివచ్చి కిసాలమందు
కొట్టుచుండు నా గానము.

శుష్కవల్కధారి, నాకు
సుస్పష్టముగా తెలియును
నీ మోసము, బైరాగీ!
నీ వానందముతోడను
సంపూర్ణపరాజయంబు
ఛద్మయుద్ధవేషముతో
సుందరిహస్తాబ్జంబుల
యందు కోరుచుంటి విపుడు.
అలరువిల్తు సారెసారె
కగ్నితేజముతను దగ్ధ
మొనరింతువు! చివర కాత
విని మాటికి బ్రతికింతువు
ద్విగుణితోజ్జ్వలునిగ జేసి.
తేపతేప కాతని తూ
ణీరము సమ్మోహనమున
నింపుచుండు; నేను కవిని.
మృత్తిక యొడిలోని కేగి
మీదికి గానంపు టింద్ర
జాలమ్మును గొనివత్తును.

నీ లీలలు మదినెరుగుదు

నేనో యన్యమనస్కుఁ !
విలపించుచు ప్రార్ధనంబు
ప్రియురా లొనరింప వినుచు
ఆకస్మికముగ మేల్కొన
నభిలషించుచుంటి పీవు
అభినవ ప్రమోద మలర.

అందుకొరకు విరహాతలము
నందు లీన మగుచు నీవు
ధ్యానచ్ఛలమున నుంటివి.
విచ్ఛేదముతోడి దీప్త
విలాపదాహమ్ముతోడ
ఉమను విలాపింప జేయ
నుత్సహించుచుంటి వీవు.
తపము భగ్నమై పోవగ
తదుపరి మేళనములోని
ఆ విచిత్ర చిత్రము నే
నరయుచుంటి యుగయుగముల.
వల్లకి తంత్రులు మీటుచు
భైరవిరాగంబు నట్లు
వాయించెడి కవిని నేనె !

భవదీయ శ్మశానమున
వైరాగ్య విలాసి వగుచు
నన్ను గుర్తుపట్టలేదు.
నా వేషము చూచి నీవు
అట్టహాస మొనరించితి
వా దారిద్ర్యోగ్ర దర్ప
మున పకపక. అట్టి సమయ
మున మేళనలగ్న మేగు

దెంచెను మధుమాసములో.
తేటగ లగ్నంబైనది
ఉమాకపోలమ్ములందు
నొనరు మందహాసముతో
వికసించిన లేతసిగ్గు.
పిలిచితి వా నాడు కవిని
పరిణయ యాత్రాపథమున,
పశ్చిరమున పుష్పమాల్య
మాంగల్యములను గొని కవి
మక్కువతో జనియె సప్త
మహోఋషుల వెంట సంటి

నీదు ప్రేత సహచరివళ
మా దినమున గనుగొన్నది
రక్తలోచనముల తోడ
ప్రాత స్సూర్యుని రుచి గల
అరుణాంశుకము ధరించిన
ఆ నీ యుజ్వల తనువును
అస్థిమాల వీడిపోయె
నల్ల మాధవీ వల్లరి
మూలంబున ; పుష్పరజము
ఫాలంబున నలదియుండె—
ఎచట తుడిచికొనిపోయెనొ
యేమొ చితాభస్మ మెల్ల.
కౌతుకమున నవ్వె ఉమయు
కటాక్షములు కవి పంకను
విసరుచు : ఆ నవ్వుతోడ
వేగమె కవి ప్రాణములో
ఝంకరించె మురళి మంజు
జయ నినాద గానముతో.

# పూర్ణత

౧

చెనుదెంచి నీ వొక్క స్తబ్ధయామిని వేళ
నిద్రావిహీననై నిండువ్యాకులతతో
మస్తకమ్మును వాంచి మందమందమ్ముగా
కన్నీటితోడ నాకరము ముద్దిడుకొంచు
ఈ విధంబున పల్కినావు: "దూరము నీవు
పోవు పక్షాన నా భువనమ్ము నిరతమ్ము
అవధి లేనట్టి శూన్యత భారమూలాన
మరుభూమివలె రూక్షమయి పోవు పూర్ణముగ!
గగనవిస్తీర్ణమౌ క్లాంతి చిత్తమునుండి
హరియించికొనిపోవు నా మూలముగ శాంతి
ఆనందహీనమై ఆలోకరహితమై
గురుశోక భారమ్ము మరణాధికమ్మగును."

౨

విని, నీ ముఖమ్ము నా వెడదరొమ్మున జేర్చి
చెప్పినా నిట్లు నీ చెవిలో రహస్యముగ:
"నీవు దూరమ్ముగా పోవుచో నీ స్వరము
నందు వేదన వజ్ర మన్ని గీతాలలో
మెరయుచుండును సదా: మెరపుమెరపునకు నా
చిత్తమ్ము బహుంభయాయత్తమై పోవునే!
వేళలన్నిటియందు విరహమై చిత్ర్యంపు
క్రీడ నేత్రంబులన్ క్రోడంబునన్ మెలగు.
ఏగి దూరమ్ముగా హృదయసన్నిహితమౌ
ద్వార మన్వేషించి చేరుదువు ప్రియతమా,
అపుడు భవదీయ చరమాధికారము నాదు
భువనంబు వ్యాపించి పూర్ణమ్ముగా నుండు."

3

చెవులలో నుభయులము చెప్పుకొన్నట్టి యా

మాటలన్ సప్తర్షిమండలంబున తార
లాలించె : రేరాణి యారామవాటికన్
అనునిమేషము సాగె నా వాక్ప్రవాహమ్ము.
మెలమెల్లగా నవల మృత్యురూపముతోడ
అరుదెంచె విచ్ఛేద మంతమ్ము లేకుండ.
ఆకర్ణనము, వీక్ష అంతమొందిన విపుడు
స్పర్శావిహీన భాషణము లాకాశాన
లేవు : శూన్యంబైన లేదు శూన్యమ్ముగా.
బాధామయకృశాను బాష్పపూర్ణము నభము ;
ఒక్కొక్కటే అగ్నినుండి సృజనము చేయు
స్వప్నప్రపంచంబు జ్వలదుగ్ర గీతిలో !

1-10-1924 పూరవీ

## ఆశ

గొప్ప గొప్ప కార్యమ్ములు
కొనసాగించుచు నుంటిని ;
అంత కఠినములు కావవి.
అఖిల జగతి తిరుగుచుంటి
జగద్ధితము కోస మేను
సహచరుల సమూహమ్మను
అధిక మగుచునుండె వరుస ;
అనేకములు వ్రాయుచుంటి,
అనేకములు చదువుచుంటి,
అనేక భాషలలోపల
వాదము లుపవాదములును,
పెక్కులు నిర్మాణంబులు,
వేనవేలు వినాశములు,

జరుగుచునుండెను. క్రమముగ
జాల మల్లుకొని పోయెను.
మూటలపై కూర్చుండెను
మూట, లంత నిటుకలపై
నిటుకలతో గృహములపై
గృహము లిట్టె లేచుచుండె.
కొందరు కీర్తిని మెత్తురు,
మంద మందు రొక కొందరు,
సమీపమ్మునకు విశ్వా
సముతో వత్తురు కొందరు,
సందేహింతురు కొందరు.
కొంత విశుద్ధమ్ముతోడ
కొంత కృత్రిమంబు కలిసి
ఏదో యొక్కటి మొత్తము
మీద సిద్ధమగుచునుండు.

అయినను నీ చిన్ని యాశ
లన్నియు దుఃఖాత్మకములు ;
ఎంతో సహజములు వినుట,
కంత సాజములు కా వవి.
సూనగంధమిశ్రిత మగు
గానములో, స్వరములోన
ఇంచుక ఆనందంబును ;
ఇట్లె విశ్రమపు మంపున
వృక్షచ్ఛాయను నిద్రయు
నిచ్ఛగించినంత పొంద
నగు నంచును భావించితి.
అయినను నవ్వానికోస
మన్వేషించిన యప్పుడు
ఆ చంచల యగు నాశయు

నగంద దెచ్చోటగూడ.
అరూపమ్ము లపారమ్ము
లగు బాష్పమ్ముల నడుమను
అజుడు నడుము కట్టుకొనుచు
ఆకాశము కంపింపగ
జేసి యెపుడు మొదలిడెనో
సృష్టిని నిర్మింప, నెపుడు
ఆదియుగమునందలి యా
యజుని కఠినపరిశ్రమము
వలన నంత యెత్తు పెరిగె
పర్వతములు లక్షయుగము
లాయన స్వప్నములు కనిన
అనంతరము మొట్టమొదిట
అందినాడు పూగు తిని

ఆశ మనమునం దున్నది
అనేక దినముల నుండియు,
ఒక మూలను స్వేచ్ఛామతి
నుండంగా పుడమిలోన.
కాదు ధనము, గౌరవమ్ము
కాదు, కాని యొక్క చిన్న
వాసస్థానమ్ము కొరకు
వాంఛించుచు నుంటి నేను.
తరువుల స్నిగ్ధచ్ఛాయయు,
తరంగిణీ ప్రవాహమ్ము,
సంజవేళ గృహమునకును
సంధ్యాతారాగమంబు ;
మల్లెపూల సువాసనల
పెల్లు గవాక్షమ్ము చెంత,
ప్రాతఃకాలం బందున

ప్రప్రథమ ప్రకాశంబు
జలముల కావలి యొడ్డున :
సర్వమ్మట్టుల చుట్టును
ఆవరించి మెలమెల్లగ
జీవనమ్ములోని కొన్ని
దినముల దుఃఖమును హాస
మును నిండించుచు నుండును.
కాదు ధనము, గౌరవమ్ము
కాదు ; కాని యొక్క చిన్న
వాస స్థానమ్ము కొరకు
వాంఛించుచు నుంటి నేను.

మనసులోన నున్నది బహు
దినముల నుండియును నాశ—
స్వాంతధ్యానము పూర్తిగ
వాగ్రూపము పొందునంచు.
కాదు ధనము, గౌరవమ్ము
కాదు ; కాని యొక్క చిన్న
వాసస్థానము కోసము
వాంఛించుచునుంటి నేను.
అస్తగామి యగు సూర్యుం
డంబుదములపై సమాప్తి
చిత్రము కల్పన యందలి
చిట్టచివరి రంగు తోడ
చిత్రించుచునున్నవాడు.
చిత్రించెద నట్లు నేను
స్వప్న మహాలోకములో
ప్రకాశమున తమము నందు
రసము తోడ రంగు తోడ
రవణ నింద్రజాలమ్మును.

ఆవరించి యది చుట్టును
జీవనమ్ములోని కొన్ని
దినముల దుఃఖము హాస
మ్మును నిండించుచునుండును.
కాదు ధనము, గౌరవమ్ము
కాదు; నాదు ధ్యానమ్మును
ప్రకాశింపజేయు భాష
వాంఛించుచు నుంటి నేను.

మనసులోన నున్నది బహు
దినములనుండియును నాశ—
ప్రాణగభీరక్షుధ తన
అంతిమసుధ నందు నంచు.
కాదు ధనము, గౌరవమ్ము
కా, దొకింత ప్రేమమ్మును
కాంక్షించుచు నుంటి నేను.
ప్రేమపూర్వకముగ నన్ను
పేరుపెట్టి పిలుచుటయును;
అరిగి దవ్వు, కూరుచుండి
ఒంటరిగా భావించుచు
నుంటయు నాలో నేనే;
కన్నులలో కథాభరిత
కాంతి చెంత కరిగినంత—
ఆవరించి యవి చుట్టును
జీవనమ్ములోని కొన్ని
దినముల దుఃఖము హాస
మ్మును నిండించు నుండును.
కాదు ధనము, గౌరవమ్ము
కా, దొకింత ప్రేమమ్మును
కాంక్షించుచు నుంటి నేను.

19 అక్టోబర్ 1924 పూరబీ

# ఆ శంక

ప్రేమ మూల్యము నీవు నాకై
రెండుచేతుల నింద నొసగితి
వెంత యధికమ్ముగ మదీయ
స్వాంత విహితంబౌ.
గాఢవంచన అంత అధికము
గా తనంతన బయలుపడదే ?
అంతకంటెను మేలు కాదా
అఖిల ఋణరాశిన్ —
చేసి రిక్తము శూన్య నొకను
తీసికొనిపోవంగ ; పొందుదు
శత్రువలనను బాధ. అదియుం
గూడ మంచిదియే.
అమృత భరితంబైన నీ హృద
యమ్ము క్రమ్మర దీసికొని చను.
నాదు భారం బొక్కచో నీ
మీద బడవేతున్ —
నా మనోవ్యథ తుడిచికొన జని
నీ మనస్సున రగులుకొల్పుదు
నేమొ ; ఒంటరి బ్రదుకు కేకను
యామినీ వేళన్ —
వేసి సంక్షుబ్ధముగ రాతిరి
వేళ యంతయు నీకు జాగర
ణమ్ము కూర్తునొ యేమె యనెడి భ
యమ్ము పుట్టంగా —
చెప్పనైతిని నీకు మనసును
విప్పి లోపలి మాట యేమియు ;
మంచిదే యగు మరువ గలిగిన
మరచి పోదగును ।

పోవుచుంటిని విజనపథమున,
నీవు వచ్చుచు నాదు వదనము
మీద నీ నేత్రద్వయమ్మును
మేళవించితివి.
నీవు నా వెనువెంట రావలె
నీవు నాతో పలుకవలెనని
నేను నీతో చెప్పదలచితి.
కాని యెందులకో—
కనుగొనంగా నీదు ముఖ మా
కస్మికమ్ముగ మానసమ్మున
అధికభయ ముద్భూతమైనది,
అవల నిను జూడ—
నీదు ప్రాణ గభీర యామిని
నిండు చీకటి నిమ్నతలమున
పండియుండెడి వీతిహోత్రము
మండసాగినది.

ఓ తపస్విని మేలుకొనుచో
నీ తపోజ్వలనంబు తటుకున
ఆ వెలుంగున భగ్నమై చను
నావరణ మపుడే.
వెంటనే దైన్యంబు శైతము
విస్ఫుటం బగు భవత్ప్రేమ
జ్వలనమున వేల్చుటకు తగినది
కలదె నా కడను!
చెప్పుచున్నా నందు చేతనె
శిరము వాలిచి, నీదు దర్శన
మధురిమ స్మృతితోడ నొంటిగ
మరలిపోదునని.

17-11-1924 పూరబీ

# వీడ్కోలు

కాలయాత్రారథధ్వానము
కర్ణగోచర మగుట లేదా ?
అహరహం బది యదృశ్యముగా
అంతరిక్షపు హృదయ సీమను
స్పందనంబును, చక్రఘూర్ణిత
సాంద్రతిమిరము, దీర్ణహృదయము
లైన నక్షత్రముల క్రందన
మతిశయమ్ముగ రేపుచుండుట.

పరుగిడెడు కాలమ్ము, బంధూ !
వన్ని జాలం బావరించుచు
పట్టుకొని నను రథము మీదికి
సత్వరంబుగ భ్రమణసరణికి
సాహసంబున లాగుకొన్నది,
చాల దూరము వరకు తావక
సన్నిధానమునుండి, మిత్రమ !
ఎన్నొ మృత్యువు లుత్తరించుచు
ఇపుడు నవ్యవిభాతశృంగము
చేరిన ట్లనిపించుచున్నది ;
శీఘ్రరథచక్రానిలంబున
మత్పురాతననామ మెగిరెను ;
మరలిరా మార్గంబు మృగ్యము–
ఓయి మిత్రమ, నన్ను దూరము
నుండి చూడ దలంచు నెడలను
గురుతు పట్టగ లేవు–నెలవా !

కొలది పనియు లేక యెపుడు
కలుగును విశ్రాంతి, వసం

తానిలాన నతీతంపు
తటమునుండి యే రాతిరి
విట్టూర్పులు బయలువెడలు,
నేల రాలు వకులమ్మలు,
క్రందనమున నింగి యెపుడు
కుందు నట్టి నిముసమందు
అరసి కనుగొనుము నీదు
ప్రాణ ప్రాంతంబునందు
కొంచెము నా వెనుక నేదొ
సంచితమై యున్నదేమొ ;
విస్మృత ప్రదోషవేళ
వెలయు నేమొ ఆ దీప్తులు,
నిలువవచ్చు పేరులేని
కలలోపలి మూర్తి యట్లు

అట్టు లయ్యును కాదు స్వప్నం
బద్ది అన్నిటికంటె సత్యము,
అదియె మృత్యుంజయము ప్రేమము.
అపరివర్తితమైన యర్ఘ్యం
బనుచు నీకై యుంచి వచ్చితి.
తేలిపోవుచు నున్నవాడను
కాలయాత్రను పరీవర్తన
గమనమున బడి, బంధు, సెలవా !

కలుగ దేదియు నీకు లోపము ;
అస్మదీయము మర్త్యమృత్తిక
నమృతమూర్తిగ సృష్టిచేసిన
యెడల సంధ్యావేళ నారతి
యెత్తవలయును; విష్ణ మెద్దియు
దినము మ్లానస్పర్శచే భవ

దీయ పూజా కేళిలోపల
సంఘటిల్లగరాదు ; తృష్ణా
సంభ్రమముచే పుష్పపూజా
భాజనంబందుండి కుసుమము
భ్రంశ మొందగరాదు, మిత్రమ !

తివిరి మానసభుక్తి వాణీ
తృష్ణతోడను సంతరించితి
భావరసపాత్రమున ; నాదగు
బాష్పసిక్తం బైన దానిని
గాని, నాదగు ధూళిధనమును
గాని మానస భుక్తితోడను
కలియనీయను సుంతయైనను.
నేడు సైతము చేయవచ్చును
నీవు రచనలు నన్ను దలచుచు
స్వప్నమందున వెలయువానిని
స్వయముగానే ; దాని భారము
బాధ్యతయు నా కుండబోవదు-
బంధు, సెలవా నాకు నింతట !

వలదు శోకింపంగ నాకై
కలదు కర్మము నాకు, విశ్వము
కలదు, పాత్రము వట్టిపోవదు ;
నింపుదును శూన్యంబు ననియెడి
నియమమును భజియింతు నెప్పుడు.
ఎవ్వరైన ప్రతీక్ష చేసెదు
నెడల నాకై సముత్కంఠను
వారు నను ధన్యాత్మ జేయగ
నేరుతురు : రేరాణి తొడిమను
శుద్ధపక్షము నుండి యెవ్వరు

ఉద్ధరించుచు కృష్ణపక్షము
రాత్రి సమయంబునను నర్ఘ్యపు
పాత్రికను సమకూర్చ నేర్తురొ,
మంచి చెడ్డలు కలిపి యెవ్వరు
మహా క్షమతో చూడగలరో
ఇంక వారొనరించు పూజను
నిచ్చుకొనగా నన్ను బలిగా
నిచ్చగింతును; నీకు పూర్వం
బేది యిచ్చితి దాని సంపూ
ర్ణాధికారము కలదు నీకే,
ఇద్ది నేను క్షణ క్షణము
ఇచ్చెడి దానమ్ము; కరుణ
మహార్తమ్ము త్రాగుచుండు
ముఖము నిండుగా నా హృద
యాంజలి నుండి నింపుకొనుచు.

అనుపమానుడ వీవు
ఐశ్వర్యవంతుడవు
నీకు నే నిచ్చినదె
నీ దానమగు నాకు.
నీ కరంబుల నుండి
నే నెంత గ్రహియింతు
నగుదు నథమర్ణుండ
నంత: బంధూ, సెలవు।

25-6-1928 మహుయా

# పాంథుడు

నన్నడుగకు ముక్తి యెచట
నున్నదనుచు ; ఏది ముక్తి ?
కాను నేను సాధకుండ,
కాను నేను దేశికుండ,
నేను కవిని, ఉన్నవాడ
నేలకు సన్నిహితుడనై ;
ఇచ్చట నౌకా ఘట్టము,
ఎదుట, అటు వోటులతో
చీకటిలో వెలుతురులో
చెడ్డతోడ మంచితోడ
ప్రాణాపగ ప్రవహించును–
ఎన్నెన్నో విస్మృతులును
ఎన్నెన్నో లాభ నష్ట
రాసు, లెన్నో రోదనములు
హాసమ్ములు తేలుచుండు.
కోసి కోసి ఒక్క తటము
కూర్చును వేరొక తీరము
ఆ వాహిని ; దాని మీద
అరుణోషఃకాంతి పడును,
జనని యంగుళమ్ము లట్లు
చంద్రకాంతి రేఖ పడును ;
కాళరాత్రి రిక్క లెల్ల
కావించును మంత్ర జపము.
నిజ రక్తాంశుకము తోడ
నిమిరిపోవు నస్తమించు
సూర్యుడు ; మాధవి మంజరి
సుందరోపహారం బా
వాహిని తరగల తేలును,

పక్షులు గాన మ్మొసంగు.

చిత్త మ్మెప్పుడు నృత్యము
చేయును తన గానముతో
ఆ తరంగ ఫణితితోడ
అబ్బురంపు భంగులతో
ఈ విశ్వ స్రోతస్సున
ఆ వరుసను నా బంధము,
అందే యున్నది మోక్షము.
కోర్కి లేదు దాచియుంచ
కొంచెమేని; అంటిపట్టు
కొనియుండగ వాంఛింపను.
కాంక్షయున్న దెల్లరతో
కలిసి తేలి పోవంగా.
విరహ మేళన గ్రంథులు
విప్పి, పడవ తెరచాపను
వడిగాలికి తేలిపోవ
వాంఛించుచు నున్నవాడ.

నీకు నిరాతంకమ్ములు
నిఖిల దిశలు, మహాపథిక!
లేదు నీకు మందిరమ్ము
లేదు నీకు స్వర్గధామ.
మడుగడుగున తీర్థము
విన్ననుసరించు సంపదలో,
చంచల నృత్యమ్మునందు,
చంచల గానమ్ము నందు,
అంతయు మరపించు దాన
మందు, నంధకార మందు,
కాంతిలోన, సృష్టిలోని

కణుపు కణుపు నందు, మహా
ప్రళయ క్షణ క్షణమునందు
పడయుచుందు ముక్తి నేను ।

7-5-1931 పరిశేష

## ప్రశ్న

నిర్దయలోకములోనికి
నీవు యుగయుగమ్మునందు
పంపుచునుందువు దూతల
భగవన్ వారము వారము.
ఎల్లవారి క్షమియింపుడు ;
ఎల్లవారి ప్రేమింపుడు ;
అంతరమున ద్వేష విషము
హరింపుడని చెప్పి చనిరి.
వరణీయులు స్మరణీయులు
వారు, కాని నేటి యశుభ
వేళయందు వారి బంపి
వేసినారు బహిర్ద్వార
సీమనుండి వ్యర్థముగా
చేసి నమస్కారమ్ములు.

అసహాయుల కపటరాత్రు
లందు రహస్యంపు హింస
బాధించుట వీక్షించితి,
ప్రబలుల యపరాధములకు
చేయలేక ప్రతిక్రియలు
న్యాయవాణి మౌనముగా

నిభృతమ్ముగ విలపించుట
నేను చూచుచున్నవాడ :
తరుణం డున్మత్తునివలె
పరుగిడుచును, రాతిమీద
పగులగొట్టుకొనుచు శిరము
మహాబాధ పడి పడి పడి
మరణించుట చూచినాను

కిట్టుపడియె నేడు నాదు
కంఠము, పిల్లనగ్రోవియు
గాన హీనమయ్యె, అమా
కార నాదు భువనంబును
అణగద్రొక్కె దుస్స్వప్నపు
టంధకారతలమునందు
నిన్నడిగెద నిందుచేత
నేత్రములం దశ్రులతో—
నీ వాయువు విషభరితము
కావించినవారి, నీదు
కాంతిని చల్లార్చువారి
క్షమియింతువ, ప్రేమింతువ ?

డిసెంబరు–జనవరి 1931–1932 పరిశేష

## మృత్యుంజయుడు

౧

దూరమునుండి యెంచినాను :
"దుర్జయుడవు నిర్దయుడవు,
కంపించును పృథివి నీదు
కరినశాసనమున, నీవు

బెదరించెడువాడవు. కడు
బాధలు పడుచుండువారి
శిథిలమతుల లేలిహాన
శిఖి వెలుంగుచుండు గదా!
నీ దక్షిణ హస్తంబున
నిహితమైన శూలములేచు
జడిమబ్బులపై పందలి
పిడుగుల గొనితేవంగా"
గుండెలు దడదడలాడుచు
నుండంగా వచ్చినాను
భయ భయముగ నెల్లెట్లో
భవత్సమ్ముఖమున కేను.
త్వద్భృకుటీ భంగమందు
తరంగితం బాసనొ్న
త్పాత, మ్మాఘాత మ్మె
పడియె వచ్చి; పంజరంబు
కంపించెను రొమ్ముమీద
కరములుంచి యిట్లంటిని:
"ఏమయినను మిగిలినదా
ఇంకను వజ్రాఘాతము?"
అంటినొ లేదొ తోడనె
ఆఘాతము వచ్చిపడియె.

ఈమాత్రంబేన? ఓసి!
ఇంకేమియు లేనె లేద!
అయ్యేను విచ్ఛిన్నము భయ.
మశని నెత్తినపుడు నీవు
ఘనుడవు నాకన్న ననుచు
గణనచేసినాను సుమ్మ!
నీవు ప్రహారమ్మతోడ

నిమ్నస్థితి కరుదెంచితి
వస్మదీయ భూమి కిపుడు;
అంత లజ్జ తొలగిపోయె
ఎంత ఘనుడవైన నీవు
హెచ్చుకావు మృత్యువుకన్న.
"అధికుడ మృత్యవు కంటెను."
అను నంతిమవాక్కు పలికి
అడుగుచున్నవాడ నేను.

1-7-1932 పరిశేష

## ప్రథమ పూజ

త్రిలోకేశ్వరాలయమ్ము:
దీని శిలా విన్యాసము
సంతరించె విశ్వకర్మ
స్వయముగా నే మాంధాతృని
పరిపాలన వేళ ననుచు
పలుకుచునుందురు లోకులు.
హనుమానుడు శిలలు మోసి
కొనితెచ్చినవాడట! ఈ
దేవాలయము కిరాతులు
తీర్చి దిద్దినారట. ఈ
దేవత వారలదే నని
తెలుపుదు రితిహాస విదులు.
క్షత్రియరా జీ దేశము
జయించినపుడు పూర్వమందు
ప్రాంగణంబు పూజాదుల
రక్తముతో నిండెనంట.
నూతన నామమ్ము తోడ

నూతన పూజా విధాన
తిరస్కారిణి మాటున నెటొ
దేవత రక్షణ మందెను.
పది వందల వత్సరముల
భక్తిధార తిరిగి పోయె.
ఇపుడు కిరాతులు కనబడ,
రీయాలయ సరణి వారి
కే మాత్రము తెరచిలేదు.

వార లిపుడు సంఘమునకు
దూరముగా నున్నవారు ;
వారి పక్కణంబు నదికి
తూరుపు తీరాన కలదు.
ఆ భక్తజనమ్ముల కిపు
డాలయమ్ము లేదు ; కాని
గానశక్తి లోపింపదు.
కరము లందు నైపుణియును
కను చూపున ద్రఢిమ కలవు.
రాతికి రాయి బిగుంచుట
రజతపుష్పముల నిత్తడి
పైనం జెక్కుట, నల్లని
పాషాణము విగ్రహముగ
గందరించు విధానమ్ము
మెండుగ దెలియును వారికి.
శాసనమ్ము వారి కడను
శస్త్రమ్ములు లాగివేసి
వాసమందు వేషమందు
వ్యవహారమునందు వారు
గౌరవచిహ్నముల నుండి
గ్రంథంబుల విద్యనుండి

దూరీకృతులై పోయిరి ;
తోచుచుండు నపరదిశను
త్రిలోకేశ్వరాలయంపు
దివ్యకాంచన శిఖరము.
గమనించుచు తమవారల
కల్పనాదర్శములను
బహుదూరము నుండి వారు
ప్రణామమ్ము చేయుచుంద్రు.

కార్తికపూర్ణిమ పూజా
ఘనోత్సవము ; మంచెలపై
మ్రోగుచున్నవి మృదంగ
మురళులు, కరతాళంబులు.
చుట్టుగ మైదానమునకు
దట్టముగా పటకుటీర
పంక్తులు లేచినవి ; నడుమ
పతాక లనిలముల కాడు.
వర్త్మమ్మున కిరుప్రక్కల
వ్యాపారుల విపణులందు
రజతాలంకారంబులు,
రాగిపాత్ర సామగ్రులు,
పట్టుబట్ట, లెన్నెన్నో
మట్టిబొమ్మ, లాకుబూర
లర్ఘ్యపదార్థములు, పూవు
లగరువత్తు, లాడుకొనెడి
దారు డమారములు, దేవ
తామూర్తుల పటములు, బహు
కుసుమమాల్యములును, పండ్లు,
కుండలతో తీర్థజలము.
అరచుచు తారస్థాయిని

ఐంద్రజాలికులు విచిత్ర
ఘటనలు చూపుచునుండిరి.
కథకులు రామాయణమున
గాథలు పలుకుచునుండిరి.
ఉజ్జ్వల వేషముల తోడ
ఉత్తమ తురగముల నెక్కి
ఆయుధముల దాల్చి భటులు
అటు నిటు తిరుగుచు నున్నా.
రమాత్యు లేనుగుల మీద
అంబారీ లెక్కినారు ;
వారల సమ్ముఖమునందు
బాకాల్ మ్రోగుచు నున్నవి.
బంగరు పూవులు కుట్టిన
పట్టు దుప్పటములు కప్పు
పల్లకీల ధనవంతుల
భార్యలు కూర్చున్నవారు.
వారి ముందు వెనుకల పరి
చారిక సందోహ ముండు.
పంచవటము క్రింద నగ్ని
భస్మధారి జటాధారి
పరివ్రాట్టు బృంద ముండు.
వారల పద సన్నిధిలో
బాలలు ఫలములు దుగ్ధము
సన్న బియ్య మాజ్యము మి
ష్టాన్నము భోగముగ నుంత్రు.

జయము త్రిలోకేశ్వరునకు.
జయమనుచును నడుమ నడుమ
ఆకాశతలమ్ము నందు
కేకలు చెలరేగుచుండె.

ప్రథమ పూజ కరుగుదెంచు
ప్రభువే శుభలగ్నంబున;
భద్రగజము మీదనెక్కి
ప్రభు వరుదెంచును స్వయముగ.
రేడు వచ్చు మార్గమునకు
రెండుప్రక్కలందు పంక్తి
పంక్తిగ కదలీతరువుల
పై లతాంత దామమ్ములు,
మంగళఘటముల నిండుగ
మామిడి చిగురాకు గుములు.
సరణిలోని ధూళిమీద
క్షణ క్షణమునన్ సుగంధ
జలసేకము జరుగుచుండె.

అది శుక్ల త్రయోదశీ
యామిని; మందిరమునందు
ప్రథమ ప్రహరపు శంఖము
పటహము, భేరియు, ఘంటయు
ఆగిపోయె; చంద్రునిపై
నావేశను నీలిమితో
ఆవరణం బాక్రమించె.
మసక మసకగా నున్నది
మత్తిలినట్టుల చంద్రిక.
అనిలము రుద్ధం బయ్యెను;
ఆకాశమ్మున ధూమం
బావరించె; వృక్షలతలు
అనుమానముతోడ జడము
లయిన ట్లున్నవి; కుక్కలు
అకారణమ చేయుచున్న
వార్తనాదములు, హయాలు

శ్రవణంబుల రిక్కించుచు
సకిలించెను శూన్యదృష్టి.

కర్ణగోచరం బయ్యెను
గభీర భీషణరవంబు
ఆకస్మికముగ ధారుణి
యథోభాగమందునుండి;
దనుజులు పాతాళంబున
తమ రణభేరిని మ్రోగిం
చిన రీతిని దోచె నపుడు ;
ఘన రవమున మందిరంపు
ఘంట తటాలున మ్రోగెను.

బద్ధములై ఉన్న కరులు
బంధనములు త్రెంచివేసి
నలుదిక్కులకును ఘీంకృతి
నాదమ్ములతో ఝుంఝూ
వారి వాహముల విధాన
పారిపోవ దొడంగినవి.
చెలరేగెను జడి గాడుపు
క్షేత్రముపై ; ఆ క్షణమున
ఊర్ధ్వశ్వాసమ్ముతోడ
ఉష్ట్రిమ్ములు మహిషమ్ములు
గోవులు మేకలు గొర్రెలు
గుంపులుగా పరుగిడినవి.
పలాయనము చేసినారు
బహుజను లార్తస్వరమున,
దిగ్భ్రమమ్ము కలిగె వారి
దృష్టికి ; నిజ పరభేదము
తొలగిపోవు కారణమున

త్రొక్కుకొనిరి పరస్పరము,
ఉర్వి పగిలి ధూమ మెగసె,
ఉష్ణసలిల ముబకజొచ్చె.
ఇంకిపోయె సరోవరము
ఇసుకనేల లోపలికిని.
మందిరచూడమ్ము మీది
మహాఘంట ఊగి యూగి
గణగణ మని మ్రోగసాగె.
గభీలునం గూలినట్టి
భగ్నపదార్థంబు తోడ
ప్రశమించె హరాధ్వానము.

నేల శాంతి నొందునరికి
నిండు చందురుండు వ్రేలు
చుండెను పశ్చిమ దిక్కున ;
మండుచున్న పటకుటీర
ధూమావర్తము లేచుచు
వ్యోమమునకు, నజగరమ్ము
వోలె చంద్రికను చుట్టెను.

మరుదినాన ఆత్మీయుల
కరుణవిలాపములతోడ
దిశలు మారుమ్రోగుచుండ
దేవాలయమునకు చుట్టు
అధిపుభటులు నిలిచినారు
అపవిత్రత కలుగకుండ.
మంత్రులు కార్తాంతికులును,
స్మార్తవిదులు వచ్చినారు.
బాహ్యావరణంపు గోడ
పగిలి నేలగూలియుండె.

విరిగిపడియె దేవమూర్తి
వేదికాచ్ఛాదనమ్ము :
"వచ్చెడి పూర్ణిమకు ముందె
వలయు చేయ నుద్ధారము.
అటు కాకున్నను దేవత
త్యజియించును నిజమూర్తిని"
అని పలికిరి విద్వాంసులు.
అట్లె చేయ డనగ రేదు,
ఆమాత్యు డిటు విన్నవించె :
"ఆ కిరాతజనులు తప్ప
అన్యు లెవరు రాతి పనిని
అట్లు తీర్చిదిద్దగలరు ?
దేవత నెటు వారి కలుష
దృష్టినుండి రక్షింపగ ?
ఆలయంబు నుద్ధరించి
నంతమాత్రముననె ఫలమె ?
మలిన మయిన దేవతాంగ
మహిమ, నిష్ప్రయోజనంబు."
అపుడు పిలువనంపె రాజు
ఆ కిరాతదళపతి యగు
మాధవు; నత డరుగుదెంచి
మల్లెపూలు గుప్పెడుంచి
ప్రభువు పాదసన్నిధిలో
ప్రణామమ్ము చేసినాడు
స్పర్శలేక యుండునట్లు.
శుక్ల కేశ మస్తకమున
శుభ్రమైన ద్విపటంబును
చుట్టుకొన్నవాడు వృద్ధు-
పెట్టినాడు పచ్చగోచి,
అనావృతము కటివరకును

అతని తామ్రవర్ణ తనువు,
నమ్రతయును జాలి యతని
నయనంబుల నిండియుండె.
అనియె ప్రభువు: "మీరులేక
ఆలయసంస్కృతి జరగదు."
"మాపై నింతయనుగ్రహ
మాదేవత !" కని దళపతి
చిత్తంబున దలపోయుచు
చేతులు జోడించినాడు.
"కనులమీద గంతకట్టి
పని చేయంగలవ నీవు ?
దేవతామూర్తిమీద
దృష్టి వాలనీయరాదు"
అని నృపతి నృసింహరాయ
లనగా మాధవు డిట్లనె:
"అంతర్యామియె యొసగుచు
నంతర్దృష్టిని తనపని
చేయించుకొనున్, కన్నులు
చివరవరకు తెరవ నేను."

బయటిపని కిరాతదళము
ప్రశస్తముగ చేయుచుండె,
మందిరమ్ములోని పనిని
మాధవు డొనరించుచుండె.
నీలాంబరఖండ మతని
నేత్రంబుల చుట్టు కొన్ని
మడతలుగా గట్టినారు ;
మందిరమ్ము విడువ డతడు–
పగటివేళ రాత్రివేళ
పనులు చేయుచున్నవాడు.

గానమ్మున ధ్యానమ్మున
కదలుచుండు నతని వ్రేళ్లు.
అరుగుదెంచి మంత్రి యిట్టు
లనియెను : "త్వరపడవలయును ;
ఎన్నో దినములు గడచెను,
ఎపుడు వచ్చునో లగ్నము ?"
"త్వరపడుచున్నా డాయన
తన పనికై స్వయముగానె.
నిమిత్తమాత్రుండ స్వామి,
నే" ననియెను మాధవుండు
నిజ హస్తంబులను మోడ్చి.

అమావాస్య గడచిపోయి
అరుదెంచెను శుచిపక్షము.
మాధవుండు శిలల తోడ
మాటాడుచు నున్నవాడు.
ప్రతివచనం బిచ్చు రాలు.
భటులు వెనుక నిలిచినారు
మాధవుండు నేత్రంబుల
మాటును తొలగింపకుండ.
ఏగుదెంచి విద్వాంసులు,
"ఏకాదశి నాటి రాత్రి
ప్రథమ పూజకై లగ్నము.
పని ముందుగ పూర్తియగునె ?"
అని యడుగగ మాధవుండు
అనియె నిట్లు ప్రణమిల్లుచు :
"ఎవడ నేను బదులు చెప్ప ?
ఎపుడు దైవకృప కల్గునో
అపుడు వార్త పంపగలను,
యథా సమయమునకు ముందు

ఆరుగుదెంతురేని మీరు
కలుగవచ్చు వ్యాఘాతము
కాలవిలంబంబు కూడ."
షష్ఠి సప్తములును గడచె.
చంద్రిక ద్వారంబువెంట
వచ్చి పడె కిరాతనేత్రు
పలిత కేశరాశిమీద.
సూర్యు డెపుడొ అస్తమించె :
శుభ్ర గగనతలమునందు
విలసిల్లిన దేకాదశి
వెన్నెల ; నిట్టూర్పు విడిచి
విన్నవించె మాధవుండు :
"భటులారా, నేటితోడ
పరిసమాప్తమయ్యె నాదు
పని ; లగ్నము దాటకుండ
చని వేగమ తెలుపవలయు."

వెడలిపోయినారు భటులు ;
విప్పి నేత్రబంధనమ్ము
వీక్షించెను మాధవుండు ·
వివృతద్వారమ్ము నుండి
పడుచున్నది దేవమూర్తి
పై నేకాదశి కౌముది
మోకరిల్లి కూరుచుండి
ఏకాగ్రతతోడ నతడు
చూడసాగె మూర్తిముఖము
శోధించుచు హస్తంబుల.
అతని నేత్రముల నుండి
అశ్రుధార జాలువారె.
ఆకొను భక్తునకు వేయి

హాయనమ్ము లయిన పిదప
సంఘటిల్లె నేడు దేవ
సన్నిధిలో దర్శనంబు.

ప్రభువు మందిరమ్ములోన
ప్రవేశించు నిమేషమున
వేదికామూలమందు
వినతంబై యుండె మాధ
వుని శిరమ్ము ; ముహూర్తమున
నృపుని చేతి కృపాణమున
నికృత్తమై మస్తకంబు
మూర్తిచరణ సన్నిధిలో
మొదటిసారి బలి యయ్యెను.—
తుది ప్రణిపాతంబు కూడ.

ఆగష్టు 13, 1932 పునశ్చ

## విహంగమము వెడలిపోవు వేళయైనది

విహంగమము వెడలిపోవు వేళయైనది,
నీడ యింక రిక్తమగును, నేడు గీతికల్
స్తబ్ధమగును, కులాయంబు జారి రాలును
ధూళియందు సరణ్యాందోళనమ్ములో.
కూడి శుష్కపర్ణంబులు వాడు పూలతో
పదచిహ్నము లేవి లేని బట్టబయలున
యామినీ ప్రభాతవేళ లందు నెగురును
అస్తదిశార్ణవమ్మునకు నావలి దరిని
ఎంతకాల మాతిథ్యం బిచ్చిన దీ వసుధ ।
ఆమ్ర ముకుళ పరిమళ మిళి తాహ్వాన వచస్సు
చేరె నొకట ఫాల్గున మధు దాక్షిణ్యము వలన

ఇచ్చితి నా స్వర మశోక మంజరి యింగితమునకు
నింపుచు ప్రీతిరసంబును మెండుగ నిదాఘవేళలను.
వేడి ధూళిలో నైనగాని జడిగాడుపులో గాని
అప్పుడపుడు నా కంఠము రుద్ధంబై పోయెడిది
పక్షము లాడెడివి కావు ప్రాణాద్భృతిని
అయితిని ధన్యుడ స్వీకరించుచు న్నన్నిటి నేను
శ్లాంత యాత్ర యీ తీరంబునకడు శాంతి గనంగా
క్షణకాలము వెనుదిరిగిచూచి యీ జన్మమ్మునకు
అధిదేవతకును నమ్ర నమస్సున నరుగుదు నేను.

28-4-1934 ప్రాంతిక్

## నీ కన్నులలో

అది చైత్రము; శేషప్రహ
రాలోకముతోడ నెఱ
నైన దినమునందు గంటి
నీ నయనమ్ములలో నా
సర్వనాశనంబు నేను.
సంసారపు నిత్యలీల
లందలి నానావిధముల
ప్రాణి సమాగమములందు,
పథముల, ఘట్టములయందు
పలుజనముల హాసమ్ములు
అపహాసమ్ములను వాని
యందు నీదుకన్నుల నా
సర్వనాశనంబు గంటి,
సమీరు డూపగ ముకుళము
లామ్రవనిని రాలుచుండె.

అనుక్షణము విశ్వాసము
మధుమాసదినంబు విడుచు
మంజరితములైన కొమ్మ
కొమ్మల, మధుమక్షికాచ
యమ్ముల పక్షంబులందు;
నడుమ నీదు కనులగంటి
నాదు సర్వనాశనంబు.

సెప్టెంబర్, అక్టోబర్ – 1934 గీతవితాన్ 3

## అవసన్న చైతన్య గోధూళివేళ

అవసన్న చైతన్య గోధూళివేళలో
అరసితిని నీలకాళింది వాహినిలోన
తేలిపోవుచునుండె నా శరీరమ్మదే
తీసికొని యనుభూతి పుంజమ్ము తనవెంట,
తీసికొని యద్దాని చిత్రవేదననెల్ల,
తీసికొని జీవితస్మృతి సమూహమ్ముచే
చిత్రితమ్మైన యాచ్ఛాదనమ్మును గూడ,
చేతిలో తనదు పిల్లనగ్రోవి గ్రహియించి.
పోవగా పోవగా దూరమ్ము మ్లానమై
పోవుచున్నది దానిరూపమ్ము పరికింప;
పరిచితమ్మగు తీరతీరమ్మునం దెల్ల
తరుఘన చ్ఛాయాపరీరంభములలోని
జననివాసములందు సంజహారతి రవము
సన్నగిల్ల దొడంగె. ఎల్లగేహంబులను
ద్వారంబులును గూడ బద్ధంబులైపోయె.
సారె కాచ్ఛాదితమ్మయ్యె దీపశిఖాళి,
బద్ధంబులయ్యె ఘట్టములందు నౌకలును.

రుద్ధంబులయ్యె తీరములందు తరణములు.
ప్రొద్దుపోయెను రాత్రి, విహగ సంతానముల
సద్దు లేనట్టి సంగీతమ్ము వనమందు
శాఖాళిలో మహానిశ్శబ్దతాపాద
సవిధమ్మునను నాత్మబలివి రచియించినది.
కాలిమారూపతయు స్థలమును జలమును
క్రమ్మగొన్నది విశ్వవై చిత్ర్యమును గూడ
అంతమ్ము గననట్టి కూలమ్ము లేనట్టి
అంధకారమ్ములో నది లీనమగుచుండె
తారకా వేదికాతలమునకు నరుదెంచి
స్తబ్ధుండనై నిల్చియుంటి నే నొంటరిగ.
హస్తముల్ జోడించి యూర్ధ్వమ్ము వీక్షించి
అంటి - నో పూష। నీ రశ్మిజాల మ్మట్టు
లుపసంహరించి యుంటివి దాని నీ మారు
ఒప్పుగా వెలుగంగ జేయుమా భవదీయ
కళ్యాణరూపమ్ము। నీ లోన నా లోన
గల పూరుషుం దొక్కడే యంచు కాంచెదను.

8-12-1937 ప్రాంతిక

## జన్మవాసరము

నేను పుట్టిన దినము
నే, డిప్పు డిప్పుదే
ప్రాణసీమాధ్వంపు
పరిధి ముమగుచు నంత
అఖిలంబు మాయించు
నంధకారమునుండి
లేచి మృత్యువు నుండి

లిఖితపూర్వకముగా
సమ్మతిం గైకొంటి
సాగిపోవగ ముందు.

జ్ఞప్తి యున్నది, తెలియకున్నది.
గతశరత్తున గ్రంథిబద్ధం
బైన దామం బచట భిన్నం
బైనదేమో ; నూత్నసూత్రము
నందు బద్ధం బయ్యె నూతన
జన్మవాసర మిప్పు ; డుత్సవ
సమయమునకై పరచియుంచిన
ఆసనమ్మున నేను కేవల
యాత్రికుండను ; మృత్యు దక్షిణ
హస్తమున తిలకంబు కొరకై
అపేక్షింతును. నూతనారుణ
కిరణ ముద్భవమొందుచును సం
కేతమీయగ యాత్ర కొరకై.

జనన మరణ వాసరములు
సంస్పృష్టము లగుచు నేడు
ఉభయమ్ములు కూడ కూరు
చున్నవి యేకాసనమున.
ఆ యుభయ జ్యోతి కలియు
నస్మ జ్జీవన ప్రాంతర
రేఖ మీద ముఖాముఖిగ :
రేయిని చంద్రమునకు, ప్ర
త్యూషమునను శుక్రతార
కొక్క మంత్రజపము తోడ
నుభయులకును నభ్యర్థన.

తీరిపోయె ప్రాచీనత
దింపుము నీ యర్ఘ్యంబును.
రూప హీన జీవములకు
ప్రాపగు జన్మస్థానము
చూడ ముదయ శిఖరిమీద
జ్యోతిని, నా కాశీస్సుల
నొసగుము ; పోనిమ్మ కలిసి
తృషాతప్త దిగంతమున
మృషా మరుమరీచికలను.
నేను విచ్చగాని పాత్ర
నింపినాను కోర్కె తోడ
అశుచివస్తు భరితమైన
అద్దానిని నిశ్శేషము
కావింపుము , ధూళిలోన
కలుపుము భిక్షాముష్టిని.
యాత్ర తరణిలో జనుచును
ఆర్తదృష్టితోడ జూడ
జీవనంపు టాహారో
చ్ఛిష్టమ్మును వెనుదిరుగుచు.

నిత్యమైన దాని, వసుధ,
నీవు తెలుపుచుంటివి గద ;
నను నీ సంసారరథము
నకుం గట్టి పవలు రేలు
స్థూల సూక్ష్మ విధానముల
దూరముగా దిక్కులందు
వివిధమార్గములను లాగి
వేయుచున్న క్షుత్తృష్ణల
విపులశక్తి మందగించె
విరామ గోధూళివేళ

తంద్రావిష్టకాంతిలోన :
దానివలన, ఓ కృపణా.
క్రమక్రమముగా శక్తిని
కైకొనుచున్నావు మరల.
చక్షుఃకర్ణముల కెదము
స్వచ్ఛకాంతి కద్దముగా
చేయుచుంటి, వనుదినమ్ము
దీప్తిలేవి నేపథ్యము
దిక్కెవండొ లాగువాడు :
ప్రతిదినమ్ము నా యెడ నీ
ప్రయోజనమ్ము శిథిల మగుట
మూల్యము హరియించి త్యాగ
ముద్ర వేయుచున్నా రవు
నా లలాటపట్టికపై.
నన్ను నీ యవజ్ఞ దూరి
తీరమందు పారవేయ
నేరదనియు తెలియు నాకు.
వ్యతిరేకుండైన యట్టి
వ్యక్తికి తుది సమ్మానము
చేయవలసియుండు నీదు
శేష నమస్కారముతో.
చేసిన నను పంగువుగా,
చేసిన నంధప్రాయుని,
శక్తిహీనతా ప్రదోష
చ్ఛాయను నను ప్రచ్ఛన్నుని
నలిపియున్న, వార్ధక్యపు
జాలమ్మున బంధించిన,
భగ్నమందిరమున వేది
పైన గౌరవమ్ముతోడ
ప్రతిమయుండు; దానిలాగు

బలమేమియు లేదు నీకు

పగులగొట్టుము; పగులగొట్టుము,
భగ్నవస్తు స్తూపమెత్తుగ
సాగనిమ్ము; మదీయహర్ష
స్వరూపమ్ము మహోజ్వలంబుగ
జీర్ణతా హృదయాంతరాళ
స్థితమటంచును నే నెరుంగుదు.
దిక్కుదిక్కులనుండి యమృతము
తెచ్చియిచ్చుచు ప్రతిదినమ్మును
దానికిన్ రసపూర్ణ పుష్కర
వాణి; ప్రేమించితిని నిన్నని
బదులు పలుకుగ చేయుగానము
బహువిధంబుల ఛందములతో,
తదనురాగమె నీ ప్రభావము
వదలి నను పైకెత్తుచున్నది
స్వర్గసీమకు సమీపముగా
భ్రష్టమైనను నష్టమైనను
జగము సర్వము ప్రేమమాత్రము
మిగిలియుండును పరిచయముచే
మిగుల వాడియు దానివాక్కులు
కోలుపోవగ వచ్చు నైతము
కొంత నిజతేజస్సు, చెంతనె
అమరరూపంబుండు మృత్యువు
నపరపారమునందు మేల్కొన;
చిత్రరచనము దాని తనువున
చేసె మామిడిపూ పరాగము;
అంకితం బొనరించె పేళల
మైన శేఫాలిక పరీమళ
శిశిర కణములతోడ ; కూర్చెను

శిల్పి సూక్ష్మోత్తరీయంబున
ప్రభాత కాలమున 'దోయేల్'
పక్షిగానముతోడ విహ్వల
కాకలీ సూత్రమ్ముతో, ప్రియ
కంపమాన స్పర్శచే త
త్తనువునను రోమాంచితమ్ముగ
జననమందెను వాణి ; అయ్యది
సంచితంబై యుండు నిత్యము.
నీదు కర్మాగార మందలి
నిభృత వాతాయనము లోపలి
నుండి యెవ్వరొ చెప్పజాలను
దండ నా ఫాలమ్ము చుట్టును
క్షణము లోపల చుట్టినా డా
కస్మికమ్ముగ ; కాదు భృత్యున
కిచ్చు పసదన ; మేమొ తెలుపగ,
నే యభిప్రాయమ్ము తోడనొ
ఇంత ఆత్మీయతను జూపుచు
అప్రయోజకుడైన యితనికి
అగపడక చనె దూత యెవడో ;
భాష కందని దేదొ పలుకుచు
పట్టుబడక క్షణమ్ము లోపల
నరిగె దూత, యెవండొ తెలియదు.

ఆ మనుజుం డెప్పుడొ నీ
యాశ్రయంబు విడిచి చనును,
ఓ ధరణీ, నీ వతనికి
ఒసగు దాని లెక్కపెట్టి—
పరిచర్యకు నచ్చినట్టి
పరికరముల, పయనమునకు
పాథేయంబైన గాని—

లాగివేసికొనుము ; దాన
లజ్జపొందనేర దతడు ;
దైన్యమేమి యుండదు రి
క్తతలో ; అవజ్ఞ లేదని
గ్రహియింపుము- నేను ఋణ
గ్రస్తుండను మృత్తిక కని.
ఆవేష్టన ప్రాంతంబున
నమూర్త సంధాన మొకటి
ప్రాప్తించిన దని తెలిపితి
బహుపర్యాయములు నీకు.
జడ యవనిక లీనమగును
ఛవిలో నెప్పుడు ప్రతిసుమ
మందును. ప్రతి గడ్డిపోచ
యందు, రూపరసములందు
అపుడు గూఢ రహస్యంబు
అగుచునుండు నిశ్వసితము ;
దాని చరమతాత్పర్యము
నే నన్వేషింప, ముఖము
త్రిప్పువాడ మరణామర
తీరంబును దాటు నపుడు.

నీ నిమంత్రణ మొంది నేను శాంతుండనై
అన్ని కోర్కులు విడిచి యమరావతిం జేరు
నుత్తమక్షణములో నున్ముక్తమై యుండె
ద్వారంబు ; లాలసత్వము బుభుక్షయు పొందు
వంచనమ్మట ; మట్టిపాత్రలో నచ్చోట
కూర్చు నమృతము భిక్షుకులకు, లోలుపులకున్.
దురవస్థలో నుండు నరులకోసము కాదు.
హే ధరిత్రీ, కొనుచు నింద్రు నైశ్వర్యంబు
ఎదురుచూచుచు నుందు వే త్యాగికోసమో,

గౌరవ మ్మొసరింపగా లోభవర్తితున.
కాతిథ్య మీయగా నతిదుర్గమప్రాంత
పథికునకు, దానమ్ము వైరాగ్య పరిశుద్ధ
సింహాసనమ్ముపై చేర్పగా నెంచెదవు.
శుద్ధులున్, మాంస ప్రముగ్ధులున్, లుబ్ధులున్
ఆత్మదృష్టి విహీనులగువారు పూర్ణముగ,
మసనంబు నికటాన మసలుచుండెడివారు.
యుష్మదీయాకర్ణకోరుకుండము చుట్టు
చేయుచున్ బీభత్సచీత్కారములు సతము
క్రీడాభావమును వీడి హింసానురక్తులై
చేయుచుందురు ప్రదక్షిణములన్ పోరులో.

కావునన్ నేడునున్ కర్ణగోచరమగును
నరజంతు హుంకారనాదంబు దిక్కులన్.
అయిన హాసంబుతో నరుగుచుందును నేను
పండితుల్ మౌఢ్యంబు పరిహసించెడి రీతి,
ధనవంతు లగువారు దైన్యంబు నగునట్లు,
చక్కదనము వికృతి వెక్కిరించెడు భాతి.
మనుజు లోపలి దేవతను గేలి చేయుచున్
ముఖవికారములతో మోటుగా చరియించు
వారి హాసములడచి వర్తించు చుండుదున్:
"ఆకస్మికమ్ముగా నంతరించును మధ్య
మాంకమ్మునన్ దుష్టమైనట్టి స్వప్నంబు
ఈ ప్రహసనమ్ములో; ఇంక నాట్యసమాధి
కాలిపోయిన పెద్ద కాగడా బూదియున్
ఆ యదృష్టపు టట్టహాసంబు శేషించు.
దనుజు మూఢవ్యయము, ధర్మేతరంబైన
ద్యూతమ్మునం దయ్యు నైతిహాసిక నిత్య
గ్రంథాన నెన్నండు గ్రథితంబు కాబోదు."
అనుచు నీ రీతిగా నరుగుచుందును నేను.

చాలు వ్యర్థాలాపసరణి ! నీ దేహళిని
అంతిమ ప్రహర ఘంటారావ మిళితమై
వివశవశంబునన్ వీడ్కోలు ద్వారంపు
తెరపు చప్పుడు చెవుల నొరసికొనుచున్న యది.
అనతిదూరమ్ములో అస్తమించెడు సూర్యు
రంగురంగులలోన రంజిల్లు ధారుణీ
రాగస్వరముకూడ మ్రోగు వీనులలోన.
ఇందాక జీవనస్మృతి దీపమున వెలుగు
వత్తులం గొన్నింటి నెత్తి సంధ్యారతిని
సప్తర్షి దృష్టికిన్ సమ్ముఖంబున నిత్తు
నీకునై ; దివసాంత నిమిషకాలమ్ములో
మూర్ఛిల్లు నీపాదముల మ్రోల నామౌన
వీణ; ఉండును నాకు వెనుక పూవులులేక
పవ్యాంకురితమైన నాగకేసరలతిక
తెప్ప గోల్పోయి ఈ తీరంబుపై ప్రేమ
విరహస్మృతులవలని వేరగున్ క్లాంతమై
రాత్రి శేషమ్మునన్ క్రమ్మరన్ వెనుదిరుగు.

8-5-1938 సేంతిని

## జపమాల

యాతాయాత జనాధ్వపు
టంచున కూర్చుంటి నొకడ
ప్రాతఃకాలమున నెవరు
ప్రాణఘట్టమునకు వెలుగు
చీకటి రంగముల మీద
చేర్చినారొ గాన నౌక.

సంధ్యా సమయమున వారు
చాయను లీనంబగుదురు.

వార లిపుడు నా స్వప్న
ద్వారమ్మున మూగినారు,
నష్ట స్వరమును వెదకును
నానా వ్యథ 'లేకతార'.
జాము వెనుక జాము గడచు,
శాంతముగా గుణియింతును,
నీరవ జపమాలా ధ్వని
నే చీకటి శిరసులపై.

30-10-40 రోగశయ్యాయ్

## ఋణ శోధనము

అవిరత దినకాంతి ఋణం
బక్షియుగళి కొక్కనాడు
ఇచ్చెనంచు నే నెరుగుదు;
ఇపుడు మహారాజ, నీవు
తిరిగి తీసికొనెడి హక్కు
తెలుపుదు చేసితివి నేడు.
అప్పు తీర్చవలసియున్న
దని తెలియును; కాని యేల
సంధ్యా దీపమ్ము మీద
ఛాయను ప్రసరించినావు?
అట్టి కాంతితో రచించి
నట్టి విశ్వమందు నేడు
అతిథిని నే కేవలమ్ము.

అచ్చటచట చిన్ని చిన్ని
వగు ఛిద్రంబులు వడినను
అవి పూర్ణము కాకయున్న
అవహేళన తోడ విసరి
అచట నుంచవలయు వాని.
తుదిసారిగ బయలుదేరి
ధూళిలోన నీ రథంబు
ఎచట విడుచు చిహ్నంబులు
రచించుకొన నిమ్ము నాదు
జగము నచట; ఉండనిమ్ము
ఛాయ నచట కొంచెముగా,
కొంచెముగా చీకటి నట,
కొంచెముగా మాయ నచట-
ఛాయాపథమున లుప్త
చ్ఛవి వెనుకను ప్రోగుచేసి
ఏరిన ఋణశేషమ్మున
ఏ లవమో దొరకవచ్చు.

3-11-1940 రోగశయ్యాయ్

## నా కీర్తిపై నాకు నమ్మకమ్మే లేదు

నా కీర్తిపై నాకు నమ్మకమ్మే లేదు;
నియతక్రమమ్ముతో నిత్యమ్ము కబళించు
కాలార్ణవతరంగ ఘాతమ్ము లద్దాని
నని యెరుంగుదును నే; నాత్మవిశ్వాసమ్ము
మాత్రము కలుగు; ఆ పాత్ర పూరించి
ఈ విశ్వ నిత్యసుధనే రెండు వేళలన్
ఆస్వదించితి; దానియందు సంచితమయ్యె

ప్రతి ముహూర్త ప్రీతి ; భయపెట్టలేదాయె
దుఃఖపు భారంబు : ధూళియైనను దాని
కమనీయతను నలుపు కావింపలేదాయె,
భూరంగమును వీడిపోవునప్పుడు నేను
ఎల్ల ఋతువులయందు నీ విశ్వమును ప్రీతి
నవలోకనము చేతునని సాక్ష్యమిచ్చు నీ
ప్రసవోపవనమంచు బాగుగా నెరుగుదును.
ఈ ప్రేమమే సత్య మీ జన్మమునకు దాత ;
సెలవు గైకొనువేళ స్వీకరింపదు సుమ్మ
మృత్యురూపమ్ము నీ సత్య మిమ్లానమై.

28-11-1940 రోగశయ్యాయ్

## ఏకతానము

ఎరుగుదు నే కొంతవరకు
ఈ పృథ్వి విశాల మనియు.
ఎన్ని యెన్ని రాజధాను
లెన్ని యెన్ని నగరమ్ములు
దేశ విదేశములు కలవొ
తెలియదు నాకు. మానవునకు
కీర్తి యెంత కలదొ, నదులు
గిరులు, సింధువులు, నెడారు
లెన్ని కలవొ, తెలియకుండ
నున్న జీవు లెంద రెంద,
రపరిచితములైన పా
దపము లెన్ని కలవొ యెరుగ.
విశ్వాయోజనమ్మ మిగుల
విశాలమ్ము ; నా మనస్సు

అందలి యొక చిన్న కోణ
మందు లగ్నమై యున్నది.
భ్రమణ వృత్తములం దెలుపు
బహుగ్రంథ సందోహము
ఆందోళన తొలగుటకై
అంకురితోత్సాహమునను
పరిచుచున్నాను; చిత్ర
వర్ణములం గూడినట్టి
వాక్యములను సంగ్రహింతు;
పూరింతును విజ్ఞానపు
దారిద్ర్యము భిక్షాత్తం
బైన ధనముతోడ చిత్త
మందు వీలుపడినవరకు.

నేను పృథివి కవిని, ఎచట
దానిస్వరము వెడలునెంత
అపుడు నాదు మురళీరవ
మంత స్పంద మొందుచుండు:
ఈశ్వరసాధనలో నా
కెన్నొపిలుపు లందలేదు,
కలిగె కొంత వ్యవధానము
కల్పనతో అనుమితితో
కలిగిన ధరణీ తానము
జీవనమును పరిపూర్ణము
చేసినదో నిస్తబ్ధ
క్షణములందు; హిమాలయపు
గహన మౌన నీలిమలో
జరిగినదో యే గానము
సారె సారెకుం దదీయ
మధురాహ్వానము చేరెను

మానసమును ; రాత్రివేళ
దక్షిణ మేరువుమీదను
తారక లజ్ఞాతమ్ములు
తిరుగుచుండు శూన్యమందు ;
అర్ధరాత్రివేళను నా
అనిమేష విలోచనముల
అపూర్వరుచితో మదీయ
నిద్రాభంగ స్పర్శను
నింపె వాని పరిభ్రమము.
బహుదూర వ్యాప్తియైన
ప్రచండ నిర్ఘోషము నాదు
చిత్త గహన తలమునకుం
జేర్చె నొక్క సుస్వరమును.
ప్రకృతిలోని ఏకతాన
వాహినిలో వివిధ కవులు
గానము వర్షించువారు
నానాదిక్కులనుండియు.
అందరతో సంయోగము
అందరతో సహవాసము
ఆనందముగూడ నాకు
నమరిన దీ మాత్రమైన.
అందితి గానసరస్వతి
యనుగ్రహము నేను – విశ్వ
సంగీతాస్వాదనమున.

సర్వము కన్న దుర్గమమ్మ
జనునకు స్వకీయ హృదయము.
బాహ్యదేశ కాలమ్ముల
ప్రమాణము లేదెట్టిది ;
అంతర్మయమైన దద్ది ;

అంతస్సున గలిసి నపుడె
ప్రాప్తమగును దాని హృదయ
పరిచయంబు ; దొరకలేదు
దానిలోన బ్రవేశింప
ద్వారము సర్వత్ర నాకు.
నా జీవనయాత్రయందు
నానారీతుల యావర
ణమ్ములు, నభ్యంతరములు
నాగలి క్షేత్రమ్మునందు
నెడపును కర్షకుడు , నేయు
వస్త్రము కూర్చుండి తంతు
వాయుడు ; జాలరి విసరును
వారియందు జాలమ్మును ,
వీరి చిత్రకర్మ భిన్నము
దూరము ప్రసరించు , వీరి
నాధారముగా గైకొని
యాత్ర చేయుచుండు జగము.
చాల కాలమునకు ముందు
సమ్మానము కోల్పోయిన
జగములోని చిన్నిచోట
ఉచ్చ పీఠిపైన గూరు
చుంటిని సంకీర్ణజాల
మార్గము కద , పోవుచుందు
మధ్య మధ్యమునను పేట
యంగణంబు సీమవరకు :
అంతె కాని యొక్కమారె
లోన బ్రవేశింప శక్తి
కానరాదు ; సంయోజన
చేయకున్న జీవనమ్ము
జీవముతో , గానవను

నిచయము కృత్రిమ విపణిని
నిష్ఫలమై పోవు ; కాన
నేడు గ్రహించితి దానిని
నిందా వాక్యముగ ; నాదు
స్వరమునం దపూర్ణతయె
సంభృతంబు ; నాదు కవిత
సంచరించె విచిత్రంపు
సరణుల నని, నాకు తెలియు
సర్వగాఁబు కాలేదని.
అవనీస్థలి కే కవీంద్రు
డత్యంతము సన్నిహితుడో
అక్కవి వాక్కులకు చెవుల
రిక్కించుక యున్నవార
మను కర్షక వృత్తిలోని
జనవాక్యమునందు నిహిత
సత్యం బనుభవ సహితము.
స్వయముగ సాహిత్యహర్ష
సంతర్పణ చేయలేను.
అయిన నట్టి దానికినై
అన్వేషింతును నిత్యము.
అది సత్యం బగునుగాక !
భావభంగి ద్వారమ్మున
కేవలమ్ము నేత్రంబుల
కాకుంచుత రంజనమ్ము !
ఈకుండగ సత్యమూల్య
మెవరైనను ఖ్యాతిగన్న
సాహిత్యమునందు, దాని
చౌర్యముగా నెంచవలయు.
తగదు నకలు, తగదు నకలు -
తలపవలె విలాస భృతిగ

దాని; కాన రమ్మ కవీ,
ఖ్యాతిలేని జనుల మౌన
చేతస్సుల వెదకి, నీవు
వెల్లడింపుమోయి, వాని
వేదనలను; నిర్జీవం
బీ దేశమునందు నెచట
గానము వినరాదో, అవ
జ్ఞాతాపము మాడ్చివేసి
ఆనందము హరియించెనో,
ఆ మరుభూమిని రసమున
అత్యంతము నింపవలయు,
ఉత్సాహము వారిలోన
ఉద్వేలము కావింపుము.
ఏకతాన గానసభను
ఏకతార కలవారికి
సాహిత్యమునందుగూడ
సమాదరము కలుగుగాక।
సుఖదుఃఖములందు మూకు,
లఖిలము నెదుట నతశిరస్కు-
లగువారికి, స్తబ్ధులకును
ఆదరంబు కలుగుగాక।
ఓ గుణవాన్, నికటమందు
నుండియు దూరస్థు లెవరో
వారి వాణి విందుగాక।
వారి సగోత్రుడవు కమ్మ -
ఖ్యాతి పొందనిమ్మ నీ వి
ఖ్యాతితోడ వారిగూడ.
సారె సారెకేను నీకు
సలుపువాడ నమస్సులను।

21-1-1941 జన్మదినే

## జిఘాంసు యామిని

జిఘాంసు యామిని చేరి మెల్లగను
త్రుంచి యర్గళము, దుర్బలదేహము
దూరి, జీవనపు గౌరవరూపము
హరింప జొచ్చిన ; దాక్రమింపగా
కాలిమ, ఓడిన కరణి మానసము
ఎంచుచు నున్నది : ఈ పరాభవపు
కథసిగ్గెన్నడు ఘనీభవించునో
అపుడె దిగంతమునందు కనంబడు
కనక కిరణరేఖా చిత్రతమౌ
దినపతాక ; తోతెంచు విహాయస
మందలి యేదో కేంద్రోదితమై
మిథ్య మిథ్య యని ; మిగుల ప్రసన్న
ద్యుమణి కాంతిలో దుఃఖవిజయి యగు
విగ్రహమును నే వీక్షించితి నా
దుర్బలదేహపు దుర్గశిఖరమున.

21-1-1941 ఆరోగ్య

## ఆశీర్వాదము

సుందర మధురాశీస్సును
పొందితి నీ జీవనమున
మానుషత్వ ప్రియపాత్రిక
మధురసుధాస్వాదనమును.
అక్షత, మపరాజిత మగు
నాత్మను గురితించినాడ
దుస్సహ దుఃఖదినమ్మున.

సమీపించుచున్న మృత్యు
చ్ఛాయానుభవం బైనప్పుడు
భయదుర్బల హస్తంబుల
పరాజయము పొందలేదు.
వంచితుండ గాను మహా
వ్యక్తుల స్పర్శవశమ్మున.
అంతరంగమందు వారి
యమృతవాణి సమకూర్చితి.
జీవితమ్మునందు నేను
చెందియుండి ధాతృకృపను
సుకృతజ్ఞముగా మనసున
స్మరణలిపిని నిలిపినాను.

28-1-1941 ఆరోగ్య

## మధుమయ పృథివీధూళి

సురలోక మధుమయా ! ధరియించుచుంటి
మధుమయమైన యిమ్మహీధూళి యెత్తి
హృదయములోపల. కృతకృత్య మగును
ఈ జీవనపు వాణి, ఈ మహామంత్రి ;
మనుదినమ్మేను సత్య సదుపహార
మే కొంచె మొందితి నింక నద్దాని
మధురసమునకు భంగమ్ము లేదెపుడు ;
అందుచే మృత్యువు నంత్యభాగమున
నిట్లు మ్రోగుచున్న దీ మంత్రవాణి,
ఆ యనంతానంద మట్లు రాజిల్లు
పృథివి శేషస్పర్శ నెపుడు గ్రహించి
పోవుదు, నే చెప్పి పోయెద నపుడు—

"పొలమునందు నీ ధూళిని నేను
దిద్దుకొంటిని సదా తిలకమ్ము లీల ;
అఖిల దర్శనపు మాయల మాటునుండి
నిత్యమౌ జ్యోతిని నే చూచినాడ.
ఆకృతి నొందె సత్యానందరూప
మా ధూళిలోన, నే నిది యెరిగి
నతులు నిందుంచుచున్నాడ సు"మ్మనుచు.

14_2_1941 ఆరోగ్య

## వట్టి చౌకీ

వెర్జన మధ్యాహ్న వేళ
నిప్పులు గ్రక్కుచు నున్నది
సూర్యరశ్మి ; చూచినాను
శూన్యమైన చౌకివంక.
సాంత్వన మా తాపునందు
స్వల్పముగా నైన లేదు.
నిండు యెండనుండి దాని
నిరాశాభాషలోన
హాహాకారమ్ము చేయు
నట్లుగ కాన్పించుచుండె.
బయలు వెడలె శూన్యత్వపు
భాషితంబు కరుణతోడ
కలిసి, దాని యర్థ మేమొ
గ్రహింప సాధ్యంబు కాదు.
కానరాని యజమానుని
కై వెదకుచు, జాలి గొలుపు
చూపుతోడ నరచుచున్న

శునకమువలె మూఢమనసు
ఉసురుసురనుచున్న ; దేమి
పొసగెనొ, యెందులకో మరి
బోధపడదు కొంచెమేని
నిష్ఫల నేత్రంబులతో
నిఖిలదిశలు వెదకుచుండు
దివానిశలు ; చౌకి భాష
దీనతరముగా దోచును
రి క్తమూక బాధ వోలె
ప్రియుడు లేని గృహము చొచ్చి.

28-3-1941 శేషలేఖా

## నాజన్మవాసరమున

నా యీ పుట్టిననాటను నన్నే
కోలుపోయితిని ; కోరుదు బంధుల—
కరస్పర్శచే నరలోకంబున
చరమ ప్రీతిరసంబున, జీవన
శిఖా ప్రసాదము శేషాశీర్వచ
నములను ప్రీతిని గొని చనిపోవుదు.
ఈయం దగినది యేదో యిచ్చితి
శూన్యంబైనది బోలె యీ దినము.
ప్రతిగ్రహంబున ప్రా ప్తం బగుచో
కొంచెము స్నేహము కొంచెము కరుణయు
వానివిగై కొని వాగ్విహీన మగు
నంతిమ యుత్సవమందు ప్రయాణము
చేయు నావలో చేరుదు గావత ।

6-5-1941 శేషలేఖా

## రూపనారాయణారోధస్సునందు

రూపనారాయణారోధస్సునందు నే
మేల్కొంటి, నీ జగము మిథ్యకాదనుకొంటి.
కంటి నా రూపు రక్తాక్షరంబుల యందు,
ఆఘాత మాఘాతమందు, వేదనలందు.
నన్ను గుర్తించుకొన్నాను స్పష్టమ్ముగా.
కఠినమా సత్యంబు ? కాఠిన్యమునె నేను
వలచినా, నది నన్ను వంచింప దెన్నండు.

దుఃఖ తపస్య మృత్యువుదాక జీవితము-
పొంద సత్యపు ఘోరమూల్యం బశేషంబు.
సర్వఋణశోధనము సలుపగా మరణాన
కాఠిన్యమునె నేను కామించియున్నాను.

13-5-1941 శేషలేఖా

## తొలినాటి సూర్యుడు

ప్రథమ వాసరాదిత్యుడు
ప్రశ్న వేసె నీ వెవరని
సత్తానవోద్భవమును,
సమాధాన మేమిలేదు.

వత్సరములు గడచిపోయె,
వాసరాంతమం దర్కుడు
పశ్చిమాబ్ధి తీరంబున
ప్రశ్నమడిగె చివరసారి -
నిస్తబ్ధంబగు సంధ్యను
నీ వెవరని, బదులులేదు.

27-7-1941 శేషలేఖా

## నీ సృష్టి పథము

పరచితి నీసృష్టి పథముపైన విచిత్ర
మోహజాలము మహామోహినీ! అంతటను
సరళ జీవనముపై తరళ విశ్వాసంపు
జాలంబు నిపుణహస్తాలతో గప్పితివి.
ఈ వంచనము తోడనే మహత్వమ్మునకు
చిన్నె వేసితి. వందుచేతనే రాత్రియం
దెట్టి రక్షణమును బెట్టగా లేదీవు
భవదీయమౌ కాంతిపథమన్న నద్దాని
కంతఃపథం; బద్దియచ్ఛ మెల్లప్పుడును.
సహజమైనట్టి విశ్వాసమ్ముతో దాని
నుజ్జ్వలం బొనరించుచుండు నెల్లప్పుడును
కనబడ్డ కుటిలమ్ముగా బాహ్యరూపాన
అంతస్సునన్ సరళ మౌటచే గౌరవము.
అది విడంబితమైన దనుచుండు లోకంబు.
దాని యాలోకాన ధౌతమౌ హృదయాన
ఉపలబ్ధమౌ సత్య; మొక్కింతయును దాని
వంచనం బొనరింప వలసుపడ దెవ్వరికి
శేష బహుమానంబు స్వీయ భాండారంబు
నందుండి కొనిపోవు; అశ్రమమ్మున నెవడు
సహనమ్ముతో దాటు ఛలము, నీ హస్తముల
నత డొందుబో అక్షయాధికారము, శాంతి!

30-7-1941 శేషలేఖా

# నిర్ఝరేర స్వప్నభంగ

ఆజి ఏ ప్రభాతే రవిర కర
కేమనే పశిల ప్రాణేర" పర,
కేమనే పశిల గుహార ఆఀంధారే ప్రభాతపాఖిర గాన
నా జాని కేన రే ఏతదిన పరే జాగియా ఉఠిల ప్రాణ
జాగియా ఉఠేఛేప్రాణ,
ఓరే ఉథలి ఉఠేఛే వారి,
ఓరే ప్రాణేర వేదనా ప్రాణేర ఆవేగ రుధియా రాఖితేనారి
థరథర కరి కాఀంపిఛే భూధర,
శిలా రాశి రాశి పడిఛే ఖసే,
ఫులియా ఫులియా ఫేనిల సలిల
గరజి ఉఠిఛే దారుణ రోషే.

హేథాయ హోథాయ పాగలేర ప్రాయ
ఘురియా ఘురియా మాతియా బేడాయ—
బాహిరితే చాయ, దేఖితే నా పాయ కోథాయ కారారద్వార।
కేన రే విధాతా పాషాణ హేన,
చారిదికే తార బాఀధన కేన।
భాంగ్ రే హృదయ; భాంగ్ రే బాఀధన,
సాధ్ రే ఆజికే ప్రాణేర సాధన,
లహరీర 'పరే లహరీ తులియా
ఆఘాతేర 'పరే ఆఘాత కర్।
మాతియా యఖన ఉఠేఛే పరాన
కిసేర ఆఀధార, కిసేర పాషాణ।
ఉథలి యఖన ఉఠేఛే వాసనా,
జగతే తఖన కిసేర డర।
ఆమి ఢాలిబ కరుణాధారా,
ఆమి భాంగిబ పాషాణకారా,
ఆమి జగత్ ప్లావియా బేడాబ గాహియా

ఆకుల పాగల - పారా ।
కేశ ఏలా ఇయా, ఫుల కుడా ఇయా,
రామధను - ఆఁకా పాఖా ఉడా ఇయా,
రవిర కిరణే హాసి ఛడాఇయా దిబ రే పరాస ఢాలి ।
శిఖర హఇతే శిఖరే ఛుటిబ,
భూధర హఇతే భూధరే లుటిబ
హేసే ఖలఖల గేయే కలకల తాలే తాలే దిబ తాలి ।
ఏత కథా ఆఛే, ఏత గాన ఆఛే ఏత ప్రాణ ఆఛే మోర,
ఏత సుఖ ఆఛే, ఏత సాధ ఆఛే - ప్రాణహయే ఆఛే భోర॥
కీ జాని కీ హల ఆజి, జాగియా ఉఠిల ప్రాణ,
దూర హతే శుని యేన మహాసాగరేర గాన ।
ఓరే చారిదికే మోర
ఏ కీ కారాగార ఘోర,
భాంగ్ భాంగ్ భాంగ్ కారా, ఆఘాతే ఆఘాత కర్
ఓరే ఆజ కీ గాన గేయేఛే పాఖి,
ఏసేఛే రవిర కర.

1882 ప్రభాత సంగీత

## సోనార తరీ

గగనే గరజే మేఘ ఘన బరషా ।
కూలే ఏకా బసే ఆఛి, నాహి భరసా ।
రాశి రాశి భారా భారా ధాన-కాటా హల సారా,
భరా నదీ క్షురధారా ఖర-పరశా ।
కాటితే కాటితే ధాన ఏల బరషా॥

ఏకఖాని ఛోటో ఖేత ఆమి ఏకేలా
చారిదికే బాఁకా జల కరిఛే ఖేలా

పరపారే దేఖి అంకా తరుఛాయా మసీ-మాఖా
గ్రామఖాని మేఘే-ఢాకా ప్రభాత బేలా।
ఏ పారేతే ఛోటోఖేత, ఆమి ఏకేలా॥

గాన గేయే తరీ బేయే కే ఆసే పారే
దేఖే యేన మనే హయ, చిని ఉహారే।
భరా పాలే చలే యాయ, కోనో దికే నాహి చాయ,
ఢేవుగులి నిరుపాయ భాంగే దుధారే—
దేఖే యేన మనే హయి చిని ఉహారే॥

ఓగో తుమి కోథా యాఓ కోన్ విదేశే।
బారేక భిడాఓ తరీ కూలేతే ఏసే।
యేయో యేథా యేతే చాఓ, యారే ఖుశి తారే దాఓ,
శుధు తుమి నియే యాఓ క్షణిక హేసే
ఆమార సోనార ధాన కూలేతే ఏసే॥

యతో చాఓ తత లఓ తరణీ-'పరే।
ఆర ఆఛే ?—ఆరనాఇ, దియేఛి భరే।
ఏతకాల నదీకూలే యాహా లయే ఛిను భూలే
సకలి దిలామ తులే థరే బిథరే—
ఏఖన ఆమారే లహో కరుణా క'రే॥

ఠాఇ నాఇ, ఠాఇ నాఇ, ఛోటో సే తరీ
ఆమారి సోనార ధానే గియేఛే భరి।
శ్రావణగగన ఘిరే ఘన మేఘ ఘురే ఫిరే,
శూన్య నదీర తీరే రహినూ పడి—
యాహా ఛిల నియే గేల సోనార తరీ॥

ఫరవరీ-మార్చ 1892 సోనార తరీ

## ఝులన

ఆమి పరానేర సాథే ఖేలిబ ఆజికే మరణఖేలా
నిశీథ బేలా ।
సఘన బరషా. గగన ఆఁధార,
హేరో వారిధారే కాఁదే చారిధార.
భీషణ రంగే భవతరంగే భాసాఇ భేలా ;
బాహిర హయేఛి స్వప్నశయన కరియా హేలా,
రాత్రి బేలా॥

ఓగో పవనే గగనే సాగరే ఆజికే కి కల్లోల ।
దే దోల్ దోల్ ।
పశ్చాత్ హతే హాహా క'రే హాసి
మత్త ఝటికారేలాదేయ ఆసి.
యేన ఏ లక్ష యక్షశిశుర అట్టరోల ।
ఆకాశే పాతాలే పాగలే మాతాలే హట్టగోల ।
దే దోల్ దోల్॥

ఆజి జాగియా ఉరియా పరాన ఆమార బసియా ఆఛే
బుకేర కాఛే ।
థాకియా థాకియా ఉఠిఛే కాఁపియా,
ధరిఛే ఆమార వక్ష చాపియా,
నిరుర నిబిడ బంధనసుఖే హృదయ నాచే ;
త్రాసే ఉల్లాసే పరాన ఆమార వ్యాకులియాఛే
బుకేర కాఛే॥

హాయ, ఏతకాల ఆమి రేఖేఛిను తారే యతనభరే
శయన 'పరే ।
వ్యథా పాఛే లాగే, దుఖ పాఛే జాగే,
నిశిదిన తా ఇ బహు అనురాగే

బాసరశయన కరేఛి రచన కుసుమ థరే;
దుయార రుధియా రేఖేఛిను తారేగోపన ఘరే
యతన భరే॥

కత సోహాగ కరేఛి చుంబన కరి నయనపాతే
స్నేహేర సాథే।
శునాయేఛి తారే మాథా రాఖి పాశే
కత ప్రియనామ మృదుమధు భాషే,
గుంజరతాన కరియాఛిగాన జ్యోత్స్నారాతే:
యా-కిఛుమధుర దియేఛును తార దుఖాని హాతే
స్నేహేర సాథే॥

శేషే సుఖేర శయనే శ్రాంత పరాన ఆలసరసే.
ఆవేశవశే
పరశ కరిలే జాగే నా సే ఆర.
కుసుమేర హార లాగే గురుభార.
ఘుమే జాగరణే మిశి ఏకాకార నిశిదివసే:
వేదనా విహీన ఆసాడ విరాగ మరమే పశే
ఆవేశవశే॥

ఢాలి మధురే మధుర వధూరే ఆమార హారాఇ బుఝి
పాఇనే ఖుంజి;
బాసరేర దీప నిబే నిబే ఆసే,
వ్యాకులనయనే హేరి చారి పాశే,
శుధు రాశిరాశి శుష్క-కుసుమ హాయఛె పుంజి;
అతల స్వప్న-సాగరే డుబియా మరి యే యుఝి
కాహారే ఖుంజి॥

తాఇ భేబేఛి ఆజికే ఖేలితే హాఇబే నూతన ఖేలా
రాత్రి బేలా।

మరణ దోలాయ ధరి రాశిగాఛి
బసిబ దుజనే బడో కాఛా కాఛి
ఝుంఝా ఆసియా అట్టహాసియా మారిబే ఠేలా,
ఆమాతే ప్రాణేతే ఖేలిబ దుజనే ఝులన ఖేలా
నిశీథ బేలా॥

దే దోల్ దోల్
దే దోల్ దోల్
ఏ మహాసాగరే తుఫాన తోల్ ।
వధూరే ఆమార పేయేఛి ఆబార, భరేఛే కోల ।
ప్రియారే ఆమార తులేఛే జాగాయే ప్రలయ రోల ।
వక్షశోణితే ఉఠేఛే ఆబార కీ హిల్లోల ।
భితరే బాహిరే జేగేఛే ఆమార కీ కల్లోల :
ఉడే కుంతల, ఉడే అంచల,
ఉడే వనమాలా వాయు చంచల,
బాజే కంకణ బాజే కింకిణీ – మత్త బోల ।
దేదోల్ దోల్॥

ఆయ రే ఝుంఝా, పరాణవధూర
ఆవరణరాశి కరియాదే దూర,
కరి లుంఠన అవగుంఠన- వసన ఖోల్
దేదోల్ దోల్

ప్రాణేతే ఆమాతే ముఖోముఖి ఆజ
చిని లబ దోఁహే ఛాడి భయ లాజ,
వక్షే వక్షే పరశిబ దోఁహే భావే బిభోల ।
దే దోల్ దోల్
స్వప్న టుటియా బాహిరేఛే ఆజ దుటో పాగల ।
దే దోల్ దోల్॥

27 మార్చి 1893 సోనార తరీ

# భ్రష్టలగ్న

శయన శియరే ప్రదీప నిబేఛే సబె,
జాగియా ఉఠేఛి భోరేర కోకిలరవే ।
అలస చరణే బసి వాతాయనే ఏసే
నూతన మాలికా పరేఛి శిథిల కేశే ।
ఏమన సమయే అరుణధూసర పథే
తరుణ పథిక దేఖా దిల రాజరథే ।
సోనార ముకుటే పడేఛే ఉషార ఆలో,
ముకుతార మాలా గలాయ సేజేఛే భాలో ।
శుధాలో కాతరే 'సేకోథాయ' 'సేకోథాయ'
వ్యగ్రచరణే ఆమారి దుయారే నామి-
శరమే మరియా బలితే నారిను హాయ,
'నవీన పథిక, సేయే ఆమి, సేఇ ఆమి'।

గోధూలిబేలాయ తఖనో జ్వాలేని దీప,
పరితేఛిలామ కపాలే సోనార టిప ।
కనకముకుర హాతే లయే వాతాయనే
బాంధితేఛిలామ కబరీ ఆపన మనే ।
హేనకాలే ఏల సంధ్యా ధూసర పథే
కరుణనయన తరుణ పథిక రథే ।
ఫేనాయ ఘర్మే ఆకుల అశ్వగులి
వసనే భూషణే భరియా గియాఛే ధూలి
శుధాలో కాతరే 'సేకోథాయ' 'సేకోథాయ'
క్లాంత చరణే ఆమారి దుయారే నామి-
శరమే మరియా బలితే నారిను హాయ,
'శ్రాంత పథిక, సేయే ఆమి, సేఇ ఆమి!'

ఫాగునయామినీ, ప్రదీప జ్వలిఛే ఘరే ।
దఖిన బాతాస మరిఛే బుకేర 'పరే ।

సోనార ఖాঁచాయ ఘుమాయే ముఖరా శారి,
దుయారసముఖే ఘుమాయే పడేఛే ద్వారీ ।
ధూపేర ధోঁయాయ ధూసర వాసరగేహ
అగురు గంధే ఆకుల సకల దేహ ।
మయూరకంఠి పరేఛి కాঁచలఖాని
దూర్వాశ్యామల ఆঁచల వక్షే టాని ।
రయేఛి విజన రాజపథ- పానే చాహి,
వాతాయన తలే బసేఛి ధులాయనామి-
త్రియామా యామినీ ఏకా బసే గాన గాహి,
'హతాశ పథిక, 'సే యే ఆమి, 'సేఇ ఆమి' ।

20 మే 1897 కల్పనా

## యథాస్థాన

కోన్ హాటే తుఇ బికోతే చాస ఓరే ఆమార గాన,
కోన్‌ఖానే తోర స్థాన ?
పండితేరా థాకేన యేథాయ విద్యేరత్న-పాడాయ,
నస్య ఉడే ఆకాశ జుడే కాహార సాధ్య దాঁడాయ,
చలఛే సేథాయ సూక్ష్మ తర్క సదాఇ దివారాత్ర
పాత్రాధార కి తైల కింవా తైలాధార కి పాత్ర,
పుథిపత్ర మేలాఇ ఆఛె మోహధ్వాంతనాశన,
తారి మధ్యే ఏకటి ప్రాంతే పేతే చాస కి ఆసన ?
గాన తా శుని గుంజరియా కహే—
నహే, నహే, నహే॥

కోన్ హాటే తుఇ బికోతే చాస ఓరే ఆమార గాన,
కోన్ దికే తోర టాన ?
పాషాణ-గాঁథా-ప్రాసాద-'పరే ఆఛేన భాగ్యవంత,
సుహాగినిర మంచ జుడి పంచహాజార గ్రంథ,

సోనార జలే దాగ పడే నా, ఖోలే నా కేఉ పాతా,
అస్వాదితమధు యేమన యూథీ అనాఘ్రాతా।
భృత్య నిత్య ధులా ఝూడే యత్న పురామాత్రా
ఓరే ఆమార ఛందోమయీ, సేథాయ కరబి యాత్రా ?
గాన తా శుని కర్ణమూలే మర్మరియా కహే —
నహే, నహే, నహే॥

కోన్ హాటే తుఇ బికోతే చాస ఓరే ఆమార గాన,
కోథాయ పాబి మాన ?
నవీన ఛాత్ర ఝుఁకే ఆఛే ఏక్‌జాటునేర పడాయ,
మనటా కింతు కోథా థేకే కోన్ దికేయే గడాయ,
అపాఠ్య సబ పాఠ్య కేతాబ సామనే ఆఛే ఖోలా,
కర్తృజనేర భయే కావ్య కులుంగితే తోలా,
సేఇఖానేతే ఛేఁడాఛడా ఏలోమేలోర మేలా,
తారి మధ్యే ఓరే చపల, కరిబి కి తుఇ ఖేలా ?
గాన తా శునే మౌనముఖే రహే ద్విధార భరే—
యాబ — యాబ కరే।

కోన్‌హాటే తుఇ బికోతే చాస ఓరే ఆమార గాన,
కోథాయ పాబి త్రాణ ?
భాండారేతే లక్ష్మి వధూ యేథాయ ఆఛే కాజే,
ఘరే ధాయ సే ఛుటి పాయ సే యఖన మాఝే మాఝే
బాలిశ—తలే బఇటి చాపా, టానియా లయ తారే,
పాతాగులిన ఛేఁడాఖోఁడా శిశుర—అత్యాచారే—
కాజల—ఆఁకా సిందుర—మాఖా చులేర—గంధే—భరా
శయ్యాప్రాంతే ఛిన్నవేశే చాస కి యేతే త్వరా ?
బుకేర 'పరే విశ్వసియా స్తబ్ధ రహే గాన—
లోభే కంపమాన॥

కోన్‌హాటే తుఇ బికోతే చాస ఓరే ఆమార గాన,
కోథాయ పాబి ప్రాణ ?

యేథాయ సుఖే తరుణయుగల పాగల హాయే బేడాయ,
ఆడాల ఖుఁజే ఆఁధార ఖుఁజే సబార ఆఁఖి ఏడాయ,
పాఖి తాదేర శోనాయ గీతి, నదీ శోనాయ గాథా,
కతరకమ ఛంద శోనాయ పుష్పలతా పాతా,
సేఇఖానేతే సరల హాసి సజల చోఖేర కాఛే
విశ్వబాశిర ధ్వనిర మాఝె యేతే కి సాధ ఆఛే ?
హఠాత్ ఉఠే ఉచ్ఛ్వసియా కహే ఆమార గాన–
'సేఇఖానే మోర స్థాన'॥

జులై 1900 క్షణికా

## లుకోచురి

ఆమి యది దుష్టుమి కరే
చాఁపార గాఛే చాఁపా హయే ఫుటి,
భోరేర బేలా మాగో, డాలేర 'పరే
కచి పాతాయ కరి లుటోపుటి—
తబే-తుమి ఆమార కాఛే హారో,
తఖన కి మా, చినతే ఆమాయ పారో ?
తుమి డాక 'ఖోకా, కోథాయ ఓరే,
ఆమి శుధు హాసి చుపటి కరే॥

యఖన తుమి థాకబే యే కాజ నియే
సబఇ ఆమి దేఖబ నయన మేలే।
స్నానటి కరే చాఁపార తలా దియే
ఆసబే తుమి పిఠేతే చుల ఫేలే—
ఏఖాన దియే పుజోర ఘరే యాబే,
దూరేర థేకే ఫులేర గంధ పాబే।
తఖన తుమి బుఝతే పారబే నా సే,
తోమార ఖోకార గాయేర గంధ ఆసే॥

దుపురబేలా మహాభారత హాతే
బసబే తుమి সబార ఖాటియా హాలే,
గాఛేర ఛాయా ఘరేర జానాలాతే
పడబే ఏసే తోమార పితే కోలే।
ఆమి ఆమార ఛోట ఛాయాఖాని
దోలాబ తోర బఇయేర 'పరే ఆని।
తఖన తుమి బుఝతే పారబేనా సే,
తోమార చోఖే ఖోఖార ఛాయా భాసే॥

సంధ్యాబేలాయ ప్రదీపఖాని జ్వేలే
యఖన తుమి యాబే గోయాల-ఘరే
తఖన ఆమి ఫులేర ఖేలా ఖేలే
టుప్ కరే మా, పడబ ఘుమే ఝరే।
ఆబార ఆమి తోమార ఖోకా హబ,
'గల్ప బలో' తోమాయ గియే కబ।
తుమి బలబే, 'దుష్టు, ఛిలి కోథా?'
ఆమి బలబ, 'బలబ నా సే కథా'।

సెప్టెంబర్ 1903 శిశు

## జగత్ - పారావారేర తీరే

జగత్ - పారావారేర తీరే
ఛేలేరా కరే మేలా।
అంతహీన గగనతల
మాథార 'పరే అచంచల,
ఫేనిల ఓఇ సునీల జల
నాచిఛే సారా బేలా।

ఉఠిఛే తటే కీ కోలాహల-
  ఛేలేరా కరే మేలా।

బాలుకా దియే బాఁధిఛే ఘర,
  ఝినుక నియే ఖేలా
విపుల నీల సలిల 'పరి
ఖాసాయ తారా ఖేలార తరీ
ఆపన హాతే హేలాయ గడి'
  పాతాయ గాఁథా భేలా ;
జగత్ - పారావారేర తీరే
  ఛేలేరా కరే ఖేలా।

జానే నా తారా సాఁతార దేఓయా,
  జానే నా జాల - ఫేలా।
డుబారి డుబే ముకుతా చేయే ;
వణిక ధాయ తరణీ బేయే ;
ఛేలేరా నుడి కుడాయే పేయే
  సాజాయ్ బసి ఢేలా
రతన - ధన ఖోఁజేనా తారా,
  జానే నా జాల - ఫేలా।

ఫేనియే ఉఠే' సాగర హాసే,
  హాసే సాగర - వేలా।
భీషణ ఢేఉ శిశుర కానే
రచిఛే గాథా తరల తానే,
దోలనా ధరి యేమన గానే
  జననీ దేయ ఠేలా।
సాగర ఖేలే శిశుర సాథే,
  హాసే సాగర - వేలా।

జగత్ - పారావారేర తీరే
చేలేరా కరే ఖేలా ।
ఝుంఝాఫిరే గగనతలే,
తరణీ డుబే సుదూర జలే,
మరణ-దూత ఉడియా చలే :
చేలేరా కరే ఖేలా
జగత్ - పారావారేర తీరే
శిశుర మహామేలా ।

సెప్టెంబర్ 1903 శిశు

## బందీ

బందీ, తోరే కే బేఁధేఛే
ఏత కఠిన క'రే ।'

ప్రభు ఆమాయ బేఁధేఛే
వజ్రకఠిన డోరే ।
మనే ఛిల సబార చేయే
ఆమిఇ హబ బడో.
రాజార కడి కరే ఛిలేమ
నిజేర ఘరే జడో
ఘుమ లాగితే శుయేఛిలేమ
ప్రభుర శయ్యాపేతే,—
జేగే దేఖి బాఁధా ఆఛి
ఆపన భాండారేతే ।

'బందీ, ఓగో, కే గడేఛే
వజ్ర బాఁధనఖాని ।'

ఆపని ఆమి గడేఛిలేమ
    బహు యతన మాని.
భేబేఛిలేమ ఆమార ప్రతాప
    కరబే జగత్ గ్రాస।
ఆమి రబ ఏకలా స్వాధీన,
    సబాఇ హబె దాస।
తాఇ గడేఛి రజనీదిన
    లోహార శికల ఖానా—
కత ఆగున కత ఆఘాత
    నాఇకో తార రికానా।

గడా యఖన శేష హయేఛే
    కఠిన సుకఠోర
దేఖి ఆమాయ బందీ కరే
    ఆమారి ఏఇ డోర।

22 ఏప్రిల్ 1906 ఖేయా

## భారత తీర్థ

హే మోర చిత్త, పుణ్య తీర్థే జాగో రే ధీరే
ఏఇ భారతేర మహామానవేర సాగరతీరే।
హేథాయ దాఁడాయే దు బాహు బాడాయే నమి నరదేవతారే,
ఉదార ఛందే పరమానందే వందన కరి తాఁరే।
ధ్యానగంభీర ఏఇ-యే భూధర,
నదీ-జపమాలా-ధృత ప్రాంతర,
హేథాయ నిత్య హేరో పవిత్ర ధరిత్రీరే
ఏఇ భారతేర మహామానవేర సాగర తీరే॥

కేహ నాహి జానే, కార ఆహ్వానే కత మానుషేర ధారా
దుర్వార స్రోతే ఏల కోథా హతే, సముద్రే హల హారా।
హేథాయ ఆర్య, హేథా అనార్య, హేథాయ ద్రావిడ చీన-
శక-హూన-దల పాఠాన మోగల ఏకదేహే హల లీన।
పశ్చిమ ఆజి ఖులియాఛే ద్వార
సేథా హతే సబే ఆనే ఉపహార
దిబే ఆర నిబే, మిలాబే మిలిబే, యాబే నా ఫిరే—
ఏఇ భారతేర మహా మానవేర సాగరతీరే॥

రణధారా వాహి జయ గాన గాహి ఉన్మాదకలరవే
భేది మరుపథ గిరిపర్వత యారా ఏసేఛిల సబే
తారా మోర మాఝే సబాఇ బిరాజే, కేహ నహే నహే దూర—
ఆమార శోణితే రయేఛే ధ్వనితే తార విచిత్ర సుర।
హే రుద్రవీణా, బాజో, బాజో, బాజో
ఘృణాకరి దూరే ఆఛే యారా ఆజో
బంధ నాశిబే - తారాఓ ఆసిబే దాఁడాబే ఘిరే
ఏఇ భారతేర మహామానవేర సాగరతీరే॥

హేథా ఏకదిన విరామవిహీన మహా-ఓంకారధ్వని
హృదయతంత్రే ఏకేర మంత్రే ఉఠేఛిల రనరని।
తపస్యాబలే ఏకేర అనలే బహురే ఆహుతి దియా
విభేద భులిల, జాగాయే తులిల ఏకటి విరాట హియా।
సేఇ సాధనార సే ఆరాధనార
యజ్ఞశాలా రఖోలా ఆజి ద్వార—
హేథాయ సబారే హబే మిలిబారే ఆనతశిరే
ఏఇ భారతేర మహామానవేర సాగరతీరే॥

సేఇ హోమానలే హేరో ఆజి జ్వలే దుఖేర రక్తశిఖా—
హబే తా సహితే, మర్మే దహితే ఆఛే సే భాగ్యే లిఖా।
ఏ దుఃఖవహన కరో మోర మన, శోనో రే ఏకేర డాక-

యత లాజ భయ కరో కరో జయ,అపమాన దూరే యాక।
దుస్సహ వ్యథా హయే అవసాన
జన్మ లభిబే కీ విశాల ప్రాణ—
పోహాయ రజనీ, జాగిఛే జననీ విపుల నీడే
ఏఇ భారతేర మహామానవేర సాగరతీరే॥

ఏసో హే ఆర్య, ఏసో అనార్య, హిందు ముసలమాన—
ఏసో ఏసో ఆజ తుమి ఇంగ్‌రాజ, ఏసో ఏసో ఖృష్టాన।
ఏసో బ్రాహ్మణ, శుచి కరి మన ధరో హాత సబాకార—
ఏసో హే పతిత, కరో అపనీత సబ అపమానభార।
మార అభిషేకే ఏసో ఏసో త్వరా,
మంగలఘట హయ ని యే భరా
సబార-పరశే-పవిత్ర-కరా తీర్థనీరే—
ఆజి భారతేర మహామానవేర సాగరతీరే॥

2 జులై 1910 *గీతాంజలి*

## తపోభంగ

యౌవనవేదనారసే - ఉచ్ఛల అమార దినగులి
హే కాలేర అధీశ్వర, అన్యమనే గియేఛ కి భులి,
హే భోలా సంన్యాసీ ?
చంచల చైత్రేర రాతే కింశుకమంజరి - సాథే
శూన్యేర అకూలే తారా అయత్నే గేల కి సబ భాసి ?
ఆశ్వినేర వృష్టిహారా శీర్ణశుభ్ర మేఘేర భేలాయ
గేల విస్మృతిర ఘాటే స్వేచ్ఛాచారీ హాఓయార ఖేలాయ
నిర్మమ హేలాయ ? ।

ఏకదా సే దినగులి తోమార పింగల జటాజాలే

శ్వేత రక్త నీల పీత నానా పుష్పే విచిత్ర సాజాలే,
గేఛ కి పాసరి ?
దస్యు తారా హేసే హేసే హె ఓభుక, నిల శేషే
తోమార డంబరు శింగా, హాతే దిల మంజీరా - బాశరి:
గంథభారే ఆమంథర వసంతేర ఉన్మాదనరసే
భరి తవ కమండలు నిమజ్జిల నిబిడ ఆలసే
మాధుర్యరభసే ॥

సేదిన తపస్యా తవ అకస్మాత్ శూన్యేగేల భేసే
శుష్కపత్రే ఘూర్ణవేగే గీతరిక్త హిమమరుదేశే,
ఉత్తరేర ముఖే ।
తవ ధ్యానమంత్రటిరే ఆనిల బాహిర - తీరే
పుష్పగంధే లక్ష్యహారా దక్షిణేర వాయుర కౌతుకే ।
సే మంత్రే ఉఠిల మాతి సేంఉతి కాంచన కరబికా,
సే మంత్రే నవీన పత్రే జ్వాలి దిల అరణ్యవీధికా
శ్యామ వహ్నిశిఖా ॥

వసంతేర వన్యాస్రోతే సంన్యాసేర హల అవసాన ;
జటిల జటార బంధే జాహ్నవీర అశ్రుకలతాన
శునిలే తన్మయ ।
సేదిన ఐశ్వర్య తవ ఉన్మేషిల నవ నవ,
అంతరే ఉద్వేల హల ఆపనాతే ఆపన విస్మయ ।
ఆపని సంధాన పేలే ఆపనార సౌందర్య ఉదార,
ఆనందే ధరిలే హాతే జ్యోతిర్మయ పాత్రటి సుధార
విశ్వేర క్షుధార ॥

సేదిన ఉన్మత్త తుమి యే నృత్యే ఫిరిలే వనే వనే
సే నృత్యేర ఛందే-లయే సంగీత రచిను క్షణే క్షణే
తవ సంగ ధరే।
లలాటేర చంద్రాలోకే నందనేర స్వప్నచోఖే

నిత్యనూతనేర లీలా దేఖేఛిను చిత్తమోర భరే ।
దేఖేఛిను సుందరేర అంతర్లీన హాసిర రంగిమా,
దేఖేఛిను లజ్జితేర పులకేర కుంఠిత భంగిమా—
రూపతరంగిమా ॥

సేదినేర పానపాత్ర, ఆజ తార ఘుచాలే పూర్ణతా ?
ముఛిలే-చుంబనరాగే-చిహ్నిత వంకిమ రేఖాలతా
రక్తిమ అంకనే ?
అగీత సంగీతధార అశ్రుర సంచయభార,
అయత్నే లుంఠిత సేకి ఏగ్ని ఖాండే తోమార అంగనే?
తోమార తాండవ నృత్యే చూర్ణచూర్ణ హయేఛే సే ధూళి ?
నిఃస్వ కాలవైశాఖీర నిశ్వాసే కి ఉరిఛె ఆకులి
లుప్త దినగులి ?

నహే, నహే, ఆఛే తారా ; నియేఛ తాదేర సంహరియా
నిగూఢ ధ్యానేర రాత్రే, నిశ్శబ్దేర మాఝే సంవరియా
రాఖ సంగోపనే ।
తోమార జటాయ-హారా గంగా ఆజ శాంతధారా,
తోమార లలాటే చంద్ర గుప్త ఆజి సుప్తిర బంధనే ।
ఆబార కీ లీలాచ్ఛలే అకించన సేజేఛ బాహిరే ।
అంధకారే నిఃస్వనిఛే యత దూరే దిగంతే చాహిరే—
'నాహిరే, నాహిరే ॥'

కాలేర రాఖాల తుమి, సంధ్యాయ తోమార శింగా బాజే ;
దినధేను ఫిరే ఆసే స్తబ్ధ తవ గోష్ఠగృహ-మాఝే
ఉత్కంఠిత వేగే ।
నిర్జన ప్రాంతరతలే ఆలేయార ఆలో జ్వలే,
విద్యుద్వహ్నిర సర్ప హానే ఫణా యుగాంతేర మేఘే ।
చంచల ముహూర్త యత అంధకారే దుస్సహ నైరాశే
నిబిడనిబద్ధ హయే తపస్యార నిరుద్ధ నిశ్వాసే

శాంత హయే ఆసే ॥

జాని జాని, ఏ తపస్యా దీర్ఘ రాత్రి కరిఛే సంధాన
చంచలేర నృత్యస్రోతే ఆపన ఉన్మత్త అపసాన
దురంత ఉల్లాసే ।
బందీ యౌవనేర దిన ఆబార శృంఖలహీన
బారే బారే బాహిరిబే వ్యగ్రవేగే ఉచ్ఛలిలోచ్ఛ్వాసే।
విద్రోహీ నవీన వీర స్థవిరేర–శాసన–నాశన
బారే బారే దేఖా దిబే ; ఆమి రచి తారి సింహాసన—
తారి సంభాషణ ॥

తపోభంగదూత ఆమి మహేంద్రేర, హే రుద్ర సంన్యాసీ,
స్వర్గేర చక్రాంత ఆమి, ఆమి కవి యుగే యుగే ఆసి
తవ తపోవనే ।
దుర్జయేర జయమాలా పూర్ణ కరే మోర డాలా
ఉద్దామేర ఉతరోల బాజే మోర ఛందేర క్రందనే ।
వ్యథార ప్రలాపే మోర గోలాపే గోలాపే జాగే వాణీ,
కిశలయే కిశలయే కౌతూహల కోలాహల ఆని
మోర గాన హాని ॥

హే శుష్కవల్కలధారీ వైరాగీ, ఛలనా జాని సబ—
సుందరేర హాతే చాఓ ఆనందే ఏకాంత పరాభవ
ఛద్మరణవేశే ।
బారే బారే పంచశరే అగ్నితేజే దగ్ధ కరే
ద్విగుణ ఉజ్జ్వల కరి బారే బారే బాँచాఇబే శేషే ।
బారే బారే తారి తూణ సమ్మోహనే భరి దిబ బ'లే
ఆమి కవి సంగీతేర ఇంద్రజాల నియే ఆసి చలే
మృత్తికార కోలే ॥

జాని జాని, బారంబార ప్రేయసీర పీడిత ప్రార్థనా
శునియా జాగితే చాఓ ఆచంబితే ఓగో అన్యమనా,
నూతన ఉత్సాహే ।
తాఇ తుమి ధ్యానచ్ఛలే విలీన విరహతలే ;
ఉమారే కాఁదాతే చాఓ విచ్ఛేదేర దీప్త దుఃఖదాహే ।
భగ్నతపస్యార పరే మిలనేర విచిత్ర సే ఛవి
దేఖి ఆమి యుగే యుగే–వీణాతంత్రే బాజాఇ భైరవీ,
ఆమి సేఇ కవి ।

ఆమారే చేనేనా తవ శ్మశానేర వైరాగ్య విలాసీ–
దారిద్ర్యేర ఉగ్ర దర్పే ఖలఖల ఓఠే అట్టహాసి
దేఖే ఘోర సాజ ।
హేనకాలే మధుమాసే మిలనేర లగ్న ఆసే,
ఉమార కపోలే లాగే స్మితహాస్యవికసిత లాజ ।
సేదిన కవిరే డాక' వివాహేర యాత్రాపథతలే,
పుష్పమాల్యమాంగల్యేర సాజి లయే సప్తర్షిర దలే ।
కవి సంగే చలే ॥

భైరవ, సేదిన తవ ప్రేతసంగీదల రక్త–ఆంఖి
దేఖే తవ శుభ్రతను రక్తాంశుకే రహియాఛే ఢాకి
ప్రాతః సూర్యరుచి ।
అస్థిమాలా గేఛే ఖులే మాధవీవల్లరీమూలే,
భాలే మాఖా పుష్పరేణు–చితాభస్మ కోథా గేఛే ముఛి ।
కౌతుకే హాసేన ఉమా కటాక్షే లక్షియా కవి–పానే–
సే హాస్యే మంద్రిల బాఁశి సుందరేర జయధ్వనిగానే
కవిర పరానే ॥

అక్టోబర్–నవంబర్ 1923

★